



శ్రీ రామ నృసింహ మూర్తులు

శ్రీవ ద్భద్రకృ దార్తిసంహరణకృ ద్యోగో యయో ర్వర్తతే
లోకారాధనతత్పరౌ ఖలజనవ్యాపాదనవ్యాపృతౌ
లోకేఽస్మి న్నవతేరతు స్సుమహితౌ శాంతోగ్రరూపౌ చ యౌ
తౌ శ్రీరామ నృసింహ మూర్తి విలస త్సంజ్ఞౌ జయేతేతరామ్॥

# సమీక్ష.

రచయితలు:— శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, శ్రీ గద్వాల సంస్థానాస్థానకవులు, "శ్రీరామనృసింహమూర్తికవులు" అను శ్రీ గంధం శ్రీరామమూర్తి, శ్రీ ఇట్టేంకి నరసింహమూర్తులు.

శ్రీ గంధం శ్రీరామమూర్తిగారు:— జననము: (క్రీ॥శ॥) 1904. జన్మస్థలము: ఉప్పులూరు. తల్లిదండ్రులు: వెంకటనర్సమాంబా నారయార్యులు. అధ్యయనము: 1912 మొ॥ 1920 వఱకు. అధ్యాపకులు: బ్రహ్మశ్రీ వారణాసి సూర్యనారాయణ శాస్త్రిగారు.

శ్రీ ఇట్టేంకి నరసింహమూర్తిగారు:— జననము: 1900. జన్మస్థలము: తోలేరు. తల్లిదండ్రులు: శేషమాంబా నారాయణస్వాములు. అధ్యయనము: 1912 మొ॥ 1920 వఱకు. అధ్యాపకులు: బ్రహ్మశ్రీ శనివారపు కనకయ్యశాస్త్రిగారు. అత్తవారియూరు: ఉప్పులూరు.

1928 నుంచి వీరు 'శ్రీరామనృసింహమూర్తికవులు'. వీరి ఆంధ్రవిశ్వవిద్యాలయ "ఉభయభాషాప్రవీణ పట్టబిరుదము 1933. పండితోపాధ్యాయవృత్తి ప్రారంభము 1934. శ్రీ గద్వాల సంస్థానాస్థానప్రవేశము 1945. మణిరత్నమాల, ఆంధ్రపుష్పబాణవిలాసము, శతావధానములు, మూర్తికవుల చాటువులు, మొదలగు సద్గ్రంథ ప్రకటనము 1951. భాగవత రచన ప్రారంభము 1951 (ఖర సం॥ర యుగాది). ప్రకటనము 1955. ఇరువురుఁ బవిత్రమగు పేదవైదికకుటుంబమున జన్మించి సుమారు 12 సం॥ సంస్కృతాంధ్రభాషలఁ గ్రమబద్ధమగు కృషిసల్పి గౌరవప్రదమగు పండితోపాధ్యాయవృత్తిచేఁ గుటుంబపోషణముఁ గావించుకొనుచు నిరాడంబరులై దైవప్రేరణ నీ సద్గ్రంథరచనకుఁ బూనుకొని కృతకృత్యులుఁ జరితార్థులునైరి. కేవల శాస్త్రజన్యజ్ఞానమేకాక దేశాటనాదుల లోకజ్ఞానమును, బాల్యప్రభృతియాధ్యాత్మికచింతనచే ననుభవజ్ఞానమును సంపాదించిరి.

సుమారైదువేల సంవత్సరములక్రిందట "అచతుర్వదనో బ్రహ్మా, ద్విబాహురపరో హరిః, అఫాలలోచనశ్శంభుః, భగవాన్ బాదరాయణః" అను వ్యాసభగవానుఁడు సంస్కృత భారతమురచించి మనశ్శాంతి నొందక భాగవతము నారదోపదేశమునరచించి నిర్మలచిత్తుఁడాయె నందురు. అట్టి భాగవతమును సుమారైదువందల సంవత్సరములక్రిందట ఏకశిలానగరవాసి, బమ్మెరపోతనామాత్యుఁ డాంధ్రము

లకు భక్తిప్రదాతమై యాంధ్రీకరించెను. దానినే యాంధ్రులిప్పటివరకు భక్తి ప్రపత్తులఁబఠించి యానందించుచుండిరి. పోతనామాత్యప్రణీత భాగవతగ్రంథము అంకితమొసంగ నిరాకరించినందున నప్పటి ప్రభువగు సర్వజ్ఞసింగభూపాలునిచే భూస్థాపితము చేయించఁబడి యుత్సన్నమైనదని కొందఱును, దేవతార్చనపేటికనుంచి పోతన పూజించువాఁడనియు, నతఁడు పరమపదించిన పిమ్మట నదిచూడ శిథిలావస్థ నొందియుండెనని మఱికొందఱు నందురు. ఆ శిథిలభాగముల శ్రీవారి శిష్యులు వెలిగందలనారయ్య, ఏర్చూరి సింగన, గంగన్నలనువారు పూరించినట్లు తెలియు చున్నది. పోతన భాగవతగ్రంథ మాంధ్రులచేఁ గీర్తింపఁబడి పూజింపఁబడు చున్నను, కవిత్రియభారతమువలె ఆంధ్రవాఙ్మయరంగమున గౌరవముఁ బొందఁ జాలకుండుట విశదమే. మఱెవరును నా లోపముఁ దీర్పఁజాలకుండిరి. భాషయందు, భావములందుఁ బూర్వాపరసమన్వయముల, ననుభవముల, సంస్కృతభాగవత విదులకు ననుభవశాలురకుఁ జాలఁ దికమక కల్గుచున్నది.

ఈ జంటకవులచే రచింపఁబడిన శ్రీమదాంధ్రభాగవతముఁజూడ పోతనయేమో యీ యిరురూపముల నా భాగవతలోపములఁ దీర్చెనా యన్నట్లున్నది. నాకుఁ బోతనామాత్యుఁడన్నను భాగవతమన్నను జాలనిష్టము. కాని యందలి సందేహ ములు మనస్సును గలతఁజెందించెడివి. ఈ శ్రీరామనృసింహమూర్తికవుల శ్రీమదాంధ్రభాగవతము దశమస్కంధమొక్కటి తక్క మిగిలిన 11 స్కంధములను జూచితి. పోతనభాగవతమందలి పెంపు, తగ్గింపు, మార్పు, వాని ప్రయోజనము దీన స్పష్టమగుచున్నది. సందేహనివృత్తియు నగుచున్నది. అట్టి ఘట్టముల నీ దిగువఁ గొన్నిటి నుదహరించుచుంటిని బుధులు గమనింతురు గాక.

పోతన కర్షకుఁడై చిదానందయోగిచేనైన తారకమంత్రోపదేశమునను, దన సహజపాండిత్య విశేషమునను సంవత్సరత్రయము క్షీరమును మాత్రము గ్రోలుచుఁ దదేకదీక్షతో భాగవత మాంధ్రీకరించెనందురు. ఈ శ్రీరామనృసింహమూర్తులును బవిత్రమగు కర్షకకుటుంబముననే జన్మించి జన్మాంతరసుకృత విశేషమున సహజలబ్ధ మగు నాధ్యాత్మికజ్ఞానముఁగల్గి బాల్యప్రభృతి వేదాంతానుభవమునఁ బుటముఁబడి సహజ సంస్కరణ, పాండిత్య, ప్రతిభలతో నిగూఢజ్ఞానవిద్యా సవిమర్శనంబునఁ బూర్వార్థ మనుభవము సేకరించి యపరార్థమున నుత్తమగ్రంథరచనమునకుఁ బూను కొని సంవత్సరత్రయమున నుద్యోగముఁ గుటుంబము నిర్వహించుకొనుచు సవిలాసం బుగ నీ శ్రీమదాంధ్రభాగవతము రచించి ప్రకృతిపరీక్షులఁ దమ యాత్మశక్తిప్రభా వంబున నుత్తీర్ణులై ప్రకటింపఁగలిగిరి. ఈ దిగువ నుదహరించు విషయముల నా లోపము లేవేనియున్న బుధులు క్షమింతురు గాక.

శ్లో. నైమిశేఽనిమిషక్షేత్రే, మునయ శ్శౌనకాదయః
సత్రం స్వర్గాయ లోకాయ, సహస్రసమ మాసత॥

గీ. అనిమిషక్షేత్రమగు నైమిశాఖ్యవనిని, శౌనకాదిమునీంద్రులుస్వర్గలోక
సముపలబ్ధికినై ఘనసత్రయాగ, మర్థిఁగావించిరి సహస్రహాయనములు.
శ్రీ- 1స్కం- 1అ- 4ప.

'అనిమిషక్షేత్రమగు నైమిశారణ్యమందు' అనిమూలమునఁ గొలఁదిగనుండ' మధువైరిమందిరంబునుంబోలె మాధవీమన్మధమహితంబై, బ్రహ్మగేహంబునుం బోలె శారదాన్వితంబై, ఇట్లు ముప్పదిరెండు పోలికలఁ బోతనామాత్యభాగవత మున సుదీర్ఘతమవచనము కల్పింపఁబడినది. అట్లే గ్రంథమందంతట నరణ్యాది వర్ణనసమయములఁ గల్పింపఁబడి పాండిత్యప్రకర్షను జాటుచున్నది. కాని వేదాంత ఘట్టములఁ దగ్గింపుకానవచ్చుచున్నది. ఏకాదశస్కంధమున శ్రీకృష్ణభగ వానుఁడు పరిపక్వజ్ఞానియగు నుద్ధవునకు బోధించిన యంత్యోపదేశము (నివృత్తి గీత) 20 అధ్యాయములు లేనేలేవు. శిథిలభాగములఁ బూరించినవారును వానిని విడిచిరా? భాగవతమువంటి తత్త్వశాస్త్రమునసే వేదాంతఘట్టముల యవసర ములేకుండెనా; ఈ భాగవతము 11వ స్కంధమున సుమారు 800 పద్యములుండఁ బోతనామాత్య భాగవతమున 100 పద్యములు మాత్రమే కనఁబడుచున్నవి. గమనింపుఁడు. పెంపు, తగ్గింపు, మార్పుల ప్రయోజనమును గుర్తింపుఁడు.

శ్లో. సరహస్యో ధనుర్వేదః, సవిసర్గోపసంయమః
అస్త్రగ్రామశ్చ భవతా, శిక్షితో యదనుగ్రహాత్
సఏష భగవాన్ ద్రోణః, ప్రజారూపేణ వర్తతే

మ. సరహస్యంబగు చాపవేదమును నిస్తంద్రప్రయోగోపసం
హారణోపేతమహాస్త్రకోటియు యదీయానుగ్రహ ప్రాప్తిఁ జా
తురిమై నేర్చితో నీవు పూజ్యుఁడగు నాద్రోణుండు పుత్రాకృతిన్
బరఁగెం జూ మనమ్రోలనేఁడిచట నశ్వత్థామనామంబునన్. శ్రీ. 1. 7. 212

మ. పరఁగన్ మా మగవారలందఱును ముస్కబాణప్రయోగోప సం
హరణాద్యాయుధవిద్య లన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం
చిరి పుత్రాకృతినున్న ద్రోణుఁడవు నీచిత్తంబులో లేశమున్
గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపఁగాఁ బాడియే. (పోతన)

వ్యాసమహర్షి యర్జునునితో ద్రౌపది చెప్పుచున్నట్లు రచింపఁ బోతన యశ్వ త్థామతో ద్రౌపది మాట్లాడునట్లు మార్పుగ వ్రాయు ప్రయోజన మూహింపుఁడు.

శ్లో. సఉచ్చకాశే ధవళోదరోదరోఽప్యరుకత్రిసు స్యాధరశోణశోణిమా
దధ్మాయమానః కరకంజసంపుటే, యథాబ్జమండే కలహంస ఉత్స్వనః॥

చ. ఉరురవకారియౌచు ధవళోదరమైన దరంబు శ్రీధరా
ధరమణిరాగరక్తిమ యుతంబయి తత్కమనీయ పాణితో
యరుహాపుటంబునం బరగి యత్తటి శోభిలె నబ్జమండమం
దరుదుగఁ గూయుచున్న కలహంసవతంసమువోలె లీలమై. శ్రీ. 1. 11. 342

మత్తకోకిల:- అన్యసన్నుతసాహసుండు మురారియొత్తె యదూత్తముల్
ధన్యులై వినఁ బాంచజన్యమురదారితాఖిల జంతు చై
తన్యమున్ భువనైకమాన్యముదారుణస్వనభీత రా
జన్యమున్ బరిమూర్ఛితాఖిలశత్రుదానవ సైన్యమున్. (పోతన)

ఇట్టి మూలశ్లోకముల గంభీరభావము లాంధ్రీకరింపఁబడక గ్రంథమంతయు వంత్యప్రాసలఁ గేవల శబ్దాడంబరమున నిండియుండు ప్రయోజనమును గమనింపుఁడు.

శ్లో. ఉద్దామభావ పిశునామలవల్గుహాస, వ్రీడావలోకనిహతో మదనోఽపి యాసాం
సంముహ్య చాప మజహాత్ ప్రమదోత్తమాస్తా, యస్యేంద్రియం విమథితుం
కుహకై ర్న శేకుః॥

శా. ఏ పూఁబోండ్ల గభీరభావపిశునాహాసోల్ల సద్ధాసల
జ్జోపేతాక్షి విలాసపాతమున మోహాహతిద్రిక్తుఁడై కంతుఁడున్
జాపంబున్ విడనాడి లోఁబడునో యాచంద్రాస్యలుం గృత్రిమ
వ్యాపారంబులఁ గృష్ణుడెందము మథింపంజాలరై రింతయున్. శ్రీ. 1. 11. 367

మత్తకోకిల:- పంచబాణుని నీఱుచేసినభర్గునిం దనువల్లి వం
చించి మూర్ఛిలఁ జేయఁ జాలు విశేషహాస విలోకనో
దంచితాకృతులయ్యుఁ గాంతలుదంభచేష్టల మాధవుం
జంచలింపఁగఁ జేయనేమియుఁజాలరైరి బుధోత్తమా! (పోతన)

అందఱిని మోహింపఁజేయు మన్మథుఁడే యాస్త్రీలనుజూచి మోహపరవశత్వమున ధనుస్సును జారవిడిచెనని మూలమునుండ మన్మథుని జంపినను తుదకు వానికి లోఁబడి పార్వతి కర్ధశరీర మొసఁగినట్టియు జగన్మోహినీ విలాసమునకుఁ జిక్కినట్టియు శివుఁడిట నుదహరింపఁబడుట యెంతవరకు సమంజసమో గమనింపుఁడు. మన్మథుఁడు దహింపఁబడెనుగాని యెవరిచేతను మోహింపఁబడలేదు కదా.

శ్లో. సఏష లోకే విఖ్యాతః, పరీక్షిదితి యత్ప్రభుః
గర్భదృష్ట మభిధ్యాయ, న్పరీక్షేత నరేష్విహ॥

గీ. తాను గర్భదృష్టుని నాత్మఁదలఁచికొనుచు, నిందు నరులనెల్లరను బరీక్షఁ జేసెఁ
గానఁ దలఁపఁ బరీక్షిత్తునా నితఁడు స, మస్తలోకమునందు విఖ్యాతుఁడయ్యె.
శ్రీ. 1. 12. 385

క. తనతల్లి కడుపులోపల, మునుసూచిన విభుఁడు విశ్వమునెల్లఁ గలం
డనుచుఁ బరీక్షింపఁగ జను, లనఘుఁ బరీక్షిన్నరేంద్రుఁడండ్రు మునీంద్రా!
(పోతన)

"తాను గర్భమందుఁజూచిన పురుషుఁడు జన్మించిన పిమ్మట నచటి నరులలో నెవఁడాయని పరీక్షించెను గాన పరీక్షిత్తనిరి." అని మూలముననుండ విశ్వమంతయు నున్నాఁడని పరీక్షించుటఁ బరీక్షిత్తనిరి, యని పోతనగారనుట అది వీక్షించుటయగుగాని పరీక్షించుటయగునా ?

శ్లో. ఇత్యుక్తో ధర్మరాజేన, తత్సర్వం సమవర్ణయత్
యథానుభూతం క్రమశో, వినా యదుకులక్షయం
నన్వప్రియం దుర్విషహం, నృణాం స్వయ ముపస్థితం
నావేదయ త్సకరుణో, దుఃఖితాన్ ద్రష్టుమక్షమః॥

గీ. అని యుధిష్ఠిరుచే నిట్లడుగఁబడి య, థానుభూతముగాఁగఁ దత్సర్వముఁ గ్రమ
సరణివర్ణించె యదుకులక్షయముతక్క, వివిధదురితాద్రిభిదురుండు విదురుఁడంత.

ఆ. సదయహృదయుఁడైన విదురుండు తా దుఃఖి, తాత్ములం గనంగనక్షముఁడయి
స్వయముపస్థితం బసహ్యమునగు యాద, వులకునైన క్షయముఁదెలుపఁడయ్యె.
శ్రీ. 1. 13. 400

ఆ. మేలు సెప్పెనేని మేలండ్రు లోకులు, చెట్టయండ్రు కీడు చెప్పెనేని
నంతమీఁద శూద్రుఁడైనకతంబున, శిష్టమరణ మతఁడు సెప్పఁడయ్యె. (పోతన)

విదురుఁడు మంచివాఁడు దయాళువుకాన బంధునాశనమువిని దుఃఖించు ధర్మజాదులఁజూడఁజాలక అకారణము, అసహ్యమునగు యదుకులక్షయముఁ జెప్పఁజాలక పోయెనని మూలముననుండ యాదవులుశిష్టులనియు బ్రహ్మవేత్తయగు విదురుఁడు శూద్రుఁడగుటఁ జెప్పలేదనియు ననుట యెట్టిదో గమనింపుఁడు.

శ్లో. మధురాయాం తథావజ్రం, శూరసేనసుతం తతః
ప్రాజాపత్యాం నిరూప్యేష్టి, మగ్నీన పిబ దీశ్వరః॥

గీ. అట్లై మధురాపురంబునా నృపుండు, శూరసేనకుమారు వజ్రుని నిలిపియు
నేమములఁ బ్రాజాపత్యనామకేష్టిఁ, జేసి తనయందు నగ్నులఁ జేర్చికొనియె.
శ్రీ. 1. 15. 496

సీ. అనిరుద్ధనందనుఁడైన వజ్రుని దెచ్చి, మధురఁ బట్టముఁగట్టె సమతఁ బాసి (పోతన)

(రాజ్యాధికారముగల భోజసంతతిలోని) శూరసేనసుతుఁడగు వజ్రుని, అని మూలమున నుండ రాజ్యాధికారములేని యాదవసంతతిలోని అనిరుద్ధపుత్రుఁడగు వజ్రుని, యనుట యెంతవరకు సమంజసము ?

శ్లో. నందంచ మోక్ష్యతి భయా ద్వరుణస్య పాశా
ద్గోపాన్ బిలేషు పిహితాన్మయసూనునాచ॥

ఉ. వారక నందునిన్ వరుణపాశభయార్తి విముక్తుఁ జేసెడున్
శూరతగోపకాళి మయసూనునిచే బిలపాతితంబు గా  శ్రీ. 2. 7. 132

మ. హయసూనుండగు దానవుండు నిజమాయన్ గోపరాజిన్ గుహా (పోతన)

మయసూనుఁడని మూలముననుండ సరిగా యతిలోనే హయసూనుఁడని ప్రయోగింపఁబడుట గమనింపుఁడు. పక్షాంతరములు, పాఠాంతరములు పెక్కులున్నను మయుఁడు, మయసూనుఁడు మాయకుఁ బ్రసిద్ధులుకాని హయసూనుఁ డెచటను గానరాఁడు.

శ్లో. అథాతః కీర్తయే వంశం, పుణ్యకీర్తేః కురూద్వహ!
స్వాయంభువస్యాపి మనో, ర్హరే రంశాంశజన్మనః॥
ప్రియవ్రతోత్తానపాదౌ, శతరూపాపతే స్సుతౌ
వాసుదేవస్య కలయా, రక్షాయాం జగత స్థితౌ॥

మ. వినుకీర్తించెదఁ బుణ్యకీర్తియును శ్రీవిష్ణ్వంశసంభూతుఁడున్

గీ. ప్రథితయశుఁడును శతరూపాపతియునైన
యా నృపతికిఁ బ్రియవ్రతోత్తానపాదు
లనెడుపుత్రులు వాసుదేవాంశమునను
జననమందిరి భువనరక్షణముకొఱకు.  శ్రీ. 4. 8 (ధ్రువ)

క. విను నిఖిలభువనపరిపాలనమునకై చంద్రధరకళాకలితుండై (పోతన)

మనువు విష్ణ్వంశాసంభూతుఁడని మూలముననుండ నీ శివప్రసక్తి యేలకో తెలియఁబడదు.

శ్లో. దైతేయచందనవనే, జాతోఽయం కంటకద్రుమః
యన్మూలోన్మూలపరశో, ర్విష్ణో ర్నాళాయితోఽర్భకః

శా. ఆలోకింపఁగ దైత్యచందనవనంబందున్ దురాత్ముండు వా
చాలుం డీతఁడు కంటకద్రుమము నోజన్ సంభవంబయ్యెఁ ద

న్మాలోన్మాలకుఁ దారుఁడైన హరికిన్ బోల్పంగ నాళంబుగా
బాలుం డీతఁడు త్రోఁచెఁగాదె తనదా వంశంబు ఖండింపఁగన్. శ్రీ. 7. 5. 173

చ. తనయుఁడుగాఁడు శాత్రవుఁడు దానవభర్తకు వీఁడు దైత్యచం
దనవనమందుఁ గంటకయుతక్షితిజాతము భంగిఁ బుట్టినాఁ
డనవరతంబు రాక్షసకులాంతకుఁ బ్రస్తుతి సేయుచుండు దం
డనమునఁ గాని శిక్షలకుఁ డాయఁడు పట్టుఁడు కొట్టుఁ డుద్ధతిన్. (పోతన)

పూర్వార్ధమునఁ నున్న యర్థమున్నదికాని ఉత్తరార్ధముననున్న చక్కని యర్థ మేల తొలఁగింపఁబడెనో తెలియకున్నది.

శ్లో. బాలస్య నేహ శరణం పితరౌ నృసింహ!, నార్తస్య చాగదముదన్వతి మజ్జతో నౌః
తప్తస్య తత్ప్రతివిధిర్య ఇహాంజసేష్టః, తావత్ప్రభో! తనుభృతాం త్వదుపేక్షితానాం॥

చ. జలనిధిమగ్ను నౌకయు రుజాపరిపీడితు నౌషధంబు ని
మ్ములఁ దలితండ్రులర్భకునిఁ బ్రోచుటకుం బరికింపఁగా నశ
క్తులె కద దేవ! తత్ప్రతివిధుల్ త్వదుపేక్షితులైన దేహధా
రులకును నంతమాత్రమగు సహాయిగఁ ద్రాతవు నీవ యెల్లరున్. శ్రీ. 7. 9. 353

వ. బాలుని దల్లిదండ్రులును, రోగిని వైద్యదత్తంబైన యౌషధంబును, సముద్రంబున మునుంగువాని నావయును దక్కొరులు రక్షింపనేరని తెలుంగున (పోతన)

నీచే నుపేక్షింపఁబడినవారికి సాధనములు నిరుపయోగములు. నీవే రక్షకుఁడవు అను మూలమందలి భావమునకు నితరాధారములకు బలమిచ్చుట గమనింపుఁడు.

శ్లో. యావద్భ్రియేత జఠరం, తావత్స్వత్వంహి దేహినామ్
అధికం యోధిమన్యేత, స స్తేనో దండ మర్హతి॥

గీ. ఎంతమాత్రానఁ గుక్షి భరింపఁబడునో, యంత దేహులకున్ స్వత్వ మౌఁదలంప
నంతకెక్కుడు వాంఛించునాత్మ నెవ్వఁ, డతఁడు పాటచ్చరుండు దండార్హుఁడు నగు.
శ్రీ. 7. 14. 503

వ. ఉదరపూరణమాత్రంబు దొంగిలినవాని దండింపక (పోతన)

ఎక్కువ నిల్వచేసికొనుట దొంగతన మనిపించుకొను ననుదానికి పై వాక్యము దొంగతనమునకుఁ బురికొల్పుమాటగా మార్పుఁజెందుట గుర్తింపుఁడు—

ఇఁక మూలవిరుద్ధంబుగ సప్తమస్కంధమునఁ జాలచోట్లఁ గల్పింపఁబడినవి గమనింపుఁడు. గజేంద్ర మోక్షణ కథాఘట్టమున "దశలక్షకోటి కరిణీనాథుండై" ఈ సంఖ్యవలని ప్రయోజనము కనబడదు. కరిణీసముదాయముతో ననవచ్చునుగదా.

శ్లో. ఏవం గజేంద్ర ముపవర్ణితనిర్విశేషం, బ్రహ్మాదయో వివిధలింగభిదాభిమానాః
నైతే యదోపససృపు ర్నిఖిలాత్మకత్వాత్, తత్రాఖిలామరమయో హరిరావిరాసీత్ ॥

శా. దంతీంద్రుం డిటు నిర్విశేషపరతత్త్వారంబున్ బ్రశంసింపఁగా
నంతన్ మూర్తిభిదాభిమానులగు బ్రహ్మాదుల్ ధృతింబూని త
త్త్వాంతక్షోణికిఁ జేరరై రపుడు విశ్వాత్ముండు విష్ణుండు స
ర్వాంతర్యామి పరాత్పరుండు హరియంగ బావిర్భవించెన్ వెసన్. శ్రీ. 8. 3. 65

విశ్వమయుఁడగు భగవంతుని గజేంద్రుఁడు ప్రార్థింప నా భగవంతుఁడచటనే యావిర్భవించి గజేంద్రు రక్షించెనని మూలమునందు "అల వైకుంఠపురంబులో నగరిలో నామూల" అని విశ్వమయుఁడగు భగవంతుని మూలనుంచి రప్పింపవలసిన యవసరమును, ఈపద్యపూర్తికే యిష్టదైవమగు శ్రీరామచంద్రప్రభువు గంటము పట్టుకొని వ్రాయవలసినవసరమ్మునేల కల్పింపఁబడినవో తెలియకున్నవి. శ్రీనాథ కవిసార్వభౌముఁడీవిషయముననే పోతన నాక్షేపించెననియునందురు. ఇంకను నీసందర్భముననే మూలమునలేని "సిరికిం జెప్పఁడు" అను పద్యమున "శ్రీకుచోపరి చేలాంచలమైన చక్కవీడఁడు" అను శృంగారవాక్యము, గజేంద్రునిరక్షించి వచ్చునపుడు "బాలా నావెనువెంటను, హేలన్ వినువీధినుండి యేతెంచుచు నీ, చేలాంచలమును బట్టుట, కాలోనేమంటినన్ను గనంభోజముఖీ!" ఇట్టి భగవంతుని కుశలప్రశ్నలఁ గల్పించుటెంత సమంజసమో గమనింపుఁడు.

వామనునికి బలి దానమొసఁగు సందర్భమున

"ఆదిన్ శ్రీసతి కొప్పుపై తనువుపై నంసోత్తరీయంబుపై
పాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందుకరంబు గ్రిందగుట మీఁదై నా కరంబుంట మేల్
గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే. (పోతన)
"కమలాకర్షణ సుప్రశస్తము రమాకాంతాకుచోపాస్తమున్
విమలశ్రీకుచశాతచూచుకతటీవిన్యస్తమున్ హస్తమున్. (పోతన)

అని కల్పింపఁబడినది— భగవంతుని హస్తమిట్టి శృంగార విలాసమునకేనా యుపకరించునది, ఇట్టివే పాఠ్యభాగములుగను నిర్ణయించుచుండిరి. ఈనాటి బాలబాలికలకెట్లుపాధ్యాయులు బోధింప ననువుపడునో గమనింపుఁడు.

శ్లో. స్త్రీషు నర్మ వివాహేచ, వృత్త్యర్థే ప్రాణసంకటే
గోబ్రాహ్మణార్థే హింసాయాం, నానృతం స్యా జ్జుగుప్సితమ్॥

క. పరిణయ వృత్తి స్త్రీజన, పరిహాస ప్రాణభంగ వైశసగతులన్
వర గో విప్రహితార్థము, ధర బొంకుట యది జుగుప్సితముగా దధిపా!
(శ్రీ. 8. 19. 506

ఆ. వారిజాక్షులందు వైవాహికములందుఁ, బ్రాణ విత్త మానభంగమందుఁ
జకిత గోకులాగ్రజన్మరక్షణమందు, బొంకవచ్చు నఘము వొందదధిప! (పోతన)

పై పద్యమున నర్మ, వృత్తి హింసావిషయంబులు లేక విత్త, మానభంగములు ప్రకరణానుచితముగఁ జేర్పఁబడుట గమనింపుఁడు.

శ్లో. దృఢం పండితమాన్యజ్ఞ, స్తబ్ధోఽప్యస్మదుపేక్షయా
మచ్ఛాసనాతిగో యస్త్వ, మచిరా ద్భ్రశ్యసే శ్రియః॥

ఉ. పండితమాని వజ్ఞుఁడవు పాల్పడి మమ్ము నుపేక్షఁ జేయుచున్
దండితనంబుఁ గొల్పడిన స్తబ్ధుఁడ విప్పుడు మా నిదేశ ము
క్కుండ నిరాకరించితివి కావున స్వీయపదంబునుండి భ్ర
ష్టుండవు కమ్ము సర్వులును జూచుచునుండ వదాన్యడాంబికా! శ్రీ. 8. 20. 522

ఆ. నీరధారఁ బడగ నీక యడ్డంబుగాఁ, గలశరంధ్రమాపఁగాను దెలిసి
హరియుఁ గావ్యనేత్రమటఁ గుశాగ్రంబున, నడువ నేకనేత్రుఁడయ్యె నతఁడు.
(పోతన)

మూలమున లేని దీన శుక్రపాత్ర గంభీరత నశించుచున్నది. ఇట్టి వెచట నుండియో గ్రహింపఁబడి ప్రకరణానుచితముగఁ జేర్పఁబడుచున్నవి.

శ్లో. నాహమాత్మాన మాశాసే, మద్భక్తైః సాధుభిర్వినా
శ్రియం చాత్యంతికీం బ్రహ్మన్, యేషాం గతి రహం పరా॥

గీ. నాకునై నేను గోరనెన్నఁడును మదిని, నీవె దిక్కని యితరమున్ విడిచి నన్ను
గోరికొల్చు మద్భక్తులకొఱకె కాని, సకల సౌభాగ్యలక్ష్ములన్ సంయమీంద్ర!
(శ్రీ 9. 4. 126

ఆ. నాకు మేలుఁ గోర నా భక్తులకె కాని, భక్తజనుల కే నపరమ గతియు
భక్తుఁ డెందుఁ జనినఁ బఱతెంతు వెనువెంట, గోవు వెంటఁ దగులు కోడె భంగి (పోతన)

ఆవు వెంటఁబడు నాఁబోతు విధముగ భక్తుని కూడ పడుదునను ఉపమాన వాక్యము కవికి రుచియని లోకము హితవుఁ జేసికొనునా? ఈ విధమున శ్రీరామ నృసింహ మూర్తుల శ్రీమదాంధ్ర భాగవతము, మూలముఁ జూచిన పోతనామాత్య భాగవతమందలి పెంపు, తగ్గింపు, మార్పులు వాని ప్రయోజనము స్పష్టముగాఁ గలదు. ఈ కాలమున శ్రీరామ నృసింహమూర్తి కవులచే నిట్టి పవిత్రవాణి వెలువడుట నీ యిరువ

దవ శతాబ్దమును ధన్యత్వముఁ జెందినదనవచ్చును. పవిత్రమూర్తులగు నీ శ్రీరామ నృసింహమూర్తికవులకు సర్వేశ్వరుఁ డాయురారోగ్య భాగ్య శేముషీ సంపదలొసంగి యెల్లవేళల సంరక్షించుచు నితోఽధిక సద్గ్రంథరచనకు దోహద మొసర్చి లోక కల్యాణమును జేకూర్చుఁగాక.

వీరవాసరం,
1 అక్టోబరు, 1955.

జి. భోగేశ్వరరావు (భాషాప్రవీణ)
ప్రథమశ్రేణి పరీక్షానాంధ్రోపాధ్యాయులు
స్థానికోన్నతపాఠశాల, వీరవాసరం.

## అభిప్రాయములు.

మన మాతృభాషయగు ఆంధ్రభాషయందు పూర్వకాలమున భారతము, భాగవతము, రామాయణము మొదలగు ఉత్తమగ్రంథములు మహాకవులచే రచింపఁబడి ఆంధ్రప్రజలను నేటికిని విజ్ఞానధనులనుగాఁ జేయుచున్నవి. నేటి నవీనయుగములో ఆంధ్రయువకవులు అనేకమంది పెక్కు ఖండకావ్యములువ్రాసి ఆంధ్రభాషామతల్లిని అలంకరించిరి. మహాకావ్యములు వ్రాయు ప్రతిభ జాతిలో క్షీణించినది. ఈయుగములో మహాకావ్యములు రచించుటకు పూనుకొని ఆంధ్రజాతి మన్ననలఁబడసినవారు యిప్పటికి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారొక్కరే. వీరికితోడు ఇప్పుడు వ్యాస మహర్షి రచిత సంస్కృతభాగవతమును పశ్చిమగోదావరీమండల వాస్తవ్యులు, గద్వాలసంస్థానాస్థాన కవిపుంగవులు, ఉభయభాషాప్రవీణులు, భగవద్భక్తులు నగు 'శ్రీ శ్రీరామనృసింహమూర్తి కవులు' తెనిగించిరి. వీరి భాగవతగ్రంథరత్నమును జూచి తన్మయుఁడనైతిని. పోతనవలె స్వతంత్రించక ప్రతిశ్లోకమునకు సరియగు అనువాదమునకుఁ బూనుకొనుట సంతసము. అనువాదములో కష్టమెంతగలదో మనకుఁదెలియనిదికాదు. వీరి కవిత్వము సరళము, మధురము. ఇంకను వీ రిట్టిమహాకావ్యముల రచించి రసమయమైన కవిత్వముతో ఆంధ్రమహాజనుల మన్ననలకుఁ బాత్రులగునట్లు సర్వలోకకల్యాణమును జేకూర్చు భగవానుఁడు ఆశీర్వదించుఁగాక.

అమృతలూరు,
6—8—55.

శరణు రామస్వామి చౌదరి (లైసెన్స్)
గుంటూరుజిల్లా గ్రంథాలయ అధారిటీ మాజీ కార్యదర్శి,
ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము.

శ్రీరామ నృసింహమూర్తికవుల శ్రీమదాంధ్రభాగవతముఁ జూచితి. అందు వీరికిఁ గల పాండిత్యప్రకర్షయు ననన్యసామాన్యమగు నాధ్యాత్మికానుభవమును ద్యోతకమగుచున్నవి. మూలానుసరణముగ నుండుట, మక్కికిమక్కిగగాక తెలుఁగు నుడికారమునకు భంగపాటులేని చక్కనిభాష కలిగియుండుట, సలక్షణముగ లక్ష్యగ్రంథముగ నుండుట, ఏపద్యమున కాపద్యమే సంపూర్ణార్థబోధకముగ నుండుట, దురభిమానపూర్వక పద్యములఁ జొప్పింపకుండుట, తిక్కన్నశైలివలె పదమధ్యయతులు, వచనరూపకపద్యములుఁ గలిగియుండుట, భాషాడంబరమున భావలోపములఁ గప్పిపుచ్చకుండుట, యసభ్యశృంగారవర్ణనలు గలచోట్లు లేకుండుట మొదలగు మంచివిషయములెన్నేని కన్పించుచున్నవి. ఇట్టి పవిత్రవాణి వెలువడు పుణ్యమూర్తులగు శ్రీరామనృసింహమూర్తులకు భగవంతుఁ డాయురారోగ్యభాగ్యములఁ జేకూర్చి పవిత్ర గ్రంథరచనకితోఽధికోత్సాహము నొసంగుఁగాక.

విద్వాన్, కె. శ్రీరామమూర్తి.

'శ్రీమదాంధ్రభాగవతము' దీనిని గద్వాల సంస్థానాస్థానకవులు 'శ్రీరామ నృసింహమూర్తికవులు' గంధం శ్రీరామమూర్తి, ఇట్టంకి నరసింహమూర్తులను జంటకవులు రచించి ప్రకటించియున్నారు. అందు మొదటి మూఁడు స్కంధములు గల ప్రథమసంపుటముఁ జూచితి. పోతన భాగవతము విఖ్యాతమగుచుండ మఱియొక రెవ్వరును భాగవత మాంధ్రీకరింపఁ బూనుకొనుటకు భయపడుచుండువారు. ఇప్పుడట్టి భయమువిడిచి తత్ప్రయత్నమునం దుత్సాహసాహసములు చూపుచుండుట మిక్కిలి ముదావహము. ఈ భాగవతానువాద మెట్లున్నదో విద్వాన్, కె. శ్రీరామమూర్తి గారు వ్రాసిన సమీక్ష వీక్షించినఁ దెలియకమానదు. మఱల నేనిట వ్రాయుట పునరుక్తియే యగును. 'అనగననగ రాగ మతిశయిల్లుచునుండు' అనునట్లు పద్యమునకుఁ గాలమే ప్రమాణమై సమీచీనతఁ గల్గించునని నా నిశ్చయము.

ఈ యిద్దఱు కవులును దాయభాగము చేసి సోదరులవలెనుండి సద్వ్యవహారము లొకరినొకరు సంప్రతించుకొనుచుఁ దమకుఁ దెలియనిసంగతుల నితరుల నడిగి తెలిసికొనుచు సంస్కృతప్రతులలోనుండు పాఠభేదములు కనిపెట్టి వానియందు యుక్తమైనదానిని గ్రహించుచు నిర్దుష్టగ్రంథరచనఁ గావించి యుత్తమలోకఖ్యాతిఁ గాంతురుగాక యని కోరుచు వారికి నాయురారోగ్యైశ్వర్యము లొసంగుంగాక యని పరమేశ్వరుని బ్రార్థించుచున్నాను.

రాజమహేంద్రవరము.
27—3—1955.

కవిపోష్యుఁడు,
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.
ఆంధ్రప్రభుత్వాస్థానకవి.

కావ్యము లిరుతెఱంగులు. ఖండకావ్యములు, మహాకావ్యములు. చిన్నకావ్యములు చెలువము పెద్దవానికిలేదు. పెద్దకావ్యముల గాంభీర్యము చిన్నవానికి రాదు. చిన్నలకు ముద్దులు, పెద్దలకు నమస్కారములు. ఇది లోక మర్యాద. బృహత్కావ్యనిర్మాణమునకు నిరుపమానదీక్షయు, నిరంతర పరిశ్రమయు, నోపికయు నవసరములు. కావ్యరచనమునకుఁ దపోనిష్ఠ ఆవశ్యకము. అందునను భాగవతము వంటి మహాకావ్యనిర్మాణము అంతింతల కొనసాగునదికాదు. ఆధునిక యుగము వారి అభిరుచి ఖండకావ్యములకేగాని మహాకావ్యరచన కనుకూలమయినదికాదు. ఇట్టివేళలో నీ జంటకవు లిమ్మహాకావ్యము వ్రాయఁబూనుట సాహసమే. అయినను పరమభాగవతులకు సాధ్యముకాని కార్యమేది? మహాకావ్యనిర్మాణమున వీరు విజయశీలురుగావుట అస్మదాదుల కానందదాయకము. గ్రంథకర్త లిరువురు నేకోదరులు కారు కాని కవిసోదరులు. ఏకవంశీయులు కారుకాని ఏకకులజులు. బంధుమిత్రులు. మీదుమిక్కిలి మేలిమిత్రులు. నెయ్యమునకు వియ్యమునకు నమత వలయుననుట వీరియెడ సార్థకమైనది. గద్వాలసంస్థానాస్థానకవుల పాండిత్య కవితాప్రతిభలఁగూర్చి ప్రసంగించుట అనవసరమేకాదు, అధికప్రసంగము. వీ రిరువురు సరసకవితాసంపన్నులు, శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, ఉపాధ్యాయశేఖరులు, ఉత్సాహపూరితులు. వీరి భాగవత మహాకావ్య మిక్కాలమున ప్రచురించుట విశ్వశ్రేయమును గోరికాని అన్యాపేక్షవలనఁగాదు. ‘బమ్మెరవారి కమ్మనికావ్యము కలదుకదా! ఇది యేల’ అని కొందఱనవచ్చును. కాని పోతనామాత్యుని భాగవతము మూలమును మన్నింపమి లోకమెఱిఁగినదేకదా. ముఖ్యముగ మూలానుసారిగావుట వీరి కావ్యవైశిష్ట్యము. సరసము మధురము నగు నీ మహాకావ్యము చిరప్రసిద్ధిని వీరికిఁ జేకూర్చి జగత్కల్యాణకారకమగుననుటలో నాకు సందియములేదు. శ్రీ దేవకీనందనుఁడు వీరికి చిరాయురున్నతినొసంగి సారస్వతసేవ వీరిచే నినుమిక్కిలిగ గావింపఁజేయుఁగాక.

ఏలూరు,
30—5—1955

అద్దేపల్లి నాగగోపాలరావు, విద్వాన్, బి.ఎ; బి.యల్.
మెంబరు, పి. ఇ. ఎస్.

మీరు దయతో పంపిన మీ భాగవత ప్రథమసంపుటముందినది. కృతజ్ఞత. గ్రంథ మామూలాగ్రముగ గాకున్నను అచ్చటచ్చట కొన్ని భాగములు చదివితిని. మీ పరిశ్రమ కెంతో సంతసించితిని. మీ పూనిక నాకు ఆశ్చర్యము కల్గించినది.

విజయవాడ,
27—6—1955.

పింగళి లక్ష్మీకాంతం, ఎమ్. ఎ.
లిటరరీ ఎడ్వైజర్, ఆలిండియా రేడియో, విజయవాడ.

హృదయపూర్వక నమస్సులు,

తమరుపంపిన తమ భాగవత ప్రథమసంపుట మందినది. చదివి యానందించితి. కవులకు కళాకారులకు దేశములో నేమాత్రము ఆదరణలేక క్రుంగి కృశించుచున్న ఈకాలములో గురుతరమైన బాధ్యతను తలపెట్టి సమర్థతతో నిర్వహించుచున్న తమకు నా జోహార్లు. ఆంధ్రప్రజానీకం తమకు జాల ఋణపడియున్నది. భాషాసరస్వతికిఁ దమభాగవతమొకప్రత్యేక అలంకరణము. భగవంతుఁడు తమకు సదా అభ్యుదయమును జేకూర్చుఁగాక.

త్యాగరాయనగర్,
మద్రాసు 17
10—5—1955.

నమస్సులతో భవదీయుఁడు,
చిత్తూరి వి. నాగయ్య.

కోమల వాగ్విలాసములఁగోటివరా లెగఁబోయుచున్న శ్రీ
రామనృసింహమూర్తులు చిరస్మరణీయులు విశ్వకావ్య గీ
తామృతసారసంస్కృతి సమన్విత భాగవతంబు వ్యాసవా
ణీమణి మొక్కవోనికరణిన్ రచియించిరి తెన్గుభాసలోన్.

కవితాసంస్థానము
తాడేపల్లిగూడెం,
9—3—1955.

వేదాంతకవి,
(ఆంధ్ర బెర్నార్డుషా)

ఉత్పలమాలిక:

మూర్తులమూవురందు నొక,మూర్తిగనుండెడు విష్ణుమూర్తి తా
మూర్తులఁగొన్నిటిన్ సరఁగ,మున్ను ధరించి సముద్ధరించె లో
కార్తుల; నిప్డు తానయయి, యాంధ్రభువిన్ జనియించి లోకులన్
బూర్తిగ భక్తితత్పరతఁ, బొందునటుల్ నలుపంగనెంచి యీ
మూర్తుల రెంటి నొక్కటను, మోదముతో ధరియించి లోక స
ద్వర్తనఁగూర్చ స్వీయకథ, భాగవతంబనుపేర మీఱ మే
ల్మూర్తమునన్ రచించుటకుఁ, బూనెనొకో యనఁ దెల్గుబాసలోఁ
గీర్తినిగాంచునట్టులు లిఖించిరి రామనృసింహమూర్తులున్.

జి. భోగేశ్వరరావు, (భాషాప్రవీణ)

ఉత్పలమాలిక:

బమ్మెరపోతరాజకృత భాగవతంబు జగద్ధితార్థమై
యిమ్మహి రాగతాళలయహిండిమమై నటియించుచుండఁగాఁ
గ్రిమ్మఱ మూర్తిసత్కవులు వ్రాసిరి భాగవతంబుఁ దెల్గులో
అమ్మక చెల్లు! పూర్వకృతమైన యఖండతపఃఫలాప్తిచే.........

శ్రీ విక్రమవిలాసము,
తణుకు,
20—3—1955.

విద్వాన్, పండిత
పెనుమెచ్చ సత్యనారాయణరాజు,
(జయపుర సంస్థానాస్థాన కవి)

# శ్రీ రామ నృసింహ గ్రంథ రత్నమాల

## మహారాజపోషకులు.

| | | |
|---|---|---|
| శ్రీ మద్దాల రామకృష్ణమ్మనాయుడుగారు | భూస్వాములు | వీరవాసరం |
| ,, పచ్చిగోళ్ల అచ్యుతరామయ్యగారు | ,, | ,, |
| ,, గ్రంధి వెంకటాద్రిపుగారు | ,, | ,, |
| ,, వేగేశన సూరపరాజుగారు | ,, | శివదేవునిచిక్కాల |
| ,, వడ్డె రంగయ్యనాయుడుగారు | ,, | ,, |
| ,, కర్రెడ్డి కుసుమేశ్వరరావుగారు | ,, | పెదకాపవరము |
| ,, యర్రా మన్యాలుగారు | ,, | ఉప్పులూరు |
| ,, యర్రా శేషయ్యగారు | ,, | ,, |
| ,, యర్రా సూర్యారావుగారు | ,, | ,, |
| ,, యర్రా చంద్రరావుగారు | ,, | ,, |
| ,, యర్రా కేశవరావుగారు | ,, | ,, |
| ,, యర్రా మాణిక్యంగారు (శ్రీరాములుగారికు॥) | ,, | ,, |
| ,, మద్దుకూరిసీతారామస్వామిగారు(సీతారామాంజనేయ హైస్కూలు)నవాబుపాలెం ప్రొప్రయిటరు. | | |
| ,, నూకల స్వామినాయుడుగారు | వర్తకులు | తాడేపల్లిగూడెము |
| ,, రావూరి అప్పారావుగారు | ,, | ,, |
| ,, పసల సూర్యచంద్రరావుగారు | కథారాధకులు | ,, |
| ,, తిరుమలశెట్టి సూర్యనారాయణగారు | భూస్వాములు | విప్పర్రు |
| ,, జవ్వాది లక్ష్మయ్యనాయుడుగారు ఎమ్. ఎల్. ఎ, కవికులాలంకారులు, పెనుగొండ | | |
| ,, గన్నాబత్తుల రంగారావుగారు | భూస్వాములు | భీమవరం |
| ,, చెన్నంశెట్టి ఆదినారాయణమూర్తిగారు, పంచాయితీబోర్డుప్రెశిడెంటు, ఉండి | | |
| ,, యర్రా సత్యనారాయణగారు (చినశేషయ్యగారి కుమాళ్లు) | | ఉండి |
| ,, వి. సత్యనారాయణగారు | | |
| ,, వర్ధినీడి చిట్టబ్బాయిగారు | భూస్వాములు | పూళ్ళ |
| ,, వర్ధినీడి కృష్ణమూర్తిగారు బి. యె. | ,, | ,, |
| ,, కళ్ళి వెంకటేశ్వరరావుగారు బి.యె.,బి.యల్., | ,, | ,, |
| ,, కళ్ళి రాజారావుగారు బి. కాం. | ,, | ,, |
| ,, పేరవలి అప్పారావుగారు బి.యె.,బి.యల్., | ,, | ,, |
| ,, యర్రా పార్థసారథిగారు బి. యె. | ,, | ,, |

| | | |
|---|---|---|
| శ్రీ పెద్దిరెడ్డి సత్యనారాయణమూర్తిగారు ఎమ్.ఎ.ఎల్.ఎల్.బి. | భూస్వాములు, | కైకరం |
| ,, శేనం భూషయ్యగారు | భూస్వాములు | కైకరం |
| ,, పోశింశెట్టి రామమూర్తిగారు | ,, | అడవికొల్లు |
| ,, నిమ్మల నర్సయ్యగారు | ,, | ,, |
| ,, మల్లారెడ్డి శేషగిరిరావుగారు ఎమ్. ఎ. ఎల్. ఎల్. బి. | | తరటావ |
| ,, పులపర్తి సుబ్బారావు జమీందారుగారు | | ఆకివీడు |
| ,, పాపోలు వెంకట్రాజుగారు, పంచాయితీబోర్డు ప్రశిడెంటు, | | ,, |
| ,, కల్దిండి పుల్లంరాజుగారు, పంచాయితీబోర్డు ప్రశిడెంటు, | | తోలేరు |

## పోషకులు.

| | | |
|---|---|---|
| శ్రీ వర్ధినీడి వీరరాఘవులుగారు | భూస్వాములు | వీరవాసరం |
| ,, వర్ధినీడి సూర్యారావుగారు | ,, | ,, |
| ,, గుద్దటి నరసింహమూర్తిగారు | ,, | ,, |
| ,, గుద్దటి కృష్ణమూర్తిగారు బి. యె., బి. యల్., | ,, | ,, |
| ,, మద్దాల బాలాజీరావుగారు, పంచాయితీబోర్డు ప్రశిడెంటు, | | ,, |
| ,, మద్దాల రంగనాయకులుగారు బి. యె. | భూస్వాములు | ,, |
| ,, మద్దాల చల్లేశ్వరరావుగారు | ,, | ,, |
| ,, మద్దాల అప్పన్నగారు | ,, | ,, |
| ,, నక్కెళ్ళ వెంకట్రావుగారు | ,, | ,, |
| ,, యిర్రింకి కృష్ణమూర్తిగారు (రాజయ్యగారికు॥) | ,, | తోలేరు |
| ,, యిర్రింకి చిననరసింహమూర్తిగారు | ,, | ,, |
| ,, యిర్రింకి వరదరాజులుగారు | ,, | ,, |
| ,, యిర్రింకి రామమూర్తిగారు(కనకయ్యగారికు॥) | ,, | ,, |
| ,, నూకల రాజారావుగారు | వర్తకులు | ,, |
| ,, చవాకుల సూర్యప్రకాశరావుగారు | భూస్వాములు | ,, |
| ,, చవాకుల చక్రపాణిరావుగారు | ,, | ,, |
| ,, తోలేటి అప్పారావుగారు (ఫిజికల్ ఇన్‌స్ట్రక్టర్) | ,, | ,, |
| ,, ఆకెళ్ళ శ్రీరామమూర్తిగారు | ,, | ,, |
| ,, ఆకెళ్ళ కృష్ణమూర్తిగారు | ,, | ,, |
| ,, ఆకెళ్ళ రామమూర్తిగారు | ,, | ,, |
| ,, యిర్రింకి మాణిక్యాలరావుగారు | ,, | ,, |
| ,, పెద్దేటి రామానుజులుగారు | వర్తకులు | గణపవరం |

| | | |
|---|---|---|
| శ్రీ బళ్ళ అప్పారావుగారు | వర్తకులు | గణపవరం |
| ,, చెన్నంశెట్టి నరసింహస్వామిగారు (మాజీపోష్టు మాష్టరు) | | ఉండి |
| ,, చెన్నంశెట్టి సత్యనారాయణమూర్తిగారు, భూస్వాములు | | ఉండి |
| ,, మెలకా రామమూర్తిగారు | | తాడేపల్లిగూడెం |
| ,, వెలిశెట్టి నారాయణమూర్తిగారు | భూస్వాములు | ,, |
| ,, ముద్దం వెంకటస్వామిగారు | ,, | ,, |
| ,, బోణం వరదరాజులుగారు | ,, | బూరుగపల్లి |
| ,, నల్లం బ్రహ్మన్నగారు | ,, | గునుపూడి |
| ,, నల్లం సోమసుందరంగారు | ,, | ,, |
| ,, నల్లం రామారావుగారు | ,, | ,, |
| ,, నిమ్మల వెంకటరత్నంగారు | ,, | ఆగర్తిపాలెం |
| ,, యాసా సీతారామయ్యగారు | ,, | పూళ్ళ |
| ,, మహమ్మద్ గౌస్ మొహిద్దీన్‌గారు | ,, | భావాయిపాలెం |
| ,, పైడిమర్రి రోషయ్యగారు | ,, | ఆకివీడు |
| ,, దెందుకూరి సుబ్బరాజుగారు | ,, | దువ్వ |
| ,, గ్రంధి సీతన్నగారు | ,, | సూర్యారావుపాలెం |
| ,, పెనుమెచ్చ రామకృష్ణంరాజుగారు బి.ఏ.,బి.ఇ.డి, | | ఉండి |
| ,, యాళ్ళబండి గోపాలస్వామిగారు | ,, | కాకరపఱ్ఱు |
| ,, లొల్ల అప్పారావుగారు | ,, | ఆరవల్లి |
| ,, మంగెన గంగన్నగారు | ,, | పోలమూరు |
| ,, ఉప్పలూరి కృష్ణమూర్తిగారు | ,, | నిడదవోలు |
| ,, పల్లా పాపారావుగారు | ,, | పాలకోడేరు |
| ,, పొత్తూరి వెంకట్రాజుగారు | భూస్వాములు | అలంపురం |
| ,, ములగాల గంగరాజుగారు | ,, | రావిపాడు |
| ,, కోటగిరి అప్పారావుగారు | ,, | ,, |
| ,, వంకాయల సూరయ్యగారు | వర్తకులు | ముద్దాపురం |
| ,, చింతలపాటి పుల్లయ్యగారు | భూస్వాములు | అయిభీమవరం |
| ,, వేగేశన రామరాజుగారు | ,, | ఎండగండి |
| ,, నరహరిశెట్టి రామారావుగారు | ,, | బుట్టాయిగూడెం |
| ,, వడ్డి వెంకట్రామయ్యగారు | ,, | అజ్జమూరు |
| ,, పులపర్తి మాధవరాయుడుగారు | ,, | చినగొల్లపాలెం |

# శ్రీ మదాంధ్ర భాగవతము

(సప్తమ, అష్టమ, నవమ స్కంధములు)

## సప్తమ స్కంధము

### క థా సం గ్ర హ ము

### ప్ర హ్లా ద చ రి త్ర.

భగవంతుఁడు సర్వసముఁడుకదా! సర్వసమగ్రుఁడగునాతనికి రాక్షసులవలన భయము కాని సంపూర్ణకాముఁడగుట దేవతలవలనలాభము కాని లేదుకదా! మరి యేల దేవతలకొఱకై రాక్షసులను వెదకి వెదకి చంపె నని పరీక్షిన్మహారాజు తనకుఁ గల్గిన సందియంబు శుకమహర్షి నడుగ నాతం డిట్లు చెప్పె.

రాజా! భగవంతుఁడు గుణముల కతీతుఁడు, సత్త్వరజస్తమంబులు ప్రకృతిగుణంబులు, అవి యొక్కొక్కప్పుడు వృద్ధిక్షయముల నొందుచుండును, వాత, పిత్త, శ్లేష్మముల నేదేనొక గుణప్రకోపమున దేహమునకు నష్టము వాటిల్లినప్పుడు దానిని సరిజూచుకొనునవసరము జీవునకు గలుగునట్లు రజస్తమంబుల (రాక్షసుల) ప్రకోపంబునఁ బ్రకృతికి హాని కలుగునప్పుడు సత్త్వగుణప్రభావంబున (దేవతలవలన) భగవంతుఁడును దాని సరిజూచుకొనవలసియుండును. ఈ యుగమునే ధర్మజుఁడు రాజసూయయాగమున దుర్మార్గుఁడగు శిశుపాలుఁడు శ్రీకృష్ణునిచే నిహతుఁడై తేజోరూపమున శ్రీకృష్ణు నందుఁజొచ్చుట కాశ్చర్యపడి దుష్టుఁ డెట్లు భగవంతుఁ జేరంగల్గె నని ప్రశ్నింప నారదుఁ డీ కథ చెప్పందొడంగె.

ఏ గుణంబుచేతనైన భగవంతునియందు మనస్సు లగ్నమైన భగవంతుఁ జేరనగును. వేనుఁడు భగవత్సంబంధి కాకుండుట నరకకూపమునఁ బడె. కామమున గోపికలు, భయమునఁ గంసుఁడు, వైరమున శిశుపాలాదులు, సంబంధంబున వృష్ణులు, ప్రేమచే మీరు, భక్తిచే మేము భగవంతుఁ జేరుచుంటిమి కదా! ఈ శిశుపాల దంతవక్త్రులును భగవత్సన్నిధానమున నుండువారలయ్యు, శాపంబున నిట్లు జనించి వైరానుబంధంబున శ్రీహరిఁ జేరికొనిరి. ఆఱుకక్ష్యలు దాటినను నేడవకక్ష్య నీ యహంకార, మమకారములను జయవిజయుల యటకాయింపు నుండకపోదు. అప్పుడే ప్రమాదము, పతనావస్థ తటస్థించుచున్నది. సనకసనందనాదులు బాలురవలె దిగంబరమున కరిగి ఆఱుకక్ష్యలు దాటి యేడవకక్ష్య నీ జయవిజయులచే నటకాయింపఁబడి కోపోద్రిక్తులైరి. ద్వారపాలురు గన్న కూడనిమహర్షుల నడ్డుటచే జయవిజయులును, వైరంబునను నహంకారయుతులగుట సనకసనందనాదులును, ఇట్టి ప్రదేశమునకు యజమానియగుట భగవంతుఁడును మహర్షిశాపముఁ బొందవలసి వచ్చెను. అందువలన నొకపుట్టువున జయవిజయులు, హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగను, సనకసనందనాదులు ప్రహ్లాద అనుహ్లాదాదులుగను, భగవంతుఁడు, యజ్ఞవరాహ నృసింహమూర్తులుగను జనించిరి. మఱి

యొక్క పుట్టువున, జయవిజయులు రావణకుంభకర్ణులుగను, సనకాదులు విభీషణాదులుగను, భగవంతుఁడు శ్రీరామచంద్రుఁడుగను జనించె. ఇప్పు డా జయవిజయులే శిశుపాల దంతవక్త్రులుగను, సనకాదులే అక్రూరాదులుగను, భగవంతుఁడే శ్రీకృష్ణుడుగను జనించె. ప్రథమమున హిరణ్యాక్షుని హరి సూకరాకారంబున నిర్జించె. దానికి హిరణ్యకశిపుఁడు రోషవిషాదములు పెనగొన హిరణ్యాక్షుని భార్యాపుత్రులను (కుటుంబమును) ఓదార్చి చావులేకుండునట్లుగను, అస్వతంత్రత యెఱుఁగకుండునట్లుగను, దైవమనియొకఁడు తనపైనుండనట్లుగను గోరి ఘోరతపంబున నట్టి ప్రభావము సంపాదించె. ఇఁక తాను స్థిరుఁడననియు, తనపైన వేఱుదైవము లేఁడనియు, తానే సమస్థుఁడననియుఁ దలంచి సోదరుని జంపిన పగఁదీర్చుకొనుటకుఁ దాను విరోధులుగ భావించువారినెల్ల హతమొనర్చుచుండెను.

హిరణ్యకశిపుఁడు గర్భవతియగు తనభార్యలీలావతిని నాశ్రమంబునవీడి తపస్సుఁజేయుచుండ నింద్రుఁడు వీనికి జనించుపుత్త్రుఁ డింతకంటెఘాతుకుఁడౌనని యామెనుగాని జనించుపుత్త్రునిగాని సంహరింపవలె నని లీలావతిని గొంపోవుచుండ నారదుఁ డడ్డుపడి తనయాశ్రమమునకుఁ దీసికొనిపోయి గర్భస్థశిశువునకు భగవన్మహిమతోఁగూడిన జ్ఞానోపదేశముఁ జేసెను. ఆ శిశువున కుపాధితోపాటు జ్ఞానమును నభివృద్ధి కాఁదొడంగెను. అట్టిబాలుని హిరణ్యకశిపుఁడు శుక్రపుత్త్రులగు చండామార్కులయొద్ద మఱికొందఱ బాలురతోపాటు చదివించెను. ప్రహ్లాదుఁడు గురువులు తన కుపదేశించు త్రివర్గము అజ్ఞానుల కుపకరించునదగుట తన కహితముగనున్నను నుదాసీనభావమున మెలఁగుచుండెను. తండ్రి తనవిద్యఁ బరీక్షించుటకుఁ బిలిపించెను. తానును దనకు దృఢముగఁ దోఁచుచున్నది చెప్పెను. హిరణ్యకశిపుఁడు కోపించి నన్ను మెచ్చుకొనుటకాని నాశత్త్రువుల దునుము సంకల్పము కాని లేక నాకంటె నెవఁడో మఱియొక దైవ మున్నాఁడని పలవించి నన్ను న్యూనతపఱచుచుంటివి. సరిదిద్దుకొను మని యదలించి బెదరించి యుపాయచతుష్టయ నుపయోగించి చూచెను. గడువొసంగెను. ఎక్కడచెప్పిన నెప్పుడుచెప్పిన నెవరితోఁజెప్పిన నేమిచేసిన ప్రహ్లాదుఁడు తన విశ్వాసమునుండి మఱల లేదు. పైగా తండ్రి పొరబడుచుండెనని తలంచి భగవంతుఁడు లేనిస్థలము లేనేలేదు. అతండు సర్వశక్తిసంపన్నుఁడు. తండ్రీ! వానిని ధిక్కరించుటకు మన కేమిశక్తి కలదు? మనము కించిత్జ్ఞులము, పొరబడుచున్నావని ముద్దులొలుకు తొక్కుపలుకుల దృఢముగఁ బలుకుచుండెను. అనేక విధముల తండ్రి తనపెద్దతనమునే భావించుచు బెదరించెను. ప్రహ్లాదుఁడు చలించలేదు. ఏమిచేసినను భయపడలేదు. బాధ నొందలేదు. 'ఎక్కడరాదేవుఁడు?' 'అంతట' 'ఈ స్తంభమున?' 'ఊ.' 'చూపించు' స్తంభమునుగొట్టెను. అందు దన వరముల కతీతమగు రూపము, అదేనరసింహమూర్తి. అదివానిని సంహరించి ప్రహ్లాదుఁ గాపాడెను. 'ప్రహ్లాదా! వరము గోరుకొనుము.' 'కోరికలేకుండుటయే నావరము'. 'సెభాస్!'

ప్రహ్లాదుఁ డొకసారి కావేరీతీరమున సహ్యపర్వతతటంబున నజగరవ్రతనిష్ఠ నుండు నొకయోగిం గాంచెను. అతఁడు నాకు కొండచిలువ తేనెటీఁగ గురువులు. తేనెటీఁగ యాచన, కొండచిలువ సుఖముఁ జూచి యిటుల నజగరవ్రతమున నుంటి నని చెప్పెను. ప్రహ్లాదుఁడిట్లు కొంతకాలము రాజ్యపాలనముఁ గావించి భక్తియోగమున నిమగ్నుండాయెను.

# అష్టమ స్కంధము

## గజేంద్ర మోక్షము.

చతుర్థమనువగు తామసుని మన్వంతరమునఁ గేతు, వృష, నర, ఖ్యాతాదులతని పుత్రు లుపమనువులు. సత్యక, హరివీర, సంజ్ఞలు వేల్పులు. త్రిశిఖుఁ డనువాఁ డింద్రుఁడు. జ్యోతి ర్వ్యోమముఖ్యులు మునులు. హరిమేధుఁడనువానికి హరిణియందు భగవదవతారంబుగ హరి జన్మించె. ఇట్టి కాలంబున ద్రవిళాధీశుండగు నింద్రద్యుమ్నుఁడను పుణ్యాత్ముఁ డొక శైలాగ్రంబున భగవద్ధ్యాననిష్ఠాగరిష్ఠుండై మౌనవ్రతంబున నుండ నగస్త్యమహాముని యట కరుదెంచె. అట్టి యగస్త్యమహర్షిం గాంచి యతఁడు వ్రతనిష్ఠామదాంధత నతని నాదరింపక పూజింపక మిన్నకుండె. దాని కలిగి యగస్త్యుఁడు రాజా! మదాంధుఁడ వగుట మదపుటేనుఁగువై జనింతువని పలికెను. ఆ మద కారణంబున నింద్రద్యుమ్నుండు మదగజేంద్రంబై జనించెను. తత్సంబంధులును మదయుతు లగుటఁ గరిణులుగ జనించిరి.

క్షీరసముద్రంబునఁ ద్రికూటంబను నొకపర్వతముకలదు. అది యొకయోజనము పొడవును నంతియ విస్తృతంబునుగలిగి రజతము, లోహము, బంగారములతోఁగూడిన మూఁడుశృంగములుగల్గి విరాజిల్లుచుండెను. అం దనేకవృక్షలతాగుల్మసముదయంబులును, సెలయేటి మొత్తములును, దివ్యవిమానములఁ జరించుకిన్నర[illegible]యంబును, క్రీడానుకూలంబులగు గిరికందరంబులును, వివిధమృగపక్షిసంకులంబులగు ప్రదేశంబులు నగాధంబులగు సరోవరంబులును గల్గి శోభిల్లుచుండెను. అం దింద్రద్యుమ్నుఁడు మదకరీంద్రముగఁ దత్సంబంధులు కరిణులుగ విహరించుచు నొకనాఁడు పిపాసాయత్తచిత్తంబునఁ దెన్నుతప్పి యొకకాసారంబుఁ జేరె. అందు తోడి కరిణులతో దిగి జలంబుఁ గొని జలక్రీడఁ గావించుచుండె. అంతఁ బూర్వంబున నగస్త్యునిచే నింద్రద్యుమ్నుఁడువలె దేవలశాపగ్రస్తుండైన హూహూనామగంధర్వుఁడు మకరంబై యాసరోవరంబున నుండి యగ్గజేంద్రుని హుంకరించి పట్టుకొని జలములు తననివాసస్థానమగుట స్థానబలమున నగ్గజేంద్రు శిథిలీకృత ధైర్యసారుం గావించె. ఇట్లా నీరాటవనాటములకుఁ బెక్కేండ్లు పోరు ఘోరంబుగ సాగె.

గజేంద్రుఁడు విగతాహంకారసంపన్నుఁడై పూర్వజన్మస్మృతిఁ దన ప్రయత్నంబునం దవిశ్వాసుండై భగవంతుఁడె తనయాపదఁ దొలఁగించి రక్షింపఁగలవాఁ డని విశ్వసించి యిట్లు స్తుతించె. ఎవనియం దెవ్వనినుండి యెవనిచేత నీజగము పుట్టి పెరిగి లయించుచున్నదో, ఎవనివలన దేహాదికప్రపంచమెల్లఁ జిదాత్మకంబై ప్రకాశించుచున్నదో, ఎవఁడీలోకములఁ గార్యకారణరూపంబులుగ నొక్కొక్కపరి బహిర్వ్యాప్తముఁ గావించుచు మఱల సంపిహితముఁ గావించుచుండునో, ఎవఁడు కాలగతి లోకంబులు లోకస్థులు, లోకపాలురు నొక్కుమ్మడి లయంబుఁ గాఁగ దుస్తరమగు తమంబున కావల ప్రకాశించునో, ఎవనిపదము దేవతలు మునులు నెఱుంగఁజాలరో, ఎవఁడు నామ, రూప, క్రియా, గుణంబులులేక తుదకన్నియుఁ దానగునో, ఎవనిమాయచే హతబుద్ధినై నన్ను నే నెఱుంగకపోతినో అట్టి నిర్వికార, నిరంజన, నిర్వికల్ప, తేజోమూర్తిని, సర్వవ్యాపకు, సనాతను, ననాది మధ్యాంతరహితు నాశ్రయింతునని యిట్లు నిర్విశేషపరతత్త్వంబును ధ్యానించు మూర్తిభేదాభిమానులగుటఁ దత్త్వాంతమునకు బ్రహ్మాదులును జేరరైరి.

అంత విశ్వాత్ముఁడు, విష్ణుఁడు, సర్వాంతర్యామి, పరాత్పరుఁడు, తత్కాలభగవదవతారము నగు శ్రీహరి తత్క్షణమ యచటనె యావిర్భవించె. ఛందోమయోద్భట పక్షిప్రవరోహ్యమానుఁడయి కాలచక్రంబు హస్తంబునఁ దోప మింట శ్రీహరి పొడసూపఁ గాంచి గజేంద్రుఁడు "ఆపదుద్ధారకా! అనాథరక్షకా! దీనబాంధవా! పాహి, పాహి" అని దుర్బలుండై దీనముగ నెట్టకేల కని తదేకధ్యానంబున నేత్రముల నానందబాష్పములు స్రవింప నట్టె చూచుచుండె. శ్రీహరి తత్క్షణము అవక్రంబగు చక్రంబున నక్రంబును దునిమి గజేంద్రు బంధవిముక్తుఁ గావించె. నక్రమును శాపమోచనంబుఁగాఁగ పూర్వరూపంబున హూహూనామగంధర్వుఁడై హరిని ధ్యానించుచు గంధర్వలోకంబునకుఁ జనె. ప్రభువులకు, మనువులకు, దేవతలకును స్వాధీనముఁగాని యిట్టి కృత్యము తత్కాల భగవదవతారమగు హరి తత్క్షణమ యచటనె యావిర్భవించి కావించి గజేంద్రు నిమిరి భయం బుడిపి యదృశ్యుం డయ్యె. గజేంద్రుఁడును వీతభయుండై మదమాత్సర్యాదులకు మనంబున దా వీయక మదగజత్వముఁ బాసి భగవద్ధ్యానంబున ముక్తిఁ గాంచె.

## క్షీ ర సా గ ర మ థ న ము

(లేక)

## కూ ర్మా వ తా ర చ రి త్ర ము.

ఆఱవమనువగు చాక్షుషునిమన్వంతరమున పురుఃపురుషసుద్యుమ్నాదు లతనిపుత్రు లుపమనువులు. మంత్రద్యుమాఖ్యుఁడింద్రుండు. ఆప్యాదికగణ మమర్త్యులు, హవిష్మద్వీరకాదిఘనులుమునులు. ఆ రాజునకు సంభూతికి భగవదవతారముగ నజితుండు జన్మించె. ఇట్టి కాలంబున దుర్వాసుశాపంబున నింద్రుఁడు సంపదఁ గోల్పోయి పదభ్రష్టుండై దేవసహితుండై వేల్పుపెద్దయగు విధాతం గాంచి తనవృత్తాంతము నివేదించె. అంత వేల్పుపెద్ద సురసమేతుండై నియతుండై వైదికవచనంబుల భగవంతుని స్తుతించె. అంత పరమేష్ఠియందుఁ గరుణించి దయాగరిష్ఠుండగు విశ్వగర్భుఁ డావిర్భవించె. సహస్రసూర్యసంకాశుండగు నా దివ్యతేజోమూర్తిని గానలేక దేవతలును దికమకఁజెందిరి. భగవంతుఁడు వేల్పుపెద్దం గాంచి "యో విరించీ! క్షీరసముద్రంబున సర్వదివ్యౌషధులువైచి మందరపర్వతంబు కవ్వముగ వాసుకి తరిత్రాడుగ మథించి యమృతము సంపాదింపుఁడు. అమృతముఁ ద్రావినజంతు వమరత్వముఁజెందు. దీనికి రాక్షససహాయంబును గావలయు. ఎప్పుడు తనకు బలము కలుగు నంతదనుక రిపులకును తాను "మూషికమునకుఁ బాము పొంచియున్నకరణిఁ బొంచియున్నను దోషంబులేదు. అమృతోత్పత్తికిముందు విషము జనించు, భయపడి నిరుత్సాహముఁ జెందఁజనదు. వస్తువులయందుఁ గామరోషంబులఁ బూనఁదగదు" అని యాదేశించి హరి యంతర్ధానముఁ జెందె. అంత సురపతి దేవసహితుఁడై యసురపతియగు బలిసార్వభౌముని సేవించుచు వానిమైత్రిసంపాదించె. దానవముఖ్యులఁ బుండరీకాక్షు ననుమతిని వశీకృతులఁ గావించుకొని యమృతజలధిమథనప్రారంభకథనముఁ దెలియఁజెప్పె.

అంత సురాసురు లమృతోత్పాదన ప్రయత్నంబున నుత్సాహవంతులై మందరము కష్టసాధ్యంబునఁ గొనితెచ్చి సముద్రంబుచేరవ మోయలేకఁ బడవైచిరి. అం దహంకారభూయిష్ఠులగు దానవులు పెక్కుఱు క్రిందంబడి మడిసిరి. నిరుత్సాహంబున దేవదానవులు గుందుచుండ భగవంతుఁడు గరుడస్కంధంబున మందరంబిడి సముద్రంబునఁ బాఱవైచి యదృశ్యుండయ్యె. అంత దేవదానవులు వాసుకిచెంతకరిగి మంచిపలికి యజ్ఞహవిర్భాగ మాతని కిచ్చుటకును నతఁడు తరిత్రాడుగ నుండుటకును నియ్యకొలిపి పాలకడలిఁ ద్రచ్చ నారంభించిరి. దేవతలు వాసుకితలలు పట్ట దానవులు పుచ్ఛంబుఁ

బట్ట నిరాకరించిరి. అంత దైవప్రేరణంబున దేవతలే పుచ్ఛంబును దానవులే వాసుకితలలును బట్టిరి. త్రచ్చుసమయంబున వాసుకి ఫణాగ్రములనుండి బయలువెడలు విషంబునఁ గొందఱు దానవులు మడియఁ దొడంగిరి. అంత మందరంబును నిరాధారంబగుట సముద్రంబున మునింగె. దేవప్రార్థనచే భగవంతుఁడు కూర్మంబై మందరం బుద్ధరించి మరలఁ ద్రిచ్చునవకాశంబుఁ గల్గించె. ఇట్లు దేవదానవ సమాకర్షితం బగు మందరము కఠోరపృష్ఠంబుగల కూర్మమునకు వీపుతీటఁ దీర్చునదిగ నయ్యె. ఇంతలో జలధినుండి హాలాహలం బుద్భవించె. దాని దొలఁగించు నుపాయంబుఁ గానక పరమశివుఁ జేరి ప్రార్థించిరి. భవుండును భవానీప్రేరణంబున విషభక్షణంబున కియ్యకొని విషము దోసిట గ్రహించి కుక్షింగల జగంబులకుఁ బ్రమాదంబువాటిల్లకుండ కంఠమున నిల్పె, అది మహేశు కంఠము నలుపుఁ జేసె, కంఠము నలుపెక్కినను నదియు పరోపకారచిహ్నముగా నా నీలకంఠునకు కంఠాభరణభూషణం బయ్యె. దోసిట హరుఁడు విషముఁ ద్రాగుసమయమునఁ బడినబిందువుల సర్పవృశ్చికాదులు గ్రహించి విషకీటకంబులయ్యె, మఱియుం ద్రచ్చఁ గామధేను వుద్భవిల్లె, హవిర్భాగంబులకొఱకా సురభిని దేవర్షులు గ్రహించిరి. అంత నుచ్చైశ్శ్రవంబను నశ్వంబు జనింప నద్దాని హరిప్రేరణంబున నింద్రుఁడు గైకొనకున్న బలి కైకొనియె, అంత నాల్గుదంతములతో నైరావతంబను తెల్లయేనుఁగును, పిదప కల్పవృక్షంబు, ననంతర మప్సరోజనంబును, పిమ్మట సుధాకరుండును, నటుపై లక్ష్మియు జనించె. అట్టిలక్ష్మిదేవిం గని యామె కటాక్ష మెవరియందుఁ బ్రసరించునో యని దేవదానవాది సమస్తప్రముఖ జీవజాలంబును నువ్విళ్లూరుచుండె. అంత వారలఁ గాంచి లక్ష్మి తపశ్శాలియుఁ గ్రోధంబును, జ్ఞానియు సంగంబును, ప్రభావసంపన్నుండును గామవికారంబును, ద్రోయఁజాలకయుండిరన్న నితరాశ్రయులఁ దడవనేల యని మానసంబున నవ్వారల నిరసించి, ధర్మమున్న భూతమైత్రి సున్న; త్యాగమున్న ముక్తికారణమై నదిగ నుండదు. విక్రమంబును కాలవేగంబున క్షీణించు, శీలసౌభాగ్య మున్న చిరాయువు గనఁబడదు. కాన నెచ్చటను సంపూర్ణత్వము లేదు. అన్నిలక్షణంబులుగల శ్రీహరి నన్నుపేక్షఁ జేయుచుండె, ఇఁక నెవ్వరిని వరింపఁదగు నని తనమానసంబున విమర్శించి, నిరపేక్షుండైనను శ్రీహరియే తగిన వరుఁడని యాతనినే వరించె. మఱల వార్ధిఁ దరువ నంత వారుణిజన్మించె. అద్దాని దానవులు గైకొనిరి. మఱియుఁ దరువ నమృతకలశహస్తుండై ధన్వంతరి జనించె. అయ్యమృతకలశంబును గాంచి దానవులు శీఘ్రంబ లాగికొని పఱువం దొడంగిరి. చిరకాలకష్టార్జితమగు నమృతభాండము దైత్యులచేఁ జిక్క దేవతలు చేయునది లేక పరమేశ్వరునిఁ బ్రార్థించిరి.

అంత నద్దేవుఁడు జగన్మోహినియై తన లీలావిలాసహాసంబుల దనుజుల భ్రమియింపఁజేసి వారలచేఁ గోరంబడి యమృతము దేవదానవులకుఁ బంచ నియమితుఁడయ్యె. దేవదానవులు సుస్నాతులై ధవళపరిధానులై ప్రాగగ్రకుశపీఠంబులఁ బూర్వదిశాభిముఖులై పంక్తులుదీరి యమృతముఁ గ్రోలఁ గూర్చుండిరి. అంత శ్రీహరి పాములకుఁ బాలుపోయంగనిమాడ్కి రాక్షసుల కమృతంబీయఁ దగదని తనవిలాసంబుల దనుజుల భ్రమియింపఁజేయుచు దేవతల కమృతంబు వోసె. అంత దేవపంక్తి రాహువు కూర్చుండి యమృతముఁ ద్రావ సిద్ధపడ దానిని సూర్యచంద్రులు హరికి సంజ్ఞచేసి చక్రంబున నతని శిరముఁ దునిమె. అమృతము కుత్తుకదిగుట తలయుఁ గబంధమును సజీవములై రాహుకేతువులన స్థిరులై పర్వదినంబుల నావైరంబున సూర్యచంద్రుల గ్రసించుచుండిరి. ఆ సూర్యచంద్రులును [illegible] తత్కృప మఱల వృద్ధినొందుచుండిరి. ఇట్లు పూర్తిగ నమృతంబు దేవతలచేఁ ద్రాగించి హరి యదృశ్యుండయ్యె. ఇదియంతయు దేవతల మోసమని దానవులు పెచ్చుపెరిగి దేవతలతో యుద్ధమునకు డీకొనిరి. అంత నింద్రుండు వజ్రధారియై రాక్షసులనాశంబుఁ గావించుచుండ నా వజ్రంబును నముచిచర్మంబున నిష్ఫలంబయ్యె. అప్పుడశరీరవాణివాక్యంబున నతనికి నార్ద్రము శుష్కము కానిదానఁ గాని మృత్యువు

లేదని తెలిసికొని యట్టిది ఫేనమని యెఱింగి దానిసహాయంబున నతనిఁ దున్మె. ఇట్లు దేవతలు బలిదానవేంద్రు నిర్జించి యింకను విజృంభించునెడ నారదుం డరుదెంచి సురలారా! కార్యసిద్ధివడసియు నేల యీ యాయాసంబు. యుద్ధముమాని స్వస్థలంబులకుఁ జనుండన వారును నట్లుఁగావించిరి. దానవులు విషణ్ణులై మూర్ఛఁదొఱఁగిన బలిదానవేంద్రుఁ బశ్చిమశిఖరిశిఖరంబునకుఁ జేర్చిరి. శుక్రుఁడు తన మృతసంజీవని విద్యాప్రభావంబున విధ్వంసమానకంధరుల, వినష్టదేహుల రాత్రించరుల నందఱ బ్రతికించె. బలిసార్వభౌముండును భార్గవానుగ్రహంబున విగతశరీరవేదనుండై పరాజితుండయ్యు దేశకాలపరిస్థితుల గుర్తెఱింగినవాఁడుగాన దుఃఖపడకయుండె.

పరమేశ్వరుండు భవానీదేవితోఁ గైలాసశిఖరంబున సుఖంబుండి శ్రీహరి జగన్మోహినీ న్యవతారమువిని తాను గామజేతనను గర్వంబున నయ్యవతారంబు వీక్షింప శ్రీహరిం జేరి 'మహాత్మా! యెప్పుడును నీ మగపోడుములఁగాంచితిఁగాని నీ యాఁడుచందంబుఁగానను; ఆ జగన్మోహినీరూపంబు మఱొక్కసారి ధరించి చూపింపు' మన నతం డియ్యకొని చనె. అట నొకసుందరాంగి హరునకుఁ బ్రత్యక్షంబయ్యె, హరుఁడు దానివెంటఁబడి మాయ గ్రహింపనేరక తికమకఁబడి గాఢాభిలాషను స్ఖలితవీర్యుఁడై శ్రీహరిని గుర్తించె. ఆ శుక్లంబె రజతస్వర్ణంబుల ధరణి వ్యాప్తంబయ్యె. హరుఁడు తన గర్వంబుడిగి మృత్యువుజయించితి, హాలాహలముభక్షించితిఁ గాని స్త్రీ క్రీగంటిప్రసారవీక్షణబాణపరంపర జయింపఁజాలకుంటినని సిగ్గుపడుచుండ శ్రీహరి 'గరళకంఠా! నీవుగాన యింతవరకు తట్టుకొనగల్గితివి. మఱొకఁడెవఁడైనను నిలువనేరఁడు. గుర్తించి మగుడ నేరఁడు' అని బుజ్జగించి పంపెను. ఇట్లు శ్రీహరి దేవతలచే క్షీరజలధిఁ దరింపఁజేసి, కూర్మంబై మందరం బుద్ధరించి, జగన్మోహినియై యమృతంబు దేవతలకుఁబోసి, లక్ష్మీసహితుండై వైకుంఠంబునకరిగె.

## వామనచరిత్రము.

సప్తమమనువగు వైవస్వత మన్వంతరమున నిక్ష్వాకుఁడు, నభగుఁడు, ధృష్టుఁడు, శర్యాతి, అరిష్యంతుఁడు, నాభాగుఁడు, దిష్టుఁడు, కరూశకుఁడు, పృషధ్రుఁడు, వసుమంతుఁడు అను పదుగురు ప్రభువులు. పురందరుఁడనువాఁ డింద్రుఁడు. ఆదిత్య, మరుదశ్వివసు, రుద్ర సంజ్ఞలుగలవారు దేవతలు. కశ్యప, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, గౌతమ, వసిష్ఠ, జమదగ్నులు సప్తర్షులు. కశ్యపునకు దితిగర్భమున భగవదవతారముగ వామనుఁడు జన్మించె.

బలిదానవేంద్రుఁడు దేవేంద్రునిచే నొచ్చి భార్గవునిచే సెట్టకేలకు బ్రతికి భార్గవుల శుశ్రూషలచే మెప్పించి విశ్వజిద్యాగంబుఁ జేయమొదలిడె. శిష్యవాత్సల్యంబున శుక్రుండు విశ్వజిద్యాగంబిట్లు చేయించుచుండ నా హోమగుండమున దివ్యాయుధసమన్వితంబగు బంగారురథం బుద్భవించె. అద్దాన మహాతేజోవిరాజితుండై యజ్ఞదక్షిణల బుత్విక్కులఁదనిపి సురలోకంబుపై దాడిసలిపె. అంత వాని సమరసముత్సాహంబుఁ దిలకించి యింద్రుఁడు భయపడి దేవతలకు గురువును మంత్రియు నగు బృహస్పతిని సమీపించి బలి యుద్ధవృత్తంబు విన్నవింప నాతం డిట్లనియె 'ఇంద్రా! గురువులగు భృగువుల శుశ్రూషచే వీఁడింత పెచ్చుపెరిగె. వీని నిప్పుడు జయింప నేరికిని శక్యంబుకాదు. కొంతకాలంబు పొంచియుండిన సమయంబు రాఁగలదు, అప్పుడు జయింపవచ్చు' ననిన బృహస్పతివాక్యంబులు విని కామరూపులై దేవతలు స్వర్గంబు దిగనాడి యెందేనిఁ జనిరి. బలియు నిశ్శత్రుండై జగత్త్రయంబుఁ దనవశముఁ జేసికొని విశ్వవిజయుండై పెద్ద

కాలంబు రాజ్యంబుఁ జేసె. భార్గవులును వానిచే శతాశ్వమేధంబులఁ జేయించిరి. ఇట్లు రాక్షసులు విజృంభించుటయుఁ, దన కొమరులగు నింద్రాదిదేవతలు డాగి నికృష్టజీవయాత్ర నెఱపుటయుఁ గాంచి దేవమాతయగు నదితి తన స్వాంతంబునఁ గుందుచుండె.

అంత నొక్కనాఁడు కశ్యపబ్రహ్మ నిజసతియగు నదితి గృహంబునకుఁ జని యామె నిర్వేద కారణం బడిగి యామెవలన నావృత్తాంతముఁ దెలిసికొని విజ్ఞానదృష్టి నవలంబించి భావికాల కార్యంబు విచారించి 'మగువా! యేలఁగుందెదవు? కాకున్నది కాకమానదు. అయినను కాలోచిత కార్యంబు నడిపెద నాలకింపుము. ఈ ఫాల్గుణశుద్ధ పాడ్యమిఁ దొరకొని పండ్రెండుదినంబులు హరిసమర్పణంబుగఁ బయోభక్షణవ్రతం బాచరింపుము. దాన నవ్వాసుదేవుండు ప్రీతుండై నీకోరిక నెరవేర్చు'నని యావ్రతవిధానం బెఱింగించె. అదితియు భర్తచెప్పిన పద్ధతిని నియమపురస్సరంబుగా నావ్రతం బాచరించె. అంత భగవంతుం డవ్వ్రతంబున సంతసించి శంఖచక్రగదాధరుండుఁ జతుర్బాహుండు బీతకౌశేయుండుఁ నగుచు నగోచరుండగు హరి గోచరుండై యదితిచేత స్తుతింపఁబడి యిట్లనియె. అవ్వా! నీ మనోరథం బే నెఱుంగుదు. మీ దంపతుల సేవలకు సంతసించితి. నీపతి నారాధింపుము. మీకు కుమారుఁడనై జనించి బలిరాజ్యంబు సామంబునఁ గైకొని పురందరున కొసంగుదు. బలిమిని బలిని జయింప నిప్పు డేరికిని శక్యంబు గాదు. ప్రాజ్ఞుఁడగు కార్యసాధకుఁడు సమయజ్ఞుండై యుండవలయు నని పలికి యదృశ్యుం డయ్యె. అదితి కశ్యపు నాశ్రయించె. అదితి గర్భంబు ధరించి నవమాసంబులు మోసి శుద్ధద్వాదశి శ్రవణానక్షత్రయుక్త యభిజిల్లగ్నంబున వామనుని గనె. దేవతలు నానందపరవశులైరి.

ఋషులు కశ్యపుఁ బురస్కరించుకొని యథాకాలంబుల సముచితకర్మకలాపంబుల నిర్వర్తించిరి. ఇట్లు వామనుఁడు బ్రహ్మచారియై లోకజనాకర్షణీయమగు సుందరరూపంబు ధరించి పాదచారియై నర్మదానదిం దాటి బలి యజ్ఞశాలం జేరి, బలిచే నాదరింపఁబడెను. బలియు నాతనిఁ గాంచి యెద్దియైన నిచ్చుటకు సిద్ధముగనున్నవాఁడ నీ వాంఛితం బెద్దియన వామనుఁడు ముదితుఁ డయ్యె, నాతని పూర్వుల వితరణాదివృత్తాంతములఁ బొగడి నేను వటుఁడను. పదత్రయభూమి మాత్రము తపంబునకై యాచించెద ననెను. బలియు నా త్రివిక్రముని గుర్తింపనేరక యజ్ఞానియై యా దానము కొంచెమనియు, తాను నెఱదాతననియు నింకను వేఁడు మనియు, పొఱపడి నిర్బంధింప జొచ్చె. అది శుక్రుఁ డెఱింగి బలిసార్వభౌమా! ఈతఁడు సాధారణవటుఁడు కాడు, త్రివిక్రముఁడు. వీని కా పదత్రయధరణియు నీయలేవు. అజ్ఞానంబునఁ దెలిసికొనలేక పోతివి. ఇప్పుడైనను దప్పించు కొమ్ము, లేదేని సర్వనాశంబు కాఁగలదు. ఈ ధరణి నీయది కాదు. ప్రజలది. అందఱిని నష్ట పరచి దీని వీని కొసంగుట యుచితము కాదు; అర్హతయును లేదు. అని గురువుగాన యథార్థమును శ్రుతపరచెను. బలి సర్వంబును గుర్తించి జ్ఞానియై యిచ్చెదనని యీకున్న కీర్తికి నష్టము. ఇచ్చిన ధరణికి నష్టము. ఎవఁడగుఁగాక. అశాశ్వతమగు నీధరణి నష్టమైనను శాశ్వతమగు కీర్తి గడించుటయే తన కర్తవ్యమని యప్పుడు భావించెను. శుక్రుండును దేశ కాల పరిస్థితుల గమనించి శిక్షింపబడ భ్రష్టుఁడ వగుదువు. ఆలోచించుకొమ్మని హెచ్చరించెను. బలి సర్వంబును దెలిసికొనియుఁ దన్నుకూడ త్రివిక్రమునకు సమర్పించుకొనుటకే నిశ్చయించుకొనెను. త్రిపదంబుల ధారవోసి త్రివిక్రముని సంతసింపఁజేసి కృతకృత్యుఁ డయ్యెను.

అప్పుడు వామనుఁడు బలిని వారుణపాశంబులఁ గట్టించి రసాతలంబున నుంచె. బలి భార్య యగు వింధ్యావళియు వామనునిఁ జేరి 'దేవా! అంతయు నీది. సర్వంబును నీయదియ. నిన్ను

చిన్నగ గుర్తించి నీవు కొంచె మడిగి యెక్కువ కొంటి వనియు, మేము గొప్పగ నిచ్చి నెఱదాతల మైతిమనుకొనుటయు నజ్ఞానవిలసితంబులే. మా యజ్ఞానంబుఁ దొలఁగించి విజ్ఞానులఁగావించి మహోపకారుఁడవైతివి. ఇది నిన్ను సర్వాంతర్యామిగ గుర్తించక రాజ్యమదంబునఁ ద్యాగమదంబున కుఱుచవానిగ గుర్తించిన మా యజ్ఞానంబ కాని వేఱొండుగాదు. క్షమింపు'మని ప్రార్థించెను. బలితాతయగు ప్రహ్లాదుండును, బ్రహ్మాదులును నా భగవంతుని స్తుతించిరి. వామనుండును శుక్రునిఁ గాంచి భృగువర్యా! యజ్ఞశేషంబుఁ బూర్తిఁ గావింపుము. మీరు తలఁచుకొనిన జేయరానిదేది యుండును అని శుక్రునిచే యజ్ఞముఁ బూర్తిఁ జేయించి శుక్రుని స్తుతులంది రాజ్యము పురందరున కొసంగి ప్రహ్లాదాదులకుఁ దాను నిత్యదర్శనుండై రసాతలంబున నివసించుచు త్యాగధనియగు నా బలి సార్వభౌము భవిష్యద్దేవేంద్రునిగ రసాతలంబునఁ గాపాడుచుండె.

## మత్స్యావతారచరిత్రము

### (లేక)

## సత్యవ్రతోపాఖ్యానము.

“కృతమాలిక” యను నదీతీరమునఁ గల్పాంతవేళ ద్రవిళదేశపు రాజగు సత్యవ్రతుఁడు కేవలము జలముమాత్రమె యాహారముగఁ గొనుచు హరినిఁగూర్చి ధ్యానించుచుండె. అతఁడా నదీజలంబు దోయిటఁదాల్చి హరికిఁ దర్పణమిడుచుండ నందొక చేపపిల్ల కానంబడె. అంత నది దోసిలినిండె. పాపమా సత్యవ్రతుఁడు దానినొక శరావమున నునిచె. అదియును నిండునట్లు పెద్దదియయ్యె. దాని మర్మమెఱుంగఁజాలక యొకసరస్సున విడిచె. అదియును క్షణమాత్రమున నిండె. ఇక విసిగి దాని సముద్రంబున వైచి యత్యాశ్చర్యంబున 'నిదేమి దైవమాయయో' అని నివ్వెఱపడి భగవద్విలసితమని తుదకు నిశ్చయముఁజేసికొని విశ్వసించి 'దేవా! యేల యిట్లు మత్స్యరూపంబుధరించి నాకుఁ బ్రత్యక్షమైతివి? నిన్నుఁ దెలియ నేరని నా యజ్ఞానంబు క్షమింపుము. నావలనఁ గాదగు కృత్యం బేది?' అని పరిపరివిధంబుల నా మత్స్యరూపభగవంతునిఁ బ్రార్థించె. అంత నా మత్స్యరూప భగవంతుఁడు 'సత్యవ్రతా! నీ నియమనిష్ఠలకు నాయందలి భక్తికిఁ మెచ్చి నీకుఁ బ్రత్యక్షమైతి. ఈరాత్రి కేడవదినంబునకు బ్రహ్మదేవునకొక పగలు నిండును. అంత రాత్రికాఁగ నతఁడు నిద్రించును. భూర్భువాదిక జగంబులు మూఁడును విలయాబ్ధిలో మునుంగును. ఆ వార్ధిలో నొకపెద్ద నావ చేరవచ్చును. నీవు సర్వౌషధీతతులు బీజరాసులు చేకూర్చుకొని యానావనెక్కి పయోరాశిలో విహరింపుము. ఆ నావయందు సప్తర్షులుందురు. చీఁకటిలో మొదట నెదుట గానఁబడని యానావ మునుల శరీరకాంతులు మిణుకుమిణుకుమనుచుండ నీకు గోచరంబగు. దాని ప్రక్క నేనును సంచరించుచుందును. నాయాజ్ఞఁ బెనుబామొకటి యాప్రక్కననుండు. సుడిగాడ్పుల కతంబున భంగపాటుఁ జెందకుండ సప్తర్షులతోఁగూడిన యానావ బీజౌషధీతతులఁ గైకొని నీవెక్కి యాపాముచే నావను నాకొమ్మునకుఁ గట్టుము. నావకుఁ బ్రమాదము వాటిల్లకుండ, నీకుఁ దపసులకు నలజడి కలుగకుండ నామున్నీటఁ బద్మభవుఁడు రేయి నిద్రనుండి వేగునంతకు మెలంగెద. అది కారణంబుగ నీ మత్స్యరూపంబుఁ గైకొంటి. నిన్ననుగ్రహించితి' అని మత్స్యరూపభగవంతుఁ డదృశ్యుండయ్యె.

అంత సత్యవ్రతుఁడు భగవంతుని ధ్యానించుచుఁ గాలము నిరీక్షించుచు దర్భశయ్యఁ దూర్పు శిరస్సుగాఁ బండియుండె. అప్పుడు కల్పాంతంబుదాసిన మేఘపంక్తులు వృష్టింగురిసి జలమయంబుఁ

గావించె. బ్రహ్మ పగలంతయు సృష్టిఁ గావించి కావించి విశ్రాంతి నొందఁదలఁచి సృష్టిమాని నిద్రించె. సత్యవ్రతుఁడు భగవంతుఁ డాదేశించినకరణిఁ దప్పక యాచరించి యా మత్స్యరూపు నితోఁసహా ప్రళయాంభోధి విహరించుచుండె.

ఇట్లు నిద్రించు పరమేష్ఠి ముఖంబునుండి వేదంబుల హయగ్రీవుండను చోరుండు హరించి మున్నీటం జొచ్చె. అంత మత్స్యావతారుండు ఋషుల నోషధీబీజంబుల సత్యవ్రతునిఁ గాపాడుచు నా ప్రాఁజదువులదొంగను సంహరించి వేకువ నిద్రమేల్కాంచి భారతీయుక్తుఁడై సృష్టిఁగావింప దొడఁగొను నా విధాతకుఁ జిక్కువెడలించి వేదంబుల నప్పగించె. సత్యవ్రతుఁడిట్లు హరికి జలతర్పణం బిడుట నా ప్రళయంబున బ్రతికి ప్రళయాంభోధి విహరించి యీ కల్పంబున వివస్వంతుఁడగు సూర్య భగవానునకు శ్రాద్ధదేవుండన జన్మించి శ్రీహరి కృపావశంబున వైవస్వతుఁడను నేడవమనువయ్యె. మత్స్యరూపభగవంతుఁ డిట్లు నిద్రావస్థఁ బోఁగొట్టుకొన్న వేదంబుల వేగునంతకుఁగాపాడి ప్రాతః కాలమున నతనికిడి మరల నతనిసృష్టికున్ముఖుఁగావించి సత్యవ్రతు నాశీర్వదించి యంతర్హితుఁడయ్యె.

---

# నవమ స్కంధము

## రాజవంశేతిహాసము.

### సూర్యవంశము.

## సుద్యుమ్న చరిత్ర.

బ్రహ్మకుఁ గశ్యపుఁడు పుట్టె. ఆ కశ్యపునకు దక్షాత్మజయైన యదితియందు సూర్యుండుద్భవించె సూర్యునకు సంజ్ఞయందు శ్రాద్ధదేవుండను మనువుజనించె. అతఁడే వైవస్వతమనువు. వైవస్వతుఁడు పుత్రసంతానకాంక్షియై వసిష్ఠుప్రోత్సాహంబున నొకయజ్ఞంబుఁజేసె. కాని వీనిభార్యయగు శ్రద్ధ పుత్రికయందలిమక్కువ హోతనాశ్రయించె. ఆ హోత శ్రద్ధాదేవికోరిక ననుసరించి పుత్రికకలుగు మంత్రంబులయజించె. అంత శ్రద్ధకు నిలయనుకన్యక యుద్భవించె, వైవస్వతమనువు పుత్రునియందలి కాంక్ష వసిష్ఠునిఁజేర 'దేవా! పుత్రునికొఱకుయజింపఁ బుత్రికయేలకలిగె? మీరు బ్రహ్మవాదులు, మంత్రవేత్తలుగదా! యిట్లు జరుగనగునా?' యన వసిష్ఠుఁడది హోతృవ్యభిచారమని తెలిసికొని 'రాజా! సంకల్పవైషమ్యంబున హోతృకృత్యంబునఁ బుత్రికజనించె. ఐననేమి? పురుషునిగావించెద' నని తన ప్రభావంబున నిలను సుద్యుమ్నుఁడను పుత్రునిగామార్చెను. ఆ సుద్యుమ్నుఁడు పెరిగి పెద్దవాఁడై వేటకుఁబోయి యుత్తరదిశను మేరువుప్రాంతఁ గుమారవనముఁజేరి మరల యాడుదియయ్యె. గుఱ్ఱము పరిజనులు మొదలగువారందఱును స్త్రీత్వమునొందిరి. దాని కచ్చెరువంది అది పార్వతీపరమేశ్వరుల నివాసస్థానమనియు, వారుండుచోటునకుఁ ఋషులు వచ్చుచుండుటచే భవానీదేవి యిట్లు శపించెననియు నద్దాన స్త్రీత్వముకల్గెనని తెలిసికొని సుద్యుమ్నుఁడు స్త్రీయై పరిజనులు చెలికత్తెలుగా సోమసుతుండగు బుధుని యాశ్రమమునకుఁజేరి యాతనివరించెను. అప్పుడా యువిదకు బుధునకుఁ బురూరవుఁడుజనించె. సుద్యుమ్నుఁడు మరల తాను పురుషుఁడు కాఁగోరి వసిష్ఠునాశ్రయించె. ఆవసిష్ఠుఁడు పరమశివుని బ్రార్థించె. పరమేశ్వరుఁడు కరుణించి భవానీవాక్యమును వసిష్ఠునికోరికయుఁ దీఱునటుల

నొకనెల స్త్రీయు మఱి యొకనెల పురుషుఁడుగ మారుచుండునట్లు వరంబొసంగె. సుద్యుమ్నుఁడు పురుషుఁడుగనుండునప్పుడు ఉత్కలుఁడు, గయుఁడు, విమలుఁడునను కొడుకులు మువ్వురు పుట్టిరి. వా రుత్తరాపథరాజులైరి. సుద్యుమ్నుఁడు ముదుసలియై ప్రతిష్ఠానపురమువిడిచి పురూరవునకు రాజ్యం బొసంగి వనంబునకుఁజనియె.

## పృషధ్రి చరిత్ర.

వైవస్వతుఁడు తన కుమారుఁడగు సుద్యుమ్నుఁడిట్లుపోవ నూఱేండ్లు హరింగూర్చి యమునలోఁ బుత్రకాంక్షియై తప మాచరించె. అంత శ్రీహరికృప నతనికి ఇక్ష్వాకుఁడు పృషధ్రుఁడు నృగుఁడు శర్యాతి ధిష్టుఁడు ధృష్టుఁడు కరూశకుఁడు నరిష్యంతుఁడు నభగుఁడు కవి యను పదుగురుపుత్రులు కలిగిరి. అందు పృషధ్రుఁడు ధర్మంబుఁదప్పక పిత్రాజ్ఞ గోపరిపాలనంబుఁ గావించుచుండె. ఒకనాఁడు బోరునవర్షంబుకురియసాగె. అతఁడు నడిరేయి మందఁ గ్రూరసత్త్వంబులు చొరకుండ జాగ్రత్తగఁజూచుచుండె, కాని యొకబెబ్బులి మందఁజేరి యొకగోవును బట్టుకొనెను. గోవు "అంబా"యని యఱచెను. ఆ పెంజీఁకటిఁ బృషధ్రుఁడొకబాణంబునఁ బులింగొట్టె. ఆబాణఘాతంబున గోవు మరణించె. బెబ్బులి పాఱిపోయె. అతఁడప్పుడు పులియే మరణించినదని భావించి వేకువ యథార్థంబు గుర్తించి చింతించె. అందువలన నతఁడు రాజ్యపాలనంబున కనర్హుఁడై వసిష్ఠునాజ్ఞ వనంబున కేగి శ్రీహరిని ధ్యానించుచు నొకదావాగ్నిమడసి బ్రహ్మంబుఁజెందె.

## శర్యాతి చరిత్ర.

వైవస్వతుకొమరులలో నొకఁడగు శర్యాతికి సుకన్యయను కుమార్తెకలదు. ఆమె తండ్రితో వనంబునకరుదెంచి యొకపుట్టలో రెండుజ్యోతులఁగాంచి మిణుగురులని వాడిముల్లిచే పొడిచె. అంత శర్యాతిభటసముదాయమునకు మలమూత్రములుబంధించి మొగంబుల వెల్లబాఱసొచ్చె. శర్యాతి భయకంపితుఁడై యెవరో యేదో యపరాధ మేమహాత్మునకొసఁగిరని భావించి యందఱ నడిగె. సుకన్య తనకృత్యంబుఁజెప్ప శర్యాతి తత్తరంబునఁ గుమార్తెం దోడ్కొని పుట్టకడకుంజేరి తపంబుఁజేయు చ్యవనుని గాంచి తననేర్పున నతనిఁ బ్రసన్నుఁగావించి ఋషిచిత్తము నెఱింగి సుకన్య నాతని కొసంగి పట్టణంబునకరిగె. ముక్కోపియగు చ్యవనునకు సుకన్య పరమశాంతంబున శుశ్రూషసేయుచునుండె. అంతనొకనాఁ డశ్వినీదేవతలచటికి వచ్చిరి. చ్యవనుండు వారల నుపచరించి మీరు వైద్యులగుకతన యజ్ఞభాగంబులేకుండిరి. నేనుమీకు యజ్ఞభాగంబుఁగల్పింతు, మీరు నాముదిమిఁ బోగొట్టుఁడనెను. అశ్వినీదేవతలును సంతసించిరి. సిద్ధనిర్మితహ్రదంబున నాతనిబెట్టిముంచిరి. మువ్వురునొక్కవిధంబున బయటకురా సుకన్య తనపాతివ్రత్యప్రభావంబున భర్తనుగుర్తించి సుఖంబుండె. అశ్వినీదేవతలు స్వర్గంబునకుఁజనిరి. శర్యాతియజ్ఞంబునేయ సంకల్పించి కుమార్తెనుగొంపోవఁ జ్యవనునాశ్రమంబునకువచ్చెను. సుందరరూపునిప్రక్కనున్న సుకన్యఁగాంచి శంకించి కుమార్తె వృద్ధపతినిఁద్రోసివచ్చి సుందరుఁడగు జారుని గవగూడెనని కోపించి నిష్ఠురములాడఁబోవఁగ, సుకన్య తండ్రియుద్దేశ్య మెఱింగి చిఱునవ్వు నవ్వుచు "తండ్రీ! యితఁడు నీయల్లుఁడగు చ్యవనమహర్షియే" అని తద్వృత్తాంతమంతయు విశదీకరించె. శర్యాతియుసంతసించి యా దంపతులవలన సత్కారంబులఁగాంచి యజ్ఞార్థమువారల తన పురికిఁగొంపోయి యాచ్యవనమహర్షిచే యజ్ఞంబు నిర్వర్తింపఁజేసె. చ్యవనుండును తనవాగ్దానము ననుసరించి యా యాగంబున నశ్వినీదేవతలకు సోమపాత్రనందిచ్చె. దానఁగోపించి యింద్రుఁడు మునింజంప

శ(జంబెత్తె. చ్యవనప్రభావంబున నా యింద్రబాహు వ్వట్లై స్తంభించె. ఇంద్రుండంత భయంబుఁజెంది యంతనుండి యశ్వినీదేవతలకును సోమభాగంబుండున ట్లంగీకరించి చ్యవను శాంతచిత్తుఁగావించి వాని యనుగ్రహంబున నెప్పటివాఁడై స్వర్గంబునకుఁజనె. ఆ శర్యాతికి నానర్తుఁడును, వానికి రైవతుఁడును పుట్టిరి. ఆ రైవతుఁడు తనకుమార్తెయగు రేవతిని "ఈమెపతియెవఁడు?" అని యడుగుటకుగాను బ్రహ్మ లోకంబునకుఁ జని క్షణంబుండునంత భూలోకంబున తరతరంబులుగడిచె. రైవతుఁడు బ్రహ్మనుమతి నా కాలమున బలిష్ఠుఁడగు బలరామునకా రేవతినొసంగె.

## నా భా గు చ రి త్ర.

వైవస్వతుకొమరుఁడగు నభగునకు నాభాగుఁడను కొమరుండుగలఁడు. అతఁడు బ్రహ్మచారియని సోదరులు భాగముఁబెట్టరైరి. "నా భాగమే"దనఁ దండ్రినడుగుమనిరి. తండ్రినడుగ "సోదరులు చేసిన దన్యాయమేయైనను దానితోఁబనియేమి? అంగిరులు సత్రయాగముఁజేయుచున్నారు. అం దాఱవ నాటికర్మ వారికిఁదెలియదు. దానికనువగునీరెండు వైశ్వదేవసూక్తులు నచటఁజదువుము. వారలా యజ్ఞ పరిశిష్టధనము నీకిడి స్వర్గమునకుఁబోవుదు"రనెను. నాభాగుఁడట్లే కావించెను. ధనము చేఁజిక్కెను. కాని యొకనీలశరీరుఁడడ్డుతగిలి "యజ్ఞపరిశిష్టధనము నాయది" అనెను. ఋషులు నాకిడిరని నాభాగుఁడనెను. మీతండ్రి నడుగు మతఁడుచెప్పినట్లు మన ముభయులము నడచుకొందమని నీలశరీరుఁడనెను. నాభాగుఁడు తండ్రినడిగెను. నభగుఁడు యజ్ఞపరిశిష్ట ముచ్ఛిష్టము కాన నది రుద్రునిదేయని పెద్దలందురనెను. నాభాగుఁడు పోయి యాతనిధనముఁ గైకొనుమనెను. ఆ రుద్రుఁడతని ఋజువర్తనమునకును పితృభక్తికిని సంతసించి ధనమొసంగి తత్త్వసంహిత నుపదేశించి విజ్ఞానధనునిఁగావించెను.

## అం బ రీ షో పా ఖ్యా న ము.

నాభాగునిపుత్రుఁ డంబరీషుఁడు, ఇతఁడు తండ్రియనంతరము సప్తద్వీప పరీతభూవలయం బేకచ్ఛత్రంబుగఁ బాలించుచు సద్గుణగరిష్ఠుండై దుర్గుణంబుల కేమఱుపాటునండైన నెడమీయక సతతశ్రీహరిధ్యాన నిష్ఠాగరిష్ఠుండై యొప్పాఱుచుండె. హరిభక్తికతంబున రాజ్యపరిపాలనముఁ జేయుచున్నను సామ్రాజ్య వైభవంబుల నతనికి నీహ వొడమకుండె. శ్రీహరి కాలచక్రప్రభావంబును నతనికి గోచరించె.

ఇట్లుండి తనకనురూపపత్నియగు భార్యతో ద్వాదశీవ్రతమొకవత్సరము శ్రీహరిఁగూర్చిసలిపె. వ్రతాంతమునఁ గార్తికమాసంబున మూఁడురాత్రు లుపవసించి కాళిందీజలంబుల సుస్నాతుండై మధువనమున శ్రీహరిని యథోచితంబుగఁ బుష్పములఁబూజించి లెక్కకుమిక్కిలిగఁ బాఁడియావుల మొత్తముల నుత్తమద్విజులకు దానంబొసంగి మధురాన్నంబుల బ్రాహ్మణసమారాధనంబుఁగావించి తా నిఁక వ్రతాంతభోజనముఁగావింప నుద్యుక్తుండుఁగాఁగ దుర్వాసుండతిథియై వచ్చె. ఇట్లువచ్చిన యతిథినిఁబూజించి భోజనమునకు దయచేయుఁడనెను. దుర్వాసుండును సంతసించి భోజనమునకియ్యకొని స్నానంబుఁజేయఁ గాళిందికిఁజనియె. ఆ కాళిందీనిర్మలతోయంబుల మునిఁగి పరమాత్మధ్యానంబున లీనుండై బాహ్యంబుమఱచి లోఁజవుల సొక్కుచుండె. ఇటనంబరీషుండును దుర్వాసుండు రాక తడవు సేసిన ముహూర్తార్ధావశిష్టయగు ద్వాదశియందుఁ బారణసేయకయుంటఁ జింతించి బ్రాహ్మణాతిక్రమణ దోషంబునకుశంకించి ధర్మవిరుద్ధంబుగాకుండ సలిలభక్షణంబుఁగావించె, ఇట్లు సంవత్సరంబు క్షణమాత్రంబుగ గడువ దుర్వాసుండరుదెంచి రాజుచే సత్కృతుండయ్యు నాతని కృత్యంబెఱింగి

క్రోధభూయిష్ఠుండై దుర్భాషలుపలుకుచుఁ దన జటఁబెరికి నేలంగొట్టె. అద్దాన భయంకరమగునొక కృత్య 'రాక్షసి' యావిర్భవించి భీకరశూలాయుధసమేతయై రాజుం గవిసె. అంబరీషుండును ప్రశాంత హృదయంబున భగవంతుని ధ్యానించుచుండె. భగవత్ప్రేరితమగు కాలచక్రము తత్క్షణము కృత్యను హత్యఁ గావించి మునిందాకె. చక్రానలదందహ్యమానదేహుండగుచు దుర్వాసుండును దన్నివారణోపాయంబెఱుంగఁజాలకయు, నెదుర్కొనశక్తిలేకయుఁ, దత్తరంబునఁ బ్రపంచంబంతయుఁ గలయఁ దిరిగె. చక్రంబంతటను వ్యాపించియుంట నెటకేగినను బాధించుచునేయుండెను. అంత దుర్వాసుండు బ్రహ్మలోకంబునకుఁజని బ్రహ్మకును చక్రంబునుఱలింప సామర్థ్యములేమి నాతనిచేఁ దిరస్కృతుండయ్యె. కైలాసంబునకుఁజని మహేశ్వరుఁడును నట్టివాఁడగుటమఱలివచ్చె. ఇఁక త్రిజగంబులఁదన్నుఁ గాపాడువాఁ డొండొకఁడులేఁడని యా శ్రీహరిశరణుఁజొచ్చె. శ్రీహరియుఁ దాను భక్తపరాధీనుఁడ ననియు నీ విఁక యా యంబరీషునే శరణుఁజొచ్చిన లాభముండుననియు వాక్రుచ్చె. దుర్వాసుండుఁ జేయునదిలేక మగిడి యంబరీషుని పాదంబులఁబడె, అంబరీషుఁడు దుర్వాసుఁడు తన పాదంబంటుటకుఁ దత్తరంబుఁజెంది యాతనిహస్తంబులు తొలఁగించిపట్టుకొని 'మహాత్మా! నిర్భయుండవుకమ్ము. మదిఁ గుదురపరచుకొమ్ము' అని యభయంబొసంగి శ్రీహరిచక్రంబును "నేను ధర్మముఁదప్పక చరించెడి వాఁడనేని శ్రీహరిభక్తుఁడనేని సాధుజనులనాదరించువాఁడనేని యీ దుర్వాసునియందు వికృతిం బొందని మనంబుగలవాఁడనేని శాంతింపుము. ఇమ్మునిపుంగవుని రక్షింపుము. నీకిదె సహస్రాధిక వందనములర్పింతు' నని ప్రార్థించెను. అంత దుర్వాసుండు చక్రానలబాధానివృత్తుండై భగవద్భక్తుండగు నంబరీషుని ప్రభావంబుఁదెలిసికొని 'మహాత్మా! నీ ప్రభావంబిదివరకే వినియున్నవాఁడ. కనులార నిపుడు నిన్నుఁగాంచితి. మనసార నీ చరణంబంటి పవిత్రుఁడనైతి, భగవంతుని భక్తియోగప్రభావంబును నెఱింగితి. సెలవొసంగుము. పోయివచ్చెద' ననెను. అంబరీషుండును దుర్వాసునకు సాష్టాంగనమస్కారం బొనర్చి యిష్టమృష్టాన్నంబుఁగుడువంబెట్టి భుక్తశేషముఁదానుభుజించి యిదియంతయు శ్రీహరికరుణాకటాక్షప్రభావంబనియెఱింగి రాజసంబుపొంతఁబోక నిర్మలుండై ప్రశాంతుఁడయ్యె. దుర్వాసుండును నంబరీషుని దీవించి కీర్తించుచు మింటితెరువున బ్రహ్మలోకంబునకుఁ జనియె.

అంబరీషుండును వ్రతసమాప్త్యనంతరము రాజ్యముతోడి తగులంబుమాని విరక్తుండై తనతో సమానులగు తనయులరావించి రాజ్యభారమునప్పగించి కాననంబునకుఁజని నిర్మలచిత్తంబున శ్రీహరిని ధ్యానించుచు ముక్తింబొందె.

## ఇక్ష్వాకుచరిత్ర.

వైవస్వతమనువు తుమ్మిన నతనిఘ్రాణరంధ్రమునుండి యిక్ష్వాకుఁడుపుట్టె. ఆ యిక్ష్వాకునకునూర్వురుకుమారులు. ఇక్ష్వాకుఁడొకనాఁ డష్టకశ్రాద్ధముఁగావించుచు నగ్రసుతుండగు వికుక్షిని వేటకుఁ బోయి శ్రాద్ధమునకనువగు మాంసఖండముఁదెమ్మనిపనిచె, ఆ వికుక్షియుఁ బిత్రాజ్ఞ వనమున కరుదెంచి వేట నలసటఁజెంది తుదకొక శశమునుబట్టుకొని యాఁకలిమిక్కుటముగాఁగ నద్దాన సగముతిని శేషముతండ్రికొసంగె. వసిష్ఠుఁడది తెలిసికొని "యెంగిలి పైతృకమునకెట్లుపనికివచ్చు" నని యిక్ష్వాకునకా యుదంతంబుఁదెల్పె. ఇక్ష్వాకుఁడు వికుక్షి దుష్టుఁడని యాతనిరాజ్యమునుండి నిష్కాసితుఁగావించె. ఇక్ష్వాకుఁడు కొంతకాలము రాజ్యమేలి దివంగతుఁడయ్యె. అంత వికుక్షి శశమునుదినుట శశాదుఁడను పేరఁబరఁగి మఱల రాజ్యమున కరుదెంచి ధర్మమార్గంబున రాజ్యంబుఁ జేయుచుఁగకుత్స్థుఁడనుకుమారుఁ గాంచె. కకుత్స్థునకురాజ్యమొసఁగి శశాదుఁడుముక్తిఁగాంచె. దేవదానవులకు జరిగిన సంగరంబున దేవప్రార్థితుఁడై వికుక్షిపుత్రుఁడు దానవులపైఁ గవియునప్పుడింద్రుఁడు వృషభమై యాతని మోసి-

'కకుత్' అన యెద్దుమూపురము. దానియందితఁడుండెఁగాన కకుత్థ్సుఁడను నామంబితనికిఁ జరితార్థం బయ్యె. దానవపురంబుల జయించుటఁ బురంజయుఁడను నామంబును బొందె. ఇట్లు శశాదపుత్రుఁడు కకుత్థ్సుఁడను విఖ్యాతపురుషుండయ్యె.

## మాంధాతృ చరిత్ర.

అట్టి కకుత్థ్సవంశంబున యువనాశ్వుఁడను రాజు నూర్వురుభార్యలతో సంసారసుఖంబు లనుభవించుచు సంతతిలేక నిర్వేఁదంబడియుండె. అంత మునులు దయగలవారై యింద్రప్రీతికొఱకు నైంద్ర యాగముఁజేయించిరి. ఆ యాగంబునఁ గలశంబున మంత్రించినజలంబుంచి వేకువ నతనిభార్యచేఁ ద్రావింప భావించి ఋత్విజులా రేయి నిద్రించిరి. యువనాశ్వుఁ డర్ధరాత్రంబున మేల్కాంచి పిపాసార్దితుండై యజ్ఞశాలాభ్యంతరమునకుఁజని కలశంబుననున్న మంత్రపూరితజలంబుఁ ద్రావె. వేకువ ఋత్విజులాశూన్యజలకలశంబును గాంచి దానివృత్తాంతముఁ దెలిసికొని విధివైపరీత్యమున కచ్చెరువుఁజెందుచుండిరి. అంత నద్దాన యువనాశ్వుకడుపుఁ వ్రక్కలించుకొని చక్రవర్తిచిహ్నములుగల కుమారుండు జన్మించి తల్లిలేని కతంబున పాలులేక యేడ్చుచుండ నింద్రుఁడు వచ్చి బొటనవ్రేలఁదిచ్చెను. దాన నతఁ డేడ్పుడిగె. ఇతఁడు నన్ను నురక్షించుననుట నాశిశువు మాంధాతనామంబునఁ బరఁగె. యువనాశ్వుకడుపు మునులు సరిజేయ నాతండునుబ్రతికి కుమారుని ముద్దుముచ్చటలు గాంచఁగలిగె. యువనాశ్వుఁడు మాంధాత చక్రవర్తికి రాజ్యమునప్పగించి తపస్సిద్ధినొందె. మాంధాతయు సూర్యకిరణములు ప్రసరించు నంతదనుకఁ గల ప్రదేశంబుఁ బాలించుచు శశిబిందుకుమార్తెయగు బిందుమతియందు ముగ్గురుకొడుకులను నేబండ్రుకూఁతులను గనె.

సౌభరిమహర్షి యమునానదీజలంబునఁ దపంబుఁజేయుచు నందలి మీనసంసారంబునుగాంచి తానును గృహస్థుండుగా మదిఁగోరి యొక్కకుమార్తెను నాకొసఁగుమని మాంధాతనుగోరెను. అతండు స్వయంవరమున నాకన్నెలు నిన్నుఁగోరుకొనిన నాయభ్యంతరములేదనెను. సౌభరి యౌవనవతులు ముదుసలినైన నన్నెట్లువరింతురని కటకటంబడి తనతపోధనము వెచ్చించి యువకుఁడు నాలంకృతుండునై యెదుటనిలఁబడిన మాంధాత సౌభరిని కన్యాంతఃపురంబున కనిచె. అంత నా యేబండ్రుకన్యలును సౌభరియందంబుఁగాంచి ముగ్ధలై యందఱు నతని వరించిరి. మాంధాత వారినందఱను సౌభరికొసంగె. సౌభరియింకను తనతపోధనమువ్యయపఱచి భోగభాగ్యంబులఁదులదూగుచు ఘృతధారలనగ్నితృప్తిఁజెంద దక పెచ్చుపెరుగుచందంబునఁ గామోపభోగంబుల నుపరతిఁజెందక విషయాభిలాషల విజృంభించుచుండె. మాంధాత కుమార్తలేమైరో యని పరితపించుచు వనంబునకుఁజని తన్నుమించిన రాజభోగంబులనుభవించుచున్న సౌభరినిఁగాంచి వెఱఁగుపడి కూఁతులవలన సత్కరింపఁబడి వారియానందమునకు సంతసించి పురికేగె. సౌభరియు మీనసంసారవీక్షణంబునఁ గల్గిన తనసంసారకాంక్షయుఁ దపోవ్యయమును గుర్తించి తన్నుఁదా నిందించుకొనుచు గృహస్థాశ్రమంబువిడిచి వానప్రస్థముస్వీకరించి మఱల ఘోరతపంబుఁ గావించి పరబ్రహ్మంబుసొచ్చె. సౌభరిభార్యలు నగ్నితో శిఖలంకరించు విధంబున భర్తననుగమించిరి.

## హరిశ్చంద్రు చరిత్ర.

మాంధాతరెండవకొడుకగు పురుకుత్సుఁడు నర్మదయను నాగకన్యకను పరిణయమై తన్ను ధ్యానించువారికి నాగభయంబులేకుండవరంబునొందె. ఆపురుకుత్సునకుఁ ద్రసదస్యుఁడు, వానికి నవర

ణ్యుఁడు, వానికి హర్యశ్వుఁడు, వానికి నరుణుఁడు, వానికి త్రిబంధనుఁడు, వానికి సత్యవ్రతుఁడును గలిగిరి. ఆ సత్యవ్రతుఁడే త్రిశంకుఁడు. ఇతఁడు గురుశాపంబున చండాలుఁడై బొందెతో స్వర్గమునకుఁబోవ విశ్వామిత్రుప్రేరణమున యజ్ఞంబుఁగావించె. ఆ విశ్వామిత్రుప్రభావమునఁ ద్రిశంకుఁడు స్వర్గమునకుబొందెతోఁజేరుచుండ దేవతలటనుండినెట్టివేసిరి. తలక్రిందుగ భూమిఁబడుచుఁ ద్రిశంకుఁడు విశ్వామిత్రునిరక్షింపుమని ప్రార్థింప నాతఁడు తనప్రభావంబున నాకాశంబుననిలిపె. ఇప్పటికిని త్రిశంకుఁడట్లుతలక్రిందుగ నాకాశంబునఁ గన్పట్టును. ఆ త్రిశంకునిపుత్రుఁడు హరిశ్చంద్రుఁడు. వసిష్ఠునియందలి యాగ్రహంబున విశ్వామిత్రుఁడుహరిశ్చంద్రుబాధింపఁదొడంగెను. అది కని వసిష్ఠుఁడు విశ్వామిత్రునిగృధ్రమవుకమ్మనిశపించె. వసిష్ఠుని విశ్వామిత్రుఁడు బకముకమ్మని ప్రతిశాపంబొసఁగె. ఇట్లు వసిష్ఠవిశ్వామిత్రులు పక్షిరూపులయ్యుఁ బూర్వవైరంబుకతన నల్లేకలహించుకొనుచుండిరి. హరిశ్చంద్రుఁడు సంతానములేకవరుణుని యజించె. తనకు వరుణునిదయచే సంతానముకలిగిన నాపుత్రునే యజ్ఞపశువుగఁజేసి మరలయజింతుననియుఁ బ్రార్థించె. అంతపుత్రుం డుద్భవించె. వరుణుఁడు వాగ్దానము నెరవేర్పుమన హరిశ్చంద్రుఁడుపుత్రమోహంబున నెప్పటికప్పుడేవో సాకులుచెప్పి తప్పించుకొనుచుండె. ఆపుత్రునకు రోహితుఁడను నామకరణంబుఁగావించి యల్లారుముద్దుగ బెంచుచుండ నతఁడుపెద్దవాఁడై వరుణునివృత్తాంతము తెలిసి వనంబునకుభీతిచేఁబాఱిపోయె. ఇట హరిశ్చంద్రుఁడు వరుణుని యాగ్రహంబున జలోదరరోగంబునబాధనొందుచుండె. అది తెలిసి పురికి రోహితుఁడు చనుదెంచుచుండ నెప్పటికప్పుడింద్రుఁ డంతరాయముఁ గల్పించుచుండె. తుదకు పురికివచ్చుమార్గంబున నజీగర్తుమధ్యమపుత్రు శునశ్శేఫు విలిచితెచ్చి తండ్రికొసంగి యానందించె. హరిశ్చంద్రుఁడు పురుషమేధముఁగావించి వరుణుఁదృప్తిపఱచి రోగవిముక్తుండయ్యె. హరిశ్చంద్రునివలన వసిష్ఠవిశ్వామిత్రులిరువురు సంతసించిరి. వసిష్ఠుఁడు హిరణ్మయరథంబొసంగె. విశ్వామిత్రుఁడు విజ్ఞానముఁ బ్రసాదించె. హరిశ్చంద్రుఁ డిట్లు విజ్ఞానంబార్జించి సంసారహేతువైన ప్రకృతింబాసి బంధవిముక్తుండై యవాఙ్మానసగోచరుండై స్వస్వరూపంబునఁ బ్రకాశించె.

## సగర చక్రవర్తి చరిత్ర.

అట్టి రోహితుని సంతతియందలి బాహుకుఁడు వైరులచే రాజ్యముఁగోల్పోయి భార్యలతో నరణ్యంబునకుఁ జని ముదుసలియై యచటమరణించె. వానియగ్రమహిషిభర్తననుగమింపనుంకింప నౌర్వమహర్షి యామెగర్భవతియగుట గుర్తించి మఱలించె. మిగిలినబాహుకునిభార్య లామెగర్భవతియగుట కసూయఁజెంది విషమిడిరి, అయినను నామె సురక్షితముగఁ బుత్రునిఁగనె. ఆబాలకుఁడు గరముతోఁబుట్టినవాఁడుగాన సగరుఁడనఁబరఁగె. ఆ సగరుఁడుపెరిగి తనతండ్రి నగవులపాలుగావించిన వైరులనందఱజయించి చక్రవర్తియయ్యె. సగరునకుఁ గేశినియందు నసమంజసుఁడను పుత్రుండు పుట్టె. వానియందు సమంజసగుణములులేకపోవుట నసమంజసుఁడయ్యె. అతఁడు పూర్వజన్మంబున యోగియై సంగంబున యోగభ్రష్టుండై సగరునకుఁబుట్టి జాతిస్మరణజ్ఞానంబుఁగలిగి యెవ్వరుఁదన్నుఁజేరకుండున ట్లసమంజసముగ వర్తించుచుండె. ఒకనాఁడయోధ్యయందలిబాలకుల సరయూనదిలోనికి విసరివైచుచుండె. దానికలిగితండ్రి వీనినిపట్టణబహిష్కృతుఁగావించె, అసమంజసుఁడు తన యోగప్రభావంబున గొన్నాళ్ళకాబాలురఁ బురంబునఁ గనఁబఱచి నివ్వెఱఁబడఁజేసె. అట్టియసమంజసునిపుత్రుఁ డంశుమంతుఁడు, సగరునకు మఱొక భార్యయగు సుమతియం దఱువదివేలమంది తనయులు జనించిరి. ఔర్వమహర్షి యాజ్ఞ సగరుఁడ నేకాశ్వమేధంబులు గావించె. ఒక యశ్వమేధంబున విడువఁబడినయశ్వము నింద్రుఁడు హరించి నాగలోకంబున కపిలునిచెంత బంధించి చనియె. ఆయ్యశ్వంబును వెదకుటకుఁ

బితాజ్ఞ సుమతికొడుకు లఱువదివేవురు బయలుదేరితుదకు భూమిఁద్రవ్వి నాగలోకంబునఁ గపిలునిచెంత గుఱ్ఱమును గాంచి యతఁడే యశ్వచోరుఁడని దూషించి తద్దోషంబున భస్మీభూతులైరి. సగరనియమితుఁడై యంశుమంతుఁడు గుఱ్ఱముకొఱకుఁజని కపిలునిగాంచి వినుతించె. కపిలుండును ప్రశాంతచిత్తమున నతనిదీవించి గుఱ్ఱమునుగొనిపోయి గంగాజలంబుల నీ పితరులనూర్ధ్వగతిఁ బొందింపుమని యుజ్జగించెను. అంశుమంతుఁడు తెచ్చిన యశ్వంబున యాగంబుపూర్తిగావించి సగరుఁడాయంశుమంతునకు రాజ్యంబొసంగి యార్యోపదిష్టమార్గంబున నుత్తమగతిం జెందె.

## సౌదాసు చరిత్ర.

అంశుమంతుఁడు గంగకొఱకునడవిఁదపంబొనరించి మడిసె. అతనికొడుకు దిలీపుండునునట్లయ్యె. దిలీపునికొడుకు భగీరథుఁడుగంగనుగాంచి తనకోరికవిన్నవించె. గంగ తనవేగము సహించువానిగ నీశ్వరు వేడుమనెను. భగీరథుప్రార్థనచే నీశ్వరుఁడియ్యకొన గంగభూమికిదిగి భగీరథునుకోరికఁదీర్చె. ఇట్టి భగీరథునకు శ్రుతుఁడు, వానికి నాభాగుఁడు, వానికి సింధుద్వీపుఁడు, వానికి నయుతాయువు, వానికి ఋతుపర్ణుఁడును జనించిరి. ఆ ఋతుపర్ణుఁడే నలచక్రవర్తితోస్నేహంబొనరించి యక్షహృదయమతనికిడి యశ్వవిద్యతాను నేర్చెను. ఆ ఋతుపర్ణునకు సర్వకాముఁడు, వానికి సుదాసుండును, వానికి మదయంతీవల్లభుఁడైన సౌదాసుండును బుట్టిరి. వీనినే కల్మాషపాదుఁడనియునందురు. సౌదాసుఁడొకనాఁడడవికిఁ జని రాక్షసునొకని సంహరించె. వానిసోదరుఁడు సోదరుఁజంపినపగఁదీర్చుకొన సౌదాసునింట వంటవాఁడుగఁజేరె అది సౌదాసుఁడెఱుఁగఁడు. వసిష్ఠుఁడొకనాఁడు సౌదాసునింటఁగుడువ నావంటవాఁడావసిష్ఠునకు మానవమాంసమువండివడ్డించె. అది వసిష్ఠుఁడు గుర్తించి కోపంబున సౌదాసునిరాక్షసుఁడవుకమ్మని శపించి పిదప సౌదాసుఁడెఱుంగమి తెలిసికొని పండ్రెండేండ్లు మాత్రమా రాక్షసత్వముండునని నిర్ణయించెను. సౌదాసుండును గురువును మఱలశపింపునని దోసిటజలంబుఁబట్టి భార్యమదయంతివారింప నాజలంబెటజల్లినను జీవరాశిదగ్ధమగునని తనపాదములందేజల్లుకొనె. పాదంబులు కందె. కల్మాష వర్ణముగలపాదములుగలవాఁడు గాన నతఁడు కల్మాషపాదుండయ్యె. అంగ సౌదాసుండు రాక్షసభావమావహింప నడవి నాఁకటఁదిరుగుచు నొక బ్రాహ్మణమిథునమందుఁ బురుషునిమ్రింగె. బ్రాహ్మణునిభార్య పరిపరివిధంబుల విలపించి భార్యఁగూడిన నీవు నశింతువని శపించి భర్తృశల్యంబుల నగ్నిప్రవేశంబుఁగావించె. సౌదాసుఁడు శాపవిముక్తిఁజెంది భార్యతోఁ గూడుటకుంకింప విప్రసతిశాపంబెఱుంగుకతన మదయంతి యంగీకరింపదయ్యె. అందువలన సౌదాసుఁడు సంతానవిహీనుఁడయ్యె.

సౌదాసుననుమతి వసిష్ఠుఁడు మదయంతికి గర్భంబుఁగావించె. ఆ గర్భమాయింతి యేడేండ్లు మోసి నిర్భావసంకటపడుచుండ వసిష్ఠుఁడువాడియగు నశ్మంబున గర్భంబుఁజీరి శిశువును మదయంతిని ప్రాణభయంబులేకుండఁ గాపాడె. అశ్మమునఁజీరఁబడిన గర్భమునఁబుట్టినపుత్రుండు గాన వాఁడశ్మకుండయ్యె. ఆ యశ్మకునకు మూలకుఁడుపుట్టె. పరశురాముఁడు క్షత్రియులఁజంపునవసరంబున స్త్రీలితనిఁగాపాడిరి గాన నారీకవచుండనుపేరు కలిగె. పరశురామునివలన నిర్మూలమగు రఘువంశమునకు మూలంబగుట నితఁడు మూలకుఁడయ్యె. మూలకునకు విశ్వసహుఁడు, వానికి ఖట్వాంగుఁడును బుట్టిరి. ఆ ఖట్వాంగుఁడే దేవదానవయుద్ధమున దేవతలకు సహాయమొనర్చి వరంబుల దన యాయువు ముహూర్తమాత్రంబని యెఱింగి యంతలో ముక్తిమార్గమును సాధించె. ఆ ఖట్వాంగుపుత్రుఁడు దీర్ఘబాహుఁడు. వాని పుత్రుఁడు రఘువు, వానిపుత్రుఁడు పృథుశ్రవుఁడు, వానిపుత్రుఁడజుఁడు, వాని పుత్రుఁడు దశరథుఁడు. వానిపుత్రుఁడు సురప్రార్థితుఁడగు శ్రీమహావిష్ణువు శ్రీరామచంద్రమూర్తి.

## శ్రీ రా మ చ రి త్ర.

దశరథునకు భగవంతుఁడు నాల్గుభాగములుగ శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులయి జనించె. విశ్వామిత్రుఁడు సవనరక్షణార్థము దశరథునడిగి రామలక్ష్మణులఁగొంపోయె. వారుమార్గ మధ్యమునఁదాటకినిఁజంపి యామె పుత్రులలోనొకఁడగు సుబాహువధించి మఱియొకఁడగు మారీచుసము ద్రంబునఁబడఁగొట్టిరి. ఇట్లువిశ్వామిత్రుయాగంబుఁగాపాడి యహల్యాశాపవిమోచనంబుఁ గావించి మిథిలకరిగి శివుని విల్లువిఱిచి శ్రీరామచంద్రుఁడు సీతను బెండ్లాడె. అయోధ్యకుసీతాబంధుసమేతుఁడై వచ్చుచు మార్గంబునఁ బరశురామునోడించె. దశరథుని కైక పూర్వముతనకీయబడిన రెండువరములకు మారుగనొకటి భరతరాజ్యపాలనముగను మఱియొకటి శ్రీరామవనవాసముగను కోర శ్రీరామచం ద్రుఁడద్దాన సీతాలక్ష్మణసమేతుఁడై చిత్రకూటంబునకరిగె. దశరథుఁడు పుత్రశోకంబునమరణించె. పిదప భరతుఁడు తల్లి యకృత్యంబువిని చిత్రకూటంబునకరిగి రాజ్యపాలనకు శ్రీరామునర్థించె. అతఁడు తనపాదుకలనిడె. భరతుఁడాశ్రీరాముపాదుకలపక్షమున ప్రతినిధిగ రాజ్యపాలనముఁ గావించుచుండె. రాముఁడుసీతాలక్ష్మణసమేతుఁడై దండకారణ్యమునకరిగి గోదావరీతటంబునఁ బర్ణశాలనిర్మించుకొని, వసించుచుండె. రావణునిచెల్లెలు శూర్పణఖ రాముఁగామించి వైపరీత్యంబుగ సంచరింపలక్ష్మణుఁడామె ముక్కుచెవులంగోసిపంపె. దాన జనస్థాననివాసులు ఖరదూషణాదులు పదునాల్గువేలమందిరాక్షసులు రా శ్రీరాముండొక్కక్షణంబున వందఱమడియించె. అది శూర్పణఖవలన రావణుండెఱింగి మారీచసహాయంబున రామలక్ష్మణులనెడబాసిన సీతనుగొంపోయిలంకనునిచె. మారీచసంహరణానంతరము రామలక్ష్మణులు జటాయువు సుగ్రీవులవలన సీతజాడఁదెలిసికొని తనకుమిత్రుఁడగు సుగ్రీవుని శత్రువగు వాలి నొక్కబాణమునఁదున్మి సుగ్రీవాజ్ఞ సీతనులంకలోఁ బొడఁగాంచివచ్చిన హనుమంతునివలన యావద్వృత్తాంతమెఱింగి కపిసైన్యముతో సముద్రంబు దరిఁజేరి విభీషణునకు శరణిడెను. అంతసముద్రంబునకు సేతువు నిర్మించి లంకఁజొచ్చి పుత్రమిత్రసహితంబుగ రావణువధించి విభీషణునకు లంకారాజ్యమొసఁగి యగ్నిప్రవేశమువలనఁ బరమపావనత్వము వెలిబుచ్చిన సీతతోఁబుష్పకవిమానమెక్కి యయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుఁడై యానందదాయకంబుగ పదునొకొండువేలవత్సరంబులు రాజ్యపాలనంబు గావించె. మాఱువేషంబున దాను ప్రజలాడుకొనుమాటలువిని గర్భవతియగు సీతనువాల్మీక్యాశ్రమమునవిడిచె. అచట సీత కుశలవులఁగనె. వాల్మీకి యాకుశలవులకు రామాయణముచెప్పి యజ్ఞముఁజేయు రామునకు వినిపింపఁజేసి సీతాపాతివ్రత్యమును వెల్లడించె. అయినను సీతయాలోకమునసుండ నొల్లక భూవివరంబున వైకుంఠంబునకరిగె. రాముండునుగుశలవులకు రాజ్యపట్టాభిషేకముఁగావించి లక్ష్మణ, భరత, శత్రుఘ్నులతోను, తనతోకలిసిమెలసితిరిగిన సమకాలికులైన యయోధ్యాపురవాసులతోను వైకుంఠంబునకరిగె.

## జ న కు చ రి త్ర.

ఆ కుశసంతతి మరువనురాజువరకువచ్చె ఆ మరువనురాజశ్రేష్ఠుఁడు రాజయోగియై కలాపగ్రామమునసున్నవాఁడు, కలియుగాంతమునసష్టమైన సూర్యవంశముసుగ్రమ్మఱనతఁడు పుట్టింపఁగలవాఁడని యందురు. ఇక్ష్వాకుఁడాదిగ బృహద్బలుఁడంత్యముగ సూర్యవంశమిప్పటివరకుసాగె. ఇఁకముందు సుమిత్రునివరకు సూర్యవంశముసాగఁ గలదు. ఇక్ష్వాకుతనయుఁడగు నిమి యజ్ఞముసేయఁగోరి వసిష్ఠు ఋత్విజునిగఁగోరెను. వసిష్ఠుఁడింద్రునిచే యజ్ఞముసేయింప నంగీకరింపఁబడితిననియుఁ బిమ్మట నీయజ్ఞమునకు వత్తుననియుఁ బలికెను. నిమి సంసారము క్షణభంగురమని మఱియొక ఋత్విజునాశ్రయించి

యజ్ఞము నెరవేర్చెను. వసిష్ఠుఁడందులకుఁ గోపించి "నీ దేహముపడుఁగాక" యని శపించెను. దానికి నిమియు "నీ శరీరము పడుఁగాక" యని వసిష్ఠునకుఁ బ్రతిశాపమిచ్చెను. వసిష్ఠుఁడు మిత్రావరుణులవలన నూర్వశియందుబుట్టి దేహియయ్యె. మునులు నిమి దేహముఁగాపాడి ప్రారంభించిన యజ్ఞముఁబూర్తిఁ జేసిరి. హవిర్భాగములకువచ్చినదేవతలు నిమిని బ్రతికించిరి. కాని నిమి యాశరీరము తనకు వలదని నిరసించె. దేవతలు వానియందలి కృతజ్ఞతకు మారుగ శరీరులకెప్పపాటున నిమి యుండునని వరం బిచ్చి చనిరి. రాజులేకుండుటవలన నిమిశరీరమును మునులుద్రచ్చి యందొక పుత్రుని నుద్భవింపఁజేసిరి. అతఁడే జనకుఁడు. విగతదేహుఁడుకాన వైదేహుఁడనియు, మథనజాతుఁడుగాన మిథిలుండనియు వానికినామములుకలిగె. ఆ మిథిలునిచేనిర్మితమైనదే మిథిలానగరము. ఆ వంశస్థులందఱు జనకులనియే పిలువంబడిరి. అందు సీరధ్వజుఁడను జనకుఁడు యజ్ఞముసేయ భూమిదున్నింప లాంగలంబునకొన సీత యుద్భవించె. ఆ సీతనే రామునకిచ్చి వివాహంబుఁగావించె. వీరందఱు మైథిలులనఁబరఁగిరి. యోగీశ్వరుప్రసాదంబున నీ జనకవంశస్థులు గృహస్థులయ్యు బంధనిర్ముక్తులై యాత్మజ్ఞానముకలిగి నిరంతర బ్రహ్మానుసంధానముఁ జేయుచుందురు.

## పురూరవుచరిత్ర (చంద్రవంశము)

జగన్నాథుని నాభికమలంబున బ్రహ్మపుట్టె. ఆ బ్రహ్మకు నత్రి జనించె. అత్రి క్రీగంటి చూపుల చంద్రుఁ డుదయించి బ్రహ్మాజ్ఞను నక్షత్రనాథుఁడయ్యె. చంద్రుఁడు రాజసూయముఁ జేసి ముల్లోకములజయించి సౌఖ్యమదంబున బృహస్పతిపెండ్లాము తారను వగూడి గురుఁడగు బృహస్పతి బ్రతిమాలుకొన్నను విడువఁడయ్యె. బృహస్పతితోడివిరోధంబున శుక్రుండును రాక్షసులును చంద్రునిజేపట్టిరి. ఇంద్రాదులు బృహస్పతి పక్షమువహించిరి. ఇట్లు తారనుగుఱించి దేవదానవులకు పోరుఘోరంబయ్యె. అంత బృహస్పతితండ్రి యంగిరుఁడు బ్రహ్మకు నీ సంగతిఁ దెల్ప చంద్రుని మందలించి గర్భిణియగు తారను బృహస్పతికి నప్పగించె. ఆ గురుండును తారను దిట్టి గర్భంబుఁబోఁగొట్టు కొమ్మనునంత బంగారుచాయగల కుమారుఁడా మెకుఁబుట్టె. ఆ శిశువుని సౌందర్యమునకు మోహంబుఁ జెంది గురుచంద్రులాపుత్రుఁగొన వాదులాడిరి. మఱల బ్రహ్మవచ్చి యీ కాంతమున తారవలన నా పుత్రుఁడు చంద్రునకుఁబుట్టినవాఁడేయని తెలిసికొని బుధుఁడను నామకరణంబుఁజేసి చంద్రునకిచ్చెను. ఆ బుధునకు నిలయనుకన్యకకుఁ బురూరవుండుజన్మించెనని యిదివరకే చెప్పఁబడినది. ఆపురూరవుని సౌందర్య గుణగణాదులు నారదునివలన నూర్వశివిని మిత్రావరుణశాపంబున మనుష్యభావంబుఁదాల్చి పురూరవునిఁజేరి యాతండు కామింప "ఓ చంద్రవంశోద్భవా! ఇవె నా రెండు మేకలు. వీనిని నీవు కాపాడిన, వివస్త్రుండవుగాక యున్న నీ మేను నేయి నీవుహితకరైన నీతోనుందు" ననెను. పురూరవుండు దానికి యకొనె. ఇట్లు వారుసుఖంబుండిరి. అంత నింద్రలోకంబున నూర్వశిలేకుండుట నింద్రుఁడెఱిఁగి యూర్వశిఁ గొనిరా గంధర్వులఁ బనిచె. వా రూర్వశిమేకల నపహరింప నవి యఱచె. ఊర్వశి నిద్రాపరవశయున్న పురూరవున కెఱిఁగించె. అతఁడు చిత్తరంబున నా దొంగలవధించి మేకలవిడిపించె. కాని వస్త్రవిహీనుఁడయ్యె. అద్దాన నూర్వశియుఁజనె. పురూరవుఁ డూర్వశియందలి మోహంబున నామెను వెదకుచు సరస్వతీనదీతటంబున నామెఁగాంచి రమ్మని ప్రార్థించె. ఆమెయు "నొక యేఁడుండిన నొక పుత్రునితో వచ్చెద" ననెను. ఆమెగర్భవతియని యెఱింగి సంవత్సరమాగి పోయెను. గంధర్వులు వానికి నూర్వశినిగాక యగ్నిస్థాలియను దాని నొసంగిరి. కొన్నాళ్లకది యూర్వశి కాదని తెలిసికొని విడిచె. అంత పురూరవుఁడు శమీగర్భజాతంబైన యశ్వత్థంబు మథించి దానిపై నరణులు రెండుగాఁజేసి యొక యరణి తాను గాను రెండవయరణి యూర్వశిగాను మధ్యకాష్ఠంబు పుత్రుఁడుగాను భావించి

మథించె. అద్దాన జాతవేదుఁడను నగ్నిజనించె. ఆ జాతవేదునికారణమున నతఁడూర్ధ్వలోకంబులకుఁ జని యూర్వశినిఁగాంచె. ఆమెయందు దార్వురుపుత్రులుజనించిరి. వారిసంతతియందు గంగనుపుక్కి-టఁబట్టిన జహ్నుండును పుట్టె. ఆ జహ్నునకుఁ బూరుఁడును, వానికి బాలకుండును, వానికి నజకుండును, వానికిఁ గుశాంబుఁడును, వానికి గాధియుఁగలిగిరి. గాధిరాజు కుమార్తెయగు సత్యవతిని విప్రుఁడగు ఋచికుఁడడుగనాతనికిచ్చుట కిష్టపడక తెల్లనిశరీరము నల్లనిచెవులుఁగల వేయి గుఱ్ఱముల నిచ్చిన నిత్తుననె. ఆ ఋచికుఁడును వరుణునియాచించియట్టి గుఱ్ఱములఁదెచ్చి యిచ్చె. చేయునదిలేక గాధి సత్యవతినిచ్చె. ఆఋచికుని భార్యయగుసత్యవతియు నత్తయగు గాధిసతియు సంతానము లేక పుత్రులఁగోరి ఋచికు నాశ్రయింపనతఁడు విప్రమంత్రంబుల నొకచరువును, క్షత్రియమంత్రంబుల నొక చరువునుగావించి వారలకొసంగె. వారలుపొఱపడి క్షత్రియమంత్రచరువు సత్యవతియు, విప్రమంత్ర చరువు గాధిసతియు భక్షించిరి. అదితెలిసి ఋచికుఁడు తనకుమారుఁడగు క్షత్రియుఁడును దనయత్తకు బ్రహ్మవాదియగు బ్రాహ్మణుండును పుట్టుటకు భయమంది తనకు క్షత్రియుఁడు పుత్రుఁడుగా గాక, మనుమఁడుగా గలుగునట్లు గావించుకొనెను. అందువలనవానికి జమదగ్నియు, నా జమదగ్నికిఁ బరశురాముడును, వానియత్త గాధిసతికి బ్రహ్మవాదియగు విశ్వామిత్రుఁడును జనించిరి.

## పరశురాముని చరిత్ర.

జమదగ్నికి రేణుకయందు వసుమనాదికుమారులు నల్వురుదయించిరి. హైహయప్రభువగు కార్తవీర్యార్జునుఁడు దత్తాత్రేయు నారాధించి శత్రుజయము, బాహుసహస్రము, నణిమాదిసిద్ధులుఁ బొంది గాలికైవడి విశృంఖలముగ నంతట వీరవిహారముఁగావించుచుండె, రావణుఁడంతవాఁడు దిగ్విజయమునకురా నర్జునుఁడు స్త్రీలతో జలకేళిఁగావించుచు రేవానదికిఁ దనభుజముల నడ్డగట్టుఁగావింప నది పొంగి రావణుసైన్యముసుముంచెను. రావణుఁడు యుద్ధమునకురాగ అతని జయించి బందీ గావించి మందలించి పంపె. అట్టి కార్తవీర్యార్జునుఁ డొకదినంబున నడవికివేటకుఁబోయి కామధేనువు సహాయంబున జమదగ్ని తమకు విందుసేయ నాగోవు నపహరింప బుద్ధిజనించి భటులచే దానిని హరింపఁజేసె. ఇట్లు మాహిష్మతీపురంబుననున్న కార్తవీర్యార్జునుని బరశురాముఁ డాశ్రమవృత్తాంతముఁ దెలిసికొని వచ్చి తాకి యర్జునువేయిచేతుల దలఁ సైన్యములనఱికి కామధేనువుఁగొనివచ్చి తండ్రికిచ్చె. జమదగ్నియు శాంతంబున నాతనిమందలించె. ఆ పాపపరిహారమున కొకవత్సరము తీర్థాటనముఁగావింపుమనె. అతండును నట్లుగావించె. రేణుకయొకనాఁడు జలంబునకుఁబోయి యప్సరసలతో జలకేళిఁగావించు చిత్రరథుఁగాంచి మోహవివశయై తడవుఁజేసె. అది జమదగ్ని తెలిసికొని దానితలనఱుకుఁడన ముగ్గురు పుత్రులును సందేహించిరి, ఆముగ్గురను తల్లినిగూడనఱుకుమన బరశురాముండునఱికి వారల బ్రతికించుటవరముగాగొనె, జమదగ్నియు వారలబ్రతికించె. కార్తవీర్యార్జును పుత్రులు తండ్రిపగదీర్చుకొన రాముఁడును నన్నలును నాశ్రమమున లేనితఱి నిశ్చలసమాధినున్న జమదగ్నిని రేణుకయడ్డుపడుచున్నను, మానకతలనఱికి కొనిపోయిరి. జమదగ్ని కొమరు లరుదెంచి విలపించుచుండ రేణుక యిరువదియొక్క-పరి రొమ్ముఁ బాదుకొనుచువిలపించె. రాముఁడు మాహిష్మతికరిగి యర్జునపుత్రులనందఱ నఱికి మిగిలినక్షత్రియుల నిరువదియొక్క-పరి వెదకివెదకిచంపి శమంతపంచకంబున క్షత్రియ రక్తంబునఁ దొమ్మిదిమడుగులుగావించి తండ్రిశిరంబుఁదెచ్చి శరీరంబుతో సంధించి, యజ్ఞంబుఁగావించి భూమియంతయు ఋత్విజులకు దానంబొసంగి సరస్వతీనది నవభృథస్నానుండై విగతకల్మషుండయ్యె. జమదగ్ని బ్రతికి తపోబలంబున సప్తర్షిమండలము నాశ్రయించె. పరశురాముఁడు మీఁది మన్వంతరమున సప్తఋషులలో నొకఁడు కాఁగలఁడు. పరశురాముఁడు శాంతచిత్తుఁడై మహేంద్ర

పర్వతంబునఁ దపంబాచరించు కొనుచుండె, విశ్వామిత్రుఁడు తపోబలంబున క్షత్రియ ధర్మము దిగవిడిచి బ్రహ్మర్షియై నూర్వురకొడుకులఁగనె, భృగుకులజాతుఁడగు నజీగర్తుకొమరుఁడు శునశ్శేఫుఁడు హరిశ్చంద్రుయాగపశువుగ నమ్ముడుపడ దేవతలఁదృప్తిపఱచి యాతనిరక్షించె. ఆ శునశ్శేఫు దనపెద్దకొడుకుగభావించె, కొడుకులందులకుఁ గటకటంబడిరి. ఏబదిమందియంగీకరింపక మ్లేచ్ఛులుగ శపింపఁబడిరి. మధుచ్ఛందుండాది యేబం డ్రంగీకరించిరి. ఆ శునశ్శేఫుఁడే దేవతలచే విడువఁబడిన వాఁడుగాన దేవరాతుఁడనఁబరఁగె.

## య యా తి చ రి త్ర.

పురూరవునకు నాయువు, వానికి నహుషుఁడును జన్మించిరి. ఈనహుషుఁడే నూఱశ్వమేధంబులఁ జేసి యింద్రపదవినొంది యింద్రాణిఁగోరి యగస్త్యశాపంబున నజగరంబయ్యె. నహుషసంతతియందు గువలయాశ్వుండును, వానికి నలర్కుఁడును గలిగిరి. అలర్కుఁ డఱువదియాఱు వేలేండ్లు ధరణిఁ బాలించె. అంత కాలము మఱెవ్వరును బాలింపలేదు. ఆ సంతతియందు రజియనువాని కేనూర్వురు కొడుకులు కల్గిరి. అతఁడు దానవులజయించి యింద్రునకు స్వర్గంబొసంగె. ఇంద్రుఁడస్థాని దిరిగి రజికే యొసంగె. కొన్నాళ్లకు రజి మృతుండయ్యె, వానిపుత్రులు మదంబున స్వర్గంబుఁ బాలింప నింద్రుఁడు వజ్రంబున నందఱసంహరించి మఱలస్వర్గంబుఁ గైకొనె. నహుషునకు యతి యయాతిమొదలగు నార్వురు పుత్రులు దేహీ కింద్రియంబుల చందంబునఁగలిగిరి. అందు పెద్దకొడుకునకు రాజ్యంబొసంగె. కాని యతండు గైకొనడయ్యె. తండ్రియు నన్నయు మృతినొంద యయాతి రాజ్యంబుఁ బాలించె.

దానవరాజగు వృషపర్వునికుమార్తె శర్మిష్ఠ వేవురుచెలికత్తెలతోను, గురుపుత్రికయగు దేవయానితోను విహరించుచు వలువలూడ్చి జలకేళిసల్పు యచటికి భవానీసహితుఁడై పరమేశ్వరుండు రా సిగ్గుపడి తత్తరంబున వలువలుదాల్చునవసరంబున దేవయానివలువ శర్మిష్ఠ ధరించె. దానికి దేవయానిమండిపడె. శర్మిష్ఠయుఁగోపించి చెలికత్తెలతో నామెను పాడునూతఁద్రోయించి పోయె. అచటికి వేటకొఱకువచ్చిన యయాతిమహారాజు చేర, నూతనున్న దేవయానిమొఱవిని పైబట్టకట్టనిచ్చి చేతివందుకొని బయటకులాగె. ఆమె పాణిగ్రహణనిమిత్తమున నీవె నాథగ్తవనె. దానికి యయాతి శంకించె. దేవయాని తాను శుక్రునికుమార్తెననియుఁ గచుఁడు మృతసంజీవనివిద్య మాతండ్రికడ నేర్చుకొనునప్పుడు నేనుప్రేమింప నతఁడువలదన మృతసంజీవనివిద్యయతనికిఁ బట్టుపడకుండునట్లు నేనుశపింప బ్రాహ్మణుఁడు నన్ను పెండ్లియాడకుండునట్లతఁడుశపించె. కాన నీవె నాథగ్తవని నిర్బంధింప నతఁ డనిష్టంబున నంగీకరించె. యయాతిచనినయనంతరము దేవయాని తండ్రితో శర్మిష్ఠకృత్యంబుచెప్పి విలపించె. శుక్రుఁడు వృషపర్వునితో నావృత్తాంతముచెప్పి సహస్రసఖీజన పరివృతయగు నీకుమార్తె శర్మిష్ఠను నాకుమార్తెయగు దేవయానికి దాసిగ నియమింపుమన భయంబున నాతఁడంగీకరించె. అట్లె శర్మిష్ఠంగూడిన దేవయానిని యయాతికిఁ బరిణయంబొనర్చి, శర్మిష్ఠం గూడవలదని కట్టడియుఁజేసె, యయాతి దేవయాని యందు యదుదుర్వసులఁగాంచె. దేవయాని వెలుపలనున్నతఱి శర్మిష్ఠ యయాతి డాసి తన కోరికదెల్పె. యయాతియు దాని కంగీకరించె. ఇట్లు క్రమంబునశర్మిష్ఠ యయాతి వలన ద్రుహ్యుఁడు ననువు పూరువను మువ్వురతనయులఁగాంచె. అంత దేవయానిగుర్తించి శుక్రునకు నివేదింప గ్రోధమూర్తియగుచుఁజనె. యయాతియువెన్వెంటఁజని బ్రతిమాలఁగాని యామె యియ్యకొనదయ్యె, శుక్రుండు యయాతిని వృద్ధుఁడవుకమ్మని శపించె. అతఁడు పురంబునకుఁజని తనకుమారుల యదు, దుర్వస, ద్రుహ్యులను ననువును ముదిమిఁదీసికొని మీయావనమిడినఁ గొంతకాలముసుఖించి మఱల మీయావనమునుమీకిడి నాముదిమిఁదీసికొందుననివేడిగి విఫలుండయ్యె, అంతశర్మిష్ఠ కడగొట్టుబిడ్డఁడగు పూరునకుఁగ

నాతఁడొసంగె. అంతయౌవనంబునఁ జాలకాలముసుఖించి తృప్తిఁగాంచక దేవయానికిఁ దనచరిత్రయే మేకనెపంబునచెప్పి దేవయానీ! అన్నియు ముదిసినవి. కాని విషయాభిలాష, బ్రతికెడుతీపి యివి రెండునుమాత్రము ముదియుటలేదు. అంగనాసంగమంబు సంసారకారణంబు. నేనిఁకవిషయంబుల జోలికిపోక బ్రహ్మధ్యాననిష్ఠమెలంగెదనని పూరునకు యౌవనంబిడి తానుముదిమిధరించి మిగిలినకొడుకులకు నాలుగుదిక్కులరాజ్యమునొసంగి పూరునకు భరతఖండంబొసంగి, సంగంబులవీడి భాగవతగతిం జెందె. దేవయానియు సంగంబులఁబాసి ముక్తిఁగాంచె.

## భ ర తు ని చ రి త్ర.

ఇట్టి పూరువంశంబున రైభ్యునకు దుష్యంతుఁడుపుట్టె, దుష్యంతుఁడువేట కడవికిఁజని దైవయోగంబునఁ గణ్వాశ్రమంబుఁజేరె. అందు శకుంతలఁగాంచి యామెయందుఁ దన మనంబు లగ్నంబు కాఁగ నామెరాజకన్యయనిభావించి తనకోరికఁదెలిపె. శకుంతలయు విశ్వామిత్రునకు మేనకకుఁ బుట్టిన దాననవియు, వారలచేవిడువఁబడి శకుంతంబులు కాపాడుటకతన శకుంతలనైతిననియుఁ గణ్వుఁడు పెంచుచుండెననియుఁజెప్పెను. దుష్యంతుఁడా శకుంతలను గాంధర్వవిధిఁగైకొనియె. అంత శకుంతల గర్భవతియై కుమారుఁగాంచె. కణ్వుఁడుసంతసించి చక్రవర్తిలక్షణములుగల యా బాలకుదీవించి జాతకర్మాదులఁగావించె. ఆ బాలకుఁడు వీరోచితకృత్యంబులు గావింపుచుండఁ గణ్వుఁడు శకుంతలను కుమారసహితంబుగ మహారాజుపాలికిఁజనుమని పంపించెను. ఆత్మసదృశాకారుఁడగు బాలకుని,శకుంతలనుజూచి దుష్యంతుఁడుమిన్నకుండె. అంతటనశరీరవాణి 'వీఁడు నీపుత్రుఁడు వీనిభరింపు'మనుట నతఁడుభరతుండయ్యె. దుష్యంతుఁడును నంగీకరించె. భరతుఁడు పెద్దవాఁడు కాఁగ దుష్యంతుఁడువానిని రాజ్యమందునిలిపి దివంబునకరిగె. భరతుఁడు రాజ్యముఁబాలించుచు యమునాతటంబున దీర్ఘతపుఁడు పురోహితుఁడుగా డెబ్బదియెనిమిదియు, గంగాతటంబున నేబదేను మొత్తము నూటముప్పది మూఁడశ్వమేధంబులగావించె, 1384 మందలొకద్వంద్వము, అట్టివేయిద్వంద్వముల పాఁడిమొదవుల దక్షిణలనిచ్చె, ధవళదంతంబులుగల నల్లనియేనుఁగుల 14 లక్షలనొసంగె. రాక్షసులజయించి రసాతలంబుననున్న దేవకాంతలవారలకొసంగె. త్రిపురదానవులజయించి నిర్జరుల నిజమందిరములనునిచె. అతనిరాజ్యమున భూమ్యాకాశంబులు కోరినకోరికలొసఁగుచుండె. ఇట్లు 27 వేలయేండ్లు ధరణిఁబాలించె. భరతునకు విదర్భరాజపుత్రికలు ముగ్వురుభార్యలు, వారలు సంతానముఁ గాంచియుఁదండ్రికితగిన సంతానముకాదని వారలఁజంపివేసిరి. భరతుఁడపుత్రకుఁడై మరుత్‌స్తోమంబను యాగంబు పుత్రార్థియైచేసి దేవతలమెప్పించె.

గర్భిణియు నన్నయగు నుతథ్యుని భార్యయునగు మమతపై సురతమునకు బృహస్పతిపడియె. గర్భస్థుఁడగు బాలుఁడు మొఱవెట్టి యావీర్యంబును వెలుపలికినెట్టె. తనసుఖమున కంతరాయముఁ గల్గించినవాఁడని యా గర్భస్థశిశువును నంధుండవుగమ్మని బృహస్పతి శపించె. బయటవీర్యంబున నొకబిడ్డయయ్యె. గర్భస్థశిశువును జనించె. ఈయిద్దఱను నీబిడ్డలుగనే పోషింపుమని మమతను బృహస్పతికోరె. కాని మమత నాబిడ్డనేకాని నీబిడ్డను నేను పోషింపలేనని యాబిడ్డను దిగవిడిచి తనబిడ్డనుగొంపోయె. బృహస్పతి శాపంబున నాబిడ్డ అంధతముండయ్యె. మిగిలినబిడ్డ యిద్దరికి సంబంధించి పుట్టుట నతఁడు ద్వాజుఁడయ్యె. 'నీవు భరింపుము, నీవు భరింపుమని' వారు వాదులాడుట నతఁడు భరద్వాజుండయ్యె. అబిడ్డను బృహస్పతియు, మమతయు విడిచిచన మరుత్తులు పోషించి తమ్ము యజ్ఞమున సంతోషపెట్టిన నీ భరతునకు పుత్రునిగ నొసంగిరి. వితథంబైన భరతవంశమున

కాతఁడు వంశకర్తయగుటచే వితథుఁడనియు విఖ్యాతిఁగాంచె. ఆ వితథునకు మన్యువు, వానికి నరుఁడు, వానికి సంకృతి, వానికి రంతిదేవుఁడును జనించిరి.

## రంతిదేవుని చరిత్ర.

రంతిదేవుఁడు రాజ్యం బేలుచుఁ దనకుఁగల సంపదలన్నియు దీనులకుఁ బంచియిచ్చి నిరాహారుఁడై నలువదియెనిమిదిదివసంబు లెందేని సంచరించె. అంత నొక్కదినంబునఁ గుటుంబయుతుఁడై కుడుచుటకుఁ గొంత నెయ్యి, పాయసము, నీరు సమకూర్చుకొనె. అంతలో నతిథిరా సగం బొసంగె. మిగిలినది తినఁజూడ నొకశూద్రుఁ డన్నాతురుఁడై వేఁడ నందు సగంబొసంగె. మఱల తినఁబోవఁ గుక్కలతో నొకఁడువచ్చి కోర నీరుతప్ప మిగిలినదంతయు వానికొసంగె. ఆ నీరైనను ద్రాగ నుంకింప నొక చండాలుఁడువచ్చి దీనుఁడై యానీటిని యాచింపఁ దనకు భగవంతుఁడేయున్నాఁడని యానీటి నొసంగె. అంత బ్రహ్మాదిదేవతలు ప్రత్యక్షమై యిదియంతయుఁ బరీక్షార్థము మేము కల్పించినదే. నీకు కావలయు వరంబు వేఁడుమనిరి. తనకేమియు వలదని భగవద్భక్తి నేమఱకుండునట్లనుగ్రహింపుఁడని కోరెను. ఇట్లు రంతిదేవుఁడు పరమపదమునొందె. ఇట్టి భరద్వాజకులంబున బుట్టిన పెక్కుఱు బ్రాహ్మణులై చనిరి. ఈ వంశజుఁడగు సత్యధృతి యూర్వశింగని మోహింప వీర్యస్ఖలనంబయ్యె. అది శరస్తంభంబునఁబడి రెండుగాఁ జీలె. అందువలన నది స్త్రీపురుషద్వయం బయ్యె. శంతనుఁ డడవికివచ్చి వారలఁ గృపతోఁ గాపాడెఁ గాన వారలు కృపుఁడుఁ గృపియు ననఁ బరఁగిరి. కృపి ద్రోణుని భార్యయయ్యె. ఈ భరద్వాజవంశము దేవాపివరకు కొనసాగె. దేవాపి కలియుగాంతమున క్షీణించిన చంద్రవంశము నుద్ధరింప నిలిచె.

## యదు చరిత్ర.

యయాతి పెద్దకొడుకగు యదువంశమువారే యాదవులు. ఈ యదువంశమున జనించిన బభ్రువు మహిమాన్వితుఁడు. దూరమునుండి వినునది దగ్గఱగ జూచెడివాఁడు (టెలివిజను). వీని యుపదేశమున **1465** గురు ముక్తినొందిరి. ఇట్టి యదువంశసంభూతుండగు శ్రీకృష్ణభగవానుఁడు నరునకుఁ బ్రవృత్తిమార్గంబున విజయంబును, ఉద్ధవునకు నివృత్తిమార్గంబున మోక్షంబును బ్రసాదించి దుష్టసంహారంబు శిష్టసంరక్షణంబుఁ గావించి వైకుంఠంబునకరిగె.

---




I have the pleasure to enrol Sri. Gandham Sreeramamurty and Sri.Irrinki Narasimhamurty who are popularly known as " Sreerama Narasimha Murty Kavulu " as our Court Poets. Hereafter they are entitled to the privileges of our Court.

Gadwal,
1-3-1945.

Youvaraja Saheb of Gadwal.
( For Maharani Saheba of Gadwal )



శ్రీ రా మ నృ సిం హ మూ ర్తు లు

శ్రీమ ద్భద్రక్ష్మా దార్తిసంహరణక్ష ద్యోగో యయో ర్వర్తతే
లోకారాధనతత్పరౌ ఖలజనవ్యాపాదనవ్యాపృతౌ
లోకేఽస్మి న్నవతేరతు స్సుమహితౌ శాంతోగ్రరూపౌ చ యౌ
తౌ శ్రీరామ నృసింహ మూర్తి విలస త్సంజ్ఞా విమే తేతరాం॥

# విషయసూచిక

## సప్తమ స్కంధము.


| అధ్యాయము. | విషయము. | పుట. |
|---|---|---|
| 1 | జయవిజయశాపోదంతము | 1 |
| 2 | సుయజ్ఞోపాఖ్యానము | 6 |
| 3 | హిరణ్యకశిపు తపోనిష్ఠ — వరప్రాప్తి | 11 |
| 4 | హిరణ్యకశిపు విజృంభణము – ప్రహ్లాదచరిత్ర ప్రారంభము | 15 |
| 5 | హిరణ్యకశిపుకృతప్రహ్లాదతర్జన భర్త్సనాద్యభివర్ణనము | 19 |
| 6 | ప్రహ్లాదోక్తదైత్యబాలక హితబోధ | 25 |
| 7 | నారదోపదేశ కథనము | 28 |
| 8 | శ్రీమన్నృసింహమూర్త్యవతారఘట్టము — హిరణ్యకశిపు వధ | 33 |
| 9 | ప్రహ్లాదకృత నృసింహస్తుతి | 40 |
| 10 | త్రిపురాసుర సంహారఘట్టము | 46 |
| 11 | వర్ణధర్మోపదేశము | 53 |
| 12 | ఆశ్రమధర్మోపదేశము | 55 |
| 13 | ప్రహ్లాదాజగర సంవాదము | 58 |
| 14 | గృహస్థధర్మోపదేశము | 61 |
| 15 | మోక్షలక్షణ కథనము | 65 |


## అష్టమ స్కంధము.


| | | |
|---|---|---|
| 1 | స్వాయంభువాది మన్వంతరాభివర్ణనము | 71 |
| 2 | గజేంద్రమోక్షణ కథాప్రారంభము | 74 |
| 3 | గజేంద్రకృత హరిస్తుతి | 77 |
| 4 | కరిమకర శాపవిమోచనము | 81 |
| 5 | క్షీరసాగరమథన కథనము | 83 |
| 6 | అమృతోత్పాదనోద్యమము | 88 |
| 7 | కూర్మావతారకథ – శివకృత హాలాహలభక్షణము | 92 |
| 8 | ఐరావతాద్యుత్పత్తి కథనము | 96 |
| 9 | జగన్మోహినీ వేషధారణము | 100 |
| 10 | దేవాసురయుద్ధ ప్రారంభము | 103 |
| 11 | దేవ విజయము | 107 |
| 12 | మోహినీ దర్శనజాతశ్శివమనో విభ్రమము | 112 |
| 13 | వైవస్వతాది మనువృత్తాంతము | 116 |
| 14 | జగత్పరిపాలన క్రమము | 119 |
| 15 | బలియుద్ధయాత్ర – వామనావతారకథా ప్రారంభము | 120 |
| 16 | అదితిప్రార్థనము | 123 |

| అధ్యాయము. | విషయము. | పుట. |
|---|---|---|
| 17 | పయోవ్రత విధానము | 127 |
| 18 | వామనమూర్త్యావిర్భావ ఘట్టము | 130 |
| 19 | యాచ్ఞ | 133 |
| 20 | బలి నిశ్చయము | 138 |
| 21 | త్రివిక్రమ విజృంభణము | 142 |
| 22 | బలి సుతలప్రవేశము | 145 |
| 23 | ఇంద్రోపేంద్ర స్వర్లోక గమనము | 149 |
| 24 | మత్స్యావతార కథాప్రారంభ ఘట్టము | 152 |


## నవమ స్కంధము.


| | | |
|---|---|---|
| 1 | సూర్యవంశాభివర్ణనము – సుద్యుమ్నోపాఖ్యానము | 159 |
| 2 | పృషధ్ర చరిత్రము | 163 |
| 3 | శర్యాతిచరిత్రము – సౌకన్యోపాఖ్యానము | 166 |
| 4 | అంబరీషోపాఖ్యానము | 169 |
| 5 | దుర్వాసో గర్వభంగము | 176 |
| 6 | ఇక్ష్వాకువంశానుక్రమము – మాంధాతృప్రభృతిక చరిత్రము | 179 |
| 7 | హరిశ్చంద్రోపాఖ్యానము | 184 |
| 8 | సగరచక్రవర్తి కథాప్రారంభము | 186 |
| 9 | గంగావతరణము – ఖట్వాంగాది చరిత్రాభివర్ణనము | 189 |
| 10 | శ్రీరామచరిత్రము | 194 |
| 11 | శ్రీరామ కృతాశ్వమేధయాగవర్ణనము | 201 |
| 12 | శ్రీరామపుత్ర కుశాన్వయాభి వర్ణనము | 205 |
| 13 | నిమివంశానుక్రమణిక (జనకచరిత్రము) | 206 |
| 14 | చంద్రవంశేతిహాసము (పురూరవశ్చరిత్రము) | 208 |
| 15 | పరశురామచరిత్ర | 213 |
| 16 | విశ్వామిత్ర చరిత్ర | 217 |
| 17 | రజి చరిత్ర | 220 |
| 18 | యయాతి చరిత్ర | 222 |
| 19 | బస్తోపాఖ్యానము | 226 |
| 20 | భరత చరిత్ర | 229 |
| 21 | రంతిదేవ చరిత్ర | 232 |
| 22 | కురువంశ కథనము | 235 |
| 23 | యదువంశ చరిత్రము | 239 |
| 24 | వసుదేవ వంశానుక్రమణిక | 242 |


---

శ్రీరస్తు.

శ్రీరామకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్రభాగవతము

శ్రీరామ నృసింహమూర్తి కవులు:—



విజయదుందుభి

వ ద్భద్రికృ దార్తిసంహరణకృ ద్యోగో యయో ర్వర్తతే
లోకారాధనతత్పరా ఖలజనవ్యాపాదనవ్యాపృతౌ
లోకేఽస్మి న్నవతేరతు స్సుమహితౌ శాంతోగ్రరూపే చ యౌ
తౌ శ్రీరామ నృసింహమూర్తి విలస త్సంజ్ఞౌ జయేతేతరామ్॥

## సప్తమస్కంధము

### అధ్యాయము 1.

జయ విజయ శాపోదంతము

రాజు:—

క. యమివర! సముఁడును భూతచయములకుఁ బ్రియసఖుఁడునై సహరి భగవంతుం
డమరవిరోధుల దాను వి,షముఁడుంబలె నేలఁ దునిమె శక్రార్థంబై. 1

శా. ఎన్నన్ లేశముఁగూడ నిర్జరులతోఁ జేయర్థమున్ లేదు సా
క్షాన్నిశ్శ్రేయసరూపకుండుఁ ద్రిజగత్కల్యాణదుండైన శ్రీ
మన్నారాయణమూర్తికిన్ మునివతంసా! లేవు దైత్యాళితో
విన్నాణంబుననొప్ప నా హరికి విద్వేషమ్ము నుద్వేగమున్. 2

గీ. ఓమహాభాగ! యో శుకయోగివర్య!, ప్రకృతిసాక్షినారాయణుగుణములయెడ
నిట్టి పెనుసందియంబు మాహృదయసీమఁ, గలిగె సద్దాని ఛేదింపవలయు నీవ. 3

శ్రీ శుకుఁడు:—

చ. స్ఫురదురుభాగధేయ! నృపపుంగవ! యద్భుతరూపమైన శ్రీ
హరిచరితంబు నీవడిగితయ్యది తెల్పఁగదయ్య భక్తి శ్రీ

వరునెడఁ బెన్చు భాగవతసర్వ్య మహామహిమంబు పుణ్యమున్
బరమమున్నై నుతింపఁబడుసనారదముఖ్య తపోధనాళిచేన్. 4

వ. కావునఁ గృష్ణద్వైపాయన మునికి నమస్కరించి హరికథావిశేషంబు నుడివెద
నాకర్ణింపుము. 5

సీ. ప్రకృతికింబరుఁడగుసభగవంతుఁడౌహరి, యవ్యయుఁడు నజుండుసనగుణుఁడయ్యు
స్వీయమాయాగుణావిష్టుఁడై తా బాధ్య, బాధకతాహేతుసభావమొందుఁ
బ్రకృతిగుణంబులై సపరఁగు సత్త్వరజస్త, మంబులుఁ దలఁప నాసత్మ కవి లేవు
వృద్ధి వినాశంబుసలేక కాలంబున, వానికిఁ గలుఁగవుసహార్థివేంద్ర!

గీ. సత్త్వజయకాలమందునిసర్జరులబుషుల,రజముఁబెంపొందనసురులఁస్రగమతదమము
బెరుగయక్షరక్షుస్సులన్సవిభుఁడుతాను, గూడుచుండుఁదత్కాలానుసగుణ్యముగను.

క. జ్యోతిఃప్రభృతులువలె సం,ఘాతంబుననుండి విభుఁడుసకాఁ డెప్పుడు పృథ
గ్భూతుఁడు మథించి యాత్మను, జాతురి నాత్మస్థుఁ దెలియఁగజాలుదురు బుధుల్.

ఉ. జీవులకుం బురంబుల సృజింపఁ బరేశ్వరుఁ డాత్మమాయ ని
చ్ఛావిధి సృష్టిఁ జేయును రజంబును జిత్రములైనయందు బ
ల్పెవ రమింప సత్త్వము సృజించును వానిని సంహరింపఁగా
భావముగల్గుచున్ దమముఁబ్రౌఢి సృజించును వేఱువేఱుగన్. 8

వ. నరేంద్రా! సత్యకరుండగు పరమేశ్వరుండు ప్రకృతి పురుషుల కాశ్రయంబై
ప్రవర్తమానంబగు కాలంబు సృజించు. అందందు సతం డుభయస్థిం బొందు.
లింగరూపుఁడగు న య్యీశునకుఁ దద్గుణంబులుం గలవు. రాజేంద్రా! ఈ
కాలంబు సత్త్వసంవర్ధకంబైనది కావునఁ బరమేశ్వరుండు సురానీకమునకు జయో
త్సేకంబుఁ గల్గించు. సురప్రీతికరుండై పృథుయశుండగు నా యీశుండు తత్ప్రతి
పక్షులగు నసురులఁ గసిమసంగు. స్వసృష్టంబగు విశ్వంబునకు స్థితిరక్షావిధానా
ర్థంబు పౌనఃపున్యంబున సత్త్వగుణంబును సురగణంబును బెంపొందించు. 9

మత్తకోకిల. రాజచంద్రుఁ డజాతవైరి సుసర్శినస్తము నారమున్
రాజసూయమహాధ్వరంబుసఁబ్రశ్నమిచ్చె యొనర్ప న
వ్యాజసత్కృపఁ బావనం బితిసహాస మొక్కఁడు సెప్పె వి
భ్రాజమానయశోవిశాల! ధరావరా! విను దానినిన్. 10

మ. క్రతురాజంబగు రాజసూయమున లోకాధీశ్వరుండైన య
చ్యుతునం దద్భుతరూపచేదినృపసాయుజ్యంబు నీక్షించి పాం
డుతనూజుం డటనున్న నారదమునీంద్రుంబ్రొంగాంచి యత్యంత వి
స్మితచిత్తుండయి యిట్లు ప్రశ్న మొనరించెన్ మౌను లాలింపఁగన్. 11

ధర్మరాజు:—

మ. ఇది యత్యద్భుతమయ్యెఁగాదె యహహా! యెన్నంగ నేకాంత భ
క్త దురాపంబగు వాసుదేవ పరతత్త్వప్రాప్తి విద్వేషియున్
మదసంయుక్తుఁడునైన చేదిపతికిం బ్రాపించె మౌనీంద్ర! యే
త దుదంతంబు నెఱుంగ మాకు మది నుత్సాహంబు రేకెత్తెడిన్. 12

క. తాపసవర! భగవన్నిం, దాపరతం బరఁగు వేనధరణీజానిన్
గోపించి ద్విజులు నారక, కూప పతితుఁగా సలుపరో! మున్నెన్నన్. 13

గీ. నారదా! తొక్కుపల్కులనాటఁగోలె, మూఢచిత్తుఁడు దమఘోషపుత్రకుండు
పాపమతి దంతవక్త్రుఁడున్ వాసుదేవు,నందు నేఁడును మత్సరాయత్తులుగద. 14

గీ. అవ్యయున్ విష్ణుదేవు బ్రహ్మస్వరూపు,సారెకున్ దూఱుచుండు నాజాల్ములకును
శ్వేతకుష్ఠంబు పుట్టదు జిహ్వయందు, నంధతామిస్రమేనియు నలముకొనదు. 15

ఉ. పాపులు వీరలేల భగవంతుఁడు దుర్గ్రహధాముఁడైన యా
శ్రీపతియం దిటుల్ లయముఁ జెందిరి? లోకములెల్లఁ జూడ నం
చీ పగిదిన్ గలంగి భ్రమియించెడు నాదగు బుద్ధి గాలిచే
దీపపు టర్చియుంబలెను దీనికి హేతు వదేమొ తెల్పుమా. 16

క. సురముని నారదుఁడు యుధిష్ఠిరు నుడి నాలించి ప్రీతచిత్తుండగుచున్
పరమాదరయుతుఁడగు నా, ధరణీపతి కిట్టులను సదస్యులు వినఁగన్. 17

నారదుఁడు:—

వ. నిందయును స్తుతియును సత్కారంబును ధిక్కారంబును కళేబరవిషయంబులె. ఇవి యవివేకంబున నాత్మకుఁ గల్పింపఁబడు. భూతంబులకు నహమ్మమత్వరూపకం బగు బుద్ధివైషమ్యంబు తదభిమానంబున జనించు. దానం జేసి దండపారుష్యంబును నిందయుఁ గలుగు. అభిమానంబునం జేసియ కళేబరనాశంబుఁ బ్రాణినాశంబుగాఁ దలంపంబడు. అభిమాన రహితుండగు పరమాత్మకు వైషమ్యాభావంబున నిందాస్తుతులు కలుగకుండు. 18

గీ. కానఁ బగనైన భక్తియోగముననైన
భయముచేనైన స్నేహంబువలననైనఁ
గామముననైన మనము యుక్తంబుఁ జేయ
నగును హరియందు దాన నన్యంబుఁ గనఁడు. 19

క. వైరానుబంధమున నరుఁ, డేరీతిన్ దన్మయత వహించునొ పొందన్
నేరఁడలు భక్తియుక్తిమ, హారాజా! మద్వినిశ్చయం బిది వింటే? 20

చ. భ్రమరముచేతఁ గుడ్యమునబట్టినిఁ బ్రత్యవరుద్ధమౌచుఁ గీ
టము భయవైరయుక్తిని నెడంద స్మరించుచు దానిఁ దత్స్వరూ
పముఁ గొనున ట్లజుండు భగవంతుఁడునైన ముకుందునందు ద్వే
షమునఁ బ్రిపూతులై యతనిసంస్మృతి వారలుఁ బొంది రా హరిన్. 21

ఉ. కొందఱు కామయోగమునఁ గొందఱు ద్వేషమునన్ భయంబునన్
గొందఱు భక్తియోగమునఁ గొందఱు స్నేహమునన్ మనంబు గో
విందునియందు నెక్కొలిపి పెక్కురిటుల్ తదఘంబుడించి యా
నంద నికేతనంబయి తనర్చెడు తద్గతిఁ బొంది రిమ్మలన్. 22

ఉ. కామమునన్ వ్రజాంగనలుఁ గంసుఁడు భీతిని జైద్యముఖ్యులా
భూమిపతుల్ విరోధమున భూధవ! వృష్ణులు బాంధవంబునన్
మే మురుభక్తియోగమున మీరలు స్నేహముచేత నా పరం
ధాముని గేళిమర్త్యుని సదా స్మరియింతుము వాసుదేవునిన్. 23

క. ఏవురిలో వేనుఁడు కాఁ, డేవాఁడును బురుషుఁడైన యీశువిషయమై
కావున మనంబుఁ జొనుపఁగ, నా విష్ణునియం దెదే నుపాయముచేతన్. 24

గీ. పాండవా! చైద్యుఁడున్ దంతవక్త్రుఁడుఁ దల
పోయఁగా మీకు మాతృష్వసేయులుగద
విప్రశాపంబునన్ బదవిచ్యుతులగు
విష్ణుపార్షదముఖ్యులు వీరు సుమ్ము. 25

ధర్మరాజు:—

ఉ. పరమమునీంద్ర! యల్ల హరిపార్షదులన్ స్పృశియించు శాప మె
వ్వరిదది యెట్టిదయ్య? హరిపాదపయోజములన్ భజించుచున్
నిరతము నవ్వైకుంఠపురి నివ్వసియించెడు శుద్ధసత్త్వ భా
స్వరులకు నట్టిశాప మెటు సంభవమయ్యె? నెఱుంగఁ జెప్పుమా. 26

నారదుఁడు:—

చ. వినుము యుధిష్ఠిరాఖ్య పృథివీరమణా! యల బ్రహ్మదేవు నం
దనులు సనందనాదిమునినాయకు లిమ్మల నీ జగత్త్రియం
బునఁ జరియించుచుండి యలవోక నొకానొకనాఁడు విష్ణుదే
వునిదగు నవ్వైకుంఠపురమున్ దరిసింపఁగఁ బోయి రమ్మడిన్. 27

గీ. తలఁపఁ బూర్వులకుం బూర్వజులును బంచ, షాబ్దడింభకసములు దిగంబరులగు
వారి బాలురఁగా నెంచి ద్వారపాలు, రడ్డగించిరి లోనికి నరుగకుండ. 28

ఉ. పాండవ! క్రుద్ధులై మునులు వారికి శాపము నిచ్చి రంత ను
ద్దండ రజస్తమోవిరహితంబగు శ్రీహరి పాదమూలమం
దుండఁగ రాదు మీర లిఁక నో జడులార! బిరాన నిద్ద యిం
దుండి దురంతమా యసుర యోని జనింపుఁడు పొండటంచిటుల్. 29

క. అని యిట్లు శప్తులై స్వభ, వనమున నుండి పతితులగు వారిని గృప న
మ్మును లనిరి 'మూఁడు జన్మలఁ, బున స్స్వపదలబ్ధి మీకుఁ బొసఁగు న'టంచున్. 30

గీ. వారలిరువురు దితికిఁ గుమారులగుచు, దైత్యదానవలోక సంస్తుత్యులైరి
జ్యేష్ఠుఁడు హిరణ్యకశిపుఁడు క్షితితలేశ!, యవరజుండు హిరణ్యాక్షుఁ డయ్యె నందు.

క. నరసింహరూపుఁడగు శ్రీ, హరి చంపె హిరణ్యకశిపు నవనీభాగో
ద్ధరణంబుఁ జేయ మాయా, కిరి యైన యతఁడె కసిమసఁగ హిరణ్యాక్షున్. 32

గీ. అచ్యుతప్రియుఁడైన ప్రహ్లాదుఁ బుత్రుఁ, గ్రూరతరముగ హింసింపఁ గోరి యా హి
రణ్యకశిపుఁడు బహుప్రకారంబులైన, యాతనలఁ బెట్టె నిజమృత్యుహేతుఁ బుత్రు.

గీ. సర్వభూతాత్మభూతుఁ బ్రశాంతుని సమ, దర్శనున్ విష్ణుతేజోభిసన్వయుక్తుఁ
దనయుఁ బ్రహ్లాదు నానావిధంబులైన, యుద్యమముల దైత్యుఁడు జంపనోపఁ డయ్యె.

గీ. పిదపఁ బొడమిరి రాక్షసుల్ విశ్రవునకుఁ, బుత్రకులు కైకసియను పొలఁతి యందు
సర్వలోకోపతాపంబు సల్పుచుం బ్ర, ఖ్యాతిఁ గొనిరి రావణకుంభకర్ణులనఁగ. 35

గీ. అందు రాఘవుఁడై హరి యవతరించి, శాపముక్తికినై వారి సంహరించె
వినఁగలవు నీవు శ్రీరాము విక్రమంబు, భూవరేణ్య! మార్కండేయ ముఖమునుండి.

క. జగతీశ్వర! వారే యర, యఁగ నీ మాతృష్వసేయు లగు క్షత్రియులై
రి గదాధర చక్రహతిన్, దెగ నఘములు శాపముక్తిని బొందిరిటుల్. 37

గీ. ప్రబల వైరానుబంధ తీవ్రతరమైన, ధ్యానమున వాసుదేవ సాత్మ్యత్వ మిట్లు
వీరు పొందింపఁబడి వెండి విష్ణుదేవు, పార్శ్వముం జేరి రల విష్ణుపార్షదులుగ. 38

ధర్మరాజు: —

గీ. విబుధముని! మహాత్ముఁడుం బ్రియుఁడు నైన, పుత్రునందు విద్వేషంబు పూన నేల?
అచ్యుతాత్మత దేనఁ బ్రహ్లాదునకది, యెటు కలిగెనో నాకు వచింపుమయ్య. 39

## అధ్యాయము 2.

### సుయజ్ఞోపాఖ్యానము

నారదుఁడు:—

క. ప్రకటితకోపుఁడు హరి వీఁ, గక తన భ్రాతను వధింపఁగాఁ దెలిసి హిర
ణ్యకశిపుఁడు రోషశోకము, లకు గుఱియై మనమున మిగులఁ బరితపించెన్.

సీ. పృథులరోషమున ఘూర్ణిల్లుచు సందష్ట, దంతచ్ఛదుండై యుదగ్రకోప
జాజ్వల్యమానలోచనయుగళమున ధూ, మ్రంబైన యభ్రభాగంబుఁ గనుచు
భీషణదంష్ట్రిలబెగడుఁ బుట్టించెడు, దృష్టిచేఁ గడు దుర్నిరీక్ష్యుఁ డగుచుఁ
గుటిలకరాళ భ్రూకుటియుక్తముఖుఁడయి, భయదోగ్రశూలంబుఁ బైకి నెత్తి

గీ. కొల్వుకూటంబునం గలక్రూరదాన, వులను గలయంగఁ గనుఁగొని చలము మీఱ
నిత్తెఱంగునఁ బల్కె భ్రాతృవధజనిత, శోకరోషమ్ముల మనంబు వ్యాకులపడ. 41

వ. త్రిమూర్ధ, త్ర్యక్ష, శంబర, శతబాహు, హయగ్రీవ, నముచి, పాక, ఇల్వల, విప్ర
చిత్తి, పులోమ, శకునాది దానవదైతేయులారా! నావచనంబు వినుఁడు. శ్రవణా
నంతరం బెల్లరును వైళంబ మదనుశాసన ప్రకారంబుఁ గావింపుఁడు. పార్ష్ణిగ్రాహుం
డగు హరి సహాయంబునం జేసి క్షుద్రులైన శాత్రవులచే నాకుఁ బ్రియుండును,
సఖుండును, భ్రాతయునగు హిరణ్యాక్షుఁడు వధింపఁబడియె. 42

చ. అనిశము బాలకుండువలె నస్థిరచిత్తుఁడు భూరితేజుఁ డ
య్యును గుహనాస్వరూప కిటియున్ దనుఁ గొల్చెడువారిఁ గొల్చువాఁ
డు నగు వికుంఠు మామక పటూజ్జ్వలశూలముచేతఁ గంఠమున్
దునిమి తదీయశోణితముతో రుధిరప్రియు భ్రాతఁ దన్పుదున్. 43

మ. అహితుండున్ గపటుండునైన హరి యిట్లంతంబునొందన్ దమం
త హరిప్రాణులుకాన వేలుపులు తోనన్ గృత్తమూలావనీ
రుహశాఖాపటలంబులుంబలెను నిర్యాలుల్ నిరాలంబులై
బహుళక్లేశములంది శోషిలుదురే భంగిన్ విలోకించినన్. 44

సీ. అరుగుఁడీ మీరు బ్రహ్మక్షత్రసంవర్ధి, తమయి పరంగు భూతలముఁ జేర
సమయింపుఁడీ తపస్స్వాధ్యాయ యజ్ఞదా, నవ్రతపసులై తనరెడు వారి
నచ్యుతుండు ద్విజక్రియామూలభూతుఁడున్, యజ్ఞధర్మమయుండు నగుపురుషుఁడు
సతతంబు దేవర్షి పితృభూతములకును, ధర్మంబునకు నాస్పదంబుకాన

గీ. ద్విజతతులు గోగణంబులు వేదములును, దలఁపవర్ణాశ్రమాచార ధర్మములును
నెనయు నెందెందు నాయయి జనపదముల, బుగ్గిఁ జేయుఁడు పెల్లగింపుఁడు
గెడపుఁడు. 45

క. అని ముదలయిడిన తమ యొడ, యని యాదేశంబు దైత్యు ƒ లాదృతిని శిరం
బునఁదాల్చి రణప్రియులై, టను గావించి రపుడు జగ ƒ దమ్ముఁ బ్రజలతోన్. 46

సీ. గ్రామపురవ్రజా ƒ రామాశ్రమోపవ, నాకరక్షేత్రకో ƒ ద్యానములను
పట్టణఖేటక ƒ ర్వరఘోషముల దహించిరి కొందఱగ్ని ని ƒ శ్శేషముగను
కొందఱు ప్రాకార ƒ గోపురసేతువుల్, త్రవ్వివైచిరి ఖని ƒ త్రములఁ గోడఁ
గొందఱు పెనుగండ్ర ƒ గొడ్డళ్ల ఛేదించి, రుపజీవ్యవృక్షస ƒ ముత్కరములఁ

గీ. కొంద ఱుద్ధతి మండెడు ƒ కొఱవులఁ గొని
దహన మొనరించి రొగిఁ బ్రజా ƒ గృహచయముల
నిట్లు దైత్యులకు లోక ƒ మిడుములఁ బడ
సురలు దివివీడి కనరాక ƒ తిరిగిరి భువి. 47

గీ. అంతట హిరణ్యకశిపుఁ డ ƒ త్యంతదుఃఖ
తాత్ముఁడై మృతుఁడైన భ్రా ƒ తకుఁ దిలోద
కాదుల నొసంగియున్ దన ƒ సోదరాత్మ
జులను సాంత్వనవాక్కులఁ ƒ గలఁకఁ దేర్చె. 48

వ. మఱియు శకుని, శంబర, ధార్ష్ట, వృక, కాలనాభ, మహానాభ, హరిశ్మశ్రు,
మదోత్కచులను, దన్మాతయగు వృషద్భానువును, స్వమాతయగు దితిని మధుర
వాక్యంబుల దేశకాలజ్ఞుండగు నసురేశ్వరుం డూరడించుచు నిట్లుపలికె. 49

హిరణ్యకశిపుఁడు:—

మ. జనయిత్రీ! సుతులార! యోమరదలా! ƒ స్వాంతంబులన్ వీరవ
ర్యునకై శోకముఁబొందఁబోకుఁ డిదియున్ ƒ యుక్తంబుఁగా దెన్నఁగన్
వినుఁడీ! శూరుల కీప్సితంబెయగు వి ƒ ద్వేష్యాభిముఖ్యంబునన్
ఘన సంగ్రామతలంబునన్ వధము శ్లా ƒ ఘ్యంబౌనుఁడీ యెంతయున్. 50

చ. భ్రమ విడువుండు మీరు చలి ƒ పందిలియందలి పాంథులట్లు దై
వముకతనన్ స్వకర్మములఁ ƒ బట్టియొకా జనులొక్కచో సుయో
గము నొకచో వియోగమును ƒ గ్రన్ననఁబొందుచు నుంద్రు చూడ ధీ
రమతులు దీనికై కలవ ƒ రంపడ రించుకయేని నాత్మలన్. 51

గీ. ఆత్మ నిత్యుండు సర్వజ్ఞుఁ ƒ డవ్యయుండు, సర్వమయుఁడును శుద్ధుఁడీ ƒ శ్వరుఁడుపరుఁడు
స్వీయమాయన్ గుణములసృ ƒ జించుచు గుణ, సంగమునఁ జేసి తాలుచు ƒ
లింగతనువు. 52

చ. తిరిగెడుకంటితో వసుమతీ వలయంబది యెల్ల దిర్దిరం
దిరిగెడునట్లుఁ దోఁచెడు గతిన్ గదలాడుజలంబుతోడ లోఁ
దరువులు సంచరించెడు విధంబునఁ దోఁచెడుభంగి భ్రాంతి సం
సరణపరీవృతుండయిన చాడ్పున నాత్మయుఁ దోఁచుచుండెడున్. 53

గీ. మనమిటు గుణములన్ భ్రామ్యమాణమగుడు
నవికలుండయి పురుషుఁడో యంబ! వింటె
లింగయుక్తుండువోలె నలింగుఁడయ్యు
నా మనము తోడ సామ్యంబు నందుచుండు. 54

గీ. లింగవిరహితుఁడయ్యును లింగదేహ, భావనమె యాత్మకై యవిపర్యయంబు
నాగిఁ బ్రియాప్రియయోగ వియోగరూప, మైనదియ కర్మసంసృతి
యనఁగఁబడును. 55

వ. అమ్మా! సంభవంబును, వినాశంబును, శోకంబును, అవివేకంబును, చింతయు,
వివేకస్మృతియు బహువిధంబులై యుండు. 56

క. వినుఁ డుదహరింతు రిట బుధ, జనులు యమప్రేతబంధుసంవాదాత్మం
బనవద్యమునైన పురాతనేతిహాసమును మీకుదాని దెలిపెదన్. 57

క. అలఘౌశీనరదేశం, బుల నొప్పు సుయజ్ఞుఁడనెడి భూపాలుఁడు శ
త్రులచే నిహతుండయ్యెన్, గలనన్ దద్జ్ఞాతు లతని కడఁ జేరి రటన్. 58

సీ. రత్నవర్మము విశీర్ణతఁ జెంద సర్వాభ,రణములు స్రజములు భ్రంశ మొంద
హృదయంబు శరవినిర్భిన్నంబుగాఁగ దేహంబు నసృగ్విలిప్తంబుగాఁగ
స్రస్తలోచనుఁడయి సరభసదష్టదం, తచ్ఛదుండగుచు మూర్ధజములెల్లఁ
జెదరంగఁ బెంధూళిచే ముఖాంభోజంబు, మునుఁగువడన్ భుజంబును గయిమవు

గీ. దునిసిపడ నాహవక్షోణి దుర్విధినటు, సల్పఁబడ్డ యుశీనరేశ్వరుని బతినిఁ
జూచి దుఃఖితలై మహిషులు కరముల, నురము బాదుకొనుచు నేడ్చి రమ్మలికల.

సీ. అక్కటక్కట! నాథ! హతులమైతిమటంచుఁ, గరముల నారీతి నురము బాదు
కొనుచును సారెకు నాతని పదంబులఁ బడి, బిట్టేడ్చుచున్ దైన్య ముట్టిపడఁగ
కుచతటీసంలిప్తకుంకుమారుణబాష్ప,ముల నాథు పాదకమలముఁ దడుపు
చాక్రందన ధ్వని లోకసమంటఁ జేసి, తుకజనులకును దుఃఖముఁ గొలుపుచు

గీ. నదవదయి కేశపాశంబులాభరణము, లెల్ల వీడ్పాటుఁ జెందఁగ నిత్తెఱఁగున
న య్యుశీనరనాథు ప్రేయసులు కుమిలి, కుమిలి విలపించి రమ్యోదఘోరగతిని.

చ. అవుర! యుశీనరప్రజలకందఱ కింతకు మున్న వృత్తి సం
డవయి తనర్చు నీ విపుడిటన్ బెనుశోకభరంబుఁ గూర్చు వాఁ

డవుగ నిటుల్ కృపారహితుఁడై విధిచే నొనరింపఁబడ్డవాఁ
డ వకట! మా కగోచరుఁడవై తివి దృష్టికిఁ బ్రాణనాయకా! 61

చ. దయితుఁడవున్ విభుండవుఁ గృతజ్ఞుఁడవున్ సుహృదుండవౌదు వీ
వ యధిప! మాకు నిన్ను విడనాడి క్షణంబిట నిల్వనేర్తు మె
ట్లయయొ! భవత్పదాంబుజ సమర్చలుఁ జేసెడిమమ్ము దండితా
రి! యనుగమింపఁగాఁ గనికరింపుము నీ చనుచోటికిం బ్రభూ!. 62

గీ. అనియిటుల్ మృతుఁడైన నాథునిపయిఁబడి, బిట్టు విలపించుచు దహనవిధికినై స
నిచ్చగింపక వలవంతనింతులుండు, నంతలో నర్కభగవానుఁడస్తమించె. 63

గీ. ప్రేతభూమిని విలపించు ప్రేతబాంధవావళుల పరిదేవనమాలకించి
బాలకుండయి స్వయముగ వచ్చి యముఁడు, వారినెల్లరఁ బొడఁగాంచి పలికెనిట్లు.

చ. అకట! సతంబు లోకగతి నారయుచుండెడునట్టి యీ వయో
ధికుల విమోహమెట్టిదొ మతిన్ బరికింప సధర్ములయ్యుఁ బా
యక యెట నుద్భవించెఁ దొలి నచ్చటికే చను మర్త్యుఁగూర్చి యీ
రక పృథుశోకతప్తులయి రాయిడిఁ బొందుచునుండి రీగతిన్. 65

చ. పితరులచేఁ ద్యజింపఁబడి పిన్నలమయ్యును గుందఁబోము ధ
న్యతముల మేముగాదె యహహా! బలహీనులమైన మమ్ము ను
గ్రతర వృకాదిజంతునికరంబులు బల్మి గ్రసింపకుండ స
మ్మతిమెయి గర్భమం దెవఁడు మానక ప్రోఁచు నతండ ప్రోవఁడే? 66

ఉ. ఏ విభుఁ డీ జగంబు సృజియించును బెంచును సంహరించు మా
యావిధి నింతులార! వినుఁడా భగవంతునకున్ జరాచరం
బై విలసిల్లు విశ్వమిది యాటపదార్థముగాఁ దలంపుఁడీ
యే విధిఁగన్న వాఁడొకఁడె యీశుఁడు నిగ్రహ సంగ్రహంబులన్. 67

ఉ. దైవ సురక్షితం బది పథంబున పీడిన నుండు లెస్సఁగన్
దైవహతంబు గేహమున దాచినదయ్యు వినాశమొందెడున్
దా వనినైనను బ్రతుకు దైవసమీక్ష ననాథజీవియున్
దైవహతిన్నశించు బహుధా పరిరక్షితుఁడయ్యు లోఁగిటన్. 68

ఉ. ఆయయి లింగదేహజములై పెనుపొందెడునట్టి కర్మలన్
గాయములెల్ల నుత్పతిలుఁ గాలవశంబున నాశమొందు నిం
తే యిదియెన్న నాత్మ ప్రకృతిస్థితమయ్యును దద్గుణంబులం
దోయ విలక్షణంబగుచు నున్కి నిబద్ధముకాదు వింటిరే? 69

చ. పురుషునకుం దలంపఁ బృథుగ్ర మోహజమైన శరీరమిద్ది యో
వరసతులార! భిన్నమగుఁ భౌతికగేహముగా నెఱుంగనౌ
నరసి కనంగ దేహమిదియ్యాదక పార్థివ తైజసంబులన్
బరువడి సంభవించి యటుపై వికృతంబగుచున్ దుదిన్ జెడున్. 70

చ. అనలము దారుసంస్థితమయ్యయ్యు నెటుల్ దనరారు భిన్నమై
యనిలము సర్వదేహగతమయ్యుఁ బృథగ్గతినొప్పు నెట్టు లో
య్యా నభమునెట్లు సర్వగతమయ్యును సక్తము కాకయుండు స్వే
చ్ఛ నటులె యాత్మ సర్వగుణసంశ్రితుఁడయ్యు నసక్తుఁడయ్యెడున్. 71

చ. ఎవనికినైన విమూఢలయియాఱలు శోకము నందుచుండిరో
ధవుఁడు సుయజ్ఞనామకుఁ డతం డిచటం బడియుండెఁగాని దా
నెవఁడు ధ్రువంబుగా వినునో యెవ్వఁడొగిన్ బ్రతివాక్యమిచ్చునో
శ్రవణసుఖంబుగా నతఁడు ప్రాగ్గతి నిప్పుడు లేఁడు చూడఁగన్. 72

క. శ్రోతయుఁ బ్రతివక్తయుఁగా, దాతతమున్ మిగుల ముఖ్యమగు ప్రాణ మహో!
ఈ తన్వసువులకుం బరుఁడై తద్ద్రష్టయగు నాత్మయఖిలవిభుఁడగున్. 73

వ. భూతేంద్రియ మనోలక్షితంబులగు నానావిధ దేహంబులం బరమపురుషుండు స్వతే
జంబున భజించు. విసర్జించు. ఎంతపర్యంతం బాత్మలింగ దేహాన్వితంబగు నంతపర్యం
తంబు గర్మబంధంబగు. దానంజేసి దేహాత్మభ్రమ క్లేశరూపంబగు మాయాయో
గం బనువర్తించు. అనర్థంబులగు గుణాత్మక దేహంబులందు నర్థదృష్టియుఁదద్విషయ
క్తోక్తియు ననునిది మిథ్యారూపంబగు నభినివేశంబు. మనోరథంబుకరణి స్వప్నంబు
పగిదిని సర్వంబగు నైంద్రియికవిషయంబు ననిత్యంబె. నిత్యంబగు నాత్మనుగుఱించి
కాని యనిత్యంబగు దేహంబును గుఱించికాని తన్నిత్యానిత్యవిదులు శోకింపరు.
శోకించియు స్వభావం బన్యథీకరింప శక్యంబు గాదుగదా! 74

చ. ఖగసమవాయమారకుఁడుగా భగవంతునిచే నియోజితుం
డగు నొకలుబ్ధకుండు వనిఁ దుం దురులొడ్డి ప్రలోభనం బటన్
దగ నిడియెన్ గుళింగమిథునంబట దిగ్గుచుఁ గాననయ్యె నా
యుగళమునన్ గుళింగి వెరవొప్పఁ బ్రలోభిత యయ్యె బోయచేన్. 75

క. ఉరుకాలనియంత్రితయై, యురిత్రాటం జిక్కుకొన్న యయ్యగ్మలి నాప
త్పరిరబ్ధన్ గాంచి పొరిం, బొరి దుఃఖించెన్ గుళింగము హృదయసీమన్. 76

క. దీనుఁ డశక్తుఁడనై స్నేహానఁ గుళింగంబు మహిషిరై విలపించెన్
దా నిష్కరుణుఁడు దేవుఁడు, దీనన్ సతిని విపదంబుధిన్ ముంచె నిటుల్. 77

మ. కడుదీనుండ సతీవియుక్తుఁడను మోహఘూయుష్కుఁడన్ మందభా
గ్యుఁడనై దుఃఖముతోడ నొంటరిగ నయ్యో! యెట్లు జీవింతు ని
ప్పు డికన్ ఱెక్కలురాని శాబకగణంబున్ మాతృహీనంబు నే
వడిఁ బోషింపఁగలాడ దీను నను దేవా! వేగఁ గొంపోఁగదే. 78

గీ. అక్కటా! మందభాగ్యులైనయట్టి, నా నిసుఁగులు కులాయంబునందునుండి
మాతృదేవతకొఱకునై మనుత హెచ్చ, నెదురుజూచుచు నున్నవవె యడియాస.

ఉ. ఇమ్మెయి నశ్రుకంఠమయియెంతయు దుర్భరమౌ ప్రియావియో
గమ్మున నుమ్మలించుచునుగద్గదికన్ విలపించు నా కుళిం
గమ్మును బొంచియుండి యటఁగాలసమీరితుఁడోచుఁ దేజితా
గ్రమ్మగు నొక్క భీషణశరమ్మునఁ గొట్టెను వ్యాధుఁ డత్తటిన్. 80

గీ. ఇటుల మీరు నాత్మోపాయమెఱుఁగ కకట!, బుద్ధిమాలినవారయియముగుదలార!
పనవి విలపించుచుండి హాయనశతముల,నైనను స్వనాథునిన్ బడయంగలేరు. 81

హిరణ్యకశిపుఁడు:—

క. బుడుతం డుడుగక యపు డీ,నడువున నుడువుడును జ్ఞాతివర్గములు గడుం
గడు వెఱఁగుపడుచు నెంచిరి, నడునుం బొడమునదియుఁ జెడున దిదని యెదలన్.

క. అంతర్ధానముఁజెందెఁ గృ,తాంతుండిది తెల్పి యప్పుడ నుయజ్ఞధరా
కాంతునకు జ్ఞాతు లొనరిచి,రంతన్ వెసఁ బారలౌకికకార్యక్రియలన్. 83

చ. ఎడఁదల మీరలున్ బరులకేనియు నాత్మకునేని నార్తిమై
నడలగఁబోకుఁ డెన్న నెవఁడాత్మ యెవండు పరుం డెవండు స్వీ
యుఁడు పరకీయుఁడెవ్వఁ డయయో! స్వపరాభినివేశరూపమై
గడుకొను జ్ఞానమే ప్రబలకారణ మిచ్చట దేహికోటికిన్, 84

నారదుఁడు:—

క. అని తెలిపిన దైత్యాధ్య, క్షుని నుడి విని దితియుఁ దేటకొని సన్నుతమై
ఘనపుత్రశోక మాతుణ, మున విడి తత్త్వమునఁ జిత్తమును నెలకొలిపెన్. 85

---

## అ ధ్యా య ము 3.

### హిరణ్యకశిపు తపోనిష్ఠ – వరప్రాప్తి

నారదుఁడు: —

క. నరవర! హిరణ్యకశిపుఁడు, తిరముగఁ దన్నెందు నప్రతిద్వంద్వునిగా
నెరి నేకరాజుఁ గాఁగ న, జరామరుగఁ జేసికొనఁగ సంకల్పించెన్. 86

క. ఆదైత్యేంద్రుఁడు సలిపె మ, హాదారుణ తపము మందరాద్రిద్రోణిన్
పాదాంగుష్ఠధృతమహీ న, భోదృష్టియు నిశ్చలోర్ధ్వభుజుఁడును నగుచున్. 87

ఉ. భానుపరంపరన్ విలయభానుని కైవడి దైత్యనాథుఁ డ
న్యూనజటాచ్ఛటాంశువులనొప్పె సలారె సుదుర్నిరీక్ష్యుఁడై
పూనికతోడ నిట్లతఁడు భూరితపం బొనరించుచుండ స్వ
స్థానములన్ దివౌకసులు చయ్యనఁ జేరిరి విహ్వలాత్ములై. 88

చ. నదులు పయోధులున్ ధరణినాయక! సంక్షుభితంబులయ్యె న
య్యదనున భూమి ద్వీప విపినాద్రిసమేతముగాఁ జలించె బి
ట్టదవదలై పడెన్ గలయ నంతటఁ దారలు సగ్రహంబులై
పదియగు దిక్కులొక్క మొగిభగ్గనమండె భయప్రదంబులై. 89

క. ఆతని మూర్ధమున సము, ద్భూతమయి తపోమయము సధూమాగ్ని జగ
ద్వ్రాతములఁ గ్రింద మీఁదన్, వే తిర్యగ్గతిని బరిధవిల్లెన్ బెలుచన్. 90

క. దానఁ బరితప్తులై స్వ,స్థానము విడనాడి బ్రహ్మధామంబునకున్
దోనఁ జని బ్రహ్మదేవుని, తో నిట్లు వచించి రాక్రతుభుజులు వినతిన్. 91

మత్తకోకిల. దేవదేవ! జగత్పతీ! యతిదీప్త దైత్యతపఃప్రభా
వావధీరితమున్ సుతాపితమైన స్వర్గమునందు మే
మో విభూ! నిలువంగ సుంతయు నోపకుంటిమి దీనికిన్
నీవు శాంతినిఁ గూర్పఁ గాఁగదె నీక దీప్సితమైనచోన్. 92

వ. దేవా! నీకు నిత్యంబు బలిదానంబులొసంగు లోకంబులు నాశనంబు నొందక మున్న యిందులకుఁ దగిన వెరవూహింపుము. 93

గీ. అబ్జగర్భ! సుదుశ్చరమగు తపంబు, సల్పు నా దైత్యనాథు సంకల్పమిద్ది
నీకుఁ దెలియనియది కాదు నిక్కువంబ, యైననున్ విన్నవింతు మేమవధరింపు. 94

గీ. నిరుపమాన తపోయోగనిష్ఠను సృజి, యించి సచరాచరంబగు నీజగంబు
నెల్లపదవులకంటె నుత్కృష్టమైన, సత్యలోకం బధిష్ఠించె జలజభవుఁడు. 95

క. ఏధిత సుతపోయోగస, మాధిన్ గాలాత్మమును యథార్థమునగుటన్
సాధించెద నేనును నెం, తే ధృతిఁ దనరంగఁ బారమేష్ఠ్యపదంబున్. 96

క. మునుపటివలెఁ గా కిద్ధా, నిని దార్మారుగ నొనర్తు నేఁ గల్పాంత
మ్మునఁ గాలవినిర్ధూతము, లను వైష్ణవముఖ్యపదముల నుడువ నేలా? 97

క. అని యాతని సంకల్పం, బనివిందు మతండు దీనికై యుగ్రతపం
బొనరించుఁగాన నంమల, కనువగు విధి సలుపు మయ్య! యఖిలాధీశా! 98

ఉ. దేవ! జగత్పతీ! శతధృతీ! కరుణార్ద్రమతీ! శుభాకృతీ!
తావక పారమేష్ఠ్య మహితాసన మారయ గో ద్విజాళికిన్
వావిరి నెల్లకాలము భవంబును శ్రేయము భూతి క్షేమమున్
శ్రీ విజయంబునుం గలుగఁ జేయుట కేగద తేజరిల్లెడిన్. 99

ఉ. క్ష్మాపలలామ! యీపగిది సర్వ సుపర్వగణంబుచేత వి
జ్ఞాపితుఁడౌచుఁ దక్షిణమునన్ భృగుదక్షముఖాన్వితుండునై
యాపరమేష్ఠి యాత్మవిభుఁడంతట నేగె మహాతపోబలో
త్తాపిత లోకజాలుఁడగు దైత్యవరేణ్యుని యాశ్రమోర్వికిన్. 100

క. ప్రకటంబుగ నజుఁడు తృణా, దిక కీచక వల్మీక పరివృతిచ్ఛన్నుఁ బిపీ
లికలు పలలాస్రచర్మా, దికములఁ దినఁ దెలియకుండు దితిజుఁ గనఁడెఁటన్. 101

క. తపమున ముల్లోకంబులఁ, దపించు దైత్యవిభు నంబుధరపిహితుండౌ
తపనుగతి నెఱిఁగి యా దై, త్యపతికి ననె హంసవాహుఁడగు ద్రుహిణుఁడిటుల్.

బ్రహ్మ:—

క. లెమ్మింక లెమ్ము నీకు శు, భమ్మగు నో కాశ్యపా! తపస్సిద్ధుఁడవై
తిమ్మెయి వరదుఁడ వచ్చితి, జు మ్మిష్టవరమ్ము గోరు సురుచిర ఫణితిన్. 103

మ. దితిపుత్రా! పరమాద్భుతంబగు భవద్ధృత్సారము న్నేను జూ
చితి వహ్వారె! పిపీలికాసముదయాచీర్ణాఖిలాంగుండవై
ధృతిఁ దూలింపక యొప్పు నీ యసువు లస్థిశ్రేణులం బండియుం
డి తిరోధానముఁ జెందకున్నవి యహో! నీమేనఁ జిత్రంబుగన్. 104

శా. చేయన్ లేదుగదయ్య యిట్టి తపమున్ సిద్ధార్థ పూర్వర్షులున్
జేయన్ బోరిఁక భావిమానివరులున్ జిత్రంబెకా యారయన్
వేయేలా? శతదివ్యవత్సరములున్ నీరేనియున్ గ్రోలకే
తా యోగంబునఁ బ్రాణమున్ నిలుపఁగా దక్షుం డెవం డిద్ధరన్. 105

గీ. కాశ్యప! మనస్వులకును దుష్కరమునఁదగు, నీమహోద్యమమున నేజయింపఁబడితి
స్థిర తపోనిష్ఠుఁడవగు నీచేతమఱియుఁ, గెలువఁబడితిని దితిపుత్ర! కేవలముగ.

గీ. కావునన్ సకలాశీర్నికాయములను, నీకు నొసఁగెద నసురోత్తమా! కయికొను
మర్త్యజన్ముఁడవగు నీకమర్త్యుఁడనగు, నాదు దర్శన మఫలంబు కాదు చూవె.

నారదుఁడు:—

క. అని యాత్మభవుఁడు లోకా, వనపరుఁడు పిపీలికాదిభక్షితతను దై
త్యుని నతిమహిమము దివ్యం, బు నగు కమండలు గతజలమునఁ బ్రోక్షించెన్. 108

ఆ. అంత వెదురుపుట్టయందుండి యోజస్స, హోబలాన్వితుఁడును యువయు వజ్ర
సంహననుఁడు పుష్టసర్వావయవ సుసం, పన్నుఁడగుచును దితికొమరుఁడు లేచె.

గీ. తప్తకార్తస్వరాభుఁడేధఃప్రవర్ధి, తాగ్నిసదృశుఁడునై హిరణ్యకశిపుఁడవు
డంబరస్థుని దేవునిహంసవాహు, నంబరంబునఁ జూచె నజాతవైరి! 110

ఉ. కాంచి సలోచనోత్సవముగాఁగ శిరఃప్రణతుల్ ధరిత్రిఁ గా
వించియు వెండిలేచి వినయేరిత దృక్కుల నవ్విభున్ సమీ
క్షించుచు సమ్మదాశ్రులు మోయిన్ బులకల్ జనియింప నల్లనన్
వంచినమేన గద్గదికవాక్కుల దోయిలియొగ్గి యిట్లనున్. 111

హిరణ్యకశిపుఁడు:—

వ. దేవా! కల్పాంతమునఁ గాలసృష్టాంధతమశ్ఛటావృతంబగు నీజగంబు నెవ్వాఁడు స్వయంప్రకాశమానుండై యాత్మతేజంబున నభివ్యక్తంబుఁగావించు సృష్ట్యాదిశక్తిత్రయవంతంబగు నాత్మంబున నెవ్వాండీజగంబు సృజించు, బెంచు, నణంచు నట్టిరజస్సత్త్వధాముఁడవు పరాత్పరుఁడవు నగు నీకు నమోవాకంబులు. ఆద్యుండవు బీజభూతుండవు, విజ్ఞానరూపుఁడవు, ప్రాణేంద్రియమనోబుద్ధి వికారంబులఁ గార్యరూపుఁడవునగు నీకుఁ బ్రణామంబులు. నీవే ముఖ్యమగు ప్రాణరూపంబున స్థావరజంగమంబులకు నియంతవు, ప్రజాపతివి, చిత్తబుద్ధీంద్రియమనంబులకు నీశుండవు, భూతగణాశయంబులకు నధీశుండవు. నీవేచాతుర్హోత్రకవిద్యయగు వేదత్రయంబును సప్తతంతువులను విస్తరింపఁజేయుదువు, నీవేకరూపుఁడవు. ఆత్మవంతులకాత్ముఁడవు, అనాదివి, అనంతుఁడవు, అపారుఁడవు, కవివి, అంతరాత్ముఁడవు. నీవే యనిమిషంబగు కాలంబవు, లవాద్యవయవంబులన్ జనంబులయాయువుల క్షయింపఁజేయుదువు. మఱియు నీవు కూటస్థుండవు, పరమేష్ఠివి, అజుండవు, మహద్రూపుఁడవు, జీవలోకంబునకు జీవాత్మవు. నీకంటెఁ బరంబైన దొండెద్దియును లేదు. త్వద్వ్యతిరిక్తంబు స్థావరజంగమంబులేశంబును గానరాదు. విద్యయుఁగళలును, సర్వంబును నీతనువులు. నీవు హిరణ్యగర్భుఁడవు, త్రిగుణాత్మక ప్రధానాతీతుఁడవు. ప్రభూ! పారమేష్ఠ్యధామస్థితుండవై యేదేహంబున నింద్రియ ప్రాణమనోగుణంబుల నుపభోగింతు వా యీ స్థూలశరీరం బిప్పుడిట్లు వ్యక్తంబయ్యె. దేవా! నీ వవ్యక్తుఁడవైన పరమాత్మవు, పురాణపురుషుండవు, విస్తృతమైన యీ యఖిల జగంబును అనంతావ్యక్తరూపుఁడగు నెవ్వనిచే వ్యాప్తంబయ్యెనట్టి చిదచిచ్ఛక్తియుక్తుఁడవైన భగవంతునకు నీకు జోహార్లు. 112

క. వరదోత్తమ! నా కభిమత, వరముల నిపుడొసఁగుదేనిఁ ద్వత్సృష్టములై
పరగెడు భూతమ్ములచే, మరణమొదవకుండుఁగాతమఱినాకుఁ బ్రభూ! 113

ఆ. విను మఱొంటఁగాని వెలుపలన్ లోపలన్, బగలు రేయిఁ బుడమి గగనమునను
గయిదువులను నరుల కతనను మృగముల, కతనఁ గలుగకుండు గాపుత మృతి.
క. ప్రాణులచే నేనియు, నప్రాణులచే నేనియున్ సురాసురనాగ
శ్రేణులచే నేనియు మ, త్ప్రాణాపాయంబు తొలఁగుతన్ బరమేష్ఠీ! 115
గీ. బవరమున నాకు నప్రతిద్వంద్వతయును, నఖిల దేహితతులకు నేకాధిపత్య
మోలి నీయట్లఖిలలోకపాలమహిమ, సిద్ధయోగులయణిమాదిసిద్ధియగుత. 116

---

## అధ్యాయము 4.

హిరణ్యకశిపు విజృంభణము—ప్రహ్లాదచరిత్ర ప్రారంభము

శ్రీశుకుఁడు:—

క. అని యిట్లు కోరఁబడి మ, న్ననమీఱ హిరణ్యకశిపునకు మెచ్చి యొసం
గెను దుర్లభమగు వరముల, వనరుహగర్భుండు దత్తపఃప్రీతుండై. 117

బ్రహ్మ:—

క. ఏ వరములు ననుగోరితొ, నీవవి దుర్లభములంచు నెఱుఁగుము వత్సా!
ధీవినుతా! యట్లయ్యున్, నే వెస నిచ్చితిని వానినీకుఁ బ్రియమునన్. 118

శ్రీశుకుఁడు:—

క. అంత నమోఘుదయుఁడు భగ, వంతుఁడు లోకేశుఁ డసురవరపూజితుఁడై
చెంతఁ బ్రజాపతులపు డ, త్యంతము నుతియింపఁజనె స్వధామంబునకున్. 119
క. ఈ తెఱఁగున వరములఁగొని, దైతేయాధిపుఁడు హైమతనుధరుఁడై స్వ
భ్రాతృవధము స్మరియించుచు, నాతఱి ద్వేషము వహించె నచ్యుతునందున్. 120
సీ. అయ్యసురాధిపుఁ డఖిలదిక్పతులను, మూఁడులోకముల వేల్పుల నసురుల
నరులను గంధర్వగరుడోరగుల సిద్ధ, చారణపితృపతి సాధ్యమునులఁ
బ్రేతంబుల ఋషుల భూతపతుల యక్ష, రక్షఃపిశాచుల రాజనమున
నిఖిల సత్త్వపతుల నిర్జించి స్వవశులఁ, జేసి యీగతి విశ్వజేతయగుచు
లోకపాలుర స్థానములును దదీయ, తేజములతో హరించె నాదితిజవరుఁడు
దైవతోద్యాననవ్యలక్ష్మీవిలసిత, మగు త్రివిష్టపస్థానమధివసించె. 121
ఎల్ల వృద్ధులెసఁగ ముల్లోకముల సిరి, కాయతనమయి తనరారు విశ్వ
కర్మచే స్వయంవినిర్మితమగు మహేం, ద్రాలయంబు దితిజుఁడాక్రమించె. 122
క. అనఘ! మహామనస్వియు మహాబలుఁడున్ జితలోకుఁ డేకరా
జనగుచుఁ బెంపుమీఱు దితిజుండు మహేంద్రుని మందిరంబునం

దనిమిష ముఖ్యవందిత పదాంబురుహద్వయుఁడున్ బ్రచండశా
సనుఁడుఁ బ్రభాన్వితుండునయి శ్లాఘ్యగతిన్ విహరించె నుద్ధతిన్. 123

మ. ఉరుగంధాసవపానమత్తు ఖలు నత్యుద్రిక్తతామ్రాక్షునిన్
సరసోపాయనపాణులై కొలిచి రాజన్ సర్వదిక్పాలురున్
హరి యీశుండు నజుండు నీ ముగురు తక్కన్యుల్ భయభ్రాంతిఁ ద
త్కరుణాపాంగ లవోపలబ్ధికయి నిత్యం బాత్మ వాంఛించుచున్. 124

మ. ఘనతేజఃప్రతిభావిశేషము చెలంగన్ శ్రీమహేంద్రాసనం
బు నధిష్ఠించిన దైత్యనాథు జయదర్పోన్మాదు విశ్వావసుం
డు నొగిం దుంబురుఁ డస్మదాదులును మాన్యుల్ సిద్ధవిద్యాధరుల్
ఘనగంధర్వులు నచ్చరల్ స్తవములన్ గావించి రొక్కుమ్మడిన్. 125

గీ. సకలవర్ణాశ్రమస్థులు సరగ భూరి, దక్షిణములగు క్రతువులం దగ యజింప
స్వీయతేజంబుతోడ దైతేయవిభుఁడు, బలిమిమీఱ హవిర్భాగములు గ్రహించె.

గీ. దున్నకయ యేడుదీవులు తోడఁబుడమి, తిన్నగ ఫలించునదియయ్యె దితిసుతునకు
దివము కామదుఘంబయ్యె దీప్తి మెసఁగ, బహువిధాశ్చర్యదంబు నభంబు నయ్యె.

వ. క్షార, సీధు, క్షౌద్ర, ఘృత, దధి, క్షీర, అమృతోదకంబులగు రత్నాకరంబు
లును దత్పత్నులగు వాహినులును దరంగహస్తంబుల రత్నౌఘంబుల వహించి
యా దైతేయవిభునకు నివేదించె. శైలంబుల ద్రోణులు క్రీడాస్థానంబులయ్యె.
సర్వర్తువులు స్వగుణయుతంబులగు ద్రుమాదుల ధరియించె. ఆదైత్యుండును సర్వ
లోకపాలుర పృథగ్గుణంబు నెల్లఁ దానొక్కరుండ తాల్చె. 128

చ. సకల కకుబ్విజేత ఘనసత్త్వుఁడు నేకవిభుండు దైత్యనా
యకుఁడు ప్రియంబులైన విషయంబుల నెల్ల నిజేచ్ఛ నిట్లు పా
య కనుభవించుచుండి యనయంబును దా నజితేంద్రియాత్ముఁడై
వికృతిని జెంది సుంత తనివిం గానఁడయ్యె స్వమానసంబునన్. 129

గీ. ఇట్టు లైశ్వర్యమత్తుండు దృప్తుఁడునయి, శాస్త్రములమించి వర్తించు శౌర్యరతికి
బ్రహ్మశాపంబుఁ బొందిన పాపమతికిఁ, దద్దయుం బెద్దకాల ముద్దవడిగడచె. 130

గీ. లోకపాలకయుతములౌ లోకము లపు, డతని యుగ్రదండంబున వ్యాకులపడి
ఎందు శరణంబుఁ గానక హీనములయి, శరణముం బొందెఁ ద్రిభువనేశ్వరుని హరిని.

క. అలఘుఁడు హరి యీశ్వరుఁ డెట, నలరునొ యాదిశకు మా జోహారులివె విని
ర్మలులును శాంతులునగు యో, గులు రారుగదె మగిడి యటకుం జని యిటకున్.

క. అని యావేల్పులు సంయత, మనస్కులున్ సములు శాంతమతులు ననిల భో
జనులు వినిద్రులు నగుచున్, గొనియాడిరిటుల్ శుభాత్మకు హృషీకేశున్. 133

క. అభయప్రదుఁడు విశుద్ధా, శుభవానందనిలయుం ǂ డనూనమహిముఁడున్
విభుఁడునగు వాసుదేవున, కు భగవదాకృతికిఁ బరునǂకున్ వందనముల్. 134

క. ఘననిస్వనమున దశదిశ, లను నులియించుచును సాధుǂలకు నభయము చూ
ప్పిల నా బృందారక విత, తుల కపుఁ డశరీరవాణి ǂ తో తెంచె నిటుల్. 135

క. డెందముల వెఱవకుఁడీఁకం, బృందారకవర్యులార! ǂ మీరెల్ల శుభం
బందుదురు మేలునకె నా, సందర్శనమగును భూత ǂ సంతతి కెపుడున్. 136

శా. దైతేయాపసదుండు క్రూరుఁడగు నాǂదర్పిష్ఠు దౌష్ట్యంబు వి
జ్ఞాతంబయ్యెనుజుండు సర్వమును విǂస్పష్టంబుగామున్న నా
చేతన్ దైవతకోటులార! మదిలోఁǂజింతింపకుండింకపై
నేతచ్ఛాంతిని సల్పువాఁడను బ్రతీǂక్షింపుండు తత్కాలమున్. 137

క. ఏవాఁడిటు వేదంబుల, దేవతలన్ సాధువులను ǂ ద్విజ గోతతులన్
బావనమగు ధర్మంబును, వావిరి ద్వేషించుఁ జెడునుǂవాఁడు దురితగతిన్. 138

గీ. స్వతనయుండు నిర్వైరుఁడున్ǂశాంతుఁడున్ మ, హాత్ముఁడున్ ధీరుఁడునగు ప్రǂహ్లాదునకయి
ఎపుడు ద్రోహంబుఁ జేయు నుంǂకించునపుడ, వరబలోర్జితు వీని జంǂపంగలాఁడ. 139

క. లోకగురుండైనట్టి హృ,షీకేశునిచేత నిట్లు ǂ చెప్పంబడి ని
ర్భీకులయి యతని కెఱఁగి ది, వౌకసులరిగిరి తలంచు ǂ చసురు హతునిగన్. 140

క. జనియించిరి యాదైత్యేం, ద్రునకున్ బరమాద్భుతులు సుǂతులు నల్వురు స
జ్జనసంసేవియు సద్గుణ,ఘనుఁడగు ప్రహ్లాదుఁడొప్పెఁ ǂ గడు వారలలోన్. 141

సీ. సత్యసంధుఁడు శీలǂసంపన్నుఁడున్ జితేం, ద్రియుఁడు బ్రహ్మణ్యుఁడైǂనెగడువాఁడు
అఖిలభూతముల కాǂత్మోపమ్యమునఁ బ్రియుం, డును సుమహాత్ముఁడునై ǂ యెనయువాఁడు
దాసుండువోలె బెǂద్దలయుద్దఁ దోయికి, సతము నమస్కృతుల్ ǂ సలుపువాఁడు
జనకుంభువలె దీనǂజనములయందు న, స్తోకవాత్సల్యంబుఁ ǂ జూపువాఁడు

గీ. సోదరునిభంగి నాదరǂమేదురుండు, గురువులందు నీశ్వరభావǂగుంభితుండు
విత్త, విద్యా, సురూప, సంǂపత్తులం ద, మానియు నదంభి ప్రహ్లాదుǂఁడౌ నరేంద్ర!

మ. విను రాజా! వ్యసనంబులం దతఁ డనుǂద్విగ్నుం డవస్తుత్వ బు
ద్ధిని వీతస్పృహుఁడై మెలంగు శ్రుతముల్ ǂ దృష్టంబులైనట్టి యీ
ఘనభోగంబులయందు నా యసుర యుǂక్తప్రాణబుద్ధీంద్రియుం
డును శాంతాత్ముఁడునొంచు నాసురత వీǂడున్ సాధుసేవారతిన్. 143

ఆ. కవులచేతఁ దొలుతఁ § గానంగఁబడిన ప్ర, హ్లాదవిమలతర మహాగుణములు
నేఁడు నవ్వి వాని § నిఖిలేశ్వరుండగు, విష్ణుదేవుఁబోలె § విడిచి చనవు. 144

క. ప్రత్యర్థులయ్యు న య్యా, దిత్యులు సాధుపరిసంగ § ధిష్ఠితసభ నా
దైత్యవరుం బొగడుదు రౌ, చిత్యజ్ఞుల మిమ్ముఁబోంట్లఁ § జెప్పఁగనేలా. 145

క. గణుతింపరాని యాతని, గుణముల సూచించిచాలు ముకుందు నసాధా
రణ సహజభక్తిఁగొల్చు ని, పుణు మాహాత్మ్యంబు పుణ్యమున్ గణ్యంబున్. 146

క. బాలుండయ్యుం గ్రీడన, కాలివిడిచి తన్మనస్కుఁ § డగుటన్ జడుడుం
బోలెన్ గృష్ణగ్రహ సం, కీలితచిత్తుఁడయి జగ మొగిం గనకుండున్. 147

క. హరిపరిరంభితుఁడగుచు న, సురబాలుఁడతండు గూరుచుండినఁ దినినన్
దిరిగినఁ ద్రావినఁ బలికినఁ, బరుండినన్ దెలియకుండె § వాని నరేంద్రా! 148

మ. ఒకచో నేడ్చు ముకుందుసంస్మృతికిఁ బ్రత్యూహంబువాటిల్లఁగా
నొకచో నవ్వుఁ దదీయచింతన వినోదోత్థాద్భుతాహ్లాదుఁడై
ఒకచోఁ బాడును ముక్తకంఠమున నత్యుత్కంఠ నిర్లజ్జుఁడై
ఒకచో నాడు మఱొక్కచోట హరిచేష్టల్ చేయుఁ దద్భావనన్. 149

క. ఒకచో మిన్నకయుండున్, ముకుంద సంస్పర్శలాభమున నిర్వృతుఁడై
ఒకచోఁ బరిణయానందో, దక మీలితనయనుఁ డుద్గతపులకుఁడు నగున్. 150

చ. అమలినసాధుసంగ సముపాత్త ముకుంద పదారవిందయు
గ్మ మహితసేవచేతఁ బరమంబగు నిర్వృతి నాత్మనున్ బరిశ
స్తముగ నొనర్చుచున్ మఱి యసంగమునన్ గడు భ్రష్టుఁడైన దీ
న మతికిఁగూడ నొయ్యన మనశ్శమ మా మహితుండు గూరిచెన్. 151

గీ. పరమభాగవతుఁడు మహాభాగుఁడు మహి, తాత్మకుఁడునైన యాత్మజు § నందు నా హి
రణ్యకశిపుఁడు క్రూరుఁడై § రాజతిలక!, యఘమునొనరించెనయ్యా నెయ్యంబుడించి.

ధర్మరాజు :—

చ. సురమునిసత్తమా! సుపరిశుద్ధుఁడు సాధువు సద్గుణాతిభా
సురతనుఁడైన యట్టి నిజసూనునికై యఘమాచరించె ని
ష్ఠురతను దైత్యనాయకుఁడు § చోద్యముగా నిది తోఁచెఁ గానఁ జె
చ్చెరఁ దెలియంగనుంటి మిది చెప్పుము సువ్రత! లోకవిశ్రుతా! 153

క. సుతవత్సలులగు పితరులు, ప్రతికూలురనైన సుతుల § బాధింపరుగా
హితమును గఱపుఁ దలంపున, యతివర్యా! మూఁదలింతు § రంతియ కాదే. 154

క. అనుకూలుర నతిసాధువు, లను గురుదైవతులఁ బుత్రులను దండ్రులు పె
న్గినుకన్ బీడింపరటం, చని వేఱుగఁ జెప్పనేల నమరమునీంద్రా! 155

క. పితృకృత విద్వేషము సుతు, మృతికిఁ బ్రయుక్తమయి యురవడించు టదివినన్
మతిఁ గౌతూహలమయ్యెన్, యతివర! యద్దానిఁ దీర్పుమయ్యా! మాకున్. 156

---

## అధ్యాయము 5.

### హిరణ్యకశిపుకృత ప్రహ్లాదతర్జనభర్త్సనాద్యభివర్ణనము

నారదుఁడు:—

మ. జగతీనాథ! పురోహితత్వమునకున్ సర్వాసురశ్రేణిచే
భగవంతుండగు భార్గవుండు వరియింపంబడ్డవాఁడయ్యెఁ జం
డగభస్తి ప్రతిమానతత్సుతులు చండామార్కులా దైత్యనా
థగృహంబందున రాజపుత్రునకు విద్యల్ నేర్పి రాదిష్టులై. 157

గీ. బాలు నచ్ఛీలు సత్క్రియాలోలు సద్గు, ణాలవాలుని బ్రహ్లాదునన్యులైన
యసురబాలుర దండనీత్యాదిపాఠ్య,ములు గఱపిరి చండామార్కులలఘుఫణితి.

క. గురువులు చెప్పినయది సు,స్థిరబుద్ధిన్ వినియె నాగతిన్ బఠియించెన్
నరనాథ! స్వపరభేదము, బొరిఁ గఱపెడు నది యసాధువుగ భావించెన్. 159

మ. ఒకనాఁ డాయసురాధినాథుఁ డెదలోనుత్కంఠ దీపింపఁ బు
త్రకునిన్ జేరఁగఁ జీరి మక్కువ నిజోత్సంగంబునం జేర్చిఁ 'వ
త్సక! నీకెయ్యది భద్రమో తెలుపుమా సంప్రీతి నా'కంచుఁ బొం
దిక ప్రహ్లాదకుమారసత్తముని బ్రశ్నించెన్ నరేంద్రోత్తమా! 160

ప్రహ్లాదుఁడు:—

మ. అసురేంద్రా! పలుమాటలేమిటికి గాఢాహంమమత్వాభి మా
న సముద్వేజితులైన దేహులకు నెన్నన్ హానినం బంధకూ
ప సమంబైన గృహంబువీడి ధృతియొప్పన్ గానకుంబోయి న
ర్వసమున్ శ్రీహరి నాశ్రయించు టది యే భద్రంబుగా నెంచెదన్. 161

నారదుఁడు:—

క. పరపక్షనిష్ఠితములై, పరగెడు పుత్రకు గభీరవాక్కులు విని బా
లుర బుద్ధులు భిన్నములగుఁ, బరబుద్ధుల ననుచుఁ దండ్రి పక్కున నవ్వెన్. 162

ఆ. వీనిబుద్ధి యింక విష్ణుపక్షులుఁ బ్రీతి, ఛ్ఛన్నులనగునట్టి జనులు భేద
పఱచకుండునట్లు బ్రాహ్మణులార! మీ, భవనమందు భద్రపఱుపుఁడయ్య! 163

ఆ. అంత యాజకులు గృహానీతుఁ బ్రహ్లాదుఁ, బిలిచి మధురవాక్యములఁ బ్రశంస
సలిపి నయము మెఱయ సాంత్వనరీతుల, నా కుమారవర్యు నడిగి రిట్లు. 164

గీ. 'వత్స! ప్రహ్లాద! నీకు శుభంబు నిజము, చెప్పు మనృతంబొకింత వచింపరాదు
బాలురనుమించిబుద్ధివిపర్యయమిది, ప్రాప్తమయ్యెను నీకు నెవ్వారినుండి ? 165

క. పరకృతమొ స్వతస్సిద్ధమొ, గురువులమగు మేమది వినఁగోరెద మసురే
శ్వరనందన! కులవర్ధన, యరుదయ్యెన్ దీనిఁ దెలుపుమా నయమారన్. 166

ప్రహ్లాదుఁడు:—

క. తానని పరుఁడని భేదము, మానవులకు నెవనిభూరిమాయనగునో యె
వ్వానివలన మోహంబగు, జ్ఞానాత్మున కా పరేశునకు నా మ్రొక్కుల్. 167

క. వినుఁడీ యా భగవంతుం, డనుకూలుండగుడు దానునన్యుండను నొ
ప్పని పశుబుద్ధి విభిన్నమ, గును దలపోయన్ బురుషులకును దనయంతన్. 168

తరల. పరుఁడు తానను భేదబుద్ధిని భ్రాంతిమున్నెడువారిచే
నరయ నా పరమాత్మయే దెలియంబడున్ బలుభంగు లే
పరమపూరుషు మార్గమందు నబ్రహ్మముఖ్యులు వేదవి
ద్వరులు మోహముఁ గొంద్రొ గూర్చి నతండె మన్మతి భేదమున్. 169

గీ. ఇనుమయస్కాంతసన్నిధినదనకుఁదాన, యెట్లుచలియించుచుండునోయట్లగురువ
తంసమా! శార్ఙ్గధరుసన్నిధానమున మ,దీయ మనము యదృచ్ఛ భేదింపఁబడెడు.

నారదుఁడు:—

క. అని యింతవట్టు ద్విజులకు,నని మిన్నకయుండె నమ్మహామతి యల్లం
తనఁబలికె రాజసేవకుఁ,డును దీనుఁడునైన యాతఁడు కుపితమతియై. 171

క. ఓరీ! బెత్తముఁదెండిటు,లూరక మా కప్రతిష్ఠ నొదవించు కులాం
గారునకుం దుర్బుద్ధికి, నారయ నాలవయుపాయమగు దమమె తగున్. 172

శా. ఆలోకింపఁగ దైత్యచందనవనంబందున్ దురాత్ముండు వా
చాలుం డీతఁడు కంటకద్రుమము నోజన్ సంభవంబయ్యెఁ ద
న్మూలోన్మూలకుఠారుఁడైన హరికిన్ బోల్పంగ నాళంబుగా
బాలుండీతఁడు తోఁచెఁ గాదె తనదావంశంబు ఖండింపఁగన్. 173

మ. అని యాబాలుని సాధుశీలుని నమందాహ్లాదుఁ బ్రహ్లాదు ని
ట్లను వౌ తర్జనభర్జనాది వివిధోపాయంబులన్ బన్ని పె
ల్లున గద్దించుచు శుక్రనందనులు విస్ఫారత్రివర్గోపపా
దనమున్ మెల్లగ్రహింపఁజేసి రిరవొందన్ బాంఢువాణ్ణందనా! 174

క. జ్ఞాతోపాయచతుష్టయుఁ, డీతండని గురుఁడెఱింగి యిటు ప్రహ్లాదున్
మాతృపరిహితు నలంకృతు, దైతేయకులోత్తమునకుఁ దా నగపఱచెన్. 175

క. అడుగులకును మ్రొక్కిన యా, బుడుతని కాశీస్సు లొసఁగి భుజయుగళమునన్
గడుఁ దడవు గౌఁగలించి య,పుడు పరమసుఖంబు దైత్యముఖ్యుఁడు పొందెన్. 176

క. ఒడిఁ జేర్చి శిరము మూర్కొని, పొడమెడు నానందబాష్పములఁ దచ్ఛిరమున్
దడుపుచు వికసితవక్త్రా, బ్జుఁడగుచుఁ బలికెన్ దితిజవిభుఁడు పుత్రునకున్. 177

హిరణ్యకశిపుఁడు:—

క. తగ నింతకాలమును నీ,వు గురువుకడ నేమి శిక్షఁ బొందితివో వత్సా!
నిగదింపుము నాకున్ స,మ్యగధీతము నుత్తమమగునది ప్రహ్లాదా! 178

ప్రహ్లాదుఁడు:—

చ. శ్రవణము నిత్యకీర్తనము సంస్మరణంబును పాదసేవన
వ్యవహృతి యర్చనంబు నభినందన మాపయి దాస్య సఖ్యముల్
వివరముగాఁగ నాత్మసునివేదన మన్నవలక్షణాన్వితం
బవు దృఢభక్తి విష్ణువయినైన స్వధామము నుత్తమం బదా. 179

నారదుఁడు:—

క. నరనాథ! సుతుని యీ నుడి, హిరణ్యకశిపుఁ డపు డాలకించియు రోష
స్ఫురితాధరపల్లవుఁడై, గురుపుత్రుం జూచి పల్కెఁ గొనకొని యిట్టుల్. 180

హిరణ్యకశిపుఁడు:—

ఉ. నాయెడ నాదరంబు విడనాడి ఖలాత్ముఁడవౌచు బ్రహ్మబం
ధూ! యిదియేమిగా సలిపితోయి! విపక్షుని పక్షమూని య
న్యాయముగాఁగ బాలకుని నారడివెట్టి యసారగ్రాహిఁగాఁ
జేయఁగ నిచ్చగించితి విసీ! నినువంటి కృతఘ్నులుందురే? 181

గీ. కలరు లోకమునం దసాధులును గపట, వేషులగు దుష్టమిత్రులు పెక్కుమంది
వారలకుఁ గాలగతిని బ్రాప్తమగుఁగా య,ఘంబు పాతకులకును రోగంబువోలె.

గురుపుత్రులు:—

మ. అమరేంద్రాహిత! మత్ప్రబోధితము నన్యప్రోక్తముంగా దిద
న్యమనీషల్ గొనఁడయ్య నీకొడుకు తన్నైసర్గికంబే యగున్
జుమి యీబుద్ధి తలంప రాజ! మతి సంక్షోభంబుఁ గల్గించు కో
పముఁ దగ్గింపుము మమ్ముఁ గుత్సితులఁగా భావింప కీ వాత్మలోన్. 183

క. గురువిట్లు బదులువలుక న,సురపతి రభసమున నాత్మసుతునకు ననియెన్
గురుముఖమునఁగా దే నే,కరణిని నీ వెడఁగుబుద్ధి గలిగె న్నీకున్. 184

ప్రహ్లాదుఁడు:—

చ. అనుపరతేంద్రియంబుల గృహవ్రతులౌచుఁ దమిస్రమున్ జొరం
జనుచుఁ బునఃపునస్త్వమునఁ జర్వితచర్వణులైనవారికిన్
ఘనుఁడగు కృష్ణునందు మతి గల్గదుగా యొకయప్పుడున్ దమం
తనయిననేని యన్యుల కతంబుననేని మిథఃప్రవృత్తినేన్. 185

చ. ఖలమతులై బహిర్విషయకాములనే గురులంచు నాత్మలోఁ
దలఁచెడు నా గృహవ్రతులు తప్పక యంధజనోపనీయమా
నులయిన యంధు లుద్దవడి నూతను గూలినయట్లు మోహవి
హ్వాలతను గర్మబద్ధులయి స్వార్థరతిన్ గనఁబో రొకింతయున్. 186

చ. పరివిమలులైన భాగవతవర్యుల పాదరజోభిషేక మెం
తవఱకు మూర్ధభాగములఁ దాల్పఁ గడంగరొ యెంచిచూడ నం
తవఱకు వీరి బుద్ధియు ననర్థనివారకమైనయట్టి కే
శవుచరణారవిందమును సంస్పృశియింపను జాల దెన్నఁగన్. 187

క. అనిపల్కి మిన్నకుండిన, తన తనయుని భాషణకు క్రోధాంధీకృతచే
తనుఁడగు హిరణ్యకశిపుఁడు, తన యుత్సంగంబునుండి ధరణికిఁ ద్రోచెన్. 188

గీ. అనియె నిట్టులు రోషతామ్రాక్షుఁడగుచు, వీని నిటనుండి నెట్టుఁడీ వెలికి నిపుడు
వీఁడు వధ్యుఁడు రాక్షసవీరులార!, వేగిరమ సంహరింపుఁడు వీనిఁ బట్టి. 189

క. ఈ యధముఁడె భ్రాతృఘ్నుఁడు, స్వీయుల సుహృదులను మున్ను విడిచి పితృవ్యున్
మాయించిన హరియడుగులఁ, బాయక గొల్చెడిని దాసుపగిది ననిశమున్. 190

క. త్యజియించె వీఁడు దా, దుస్త్యజ పితృసౌహృదముఁ బంచహాయనుఁ డీఁ కథో
క్షజునకునేని ననుకూ,లజనుఁడు వీఁ డొనరుపంగలండే బాగున్. 191

మ. హితకారుండగునేని వైరియు సుతుం డే యౌషధంబుం బలెన్
స్వతనూసంభవునేనిఁ బుత్రు నహితున్ వర్జింపనౌ రోగమ
ట్లతిధైర్యంబున దేనినిన్ విడువ శేషాంగంబు బెంపారు నం
చితమై యట్టి నిజాంగమున్ వికలమున్ ఛేదింపనౌ వ్రేల్మిడిన్. 192

గీ. యతివరునకును దుష్టేంద్రియంబుగతిని, రిపువగుచుఁ బుత్రవేషధారియగు వీఁడు
శయన భోజనాసనముల సర్వవిధము,లగు నుపాయములం జంపఁదగినవాఁడు. 193

మ. అని యారీతిని దైత్యవల్లభునిచే నాదిష్టులై రాక్షసుల్
సునిశాతోగ్రకరాళదంష్ట్రిభయదాస్యుల్ లోహితశ్మశ్రుకే
శనికాయుల్ ఘనశూలపాణులగుచున్ శాంతాత్ము నాసీనుఁ బా
పనిఁ బ్రహ్లాదునిఁ జుట్టుముట్టిరి మహార్భాటంబు దీపింపఁగన్. 194

క. ఛేదింపుఁడు భేదింపుఁడు, బాదుఁడు మోదుం డటంచు భయజనక మహా
నాదంబులు సలుపుచుఁ, బ్రహ్లాదుని మర్మములఁ గొట్టిరా దైత్యభటుల్. 195

చ. అవిషయుఁడున్ బరుండు నఖిలాత్ముఁడు బ్రహ్మమయుం డజుండు స
ర్వవిభుఁడునైనయట్టి భగవంతునియందు నియోజితాత్ముఁడై
యవికృతినున్న బాలకునియం దవి యెల్లను నిష్ఫలంబు ల
య్యె వెస నభాగ్యు సత్క్రియ లవెట్లటు లయ్యెడ వింటె ధర్మజా! 196

క. తనదు ప్రయాసములీవడువున విఫలములగుడు దైత్యపుంగవుఁ డుల్లం
బునఁ బరిశంకితుఁడై పె, క్కనరిచెఁ జలముమెయిఁ దద్వధోపాయములన్. 197

చ. దిగిభపదాభిఘాతములఁ దీండ్రపు మారణహోమకర్మలన్
నగశిఖరావపాతనము నన్నవరంధ్ర నిరోధవృత్తిఁ బ
న్నగవరఘోరదంశనము నన్ విషదానము నన్నిరన్నతన్
ద్విగుణితకోపుఁడై వెతలఁ బెట్టె సుతుం బిత పెక్కుమాయలన్. 198

చ. చలముఁదలిర్ప వెండి దితిజప్రవరుండు సుతున్ హిమానిలా
నలసలిలంబులందుఁ గఠినత్వముదోఁపఁగఁ గూలఁద్రోచియున్
బలితపుఁగొండఁ దత్తనువుపైనిడి యిట్టులు బాములెన్నియేన్
సలిపియు బాలు నిష్కలుషుఁ జంప నశక్తతనుండె నెంతయున్. 199

వ. ఇత్తెఱంగున మోఘోద్యముఁడై దైత్యవల్లభుండు దురంతదీర్ఘచింతా నిమగ్నుం
డగుచుఁ దనమనంబున, 200

ఉ. మాయురె! వీనినిన్ గఱకుమాటల దూఱితి ఘోరమారణో
పాయము లెన్నియేనియు బలాన్వితులైన నిశాచరాళిచేఁ
జేయఁగఁ బంచినాఁడ నతిచిత్రముగాఁగ స్వకీయశక్తిచే
నాయయి పాపకార్యముల నన్నిట వీఁడు విముక్తుఁడయ్యెడున్. 201

గీ. దాపునమెలంగు నెటకేని దాగఁబోఁడు, బాలుఁడయ్యును నెప్పుడు ధీరభావుఁడగుచు
నాదగు నకార్యమేని మనమ్మునన్ స్మరింపఁబోఁడు శునశ్శేఫురీతి వీఁడు. 202

గీ. అమరుఁ డకుతోభయుండు నప్రమేయ, సుప్రభావుండునై యొప్పుఁ జూడ వీఁడు
తప్పకింక నేతద్విరోధమున నాకు, నకట! మృత్యువు సంప్రాప్తమగునొ యేమొ!

మ. క్షితిపా! యిట్టు లధోముఖుండగుచుఁ గించిన్మానతేజస్కుఁడై
సుతసంబంధ దురంతచింత మెయి రక్షోనాథుఁ డుండంగ న
ష్ఠతితేజుండగు కావ్యపుత్త్రకులు చండామార్కులిర్వుర్ వివి
క్తతలంబం దసురేంద్రుఁ గాంచి యిరవొందం బల్కి రీ రీతిగన్. 204

చ. ఒకఁడవె మూఁడులోకముల నుద్ధతి గెల్చిన దిట్టవీవు త్వ
ద్భ్రుకుటి విజృంభణంబున నపో వెఱఁజెందిరి సర్వలోక పా
లకులును రాజ! నీ వలబలంబును జెందఁ గతంబుఁ గాన మ
ర్భకుల మనఃప్రవృత్తి నిలుకవంబడునే? గుణదోషచర్చకున్. 205

చ. ప్రసభముతోడుతన్ వరుణపాశములన్ బిగియించియుంచుఁ డీ
నిసువును భీతినెమ్మది జనించి పలాయన మొందకుండఁగన్
బొసఁగునుగాదె పూరుషుని బుద్ధి వయస్సున వృద్ధసేవచే
నసురవరా! భృగుప్రవరుఁడంతటిలో నిట కేగుదెంచెడున్. 206

ఉ. 'వల్లె'యటంచు నా దితిజవల్లభుఁ డా గురునందనోదితం
బెల్లను సమ్మతించి యపుడిట్లనియెన్ గృహమేధులై విరా
జిల్లెడు నట్టి రాజులకుఁ జెల్లెడు ధర్మములెల్ల వీనికిన్
దెల్లముగాఁగ మీర లుపదేశముఁ జేయుఁడు బుద్ధిచాతురిన్. 207

క. వినయావనతుండగు నా, ఘనునకుఁ బ్రహ్లాదునకును గఱపిరి గురునం
దను లానుపూర్వికంబుగ, మునుకొని ధర్మార్థకామములు రాజేంద్రా! 208

క. అనఘుఁడు ప్రహ్లాదుం డా, త్మను స్వీయ గురూపశిక్షితమగు త్రివర్గం
బునుగాని విషయపరులై, గునిసెడు తచ్ఛిక్షఁగాని గొనఁడు హితముగన్. 209

వ. మఱియు వ్యవహారప్రసిద్ధి కొఱకునై నరులచే నిట్లు వికల్పంబు చేయంబడియె. లేని యర్థంబున్నట్లు తోఁచినయెడల నా ప్రత్యాఖ్యానంబు దిగ్భ్రమంబ యగుననియు నతండు తలంచుచుండ. 210

మ. జననాథా! విను మొక్కనాఁడు తమ యాచార్యుండు గార్హస్థ్య క
ర్మనిమగ్నుండయి యుండఁజూచి పొలుపారన్ దద్వయస్యుల్ ప్రమో
జనముం గోరుచుఁ గొంద ఱా సదవకాశంబుం దగంబొంది యొ
య్యన నాహ్వానముఁ జేసి రయ్యెడకుఁ బ్రహ్లాదున్ సదాహ్లాదునిన్. 211

క. అగణితమతి విద్వాంసుఁడు, నగు ప్రహ్లాదుండు వారినతిమధురోక్తిన్
దగఁ బిలుచుచుఁ దన్నిష్ఠన్, నగుచుంబలెఁ గరుణ మదిఁ దనర వాక్రుచ్చెన్. 212

ఆ. వారలెల్ల రతని గౌరవంబునఁ జేర్మిఁ, జెలఁగి యాటవస్తువులఁ ద్యజించి
విషయలాలసజన ప్రేరితేహితములఁ, గలతఁ బడని మతులఁ జెలఁగి రపుడు. 213

ఆ. అతనియందె హృదయ మమత్వములు నిగిడించి, కువలయేశ! వారుఁ గొల్చియుండ్రి
అనియె వారి కట మహాభాగవతుఁడగు, దనుజసుతుఁడు మైత్రి దయయుఁ దనర.

## అధ్యాయము 6.

### ప్రహ్లాదోక్త దైత్యబాలక హితబోధ

ప్రహ్లాదుఁడు:—

మ. అకటా! బాలకులార! నాదు వచనం బాలింపుఁడీ మీకు భ
ద్రకరం బయ్యెడిసుండు గన్గొనుఁడు వీతత్రాణులై తోడి య
ర్భకులన్ గ్రీడల నేమటిల్లకుఁడికన్ వాంఛింపుఁ డాత్మోప ల
బ్ధి కనర్థంబున కర్థకల్పనముఁ గావించున్ గురుం డొప్పునే? 215

గీ. దేని నాలించినంత యజ్ఞాననిద్ర, సుప్తుఁడు ప్రబోధమందఁడో సుహృదులార!
నమ్మఁగారాదు సుంతయున్ దన్మతంబు, నంధనాయకుఁడేనియు నంధుఁడెకద? 216

గీ. ఎవఁడు శత్రుఁ డుదాసీనుఁ డెవ్వఁ డాత్మ, యెవఁడు మిత్రము మఱి యర్థమేది తలఁప
బహుళసంపత్ప్రదంబు విపత్ప్రదమగు, దైవమన నెద్ది మనమునఁ దలఁచి చూడ.

సీ. తనకు నితరులకు ధర్మకామంబుల, కేది హానినిఁ జేయ కెనగుచుండు
ఏది జగములకు హేతువై నట్టి య, ర్థంబు మిగుల దుర్లభంబుచుండు
మనుజ జన్మమునఁ గౌమారదశన్ భాగ, వతధర్మములు సల్పవలెఁ బురుషుఁడు
మానుషజన్మంబు మఱి దుర్లభంబగు, నధ్రువంబయ్యు నర్థదంబు

గీ. అఖిలభూతములకుఁ బ్రియుఁ డాత్మవల్ల, భుండు సుహృదుండునైన విష్ణుండు కాన
పురుషునకు నిందు నయ్యాది పురుషుఁడైన, హరిచరణ భజనంబె ముఖ్యంబు దలఁప.

చ. జతనము లేకయే యెటుల సంభవమౌ నిట దుఃఖమట్టులే
ధృతియుతులార! దేహులకు దేహముఁ బట్టియె సర్వజంతుసం
తతికి లభించుచుండుఁ గదె తప్పక ప్రాక్తన కర్మయుక్తిచే
జతపడి నిత్యమైంద్రియక సౌఖ్యము కూడ తలంచి చూడఁగన్. 219

క. ఆ యింద్రియసుఖమునకై, యాయుర్వ్యయకారియగు ప్రయాసం బెప్డున్
జేయఁదగదు హరిపాదా, ర్చాయుక్తియె క్షేమ మొసఁగు జరుగ దిఁకొంటన్. 220

గీ. కాన సంసృతిఁ బొందిన మానవుండు, పురుషరూపమౌ దేహము పుష్కలమయి
ఆపదం బొరయక యుండు నంతదనుక, నిపుణుఁడై క్షేమమునకు యత్నింపనగును.

సీ. హాయనశతమాత్ర మాయువు పురుషున, కందు సగం బజితాత్మునకును
విఫలమగున్ రేయి వీఁడంధతమసమ్ము, నొందింపఁబడి పడియుండుఁ గాన
మూఢతచే బాల్యమునను గ్రీడారతా, త్ముండౌటఁ గౌమారమున గతించు
వింశతివర్షముల్ పృథు జరాగ్రస్తుఁడై, యసమర్థుఁడై యుండు నవసరమున

గీ. నిరువదేండ్లు గతించెడు నింక దుఃఖ, పూర్ణమగు కామమునఁ బెను మోహమునను
గృహరతుఁడుఁ బ్రమత్తుఁడు నయి యహరహంబుఁ, దిరుగువానికి శేషంబు తిక్రమించు.

క. శ్రేయోవిఘాతకంబగు, నాయాసమ్మున భవాబ్ధి నల్లాడెడు నా
త్మీయులగు కుటుంబీకుల, యా యవివేకంబుఁ జూడుఁ డర్భకులారా! 223

ఆ. వినుఁడు బాలకులార! వివిధయోనులను గ, ర్భాద్యవస్థలం బ్రయాసపడుచు
వపువుఁ దాల్చుచుండి పతనపర్యంత మే, మనుభవించు రాజె యైనఁ గాని. 224

గీ. కాలము క్రియాపణంబొట్టఁ గర్మమునకు, దుష్టతయు శిష్టతయు నేది తూర్ణగతిని
గర్మమునఁ జేసి క్షణమునఁ గల్గెడునది, జన్మశతముల చేనైన నసమసిపోదు. 225

గీ. అవిజితేంద్రియుఁడగు జనుం డెవఁడు స్నేహ, పాశముల చేత దృఢతర బద్ధమగుచు
గృహరతంబైన మనమును గేవలంబు, సాహసించును దద్విమోచనముఁ జేయ? 226

గీ. వణిజుఁడును దస్కరుండు సేవకుఁడు దేనిఁ, బ్రియతర ప్రాణముల నేని విలుచునట్టి
ప్రాణములకు మిన్నయగు నర్థంబునందుఁ, దృష్ణ నెవ్వాఁడు దా విసర్జింపఁగలఁడు?

సీ. అనుకూలమైన ప్రేయసి రహస్సంగంబు, రుచిర మంత్రముల నేర్పున వచించు
సుహృదుల చెల్మి నిసువుల యవ్యక్తభా, షణముల యందు నాసక్తి మఱియుఁ
దనయుల సుతల భ్రాతలను జెల్లెండ్రను, గృపణులౌ పితరుల గేహములను
కమనీయ భోగోపకరణంబులను జీవి, కలఁ బశుభృత్య వర్గముల నెట్లు

గీ. విడుచుఁ గామములన్ దృప్తి వడక కోశ, కారియౌ కీటమటు మోహకలితుఁ డగుచు
జనుఁడు సతము జిహ్వోపస్థ సౌఖ్యములఁ గ, రంబు మెచ్చుచు నెట్లు విరక్తిఁ బొందు?

చ. అమిత కుటుంబపోషణకునై తన యాయువు చెల్లుచుండ ను
త్తమపురుషార్థముం బ్రతిహతంబగుచుండఁ బ్రమత్తుఁడై జనుం
డు మది నెఱుంగకుండు స్వకుటుంబ రతుండగుచున్ ద్రితాపదుః
ఖములను మ్రగ్గుచుండియును గానఁడుగా విసువున్ రవంతయున్. 229

చ. పరధనముల్ హరించిన యభాగ్యునకున్ సతతం బిహంబునన్
బరమున సంభవిల్లెడు విపత్తి నెఱింగినవాఁడె యయ్యు దు
స్తరతరకామముల్ విడువఁజాలక యింద్రియలాలసాత్ముఁడై
పరధనముల్ హరించుటకె పాల్పడుచుండుఁ గుటుంబి వ్యగ్రుఁడై. 230

తరల. దనుజబాలకులార! గేస్తుఁడు తా నెఱింగియు నివ్విధం
బున స్వకీయకుటుంబపోషణ బుద్ధియౌచు స్వలోకద
ర్శనసమర్థుఁడు గాఁడు మూఢుని చాడ్పునన్ బరకీయుఁడం
చును స్వకీయుఁడటంచు భ్రాంతినిఁ జొచ్చు నారకకూపమున్. 231

శా. సాపాయంబగు కాయమందు మది నత్యాసక్తుఁడై శృంఖలా
రూపాపత్య నిమిత్త భూతలగు సుభ్రూశ్రేణి కేళీమృగ
వ్యాపారంబుననున్న దన్ను విడిపింపంగా నెవండేనిఁ దా
నోపం డెందు మఱెప్పుడున్ విబుధుఁడయ్యున్ గేస్తు దీనాత్ముఁడై. 232

మ. అటులౌటన్ విషయాభిరక్తులగు దైత్యవ్రాతమందున్ సము
త్కటమౌ సంగము దవ్వుదవ్వులఁ దొలంగంద్రోచి మీరెల్లఁ బ్ర
స్ఫుటభక్త్యున్నతి నాదిదేవుఁడగు విష్ణున్ నిచ్చలున్ గొల్వుఁడీ
యిటు సేవించినవారి కాతఁడు మనోభీష్టాపవర్గం బిడున్. 233

ఆ. అఖిలభూతములకు నాత్మభూతుండౌటఁ, దలఁప నిందు సర్వసులభుఁడౌట
అసురపుత్రులార! యచ్యుతుఁ దనిపెడు, జనులకేప్రయాసమును గలుఁగదు. 234

వ. బ్రహ్మాంతస్థావరాదికంబులగు పరాపరభూతంబులందును, భౌతికవికారంబుల యందును, మహాభూతంబులయందును, గుణంబులయందును, గుణవ్యతికరంబుల యందును భగవంతుఁడు నీశ్వరుండు నవ్యయుండు నగు పరమాత్ముం డొక్కండె వెలుంగుచుండు. ప్రత్యగాత్మస్వరూపంబునను, దృశ్యరూపంబునను, వ్యాప్య వ్యాపకనిర్దేశ్యుండు ననిర్దేశ్యుండునై యవికల్పితుండగుచుఁ బరమాత్మ భాసిల్లు చుండు. కేవలానుభవానంద స్వరూపుఁడగు పరమేశ్వరుండు స్వమాయాంతర్హి తైశ్వర్యుండై గుణసర్గభూతయగు మాయం గూడియుండు. 235

క. కావున మీరిఁక నాసుర, భావముఁ ద్యజియించి భూతవర్గమున సుహృ
ద్భావము దయయునుబూనుం, డావిష్ణుఁడు దాన హృష్టుఁడగు డెందమునన్. 236

మ. పరమాత్ముండు ననంతుఁ డాద్యుఁడు జగద్భద్రానుసంధాయి యా
హరి తుష్టుండగుడున్ జగమ్మున నలభ్యంబున్నె యేదేనిఁ ద
చ్చరణాబ్జామృతసారమున్ దవిలి యాస్వాదించు మే మెన్నఁడున్
బురుషార్థంబులు లభ్యమైనను గొనంబో మల్లఁ గైవల్యమేన్. 237

సీ. అర్భకులార! గుర్వభిహిత ధర్మార్థ, కామంబులను ద్రివర్గమ్ము నీతి
త్రయియును వివిధవార్తయు నయ దమములు, నా యీ సమస్తపదార్థజాల
మల పురుషోత్తముఁ డాత్మసఖుండునౌ, యచ్యుతునకును స్వాత్మార్పణంబు
సలుపంగఁజాలిన సత్యమౌనట్టులు, కాకున్న నిదియెల్లఁ గల్లయగును

గీ. నారదునకు నీ దుర్లభజ్ఞానమొసఁగె, ననఘుఁడగు నరసఖుఁడు నారాయణుండు
హరిపదాబ్జ రజఃపూతులై యకించ, నులగు సద్భక్తవరులకున్ దొరకునిద్ది. 238

క. నే నో బాలకులార! య, నూనము భాగవతధర్మ యోజితమును వి
జ్ఞానసమేతమునగు నీ, జ్ఞానంబును దొల్లి వింటి నారదువలనన్. 239

బాలకులు :—

క. మేమును నీవును నీ చం, డామార్కులకంటె నెఱుఁగ ◊ మన్యగురుని వీ
రే మనకు బాల్యమాదిగఁ, దాము గురులుగఁ బరఁగిరిగదా? ప్రహ్లాదా! 240

గీ. అంతిపురమునసుండెడి ◊ యర్భకులకు, దుర్ఘటమ్ము మహాత్ములతోడి సంగ
మనఘ! యీ సంశయము మాకు ◊ నపనయింపుఁ, దెలుపు విశ్వాసహేతువుఁ ◊
కలిగెనేని. 241

---

## అధ్యాయము 7.

### నారదోపదేశ కథనము

నారదుఁడు :—

క. భాగవతుఁడు ప్రహ్లాదుం, డీగతినిన్ దనుజతనుజ ◊ పృష్టుఁడయి మహా
భాగ! మదుక్తముఁ దలఁచుచు, నే గౌరవమొప్పఁ బలికె నెలనవ్వొలయన్. 242

ప్రహ్లాదుఁడు :—

ఉ. మా జనకుండు దీక్షమెయి ◊ మందరశైలమునన్ మహాతపం
బోజ నొనర్పఁబోవుఁడు రక్షణోద్యమముంబొనరించి రప్పుడో
రాజవతంస! దైత్యనికరంబులపై నసమానసత్త్వవి
భ్రాజితమూర్తులౌచు నల ◊ వాసవసంయుతులౌ దివౌకసుల్. 243

క. చీమలచే దష్టంబగు, పాముగతిన్ వీఁడు లోకబాధాకరుఁ డు
ద్దాముఁడు స్వకీయపాపము, చే మెసవంబడియె నని వచించిరి వేల్పుల్. 244

తరల. అసురబాలకులార! ఘోరతరార్భటిన్ మఘువాది స
ర్వసురబృందములెల్లనుం దమపైని దాడులు నల్పుచున్
గసిమసంగుచునుండ నయ్యది ◊ గాంచి భీతిపరీతులై
యసురయూథపులప్డు పాఱిరి ◊ యన్నిదిక్కుల కందఱున్. 245

ఆ. దారపుత్రమిత్ర ◊ ధనగృహపశుపరి, చ్ఛదములం దపేక్ష ◊ వదలివైచి
యసురులెల్లరట్టు ◊ లసువులదక్కించు, కొనఁగఁ ద్వరితమగుగతిని బఱచిరి. 246

చ. విజయవిరాజమానులయి వేల్పు లనల్పబలంబుతోడ న
కృజముగఁగొల్లగొట్టి రథికంబగు రాజగృహంబునంత నా
దు జననియైన రాణ్మహిషిఁ దుర్ణగతిన్ గ్రహియించె నిర్జర
వ్రజపరిపాలకుండయినవాసవుఁ డర్భకులార! వింటిరే? 247

చ. సురపతినీయమానయగుచున్ భయకంపపరీవృతాంగియై
కురరియనం బరంగు పులుగుంబలెఁ బెన్మొఱఁబెట్టుచున్న యా

వరసతి నిచ్చ నచ్చటికి వచ్చిన నారదమౌని కాంచి ని
ర్జరవిభుతోడ నిట్లనియె సక్రమపద్ధతితోఁ బథంబునన్. 248

ఆ. అమరసార్వభౌమ! యనపరాధిని యైన, మగువను గొనిపోవఁ దగవుఁ గాదు
పరకళత్రమైన వరసతి నో మహా, భాగ! విడువు విడువు పరమకృపను. 249

ఇంద్రుఁడు:—

క. అవిషహ్యమగు సురద్వే, షివీర్య మీ లేమ గర్భసీమం గల దీ
యువిద ప్రసవించిన పదప, డి విడుతుఁ దజ్జాతుసుతు మడియఁ జేసి వెసన్. 250

నారదుఁడు:—

క. ఈ గర్భస్థుండు మహా, భాగవతుండును స్వయంప్రభావుఁ డనఘుఁడున్
ద్యాగి హరిభక్తుఁ డమలో, ద్యోగి సురాధీశ! యంత మొందఁడు నీచేన్. 251

క. అని చెప్పఁబడి సురర్షి వ, చనములు మన్నించుచు దివిషన్నాయకుఁ డిం
పున హరిప్రియభక్తిన్ నా, జననికి వలగొని బిరాన జనియెన్ దివికిన్. 252

గీ. అంత నాజనయిత్రి నా యమరముని ని, జాశ్రమంబునఁ జేర్చి సమాశ్వసించి
వత్సరో! నీవు నీభర్త వచ్చునంతఁ, దనుక నిట నుండుమనుచు మన్ననవచించె.

గీ. వల్లెయనుచు నా సాధ్వి దేవర్షివర్యు, నంతికమ్మున నకుతోభయాత్మయగుచు
దైత్యలోకాధినాథుండు తపమునుండి, మరలి రానంతదనుక సేమమున నుండె. 254

క. గర్భవతియైన సతి నిజ, గర్భక్షేమంబు మఱి సుఖప్రసవంబున్
నిర్భయమును మదిఁ గోరుచు, నిర్భరభక్తిన్ భజించె నిర్జరమౌనిన్. 255

క. కరుణాశీలుండగు ని, ర్జరమౌని సమర్థుఁ డగుచు సాధ్వికిఁ దెలిపెన్
గురుధర్మతత్త్వమున్ సు, స్థిరమగు జ్ఞానంబు నాకుఁ దెలుపఁ దలఁపునన్. 256

గీ. దీర్ఘకాలంబగుట మఱి స్త్రీయగుటను, దల్లికిన్ జ్ఞానసుది తిరోధానమందె
ఋషివరేణ్యుచేత ననుగృహీతు నన్ను, జ్ఞానసుది యిప్పుడున్ విడనాడకుండె.

ఉ. మీరలు నాదు వాక్యములు మేకొని ప్రత్యయముంతు రేని నై
శారదియైన బుద్ధియును శ్రద్ధయుఁ గైకొనుఁ డయ్యలార! సొం
పారఁగ నిక్కి స్త్రీలకును బాలురకున్ గ్రహణీయమే సుధీ
యారయ నేనుఁ జెప్పినది యంతయుఁ దథ్యము విశ్వసింపుఁడీ. 258

క. వావిరి జన్మాదిక ష, డ్భావ వికారములు గానఁబడు తనువునకే
లేనాత్మకుఁ గాలగతి మ, హావృక్షమునందు ఫలములట్లగుఁ దనువుల్. 259

వ. ఆత్మ నిత్యంబు, అవ్యయంబు, శుద్ధంబు, ఏకంబు, క్షేత్రజ్ఞంబు, ఆశ్రయంబు, అవి
క్రియంబు, స్వయంప్రకాశంబు, హేతువు, వ్యాపకంబు, అసంగి, అనావృతంబు

అను ద్వాదశపరమపురుషలక్షణంబుల నెఱింగి యహంమమరూపకంబైన దేహాదియందు మోహజనితంబగు నసద్భావముం ద్యజింపవలయు. 260

సీ. స్వర్ణకారుండు గ్రావములందుఁ దదభిజ్ఞుఁడై యోగముల హిరణ్యంబు వడయు
నట్టులే క్షేత్రంబులైన దేహంబులం, దాత్మయోగమున నధ్యాత్మవిదుఁడు
బ్రహ్మగతిం బొందుఁ బ్రకృతులష్టవిధముల్, మూఁడగుఁ దద్గుణములు వికృతులు
పదునాఱుగా మున్నుఁ బలికిరాచార్యులు, పురుషుఁ డొకండె సుండ డరసిచూడ

గీ. అఖిల సంఘాతమైన దేహంబది ద్వివిధంబు స్థావరమని జంగమంబనియును
నేతినేతివాక్యంబుల నిపుణతమెయిఁ, బోవిడుచుచు మృగ్యుండగుఁ బురుషుఁడింక.

వ. అన్వయవ్యతిరేకంబగు వివేకంబునను విశుద్ధంబగుమనంబున విమర్శితములు నసత్వరములునగు సృష్టిస్థితిలయంబులను నా పురుషుండిట్లు గవేషణీయుండగు. బుద్ధికి జాగరణంబు స్వప్నంబు సుషుప్తియను మూఁడువృత్తులుగలవు. ఆవృత్తు లెవ్వానిచే ననుభూతంబులగుచుండు నాతండధ్యక్షుండు, పరమపురుషుఁడనంబడు. త్రిగుణాత్మకంబులుఁ బరిక్లిప్తంబులుఁ గర్మజన్యంబులునగు బుద్ధిభేదంబుల గంధంబులచే వాయువుంబోలె నాత్మస్వరూపంబు నన్వయంబున నెఱుంగనగు. బుద్ధిద్వారంబైన సంసారంబు గుణకర్మనిబంధనంబై యజ్ఞానమూలంబై యపార్థంబై పురుషునకు స్వప్నంబుఁబోలెఁ గన్పట్టుచుండు. సర్వార్థంబులును, స్వప్నజాగరతుల్యంబులై మనోమయంబులగుట దృష్టంబులు నష్టంబులునయ్యు ధ్యాతకు శోకమోహభయప్రదంబులగుచుండు. పరుండు నిర్గుణుండునయ్యును గుణసంగంబు వలనఁ బురుషునకు ననిర్వృతియగు. ఈసంసారప్రవృత్తునకు జన్మాత్యయంబులు వ్యక్తంబగుచుండుంగాని స్వతస్సిద్ధంబులు కావు. కావునఁ ద్రిగుణాత్మకంబులగు కర్మములకు బీజదహనంబను యోగంబు మీచేతఁ గర్తవ్యంబు. ఆ యోగంబె బుద్ధిప్రవాహంబుగాఁ దలంపంబడు. 262

క. భగవంతుఁడు పరమేశుఁడు, నగు విష్ణునియందు భక్తియలవడుచెడు నీ
సుగమోపాయము భగవన్నిగదితమై యన్నిట నవిసనిందితమయ్యెన్. 263

సీ. బాలకులార! పావనగురుశుశ్రూష, భక్తిని సర్వలాభార్పణమున
సాధులౌ భక్తులసంగంబుకతన ని,రంతర మీశ్వరారాధనమునఁ
దత్కథాశ్రద్ధనుదద్గుణకర్మకీ, ర్తనమునఁ దత్పదధ్యానమునను
దచ్ఛుభమూర్తినందర్శనాదికముల, భగవంతుఁ డీశుఁడునగు హరి తగ

గీ. నెల్లభూతములందు వసించు ననుచుఁ, దన మనంబున భూతవితానములను
సామ్యభావంబుఁదోఁపంగ సంతతంబు, సర్వవిధముల మన్ననసేయవలయు. 264

గీ. బాలులార! కామాదిషడ్వర్గమునొగి, గెలువఁజాలినవారె కేశవలమాగురతిఁ
గలుగఁజేసెడు భక్తి నగ్గలిక మెఱయ, విష్ణుదేవునియందుఁ గావించుచుండ్రు. 265

ఉ. కేళి తనూకృతంబులగు కేశవుకర్మ గుణోరువీర్యముల్
మాలిమి నాలకించి తమిఁ మైఁ బులకల్ మొలువంగ బాష్పముల్
జాలుకొనంగ గద్గదికలన్ నయమొప్పఁగ ముక్తకంఠుఁడై
బాలకులార! యా జనుఁడు పాడును నృత్యముఁజేయు నేఁడుచున్. 266

మ. కడు నావేశముతోడ నాతఁడు గ్రహగ్రస్తుండునుంబోలె నొ
క్కఁడె తానేడుచు నొక్కచో మిగుల నాక్రందించు ధ్యానించు నొ
క్కెడ లోకంబునుజూచి మ్రొక్కును గతిశ్రీకుండునై యో ముకుం
దుఁడ! నారాయణ! లోకనాథ! హరియంచుం బల్కు నిట్టూర్పుచున్. 267

వ. అప్పుడు నరుండు ముక్తసమస్తబంధనుండై భగవచ్చేష్టిత భావనాధీనమనస్కుండై నిర్దగ్ధకర్మవాసనుండగుచు మహత్తరభక్తిప్రభావంబున నధోక్షజుం జేరు. అశుభ రాగాది యుక్తాత్ముఁడగు శరీరికి సంసారచక్ర నివర్తకంబగు నధోక్షజావలంబంబ బ్రహ్మనిర్వాణ సుఖంబని బుధులెఱింగిరి. కావున హృదీశుండగు భగవంతు హృదయంబున భజింపుఁడు. అసురబాలకులారా! యంతరిక్షంబుఁబోలె సత్స్వరూపుఁడగు శ్రీ విష్ణుదేవుని యుపాసనంబున నతిప్రయాసంబేమియగు? సర్వాత్ముఁడును సమస్తదేహులకు సఖుండునగు నధోక్షజునకు సామాన్యవిషయోపపాదనంబుల నేమిప్రయోజనంబగు? 268

ఉ. విత్త కళత్ర పుత్ర పశు వేశ్మ మహీ ద్విప కోశరూప సం
పత్తి విశేషముల్ సకలభాగ్యములున్ నిఖిలార్థ కామముల్
మొత్తమివెల్ల నెంతఁ బ్రియమౌనుంబొనరింపఁగఁ గల్గు నక్కటా!
మిత్తికిఱంగటన్ నతముమెల్లెడు మర్త్యున కెంచిచూడఁగన్. 269

తరల. అమలినంబులుగాక స్వాతిశయమ్ములై కనుపట్టు లో
కములు యజ్ఞకృతంబులారయఁగా క్షయిష్ణువులే సుఁడీ
యమలు నశ్రిత దృష్టదోషునినాత్మరూపుఁ బరేశునిన్
గొమరుమీఱ ననన్యభక్తినిఁగొల్వుఁ డాత్మసులబ్ధికై. 270

మ. వినుఁడో దైత్యతనూజులార! యిచటన్ విద్వాంసుఁడున్ మాన్యుఁడై
జనుఁ డే సౌఖ్యముఁగోరి కర్మచయముల్ సల్పుం దలంపంగఁ బొం
దునుగా తద్విపరీతమైన ఫలమున్ దుఃఖంబు వీడన్ సుఖం
బును బొందంగ యతించుఁగాని పడయుం బో దుఃఖము న్నిచ్చలున్. 271

గీ. తాను బూరుషుఁడిందు నెద్దానికినయి, కామ్యకర్మలచేత భోగములఁగోరు
భంగురము పరకీయమైనదై పరఁగునట్టి, తనువుకల్గుచునుండును దలఁగుచుండు. 272

గీ. దైత్యసుతులార! కడు మమతాస్పదులయి, పరగునీతను వ్యవహితాపత్యదార
విత్తగృహరాష్ట్రబలకోశభృత్యసచివ,హితులఁ బరకీయులని చెప్పనేల వేర. 273

గీ. అవిరతానందసాగరుండైనయాత్మ, కర్థములవలెఁదోఁచు చనర్థములయి
తనువుతోన నశించు నేతత్సమస్త, తుచ్ఛతరవిషయంబులతోఁబనేమి? 274

గీ. తెల్పుఁడీ దైత్యసుతులార! దేహికిందుఁ, బరవశతను నిషేకాద్యవస్థలందుఁ
గష్టములఁబొందువానికిఁ గర్మములను, స్వార్థమనునది యెంతసంప్రాప్తమగునో?

గీ. దేహియాత్మానువర్తియై దేహమునను, గర్మములను బ్రారంభించుఁ గర్మతుఁడయి
కర్మములచేత దేహంబుఁ,గల్గుచుండుఁ బొడమునుభయంబునవివేకమునన తెలియ.

గీ. కావునను మీరు ధర్మార్థకామములివి, యెవ్వని యధీనములయి వర్తిల్లుచుండు
నట్టి పరమాత్ము నీశ్వరు హరి ననీహు,హృదయమున భజియింపుఁడీ తృష్ణవిడిచి.

గీ. ఎల్లభూతములకును నాత్మేశ్వరుండు, ప్రియుఁడునైనట్టి హరియాత్మ కృతములై ప
రగు మహాభూతముల నొనర్పంగఁబడిన, ప్రాణులకు జీవసంజ్ఞుఁడై వరలుచుండు.

గీ. దైత్యబాలకులార! యాదిత్యుఁడైన, దానవుండైనఁ మానవుండైనఁగాని
యవలగంధర్వుఁడైనఁ ద,దన్యుఁడైన హరిచరణము భజించుచునందు శుభము.

ఉ. చాలదు దేవతాత్వము ద్విజత్వము నేని ఋషిత్వమేనియున్
బాలకులార! వృత్తమును బ్రాజ్ఞత దాన తపో వ్రతేష్టులున్
జాలవు విద్యయున్ వ్రతము శౌచము శ్రీహరిఁ బ్రీతుఁ జేయ వే
యేల? సుభక్తిఁ బ్రీతుఁడగు నీశుఁ డిఁకొండు విడంబనంబగున్. 280

గీ. సర్వభూతాత్మకుండు నీశ్వరుఁడును భగ,వంతుఁ డాత్మరూపుఁడునయి పరగెడుహరి
యందు నీకారణంబున ననవరతము, భక్తి నొనరింపుఁడో దైత్యబాలులార!

క. పాయక దైతేయులు ర,క్షోయక్షగణమ్ము స్త్రీలు శూద్రులు గోపుల్
వేయేల? ఖగమృగంబులు, నోయన నఘజీవులుఁ దగ నొందిరి ముక్తిన్. 282

క. పురుషునకున్ లోకంబున, బరమంబగు స్వార్థమింత వట్టి తెలియుఁడీ
హరియందు నియతభక్తియు,నెరి సకలమునన్ ముకుందునిం గాంచుటయున్.

---

## అధ్యాయము 8.

### శ్రీమన్నృసింహమూర్త్యవతారఘట్టము—హిరణ్యకశిపు వధ

నారదుఁడు:—

గీ. పదఁపడి యుధిష్ఠిరా! దైత్యబాలుర నిర, వద్యమగుట ప్రహ్లాదాభివర్ణితమగు
భవ్యనిష్ఠను స్వీకరింపం గడంగి, యుల్లముల గురుశిక్షితత మొల్లరైరి. 284

క. అంతట వారలమతి యే, కాంతస్థితమగుటఁ దెలిసి యాచార్యసుతుం
డెంతయు భీతిలి యయ్యది, సాంతముగా రాజునకు వెస నివేదించెన్. 285

క. తనసుతు నప్రియమైన య, వినయంబును గురుసుతుండు వివరింపఁగ నా
దనుజేంద్రుఁడు విని కినుకన్, దనువు వణంకన్ వధింపఁ దలఁచెన్ సుతునిన్. 286

మ. పరుషోక్తిన్ దదనర్హుఁడైన తనయున్ బ్రహ్లాదునిన్ ధిక్కరిం
చి రుషావేశకరాళమౌ కుటిలదృష్టిన్ బిట్టు వీక్షించుచున్
చరణప్రాహతమైన పన్నగము నోజన్ రోజుచున్ రాజు దు
ర్భరుఁడై యిట్లనె ప్రశ్రయావనతునిన్ బద్ధాంజలిన్ బాలునిన్. 287

హిరణ్యకశిపుఁడు:—

గీ. దుర్వినీత! కులాంగార! దుష్టహృదయ!, బ్రనుసి మచ్ఛాసనోల్లంఘనము సలిపిన
నిన్ను నిద్దె కృతాంతుమందిరమునకును, బంపువాఁడను జూడుము తెంపు మీఱ.

గీ. పాలకయుతంబులైన జగాలు మూఁడు, నెవఁ డలిగినఁ గంపంబు వహించునట్టి
బలియుఁడను నాదునాజ్ఞ నే బలముఁ గలిగి, మీఱితి వభీతుఁడవు బోలెమించి మూఢ!

ప్రహ్లాదుఁడు:—

గీ. నాక కాదు కేవలము నీకు మఱియు, బలియురగు నన్యులకుఁ గూడ బలమతండె
పరము లపరంబులుం జరాచరములు మఱి, బ్రహ్మముఖ్యులు నతనికి వశులు కారె.

ఉ. ఆతఁడె కాలుఁడున్ బహుపరాక్రముఁ డీశ్వరుఁ డోజమున్ సహం
బాతతసత్త్వమున్ బలము నాదిగ శక్తులుఁ గల్గువాఁడు సు
మ్మాతఁడె స్వీయమాయను నిరంతరమున్ ద్రిగుణేశుఁడై పటు
ఖ్యాతి సృజించుఁ బెంచు నణఁగార్చును గాదె సమస్తవిశ్వమున్. 291

చ. అమలినబుద్ధి నీవు నిఁక నాసురభావమునుం బరిత్యజిం
పుము సమతన్ జెలంగ మనసుం గుదియింపుము సంతతంబు బహూ
గ్గమున వసించుచున్ వశమున కాక మెలంగు మనంబు దక్క వి
శ్వమునను లేరు వైరు లటు సామ్యము నొందుట యాశు సర్వదా. 292

ఉ. ఆదిని నెల్లఁ గొల్లఁగొనునట్టి దుర్వార దస్యుల గల్వలేక యు
ష్మాదృశులైన కొందఱు దశోల పదిగెల్చితి మంచు నెంత్రు న

మోదముతోడ సాధువున్ భూతసముండు హితాత్ముఁడైన జ్ఞా
నోదయ శాలికిన్ గలుగునొక్కొ విమోహజులైన శాత్రవుల్. 293

హిరణ్యకశిపుఁడు:—

క. నీవో మూఢ! ధ్రువముగన్, జావఁదెగించితి వికత్థనము సల్పెదిటుల్
గావున మరణోన్ముఖులకు, వేవిధములఁ బొడము నిల్లైవిప్లుత వాక్కుల్. 294

ఉ. 'ఎన్నఁగ మందభాగ్య! యిపుడీవు వచించిన యట్టివాఁడు నా
కన్ననుమిన్నయై తగు జగద్విభుఁ డన్యుఁడు కల్గె నేని వాఁ
డున్న స్థలంబుఁ జూపుమి' 'యహో! యతఁడంతట నున్నవాఁడుగా'
'క్రన్నన మేటికంబమునఁ గన్పడఁడే?' 'కనవయ్యె వాఁడుగో.' 295

ఉ. ఓయి దురాత్మ! యీపగిది నూరక ప్రేలుచు నున్నయట్టి నీ
కాయమునుండి శీర్షమును గ్రన్నన భిన్నముఁ జేయువాఁడఁ జు
మ్మీ యిఁక నీవు భృత్యగతి నెవ్వనినిన్ శరణంబు నొందితో
యాయన వచ్చి నిన్ను మరణోన్ముఖు నా హరి ప్రోచుఁ గావుతన్. 296

ఉ. ఈగతినిన్ దురుక్తులఁ గ్రుధోరితమానసుఁడౌచు నమ్మహా
భాగవతున్ సుతున్ విషమభావము దోఁపగ నొవ్వఁజేయుచున్
దాఁగొని ఖడ్గమున్ సుమహితాసనభాగమునుండి లేచి వే
వేగ మహాబలుం డసుర పేర్చి స్వముష్టినిఁ గొట్టె స్తంభమున్. 297

—శ్రీమన్నృసింహమూర్త్యవతార ఘట్టము—

శా. ఆ కంబంబుననుండి పుట్టె రవ మత్యంతంబు భీతిప్రదం
బై కంజాతభవాండ కర్పరము చయ్యన్ వ్రయ్యలౌనట్లుగాన్
లోకేశాదులు స్వీయలోకముల యందున్ వ్యాప్తమా తద్రవం
బాకర్ణించి స్వకీయధామ లయమౌ నంచెంచి రప్పట్టునన్. 298

చ. తనుజునిఁ జంపు తెంపునఁ గ్రుధాకలితుండయి దాపుఁ జేరు నా
దనుజుఁ డపూర్వమద్భుత ముదాత్తమునైన మహానినాదమున్
విని ఘనదైత్యయూథపుల భీతిపరీతులఁ జేసినట్టి యా
ధ్వనికిని నెందుఁ జూచిన సభాస్థలి హేతువుఁ గానఁడయ్యెఁ దాన్. 299

మ. అవనీశా! నిజభృత్యభాషితము సత్యంబుం బొనర్పంగ భూ
తవితానంబులయందు నెల్లెడల నాత్మవ్యాప్తి రూపింపఁ జే
య విభుండంత మృగంబు మానుషముఁ గాకత్యద్భుతాపాదకం
బవు రూపంబును దాల్చి స్తంభమున దృశ్యత్వంబు నొందెన్ సభన్. 300




శ్రీ నృసింహమూర్తి

మ. దనుజాధీశ్వరుఁ డత్తఱిన్ ద్రుతగతిన్ దత్స్తంభ మధ్యంబునం
దు నిటుల్ దోఁచిన సత్త్వముం గనియు నెంతో భ్రాంతిఁ దర్కించెఁ గాఁ
డు నరుండున్ మృగమేని కాదిది మహాటోపంబు దీపింపఁ బొ
ల్చె నృసింహాకృతిఁ దాల్చి బాపురె! కడున్ జిత్రంబటం చాత్మలో. 301

శా. అత్యంతంబు భయానకంబగు నృసింహాకారమున్ భ్రాంతి నా
దైత్యాధీశుఁడు కాంచి యీ తెఱఁగునన్ దర్కించుచుండన్ దదా
ద్ధత్యంబెల్ల నణంగ సాధ్వభిమతార్థంబెల్లఁ జెల్లంగఁ దా
నత్యాశ్చర్యముఁ గాఁగఁ గట్టెదుటఁ జయ్యన్నిల్చె శ్రీవిష్ణుఁడున్. 302

సీ. స్ఫురితజటాళి కేసర లసద్వదనంబు, సంతప్తకాంచ నోజ్జ్వలనయనము
నాభీల దంష్ట్రంబు నసిచంచలక్షురాం, తాతినిశాత జిహ్వాంచలంబు
భ్రుకుటీముఖోల్బణంబు నునిశ్చలోర్ధ్వ క, ర్ణంబును గిరికందరాద్భుతంబు
వ్యాత్తాస్యనాసంబు హనుభేదభీషణ, మంబరచుంబి కాయంబు మఱియు

గీ. హ్రస్వపీవర గ్రీవమ్ము నతివిశాల, మహితవక్షస్కమున్ దనుమధ్యమంబు
చంద్రకర గౌరరోమతీక్ష్ణము నఖాయు, ధమ్ము నభిశోభుజాళిశతమ్మునగుచు.

క. దురవాపము సర్వనిజే, తరాయుధవరాభి భూత దైత్యగణమునై
పరగుచు నపుడా నరసిం, హరూప మొప్పారె విస్మయావహ మగుచున్. 304

శా. ఏవం రూపవధంబు నాకునయి దానిల్లించెఁ గానోపు మా
యావిశ్రేష్ఠుఁడు విష్ణుఁడైనను జడుండౌ వీనిచే నేమగున్
భావింపంగ నటంచు నెంచి చలమొప్పన్ దైత్యముఖ్యుండు న
ద్దేవున్ మానవకేసరిన్ గవిసె నుద్వృత్తిన్ గదాపాణియై. 305

చ. జ్వలదురు వహ్నియందు శలభంబు క్రియన్ దితిజేశ్వరుండు స
ద్విలసితుఁడై నృసింహు ఘనతేజమునందు నదృష్టుఁడయ్యె మున్
ప్రళయమునందుఁ బెన్దమముఁ బానముఁ జేసియు సత్త్వధాముఁడై
యలరెడు దేవు తేజమున నా దితిపుత్రుఁ డడంగు టబ్రమే? 306

చ. పిదప మహాసురుండు పృథువేగసమన్వితమై తలిర్చు పె
ద్గదను ధరించి భీషణముగా నెదురించె మృషానృసింహు భీ
ప్రదమగు పన్నగంబును సుపర్ణుఁడు వోలె గదాధరుండు ను
ద్గముఁడయి విక్రమించు పెను దానవనాథునిఁ బట్టె బ్రేల్మిడిన్. 307

మ. లలిఁ గ్రీడించు సుపర్ణునుండి యల వ్యాళంబట్లు మాయానృసిం
హాలసద్ధస్తమునుండి జారిపడె దైత్యాధీశ్వరుం డప్డు వ్యా

కులులై యట్టివిధం బసాధువనుచున్ క్షోణీశ! భావించి రా
త్మల లోకాధిపతుల్ ఘనాంతరితులై తద్భీతి నాయస్తులై. 308

చ. దనుజవరేణ్యుఁ డత్తఱిని దత్కరమందుననుండి ముక్తుఁడై
ఘననిజవీర్య శంకితునిఁ గా నరకేసరినిం దలంచుచున్
దనపృథుఖడ్గ చర్మములఁ దాలిచి క్రమ్మఱ నా నృసింహు నే
ర్పునఁ గవిసెన్ గతశ్రముఁడు పోలె జవాతిశయంబుఁ దోఁపఁగన్. 309

ఉ. అమ్మెయి శ్యేనవేగుఁడయి యా దితిపుత్త్రుఁడు ఖడ్గచర్మమా
ర్గమ్ములఁ గ్రిస్ననన్ నిరవకాశత మీఁదికిఁ గ్రిందికిన్ వడిన్
గ్రుమ్మఱ మీఁటి తాఁకు నసురున్ ఖర భూరిరవోల్బణాట్టహా
సమ్మొనరించి తా సరభసమ్ముగఁ బట్టె నృసింహుఁ డుద్ధతిన్. 310

ఉ. వ్యాళము మూషికమ్ము వలెఁ బల్మినిఁ బట్టె మహాహిఁ దార్క్ష్యుఁడున్
బోలె నృసింహరూపుఁడు విభుం డిటునట్టును గుంజులాడు దం
భోళిముఖాక్షతత్వచుని ముష్కరు దైత్యుని ద్వారభూమినిన్
హేల నిజోరువం దునిచి యేర్పడఁ జీల్చెఁ గన న్నఖంబులన్. 311

సీ. పృథులసంరంభ మస్రప్రేత్యభీషణలోచ, నుండును వ్యాప్తాననుండు నమిత
రుధిరవసాప్లుతారుణ కేసరాస్యుఁడై, నాకుచు నెడనెడం దనదు జిహ్వా
ద్విరదరాజమును జంపిన మృగేంద్రము భంగి, ప్రేక్షకులకు నతిభీషణుఁడయి
ప్రేవులప్రోవులు పేరులుగా మెడ, నిండఁ దాలిచి కడు నిష్ఠురతను
గీ. పృథునఖాంకురోత్పాటితహృత్సరోజు, నసురనాథుని విడిచి యుదాయుధులగు
దదనుయాయులఁ దత్తుల్యదర్పయుతులఁ, బెక్కుర నఖాయుధమ్ములనుక్కడంచె.

చ. నృహరి సటావధూతమయి నీరదపంక్తి వికీర్ణమయ్యె వే
గ్రహములు దీప్తిమాసె రుచిరంబగు నవ్విభుదృష్టిఁ జేసి శ్వా
సహతములౌచు క్షోభిలెను సాగరముల్ దిగిభవ్రజంబు దు
స్సహరవ భర్త్సితంబులయి చయ్య మదంబును డించె దీనతన్. 313

మ. నృవరేణ్యా! కుహనానృకేసరిసటానిస్సారితవ్యోమయా
నవితానాధికసంకులంబగుచుఁ గప్పెన్ నభోభాగ ము
ప్డవనీభాగమునయ్యెఁ దత్పృథుల పాదాఘాతనిష్పిష్టమై
జవయుక్తి న్నెగసెన్ గిరుల్ మెఱయ వాశావ్యోమముల్ తత్ప్రభన్. 314

ఉ. ఆ సమయంబునన్ గొలువునందు సమున్నత రాజమాన సిం
హాసనతలోపవిష్టుఁడగు నక్షత తేజు ప్రచండవక్త్రి సం

తాపసకరోగ్రరూపునిఁ గ్రుధాయుతు నప్రతిమాను నవ్విభున్
దా సవిధంబుఁ జేరుటకు దక్షుఁడు గాఁ డొకఁడేని యచ్చటన్. 315

మ. తలయేరుంబలె ముజ్జగంబులకు బాధం గూర్చియున్నట్టి యా
ఖలచిత్తుండగు నాదిదైత్యు రణరంగక్షోణిఁ బోకార్చె న
త్యలఘుం డా హరి యంచు నిర్జరసతుల్ హర్షప్రఫుల్లాస్యలై
పొలుపొప్పం గురియించి రాతనిపయిం బుష్పోరువృష్టుల్ తమిన్. 316

శా. ఉర్వీనాయక! తద్దిదృక్షు వొదలం దువ్విళ్ళు గొల్పన్ దివిన్
సర్వామర్త్యులు మూఁగి రప్పుడు విమానశ్రేణితో సందడిన్
మువ్వై యానకదుందుభుల్ క్రమగతిన్ మ్రోసెన్ ముదం బొప్ప గం
ధర్వుల్ పాడిరి యాడి రప్సరసలు నైపుణ్య మేపారఁగన్. 317

సీ. బ్రహ్మరుద్రేంద్రాదిబర్హిర్ముఖుల్ పితరులు ఋషుల్ విద్యాధరులు నురగులు
మనువులు గంధర్వులును బ్రజాపతులును, యక్షులు చారణు లప్సరసలు
కిన్నరుల్ సిద్ధులుఁ గింపురుషులు భూత, భేతాళగణములుఁ బ్రీతిఁ దనర
విష్ణుపార్షదులయి వెలుగొందెడు సునంద, కుముదప్రభృతులు మూర్ధములయందు
గీ. వినిహితాంజలిపుటులయి వేఱువేఱ, నమితతేజస్వియగుచు సింహాసనమునఁ
గూరుచుండిన పటురంహు నారసింహుఁ, బ్రస్తుతించిరి నాతిదూరస్థులగుచు.

బ్రహ్మ :—

తరల. నతుఁడ నౌదు దురంతశక్తి యనంతుఁడున్ శుభకర్ముఁ డ
ద్భుతపరాక్రముఁడై స్వమాయను బూని విశ్వసముద్భవ
స్థితిలయంబులు సత్వరీతినిఁ జేయు నవ్యయమూర్తికిన్
గృతకమానవసింహరూపున కిద్ధతేజునకున్ సదా. 319

రుద్రుఁడు :—

గీ. కోపకాలము దలఁప నీకున్ యుగాంత, మల్పుఁ డీ యసురుండు హతుఁ డయ్యెఁ
గావునం గావుమో దేవ! కరుణ నీదు, భక్తుఁడైన ప్రహ్లాదుని భక్తసులభ! 320

ఇంద్రుఁడు :—

స్రగ్ధర. ప్రత్యానీతంబు లయ్యెం బరమపురుష మా భాగముల్ దేవ నీచే
దైత్యాక్రాంతంబు త్వత్సద్మమగు హృదయపద్మమ్ము నుద్బుద్ధమయ్యెన్
నిత్యంబు న్నీకుఁ బూజల్ నెఱపు బుధులకున్ వింతయే యిద్ది వేద
స్తుత్యా! మోక్షంబు నేనిన్ దొడరరు గొనఁ బ్రాజ్ఞుల్ దదన్యంబు లేలా? 321

ఋషులు :—

మత్తకోకిల. ఆదిపూరుష! యే తపంబున | నాత్మలీనజగంబుఁ గ
ల్పాది సల్పితొ యా తపంబునె | యాత్మతేజము నట్టు ల
త్యాదరంబున మా కొసంగితి | వద్ది యీఖలుచేతఁ బెం
పేది లుప్తముగాఁగ వెండియు | నిచ్చితిప్పుడు త్రాతవై. 322

పితరులు :—

కవిరాజవిరాజితము. ప్రసభగతిన్ సుతదత్తములై తగు | శ్రాద్ధములన్ భుజియించెను దీ
ర్ఘసమయమందుఁ దిలాంబువులన్ మఱి | డ్రావెను వీఁడిపు డచ్యుత! ర
క్కసునుదరంబు నఖంబులఁ జీలిచి | క్రన్న వసాదికమెల్లఁ గడున్
వెస హరియించితి ధర్మవిధాతకు | నీకు జొహార్లు నృసింహవిభూ! 323

సిద్ధులు :—

ఉ. యోగతపోబలంబున మ | దోద్ధతుఁ డీ దనుజేశ్వరుండు మా
యోగసుసిద్ధసద్గతిని | నోజ హరించెను దేవదేవ! యా
యోగడ మెల్ల నిప్పు డణ | గార్చి నఖంబులఁ జీల్చి యీ దురు
ద్యోగినిఁ బట్టి చంపితి య | ధోక్షజ! నీకు నివే నమస్కృతుల్. 324

విద్యాధరులు :—

ఉ. దారుణవిక్రముండు బల | దర్పయుతుండగు వీఁడు దాఁ బృథ
గ్ధారణఁ బ్రాప్తమైన నము | దంచిత విద్యను ధిక్కరించెఁ గే
ళీరతి నీతనిం బశువు | లీల నురమ్మును వ్రక్కలించి సం
హారముఁ జేసినాఁడవు మ | హాత్మ! నృకేసరి! నీకు మా నతుల్. 325

నాగులు :—

క. మా కాంతామణుల మణుల, నీకర్కశహృదయుఁడు హరి | యించెన్ వీనిన్
బోకార్చి తదానందముఁ, జేకూర్చితి ప్రణతులివె నృ | సింహా! నీకున్. 326

మనువులు :—

క. మనువుల మేము త్వదాజ్ఞన్, బొనరింతుము ధర్మసేతు | వులఁ జెరచిన యీ
దనుజు దునిమి మేల్సేసితి, పనుపుము భృత్యులను వలయుఁ | బనికి మముం బ్రభూ!

ప్రజాపతులు :—

ఉ. ఈవు మముం బ్రజాపతుల | నెల్ల సృజించితివైనఁ గాని బ
ల్చేవను వీనిచేఁ బ్రతి | షిద్ధులమై ప్రజలన్ సృజింపలే
కీ విధినుంటి మీ కుమతి | యిప్డు భవన్నఖభిన్నవక్షుఁడై
తా వెసఁ గూలె లోకశుభ | దంబగు నీ యవతారమో ప్రభూ! 328

గంధర్వులు:—

క. ఓయీశ! నీకు నటులము, గాయకులము మమ్ము వీఁడు ఘనవీర్యబలా
జేయుఁడు లోఁగొని వీని గ, తాయునిఁజేసితివి కుశలమగునె ఖలునకున్. 329

చారణులు:—

చ. వరద! దయాస్పదా! భవ నివర్తకమైన త్వదీయ పాదతో
యరుహము నాశ్రయించి యనయమ్ము నయమ్మున సంచరించు కిం
కరులము చారణాఖ్యులము కర్కశచిత్తుఁడు వీఁడు సాధుశే
ఖరులకు బాధఁజేసెను జగత్పతి! చంపితి వీని నుద్ధతిన్. 330

యక్షులు:—

ఉ. నేము పరిధానభృత్యులము నీకు వినీతులమౌచు నిచ్చలున్
స్వామి! మనోజ్ఞకర్మల నొనర్చుచునుందుముగా దయానస
గ్రా! మము వీఁడు వాహకులఁగా నియమించెను లోకభీషణున్
దామసచిత్తునిం దగ వధం బొనరించితిగా నృకేసరీ! 331

కింపురుషులు: —

క. స్వామీ! వినుము కింపురుషుల, మేము మహాపురుషుఁడవు పరేశుఁడ వీ
తామసుఁడు నిహతుఁడయ్యె ను, ధీమండన! సాధులోకధిక్కృతుఁడగుటన్. 332

వైతాళికులు:—

చ. వరసభలందు సత్రములఁ బావనమైన భవద్యశంబు భా
స్వరగతిఁ బాడి యంచితసపర్యలఁ గొందుము మేము దేవ! కా
పురుషుఁడు వీఁడు లోఁగొనె మముం బ్రసభంబున నిష్ఠు నీవు సం
హరణ మొనర్చియుంటిగద యామయముంబలె దైవయుక్తికిన్. 333

కిన్నరులు:—

గీ. కిన్నరులమేము దేవ! నీకింకరులము, వెట్టి సేయింపఁబడితిమి వీనిచేత
నిట్టి పాపాత్ముఁబోకార్చినట్టినీవు, మాకు నిశ్శ్రేయసముఁగూర్పుమా నృసింహా!

విష్ణుపార్షదులు:—

చ. శరణవిధాయకా! భువనసౌఖ్యద మద్భుతమై తనర్చు నీ
నరహరిరూపమున్ ముదమునం గనినారము వీఁడు నీదు కిం
కరుఁ డల విప్రశాపమునఁగాదె? యిటుల్ ప్రభవించె నో ప్రభూ!
అరయ ననుగ్రహంబునకె యీ నిధనంబిది వీని కీగతిన్. 335

## అ ధ్యా య ము 9.

### ప్రహ్లాదకృత నృసింహస్తుతి

నారదుఁడు:—

గీ. ఈగతిం బ్రహ్మరుద్రపురోగములగు, నాదితేయాదులెల్లరు నధికకోప
సంభ్రమావిష్టు దురవాపు జగదధీశు, నానృసింహునిఁ జేరలేరైరి క్షితిప! 336

మ. వినుతత్ప్రాంతముఁ జేరఁగాఁ దలకు చక్రవ్వేల్పుల్ నృసింహున్ బ్రస
న్నుని గావింపఁగఁ బంచి రా హరికి విన్నదుం జేయు సాక్షాత్తు ల
క్ష్మి నదృష్టాశ్రుతపూర్వమాట నపుడా శ్రీదేవి యయ్యద్భుతం
బును వీక్షించియు జంకుతోడ దరియంగఁబోఁ జాలదయ్యె న్నృపా! 337

ఉ. ఆదటఁ బద్మయోని తనయంతికభాగమునందునున్న ప్ర
హ్లాదునిఁజూచి నీవు చనుమయ్య భవత్పితకై ప్రకోపితుం
డై దరిఁజేరరాక చతురాననాది గొప్పడు నీ నృసింహునిన్
శ్రీదుఁ బ్రశాంతుఁజేయుమని చెప్పి తగన్ బనిచెన్ యుధిష్ఠిరా! 338

ఉ. 'వల్లె' యటంచు నా పరమభాగవతుండగు నర్భకుండు దా
నల్లన శ్రీనృసింహుని సమక్షము మెల్లఁగఁ జేరి ప్రీతిసం
ఫుల్లముఖాంబుజుండగుచుఁ బూన్కిఁ గృతాంజలియై తనూలతా
వేల్లితభూమిభాగుఁడయి వేడుక మ్రొక్కె వసుంధరావరా! 339

మ. నరసింహుండు స్వపాదమూలమున దండంబుంబలెంబడ్డ భ
క్తిరతున్ బాలకు లేవనెత్తి కరుణార్ద్రీభూతచేతస్కుఁడై
యురుకాలాహివిభీతబుద్ధులకు సద్యోనిర్భయాపాదిన
త్కరపద్మంబును వాని మూర్ధమున మోదంబొప్ప నుంచెన్నృపా! 340

శా. బాలుం డంత నృసింహదేవు కరసంస్పర్శంబునం బాపముల్
దూలం దత్క్షణమాత్ర జ్ఞానము సముద్భూతంబుఁగాఁగన్ మదిన్
జాలన్ సౌఖ్యము జెంది యార్ద్రమతి హృత్పద్మాంతరాత్ముఁడున్ మోదబా
ష్పాలోలాక్షుఁడు నాచుఁ దచ్చరణకంజాతంబు నిల్పెన్ హృదిన్. 341

గీ. అంత నేకాగ్రమతిని సమాహితుఁడయి, హృదయమునఁ వీక్షణంబులు నృహరియందు
నునిచి ప్రేమాతిశయగద్గదోక్తులనిటు, స్తోత్రమొనరించె నచ్యుతు స్తోత్రపాత్రు.

ప్రహ్లాదుఁడు:—

చ. అనుపమసత్త్వనిష్ఠులగు నంబుజసంభవముఖ్య నిర్జరుల్
మునులును సిద్ధులున్ నిరతమున్ బహురూపవచఃప్రవాహ గుం

భనల మహాగుణంబుల సమర్థులుగా రెవనిన్ భజింప నా
ఘను హరిఁ బ్రీతిఁ జేయుటకుఁ గా నెటులోర్తును నుగ్రజన్ముఁడన్. 343

మ. బలముం దేజము నోజమున్ శ్రుతము రూపంబుం బ్రభావంబు స
త్కులమున్ విత్తము బుద్ధి పౌరుషము వైదుష్యంబు యోగంబు ని
ర్మలభావుండగు విష్ణుదేవుఁ దనియింపంజాల వంచెంతుఁ గే
వలమా భక్తినె తుష్టుఁడయ్యె హరి భావంబందు దంతీంద్రుకై. 344

చ. అనుపమరీతి ద్వాదశగుణాన్వితుఁడయ్యు సరోరుహోదరాం
ఘ్రినలినదూరుఁడౌ ద్విజవరేణ్యునికంటె శ్వపాకుఁడేనిఁ దా
ననయము వాఙ్మనఃక్రియలునర్థముఁ బ్రాణము నీశ్వరార్పణం
బొనరుప శ్రేష్ఠుఁడౌఁ గులమునోము మదాన్వితుఁ డట్లు కాదుగా. 345

తరల:- అభిలషింపఁడు పూజలం దనకాత్మలాభ సుపూర్ణుఁడౌ
ప్రభుఁడు మూఢజనంబునుండి కృపాళుఁడై కొను నే సప
ర్య భగవంతునకున్ జనుండిడునద్దియాఁదనకే సుదీ
ప్తి భరితాననశోభ తత్ప్రతిబింబసంగత మౌనటుల్. 346

ఉ. కావున నోపినట్లు మదిఁగల్గిన విక్లబతం ద్యజించి యీ
దేవు మహత్త్వసంపద నుతించెద నీచుఁడనయ్యు నెట్లొ మా
యావృతి ఘోరసంసరణమందు నిపాతితుఁడైన పూరుషుం
డీ విభు భూరిశక్తి నుతియించిన మాత్ర పునీతుఁ డయ్యెడున్. 347

సీ. దేవ! యీ బ్రహ్మాదిదేవత లెల్లరు, సత్త్వధాముఁడవై యెసంగు నీదు
నాజ్ఞాకరులు కారె? యసురులమైన మా, భంగి నిన్ ద్వేషించువారు కారు
భవదీయ భయదరూపంబును బొడఁగాంచి, భీతిల్లుచుండిరి వెలుపుఁ దీర్ప
తగ భగవంతుఁడవగు నీ శుభావతా, రంబులనగు విహార క్రమంబు
గీ. లీ సమస్తవిశ్వంబులకెల్ల వేళ, క్షేమమునకును సంపత్తికిని వినిర్మ
లాత్మసుఖమునకును బొలుపారుచుండుఁ, గాని భయదాయకంబులు కావుగాదె.

ఉ. క్రోధము సంహరింపు మసురుండు నిటుల్ హతుఁడయ్యె నాత్మలన్
సాధులు మోదమందిరి వెసన్ ఫణివృశ్చిక హత్యచే బలెన్
బాధ తొలంగె లోకము లపారసుఖంబునఁ బొంగె నో జగ
న్నాథ! నృసింహ! రూపిది జనంబు స్మరింప భయాపహంబగున్. 349

మ. అరుణాక్షంబుఁ గరాళజిహ్వము నితాంతతాఖీలవక్త్రంబు భీ
కరదంష్ట్రింబు సముత్కటభ్రుకుటి యుక్తం బాంత్రమాలాయుతం

బరిభిచ్ఛాతనఖంబు ఘోరరవభీరతా శేభమున్ రక్తకే
సరమా నీ నరసింహరూపమున నేనంత్రాసమందం బ్రభూ! 350

మత్తకోకిల. నారసింహా! విభీతిఁ జెందుదుర్నామనంబున ఘోర సం
సారచక్రసముత్కటార్తి నృశంసకావళిలోనఁ దెం
పారఁ గర్మనిబద్ధచిత్తుఁడనై తి నెన్నఁడు నన్ను వి
స్ఫారమోక్షదమైన నీ పదపద్మమూలముఁ జేర్తువో? 351

వ. ప్రియవియోగాప్రియసంయోగ సంభవశోకపావకంబున సమస్తయోనులం దహ్యమానుఁడనై తి. తద్దుఃఖప్రతీకారంబును దుఃఖంబయగు. ప్రభూ! దేహాద్యభిమానంబున మూఢచిత్తుఁడనై భ్రమించుచుంటినిగాన భవద్దాస్యయోగంబును బ్రసాదింపుము. ప్రియుండవు సుహృదుండవు పరమదైవతంబవగు నీదు బ్రహ్మగీతంబులగు కథావిశేషంబుల నభివర్ణించుచు గుణవిప్రయుక్తుండనై భగవత్పాదభక్తులగు పరమహంసల సంగంబునంజేసి దుఃఖంబుల నిస్తరింతు. 352

చ. జలనిధిమగ్న నౌకయు రుజాపరిపీడితు నౌషధంబు ని
మ్నలఁ దలితండ్రు లర్భకునిఁ బోచుటకుం బరికింపఁగా నశ
క్తులెగద దేవ! తత్ప్రతివిధుల్ త్వదుపేక్షితులైన దేహధా
రులకును నంతమాత్రమగుఁ గాఢగఁ దాతవు నీవ యెల్లకున్. 353

వ. ఈ విశ్వంబున నెవ్వఁ డెవ్వనిచేఁ బ్రేరితుండై పిత్రాద్యపరంబును, బ్రహ్మాదిపరంబునగు భావంబున నెద్దానియందు దేనివలన నే సమయంబున నే ప్రదేశంబున దేనికొరకు నే కతంబున నెట్లు దేనిని నుత్పాదించి రూపాంతరంబునొందించునది యెల్ల భగవంతుండవగు నీ స్వరూపంబ. పురుషానుమతంబగు కాలంబునఁ బ్రేరితగుణయగు మాయ కర్మమయంబును బలీయంబునగు మనంబును సృజించు. అవిద్యాకృతషోడశారసంసారచక్రంబగు ఛందోమయంబైన మనంబును ద్వదాశ్రితుండు గాక తదన్యుం డెవం డతిక్రమింపఁ గలండు. దేవా! నీవు స్వశక్తి నిర్జితబుద్ధిగుణుండవు. వశీకృతకార్యకారణ శక్తిసంపన్నుండవు. కాలాత్మకుండవు. కావున మాయాకృతంబగు షోడశారసంసారచక్రంబున నిష్పీడ్యమానుండనగు నన్ను భవత్సన్నిధానంబునకు నాకర్షింపుము. 354

చ. కుతుకముఁ గూర్చుచున్ జనులకున్ స్పృహణీయములైన సర్వ ది
క్పతులయు నాయువున్ సిరియు గానై భవముంగని యొంటివాఁడ మ
త్పితృకుపితాట్టహాస సముదీర్ణతరభ్రుకుటీ విజృంభ నా
శితులయి రట్టె దైత్యవరుఁ జీల్చితి వీవు నఖంబులం దృటిన్. 355

ఉ. కావున నేను బ్రహ్మాదసుస్సకంగల దేహుల యాయు రర్థముల్
శ్రీవిభవంబులాదిగ నశ్శేషములైన పరిక్లృప్త భోగముల్
భావమునందుఁ గోర సవిశ్వవ్యర్థములై చెడుఁ గాలరూపుఁడౌ
దేవునిచేత నన్ననుమస్తింపుము తావక సేవకాళిలోన్. 356

మ. మృగతృష్ణాప్రతిమానభోగముల నస్థింగోరుచున్ సర్వరో
గ గృహంబైన కళేబరంబుపయి సక్తత్వంబునుం బొంది పెం
పగు కామాగ్ని ని దుఃఖసాధ్య సుఖలేశావాప్తిఁ జల్లార్చుచున్
విగతజ్ఞానుఁడు దీనుఁడై కనఁడు నిర్వేదంబు విద్వాంసుఁడున్. 357

చ. సరవిఁ దమోధికంబును రజఃప్రతిపన్నమునైన యీ సురే
తరకులమందుఁ బుట్టిన యస్థన్యుఁడనేడ? తలంచి చూడఁ ద్వ
త్కరుణ యదేడ? నిర్వృతివిధిగా పరమేష్ఠికి శూలికిన్ రమా
తరుణి కలభ్యమైన కరతామరసంబును నాశిరంబునన్. 358

చ. జగముల కాత్మమిత్రుఁడవుస్జంతువుకుంబలె నుచ్చనీచ బు
ద్ధి గలుగఁబోదు నీకు గణుస్తింపఁ బ్రసాదము సేవఁబట్టియే
తగఁ బ్రభవించుచుండును గదా? సురశాఖికిఁ బోలె సేవచే
నగుఁ దగువృద్ధి కాదిటఁ బరావరభేదము హేతువెన్నఁగన్. 359

చ. అరయ భవాహికూప పతితాత్ములుఁ గామవిమూఢులైన పా
పరతుల దుష్టసంగమునఁబట్టి నశింపఁగనున్న నన్ని ని
ర్జరముని స్వీకరించుటనుసమ్మతి నీవు ననుగ్రహించి తో
వరద! నృసింహ! యేపగిదిఁబాయుదుఁ దావక భృత్య సేవలన్. 360

మ. కరవాలంబుధరించి పాపమతి నాకంఠెన్ బరుండెవ్వఁడీ
శ్వరుఁడి ద్దాతఁడు నిన్నుఁగాచుతను శీర్షంబున్ నెసన్ ద్రుంతునాన్
గరిమంబొప్పఁగ నన్నుఁగాచుట మఱిన్నాతండిఁబోకార్చు ౘ
న్న రమేశా! నిజభృత్యవాక్కు ఋతమున్ గావింప నేకాదొకో! 361

వ. ఈ విశ్వం బేకరూపుఁడవగునీవ. నీవ యీవిశ్వంబునకాది మధ్యాంతంబులం బృథ
గ్భావంబునఁ బర్యవసితుండవై సత్తామాత్రంబున వెలుంగుచుందువు. స్వమా
యచే గుణపరిణామాత్మకంబగువిశ్వంబునుసృజించియందుఁజొచ్చినానావిధంబులం
బ్రతీయమానుండవగుదువు. పరమేశా! సదసదాత్మకంబగు నీజగంబెల్లనీవ; తద
న్యంబగు నాత్మపరాత్మకంబగుబుద్ధి యపార్థంబగు మాయయగు. బీజవృక్షంబు
లకు వస్తుకాలంబులుంబోలె జగంబులకు సృష్టిస్థితిలయంబులగు. మఱియు నీ

జగంబు నాత్మంబుననిల్పి విలయాంబుమధ్యంబున నిస్తమస్క నిజసుఖానుభవుండవు, నిరీహుండవునై శయనింతువు. యోగనిమీలిత దృష్టివి, ఆత్మనిపీత నిద్రుండవునగుచుఁ దుర్యావస్థయందుండి తమంబునుగాని గుణంబులనుగాని గూడకుందువు. విలయంబునందు స్వకాలశక్తి సమీరితపరికృతి ధర్ముండవై యనంతశయనంబునుండి సమాధినిరతుండవగు నీ నాభితలంబునుండి యాత్మగూఢంబగు లోకపద్మంబు వటబీజంబునుండి మహావటవృక్షముంబోలెఁ బ్రభూతంబయ్యె. తత్పద్మసంభవుండైన బ్రహ్మదేవుండుఁ దదన్యంబెద్దియుంగానక బీజరూపుఁడవు, నాత్మవ్యాప్తుఁడవు నగు నిన్ను వెలి నంతట నెమకుచు హాయనశతంబుల జలంబుల నిమజ్జమానుండై నిన్నుఁబడయంజాలఁడయ్యె. అంకురంబుత్పన్నంబగుడుఁ దద్బీజంబెట్లులభ్యంబగు? ఆ పద్మగర్భుం డతి విస్మితుండై మగుడఁ బద్మంబునాశ్రయించి తద్దయుంబెద్దకాలంబునఁ దీవ్రతపంబునఁ బరిశుద్ధభావుండై భూమియందు గంధంబువలె నతిసూక్ష్మరూపుఁడవును భూతేంద్రియాశయమయంబగు నాత్మంబున వ్యాప్తుండవునగు నిన్నుఁ జూచె. 362

చ. అజుఁడు నిటుల్ సహస్రవదనాంఘ్రిశిరఃకరకర్ణనాసికా
భుజనయనోరువక్త్రమణిభూషణకోటి విరాజమానుఁ డ
క్కజమగు మాయలాఁడుఁ ద్రిజగన్మయుఁడై తనరారు నయ్యధో
క్షజుఁ బురుషోత్తముంగని ప్రకామ ముదంబునుబొందె నాత్మలోన్. 363

చ. అల హయశీర్షరూపమునన్ నా పరమేష్ఠికి నిచ్చితీవు ని
స్తులబలశాలులున్ నిగమచోరులునైన రజస్తమస్స్వరూ
పుల మధుకైటభాఖ్యులను బోరనఁ ద్రుంచి శ్రుతివ్రజంబులన్
బొలుపగు సత్త్వరూపతనువుల్ ప్రియమందురు నీకుఁ గోవిదుల్. 364

ఉ. దేవ! యిటుల్ నృతిర్యగృషిదేవఝషాద్యవతారలీలలన్
నీవు జగంబుఁబ్రోతు వధియింతువు లోకవిరోధులన్ లస
ద్భావ! యుగానురూపధర్మపరిపాలనముం బొనరింతటుల్ కలిన్
గావు వసింతు ఛన్నతనుగావున నే త్రియుగాఖ్య నీకగున్. 365

సీ. దుర్భరంబును పాపదుష్టం బసాధువు, హర్షశోకభయైషణార్తియుతము
కామాతురమునగునామనం బది తావ, కీనకథానుసంకీర్తనమున
ఆప్యాయనముఁబొందదచ్యుత!, వైకుంఠనాథ! నిర్మలకరుణాసనాథ!
అట్టి మనమున నేనతిదీనుఁడ విభుంశ,వగు నీదు గతి నెట్టులరయువాఁడ

గీ. జిహ్వ యుదరంబు ఘ్రాణంబుశిశ్నము శ్రవణంబుజంచలదృష్టియన్ గర్మశక్తు
లన్నియును నన్ని చోట్లకునన్ను నీడ్చుఁ, బల్వురగుసవతుల్ గేహపతినిబోలె. 366

చ. జని మృతి రోగపీడితము స్వాన్యతనూగతమైత్రివైరమున్
స్వనియతకర్మకోటి భవ వై తరణీపతితంబులైన యీ
జనమునుగాంచి యుద్ధరణ సల్పుము పారచరుండవీవుఁ గా
వున సదనుగ్రహంబునఁ బ్రభూ! తొలఁగింపు తదీయమాధ్యమున్. 367

మ. భువనశ్రేణికి సృష్టిసంస్థితిలయంబుల్ సేయ నెంతే వలం
తివిగా సర్వజగద్గురూ! నరహరీ! నీ కీ జనోత్తారణ
ప్రవణత్వంబున నే ప్రియాసమగు? దేవా! దీనమందార! సా
ధ్వవనా! నీ ప్రియభక్తులంగొలుచు మార్గద్వార నే మారయన్. 368

మ. చతురత్వంబునఁ దావకీన సముదంచద్వీర్యగానామృతా
ప్లుతచిత్తుండ భవోగ్రవైతరణికిన్ బొందన్ మహోద్వేగమున్
బతితత్వంబున నిచ్చఁ దద్విముఖులై మాయేంద్రియార్థోత్థసౌ
ఖ్యతతిక్లేశితులైన మూఢులకు నత్యంతంబు శోకించెదన్. 369

ఉ. మానవకేసరీ! సతము మానివరుల్ స్వవిముక్తకాములై
మానమునం జరింత్రు పరమార్థపరాయణతన్ రహస్స్థలిన్
దీనజనంబులన్ విడిచి దేవ! మనంబునఁ గోర మోక్షమున్
నేనుఁ ద్వదన్యుఁ డెవ్వఁడు గణింప శరణ్యుఁడు లేఁడు వీరికిన్. 370

మ. కరకండూయనతుల్యమై తుదిని దుఃఖాపాదియై తుచ్ఛమా
తరుణీసంగమ మాదిగాగల గృహస్థవ్రాత సౌఖ్యంబునన్
బరతంత్రత్వమునన్ నిమగ్నులయి యాత్మన్ దృప్తినిం బొందర
ద్దిర! కండూతినిబోలెనై చెడును దాధీరుండు కామంబులన్. 371

ఉ. మానతపోవ్రత శ్రుతసమాధి జపాధ్యయనస్వధర్మ సు
జ్ఞాన వివిక్తవాసము లనంబడు నీపది మోక్షహేతువుల్
ఐన నసిద్ధితేంద్రియుల కయ్యవి వృత్తికరంబులౌను దు
ర్మానుల కవ్వి వృత్తులకు మార్గములై విఫలంబులయ్యెడున్. 372

సీ. అరయ నరూపుఁడవగు నీకు బీజాంకు, రములట్లు కార్యకారణములైన
శ్రుతిదృష్టములు రెండు రూపముల్ వెలుగొందు, నీరెంట యుక్తులై ధీరమతులు
దారువులందు మథనమున వహ్నిచం,దమున సద్భక్తియోగమున నిన్నుఁ
బొడఁగాంచుచుందురు పురుషోత్తమ! మఱొంట,జ్ఞానంబు లభ్యంబు గాదు చూవె
ఆ. పంచభూతములును బ్రాణేంద్రియములుఁ ద, న్మాత్రలును దలంపమన మనుగ్ర
హంబుఁ జిత్తమివియఖిలంబు నీవె కా, సగుణుఁడవును నీవ యగుణుఁడవును. 373

వ. మనోవచఃప్రకాశితంబు నీకంటె నన్యమెద్దియు లేదు. ఆద్యంతవంతంబులు గుణానుగుణ్యంబులగు నీ మహదాదులును మనఃప్రభృతులును, దేవమర్త్యులును ననాదినిధనుండవైన నిన్ను నెఱుంగఁజాలరు. ఇట్లు విమర్శించి విద్వాంసు లధ్యయనాదికంబునుండి విరమించి సమాధియోగంబున నుపాసింతురు. 374

గీ. నమనమును స్తుతి కర్మార్పణము సపర్య, చరణసంస్మృతి సత్కథాశ్రవణము నన
దనరెడు షడంగసేవను దక్కజనుఁడు, పరమహంసగతిం దాను బడయు నెట్లు? 375

నారదుఁడు:—

ఉ. క్ష్మాదయితా! యుధిష్ఠిర! యచంచలభక్తిని భక్తుఁడైన ప్ర
హ్లాదునిచే నిటుల్ వినుతుఁడై యగుణుండగు నయ్యధోక్షజుం
డాదర మొప్పఁగాఁ బ్రణతుఁడైన నయాన్వితు బాలుఁ జూచి యా
హ్లాదపరీతచిత్తుఁడయి యుల్కను డించి వచించె నర్మిలిన్. 376

భగవానుఁడు:—

గీ. భద్రచరిత! ప్రహ్లాద! శుభంబు నీకు, నర్భకా! యెదఁ బ్రీతుఁడనైతి నేను
బ్రీతి నభిమతవరముఁ గోరికొనుమయ్య, జనులకుం బూర్ణకాముం బొసఁగుదు నేన.

క. ననుఁ బ్రీతుం జేయని వ్య, ర్థునకున్ నా దర్శనము సుదుర్లభముసుమా
విను మాయుష్మంతుఁడ! ననుఁ, గనిజంతువు దుఃఖ మొందఁగఁ దగదు మగుడన్.

ఆ. సర్వవరదు నన్ను సాధుసత్తములు మ, హామహుల్ సుభద్రకాములగుచు
సర్వభావములను సర్వవిధంబులఁ, బ్రీతిఁ జేయుచుంద్రు సవించె? వత్స! 379

నారదుఁడు:—

క. ఈభంగిన్ లోకములన్, లోభపఱచు వరములం బ్రలోభితుఁడయ్యున్
దా భగవద్రతుఁడగుట మ, హాభక్తుం డాతఁడొల్లఁడయ్యె వరములన్. 380

---

## అధ్యాయము 10.

### —త్రిపురాసుర సంహారఘట్టము—

నారదుఁడు:—

గీ. దైత్యరాజతనూజుఁ డేతత్సకలము, భక్తియోగంబునకుఁ బ్రత్యవాయమగుట
నెదఁ దలంచుచు నా హృషీకేశునకును, లేనగవుతోడ నిట్లు వల్కెన్ నరేంద్ర!

ప్రహ్లాదుఁడు:—

మ. సరగన్ బుట్టినదాది కామనుల నాసక్తుండఁ గానట్టి న
న్వరదానంబున లోభపెట్టకుము దేవా! యుల్లసద్భావ! వా

విరిఁ దత్సంగ విభీతబుద్ధినయి నిర్విణ్ణత్వముం జెంది నీ
చరణాబ్జంబుల నాశ్రయించితిని మోక్షాపేక్ష సంధిల్లఁగన్. 382

క. తలఁపఁగ సంసృతి బీజం, బులు హృద్గ్రంథులగు కామములయందున్ భృ
త్యులఁ బ్రేరేపుదుఁగా భృ, త్యలక్షణమ్ముల నెఱుంగు దలఁపున దేవా! 383

క. కాకున్నఁ గృపాళునకున్, నీకొండొక బుద్ధియున్నె? నీ వొకఁడవ య
స్తోకాంధతమోనష్టా, లోకునకున్ దృష్టి నీగలుగుదు నృసింహా! 384

గీ. ఎవఁడు కోర్కులు కోరు నో భువననాథ!, వాఁడు భృత్యుఁడు కాఁడు చూ వణిజుఁడెయగు
కాముకులు కాక గుణలుబ్ధులై మెలఁగెడు, వారె స్వామిభృత్యులనంగ బరఁగుచుంద్రు.

క. ఊరక స్వామినిఁ గోర్కులు, కోరెడి వాఁ డొక్క సేవకుఁడు కాఁ డరయన్
కోరికలు భృత్యుపై నిధి, కారమునకు నొసఁగ స్వామి కాఁడతఁడు ప్రభూ! 386

గీ. ఈశ! నిష్కామభక్తుఁడ నేఁ బ్రయోజ,న రహితుఁడవగు స్వామి వీవరసి చూడ
రాజభృత్యులకుఁ బలె నర్థంబెదియును, మనకు నేవిధమగు ప్రయోజనము లేదు.

క. ఐనను వరదోత్తమ! దే, వా! నాకిపు డొసఁగు దేని నభిమత వరమున్
నే నెదఁ గామములకు నెడ, మీని వరముఁ గోరుదుం బరేశా! నిన్నున్. 388

వ. ప్రాణేంద్రియమనంబులును, ధర్మంబు, ధృతియు, మతియు, హ్రీయు, శ్రీయుఁ, దేజంబు, స్మృతియు, సత్యంబు, జన్మంబుననే యెవ్వానికి నశించు నెప్పుడు మానవుండు మనస్సంభవంబులగు కామంబులఁ ద్యజించు నప్పుడ యతండు సాక్షాద్భగవత్స్వరూపుఁడగు. 389

గీ. ప్రణవరూపుఁడవున్ భగవంతుఁడవును, పరమపురుషుఁడవును బరబ్రహ్మ మవును
నద్భుత నృసింహుఁడవు పరమాత్మవునగు, నీకు విష్ణునకున్ నమోవాకములివె.

భగవంతుఁడు:—

సీ. కాంక్షింపఁ దొడరరు కామంబులను భవా, దృశులు నా యేకాంతులిందు నందు
నాయందు నెన్నఁడై నను దైత్యపతుల భో, గంబు లీ మన్వంతరంబు నీవు
ననుభవింపుము మత్ప్రియ కథామృతంబు నా, స్వాదించు చేకాత్మ సత్స్వరూపు
నను మదిం జొనిపి యజ్ఞపతి నీవు యజింపు, మఖిలభూతంబులయందు నీవు

గీ. యోగమునఁ గర్మము జయింపు భోగమునను
బుణ్యమును క్షేమమునఁ బాపము నురుకాల
గతినిఁ దనువును విడిచి లోకస్తుతకీర్తి
బెనిచి ముక్తబంధుఁడ వౌచు ననుఁ బడయుము. 391

గీ. నాకునై నీవు గాన మొనర్చినట్టి, దీని నెప్పుఁడు గీర్తించు ధృతిదలిర్ప
డెందమున వాఁడు నన్ను నన్నుఁ దలఁచుచుఁ, గర్మబంధవిముక్తుఁ డౌ గాలగతిని.

ప్రహ్లాదుఁడు:—

సీ. పరమేశ! నిన్ను నేవరముఁ గాంక్షింతు న, బుద్ధుఁడై నాతండ్రి బద్ధవైరుఁ
డగుచు నెఱుంగమి నఖిలజగద్గురు, నధినాథు నిను భ్రాతృహంత యనుచుఁ
దెగడుచు వంచితదృష్టిఁ ద్వద్భక్తుఁడ, నైన నాయందు ద్రోహంబుఁ జేసెఁ
గావున నో దేవదేవా! లసద్భావ!, పతితపావన! లోకభద్రదాయి!
గీ. దుస్తరమ్ము దురంతమ్ము దుస్సహమ్ము, నైన పాపకూపమునుండి యసురవిభుడుఁ
నీదు పావనదృష్టిఁ బునీతుఁ డయ్యె, మఱియుఁ బూతాత్ముఁ డగుఁగాక మనుజసింహ!

శ్రీభగవానుఁడు:—

క. కులపావనుండ వీవని, కులమున నీ వుద్భవంబగుట నీ జనకుం
డెలమిన్ ముయ్యేడుతర, మ్ముల పితరులతోడఁ గూడఁ బూతుఁడగుఁ జుమీ. 394

క. సమదర్శులుం బ్రశాంతులు, సమలాచారులును సాధులగు మద్భక్తో
త్తములు పునీతములుగ వా, టముగా నొనరింత్రు కీకటంబులనైనన్. 395

క. దైతేయవర్య! బహువిధ, భూతగ్రామములయందుఁ బూనరు హింసన్
వీతస్పృహులున్ మద్భా, వాతతచిత్తులయి నా దయన్ మద్భక్తుల్. 396

క. ధీవర! ప్రహ్లాదా! ప్ర, జ్ఞావినుత! మదీయభక్తజనులందఱిలోన్
నీవ యతిశ్రేష్ఠుండవు, చూవె యనన్యమగు భక్తిఁ జొప్పిలు కతనన్. 397

క. వేతెఱఁగులఁ బూతుండగు, నీతండ్రికిఁ బ్రేతకార్యనిర్వాహణము వి
ఖ్యాతిసలుపు సద్గతి దు, ర్జాతులు గందురు మదంగసంస్పర్శమునన్. 398

నారదుఁడు:—

మ. భగవంతుండు నృసింహుఁ డీవిధమునన్ వాక్రువ్వ నాచంద మొ
ప్పఁగఁ బ్రహ్లాదుఁడు తండ్రికిన్ సలిపె భూపా! యౌర్ధ్వదైహక్రియల్
దుగినుం బోలు ద్విజాళిచేత నభిషిక్తుండౌచుఁ బ్రహ్లాదుఁ డిం
పుగ రాజన్వతిఁ జేసె నీవసుమతిన్ మోదంబుఁ జేకూర్చుచున్. 399

చ. కురిధయుడు గం బ్రసాదసుముఖుండగు నా నరకేసరిన్ హరిన్
విధిత్రిదివేశకోటి పరివేష్టితుఁడై యనువొప్పఁ గాంచి వే
విధములుగా గడుంగడుఁ బవిత్రవిచిత్రగభీరవాక్సుధా
మధురముగా స్తుతించి పెనుమన్నన దోఁప వచించె నీక్రియన్. 400

బ్రహ్మ:—

సీ. దేవదేవ! యఖిలాధీశ! భూతాత్మ! కా, రణధృతజన్మ! పురాణపురుష!
పాపుఁడు లోకసంతాపనుఁడునగు నీ, యసుర నీచేత భాగ్యంబు కతనఁ

బ్రతిహతుఁడయ్యె నాఁవలనన వీఁడు సం,సారి ప్తవరుండయిఁబలియుఁడయ్యె .
మత్సృష్టములగు సమ స్తభూతంబుల, చేత వధ్యుఁడుకాఁడుశ్రీనివాస!

గీ. యురుతపోయోగబలదర్పయు క్తుఁడగుచు,ధర్మములనెల్లవీఁడు ధ్వ స్తములఁజేసెఁ
గ్రూరపితృరూపమృత్యువుబారినుండి, బాలువిడిపించి తీ మహాభాగవతుని. 401

క. యతచిత్తుండగుచున్ సం, తతమున్ధ్యానించు భ క్తునకుఁ గూరిరవధో
ద్యతమృత్యువునుండియు నా, దృతిమెయి నీ యీస్వరూపమెలమిం బ్రోచున్.402

మ. సకలామ్నాయమయస్వరూపమును సాక్షాత్సర్వ యజ్ఞాత్మమున్
సకలోదా త్తతపోమయంబు నతిభాస్వత్సర్వతీర్థంబునౌ
పరికటోత్సంగమునందుఁ బావకమునన్ స్వర్ణంబునుంబోలెఁ బొం
దిక స్నాతుండయి పూతుఁడౌట నితఁడెంతే ధన్యుఁడున్ మాన్యుఁడున్. 403

శ్రీభగవానుఁడు:—

క. సారసభవ! నీవెప్పుడు, కూరిరాత్మకులగు సురాసురుల కిట్లు వరం
బీరాదు సర్పములకు సు, ధారసమునుంబోలెఁ బ్రజకుఁదాపకరముగన్. 404

నారదుఁడు:—

క. అనిచెప్పి యో యుధిష్ఠిర, జనపాలా! గిరిశపద్మజార్చితుఁడై చ
య్యన హరి యంతర్హితుఁడ, య్యె నఖిలభూతంబులకు నదృశ్యుండగుచున్. 405

క. అంతటఁ బ్రహ్లాదుండు పు,రాంతకుఁబూజించి బ్రహ్మ కర్థి నెఱఁగి య
ల్లంతన విష్ణ్వంశజులకుఁ, బొంతనమున దేవతలకుఁ మొక్కెన్ భ క్తిన్. 406

క. ఆదటఁ బరమేష్ఠియుఁ గా, వ్యాదిముని పరివరయు క్తుఁడై యనఘుం బ్ర
హ్లాదునిఁ బతిఁగాఁజేసెను, మోదంబున దైత్యదానవుల కెల్ల నృపా! 407

క. ఆదరయుతులై యాప్ర,హ్లాదుఁబ్రశంసించి యొసఁగియాశీస్సులఁ బ్ర
హ్మాదులగు దేవతలు వసు, ధాదయితా! చనిరి స్వస్వధామంబులకున్. 408

గీ. విష్ణుపార్శ్వగులగు జయవిజయులిట్లు, దితికి నందనత్వంబుఁ బొందింపఁబడిరి
వారు హృదయస్థమగు వైరభావముసను, దెంపరులగుచు హరిచే వధింపఁబడిరి.

గీ. వారలిరువురు విప్రశాపమునఁజేసి, క్రమ్మఱన్ గుంభకర్ణుండురావణుఁడను
నామములరాక్షసులయి జన్మంబునొంది, రామునిపరాక్రమంబునఁబ్రహతులైరి.

గీ. శ్రీరఘూద్వహబాణ నిర్భిన్నహృదయు,లైనవారు రణోర్వి శయానులై యు
ధిష్ఠిరా! తన్మనస్కతన్ దేహము విడ,నాడి రాపూర్వజన్మముసంబువోలె. 411

గీ. వారలిర్వురు నిట శిశుపాలదంత, వక్త్రులను పేర్లఁ గ్రమ్మఱన్ బ్రభవమంది
పరఁగ హరియందు వైరానుబంధకలన, నీవుఁజూడఁదాదాత్మ్యమంది రిరి నృపాల!

క. జగదీశ! కృష్ణుశాత్రవు,లగు నృపులెల్లన్ దదాత్ములై యఘములఁ బా
ర్తిగవిడిచి వైరటుయుక్తిగ భ్రమరధ్యానమునను గీటములక్రియన్. 413

గీ. భేదదర్శనశూన్యమౌ విమలభక్తి, భాగవతవర్యులెల్లఁ బడసిరట్లు
చేదినృపతి ప్రభృతులు తచ్చింతతోన, నయ్యధోక్షజు సాయుజ్యమందిరి నృప!

క. తమి నీ యడిగినదెల్లన్, క్రమమొప్పఁగఁ దెల్పినాఁడ రాజోత్తమ! వ్య
క్తముఁ జేసితి తద్రిపులగు, దమఘోషసుతాదుల హరితాదాత్మ్యంబున్. 415

గీ. ఆదిదైత్యవధం బెందు నమరియుండు, నట్టి బ్రహ్మణ్యపతియు మహాత్ముఁ డజుఁడు
నచ్యుతుఁడునగు విష్ణుపుణ్యావతార, గాథ రాజేంద్ర! నీకు నాఖ్యాతమయ్యె. 416

సీ. పరమభాగవతుఁడౌ ప్రహ్లాదుచరితంబు, భక్తి జ్ఞానంబు విరక్తి మఱియు
హరియందు నతని తాదాత్మ్యంబు సృష్టిస్థి, తి లయేశుఁడైన యద్దేవుని గుణ
కర్మవర్ణనము సాకల్యముగాఁగ దే, వాసురస్థాన విపర్యయంబు
భగవత్ప్రబోధక భాగవతసుధర్మ, మఖిలంబునైన యాధ్యాత్మికంబు

గీ. అధిప! యాఖ్యాత మీ శుభాఖ్యానమందు, విష్ణుదేవుని వీర్యోపబృంహితమగు
నీ మహాఖ్యానమెలమిఁ గీర్తింప వినిన, జనుఁడు ముక్తుఁడౌఁ గర్మపాశములనుండి.

మ. ప్రయతుండై యెవఁడాదిపూరుషుని యీ పంచాస్యలీలం గను
బ్జయలక్ష్మీయుత దైత్యయూథపవధ వ్యాపారమున్ భక్తియు
క్తి మెసంగన్ బఠియించు సాధువర దైతేయాత్మజోద్యద్గుణో
దయ మాలించు నతండు పొందు నభయంబై యొప్పు కైవల్యమున్. 418

మ. నరదేహంబున గూఢరూపుఁడగుచున్ సాక్షాత్పరబ్రహ్మమౌ
హరి నీ గేహమునన్ వసించెనని పుణ్యాత్ముల్ జగత్పావనుల్
వరమౌనుల్ చనుదెంత్రు నిచ్చలున్ భూపా! కావునన్ మీర లీ
నరలోకంబున నెంచిచూడఁగఁ గడున్ ధన్యుల్ మహాభాగులున్. 419

చ. ప్రియుఁడును మాతులేయుఁడు సుహృత్తముఁడున్ గురుఁడున్ నియోగకా
రియు నయి మీకు నే హరి చరించు నతండె యుధిష్ఠిరా! శుభో
దయ నిరుపాధి కేవల సుఖానుభవంబు మహద్విమృగ్య మ
వ్యయము నఖండమై పరగు బ్రహ్మముగాఁగ మదిం దలంపుమా. 420

చ. ఎవని సమగ్రరూప మిదమిత్థమటంచును గేవలంబు నా
భవపరమేష్ఠిముఖ్యులును వర్ణనముం బొనరింపలేరొ వా
స్తవముగ నేము మౌనమున శాంతిని భక్తిని సుప్రసన్నుఁగా
నెవనినిఁ జేసికొందు మతఁడెన్నఁ బ్రసన్నుఁడు మీకు నిచ్చలున్. 421

నారదుఁడు:—

క. ఈ యచ్యుతుండె రాజా!, మాయావివరేణ్యుఁడైన మయుని కతమునన్
మాయింపఁబడిన రుద్రుమ,హాయశముం జేసె మగుడ నతివితతముగన్ 422

ధర్మరాజు:—

క. ఏ కర్మమునందు మయుఁడు, శ్రీకంఠుని యశము మాయఁ జేసెన్? మగుడన్
శ్రీకృష్ణుఁ డెత్తెఱంగున, నా కీర్తిం బెనిచెఁ దెల్పు మా యది సారిదిన్. 423

నారదుఁడు:—

క. శ్రీవిష్ణు సముపవర్ధితు,లా వేల్పులచేత విజితులై యసురులు మా
యావివరున్ గురు మయునిన్,భూవర! భీతిమెయి శరణుఁ బొందిరి వింటే. 424

గీ. రాకపోకలఁగానఁగారా కలత్స్య
ఘనపరిచ్ఛదయుతములై తనరు హైమ
రాజతాయసములగు పురములు మూఁడు
మయుఁడు నిర్మించె నపుడు విస్మయముఁగాఁగ. 425

గీ. ఆ పురంబులతోఁ గూడి యసురయూథ,పతులు పూర్వవైరమ్ము మతిఁదలఁచుచు
వీఁకమైఁ బాలకసమేత లోకములను, నాశనమొనర్పసాగిరి నరవరేణ్య! 426

గీ. ఓ యుధిష్ఠిర! పాలకయుక్తులైన, లోకు లా రుద్రుఁజేరి యిట్లు వచియించి
రధిప! త్రిపురాసుర వినష్టులైన మమ్ముఁ, దావకీనుల దీనులఁ గావుమనుచు. 427

గీ. అపుడు వారియందు ననుగ్రహంబు కల్గి, వెఱవకుఁడు మీరటంచు నవ్విభుఁడు వల్కి—
శరము ధనువున సంధించి పురములపయి, భీషణంబగు నస్త్రంబు విడిచిపుచ్చె. 428

క. ఆయస్త్రమునుండి వెడలె, సాయకచయములు మయూఖజాలములు వడిన్
దోయజహితమండలిఁ బలె, ధీయుత! పురము లవి మూఁ డదృశ్యములయ్యెన్.

గీ. అపుడు తద్బాణనిహతులై త్రిపురవాసు
లపగతాసువులై యెల్ల రవనిఁబడిరి
వారిఁ గొనిపోయి ఘనయోగబలయుతుండు
మయుఁడు కూపామృతంబునఁ బ్రోఁచి నునిచె. 430

గీ. సిద్ధపీయూషరసవినిషిక్తులగుచు, వార లురుతేజులున్ వజ్రసారులునయి
వేగ లేచిరి ఘనమేఘభేదులైన, వైద్యుతసముజ్జ్వలాగ్నులభంగి నపుడు. 431

సీ. వితత సంకల్పుఁడు విమనస్కుఁడునగు నా, వృషభధ్వజునిఁ గాంచి విష్ణుమూర్తి
భగవంతుఁ డప్పు డుపాయమొకండుఁ గ, ల్పించె నీరీతి భూభృల్లలామ!

అంత నజుఁడు లేఁగయయ్యె నీవిష్ణువు, తాను సాక్షాత్తు గోధేనువయ్యెఁ
ద్రిపురంబులం జొచ్చి నిపుణతఁ గూపామృతంబును ద్రావె మధ్యాహ్నవేళ
గీ. నసురు లది కనుచుండియు నడ్డగింప, నైరి మోహితచిత్తులై యమ్మొదవును
నదియెఱింగి మహాయోగి యగు మయుండు, పరిహసించెనా రసకూపపాలురఁగని.

ఉ. శోకసమేతులం దెగడుచున్ ఘనదైవ విలాసమెంచుచున్
శోకముఁదక్కి యమ్మయుఁడు క్షోణివరా! యిటుపాడె నౌర! యీ
లోకమునన్ సురల్ దనుజులున్ మనుజుల్ మఱి యన్యులెవ్వరేన్
బ్రాకట దైవకల్పితముఁ బ్రౌఢిఁ దొలంగఁగఁ జేయలేరుగా. 433

వ. అంత నీవిష్ణుండు ధర్మజ్ఞానవిరక్తి వృద్ధి తపోవిద్యా క్రియాదులగు స్వీయశక్తుల నమ్మహాదేవునకు రథ, సారథి, ధను, రశ్వ, ధ్వజ, వర్మ శరాదికంబులగు ప్రధన సాధనంబులు కల్పించె. 434

స్రగ్ధర:- సన్నద్ధుండౌచు నా యీశ్వరుఁడు కడఁకమై స్యందనంబెక్కి చాపం
బు న్నారాచంబు హస్తంబునఁగొని విశిఖంబున్ శరాసంబు నందున్
గ్రన్నన్ సంధించి శుంభద్గతిఁ ద్రిపురములన్ గాల్చె విష్ణుప్రభావా
ఖిన్నుండై ధర్మపుత్రా! క్షితిరమణ! రణక్రీడ మధ్యాహ్నవేళన్. 435

ఉ. బోరన దివ్యదుందుభులు మ్రోగె దివంబున సిద్ధసాధ్య బృం
దారక యక్షమౌని పితృనాగపతుల్ జయ రావమొప్ప వి
స్ఫారిత పుష్పవృష్టులు వెసం గురియించిరి యచ్చరల్ ముదం
బారఁగఁగూడి యెల్ల రపుడాడిరి పాడిరి ధర్మనందనా!. 436

చ. పురరిపుఁ డిత్తెఱంగున నమూఁడుపురంబుల నీఱుసేసి తా
మరసభవాది సర్వసురమండలిచేఁ బ్రతినంద్యమానుఁడై
నరవరసత్తమా! నిజగణంబులుతో నరుదేర నంతఁ జె
చ్చెర విమలస్వధామమును జేరఁగ నేగె జగంబు మెచ్చఁగన్. 437

ఉ. మానుష విగ్రహంబును స్వమాయ ధరించి విడంబనంబిటుల్
పూనెడు కృష్ణదేవుని యపూర్వములున్ మునిగీతముల్ సుశో
భానిబిడంబులున్ భువనపావనముల్ మహితంబులైన యా
మానితలీలలిట్టివి సుమా వినఁగోరె దిఁకేమి దెల్పుమా. 438

---

## అధ్యాయము 11.

### వర్ణధర్మోపదేశము

శ్రీశుకుఁడు:—

ఉ. పావనమున్ సభాజనసభాజనభాజనమున్ ఘనంబునౌ
శ్రీవరభక్తుఁడౌ దితిజశేఖరు సాధుచరిత్ర మింపుగాఁ
దా విని యయ్యుధిష్ఠిరుఁడు తామరసోద్భవసూను నారదున్
దేవమునీంద్రు నిట్లడిగె ధీవిభవం బెసఁగంగఁ గ్రమ్మఱన్. 439

ధర్మరాజు:—

సీ. భగవత్స్వరూప! నే వలఁతు వినంగ వ, ర్ణాశ్రమాచార సమన్వితమగు
నరుల ధర్మంబు సనాతనం బద్దానఁ, బడయుఁగా పురుషుండు పరమపదము
సాక్షాత్తునీవు ప్రజాపతిసుతుఁడ వౌ, యతతపోజ్ఞానసమాధియుక్తిఁ
బరమేష్ఠి సుతులలోఁ బ్రథమగణ్యుండవు, విబుధర్షిసత్తమ! విమలచరిత!

గీ. సాధువుల్ కరుణాళువుల్ శాంతమతులు, త్వాదృశులగు నారాయణపరులుగువ్యా
ధర్మమును దా రెఱిఁగిరి యథాతథముగ, నాగతిం దెలియఁగ జాలరితరులు.

నారదుఁడు:—

క. జగదమల ధర్మసేతువు, భగవంతుఁడునైన హరికిఁ బ్రణమిల్లి విభుం
డగు నారాయణుముఖమునఁ, దగ విన్నమహాపురాణధర్మము వినుతున్. 441

ఉ. శ్రీయుతమూర్తియై యవతరించెను స్వాంశముతోడ మున్ను దా
క్షాయణియందు ధర్ముఁడను సంయమివర్యునకున్ విభుండు నా
రాయణుఁ డాదిదేవుఁడు పరాత్పరుఁ డా పరమేశుఁ డీ జగ
చ్ఛ్రేయముకై తపంబు బదరీవనియం దొనరించు నిచ్చలున్. 442

గీ. ధర్మమూలుండుసర్వవేదమయుఁడుహరి, వేదవిదులకుస్మృతియౌచు వెలయుచుండు
దాన నాత్మకడున్ బ్రసాదంబునొందు, వింటివె? యుధిష్ఠిరా! సుపవిత్రచరిత!

సీ. సత్యంబు దయయును శౌచంబుఁ దపము నీ, క్షయును దితిక్షయు శమముదమముఁ
ద్యాగంబు బ్రహ్మచర్యము నహింసయును స్వా, ధ్యాయంబుసంతోషమార్జవంబు
సమదర్శనంబును సత్సేవ గార్హస్థ్య వాం, ఛానివృత్తియు దాసమానములును
భూతంబులం దాత్మబుద్ధియు దేవతా, మతియును నాత్మవిమర్శనంబు

గీ. శ్రవణమును గీర్తనంబును స్మరణ విధియు, సఖ్యమువసతియుజన దాస్యములుసర్వ
యనఁ జెలంగు త్రింశల్లక్షణాఢ్యమైన, ధర్మమిది చెప్పునరుల కంపవలకు నధిప!

వ. బ్రహ్మ చెప్పినవడువున మంత్రవంతంబులగు సంస్కారంబు లవిచ్ఛిన్నంబులుగాఁ గలవాఁడు ద్విజుఁడని చెప్పంబడు. జన్మకర్మావదాతులగు ద్విజన్మలకు యజనాధ్యయనంబులు విహితంబులు. ఆశ్రమచోదితంబులగు క్రియ లాచరణీయంబులు. అందు విప్రునకు యాజనాధ్యాపన ప్రతిగ్రహంబులు విధేయంబులు. రాజప్రతిగ్రహుండై బ్రాహ్మణులుదక్క తక్కుంగలవారివలన గృహీతంబులగు కరదండ శుల్కాదులచేఁ బ్రజాగోపనంబుఁ గావింపవలయు. వైశ్యుండు వాణిజ్యవృత్తియై బ్రహ్మకులానుయాయియగుచు మెలంగనగు. 445

వ. శూద్రునకు ద్విజశుశ్రూషయ వృత్తియగు, విప్రునకుఁ గృష్యాదివృత్తియు నయాచితప్రాప్తంబును, యాయవారంబును, శిలోంఛనంబును నను నాల్గు తెఱంగుల వృత్తులుతగు. అవి యుత్తరోత్తరంబులు శ్రేయోదాయకంబులై యుండు. నీచుండగునరుం డనాపన్నుఁడగునప్పు డుత్తమవృత్తిని సేవింపరాదు. రాజు తక్క తక్కినవారికి సర్వవృత్తు లవలంబనీయంబులు. ఋతామృతంబులఁగాని మృతప్రమృతంబులఁగాని సత్యానృతంబునఁగాని జనుండు జీవింపవచ్చు. శ్వవృత్తిచే నెన్నఁడును జీవింపరాదు. శిలోంఛనంబు ఋతము, అయాచితం బమృతంబు, నిత్యయాచ్ఞ మృతము, కర్షణంబు ప్రమృతంబు, వాణిజ్యంబు సత్యానృతంబు, నీచసేవ శ్వవృత్తి. విప్రుండు సర్వవేదమయుఁడు, క్షత్రియుఁడు సర్వదేవమయుఁడుఁ గాన జుగుప్సితంబగు నీచసేవను విప్రరాజన్యులు వర్జింపవలయును. 446

క. శమమును దమమును సంతో, షము శౌచము నార్జవంబు క్షాంతి దయయు స
త్యము జ్ఞాన మచ్యుతాత్మ, త్వముఁ దలఁపఁగ లక్షణములు బ్రాహ్మణునకగున్.

క. క్షమయును శౌర్యంబును వీ, ర్యముఁ ద్యాగము ధృతిప్రసాద మాత్మజయముఁ దే
జము బ్రహ్మణ్యత రక్ష బ, లము నియ్యవి యెన్న క్షత్రలక్షణములగున్. 448

క. గురుదైవత సజ్జనగో, వరభక్తియు నుద్యమంబు వర్ణత్రితయీ
పరితోషణ మాస్తిక్యము, సరసత నైపుణము వైశ్యజన లక్షణముల్. 449

క. అవనతి శౌచమ్మును నా, ర్జవమును నిష్కపటమైన ప్రభుసేవ యమం
త్రవితానం బస్తేయం, బు విప్రగోరక్ష లక్ష్మములు శూద్రునకున్. 450

క. పతిదైవతలగు స్త్రీలకుఁ, బతిశుశ్రూషయుఁ దదీయ వ్రతధారణమున్
సత మనుకూలతఁ దద్బం, ధుతతి యెడ సమాదరంబును లక్షణముల్. 451

సీ. ఓపిక సమ్మార్జనోపలేపముల గృ, హాలంకరణముఁ జేయంగవలయు
సుష్ఠ్వలంకృతయగుచును గృహో, పకరణములు నిర్మలములుఁగా నలుపవలయు
వివిధకామంబుల వినయదమముల స, త్యప్రియోక్తులఁ బతిఁ దనుప వలయు
సర్వకాలమ్ముల సర్వదశలయందు, మేకొని పతినిఁ బ్రేమింపవలయు

గీ. అనలస యలాలసయు శుచి యప్రమత్త, ధర్మచిత్త సంతుష్ట స్నిగ్ధ యనవద్య
సూనృతప్రియవాక్యయునై నిరతము, నపతితుఁ బతి భజియింపనగును సాధ్వి.
క. శ్రీయువతి వోలెఁ దత్పర, యై యే సతి గొలుచుఁ బతిని హరి భావముతో
నాయమ హరిలోకమ్మున, శ్రీయటు హరిరూపుఁ బతినిఁ జేరి సుఖించున్. 453
గీ. భూపముఖ్య! యచోరు లపాపులునయి, యలరు సంకరజాతుల కంత్యజులకుఁ
గులపరంపరాగతమయి చెలఁగునట్టి, వృత్తియ యగున్ జుమీ పరికించిచూడ.
గీ. ప్రతియుగంబునఁ దత్తత్స్వభావవిహిత, మైన ధర్మమె నిక్కము గా నరులకు
నిందునందును సుఖముఁ గావించునదిగ, వేదవేదులచే నిరూపింపఁబడియె. 455
గీ. వినుస్వభావకృతంబగు వృత్తితోఁ జ, రించుచు స్వకర్మముం బొనరించువాఁడెఁ
మెల్లన స్వభావభవ కర్మమెల్ల విడిచి, నిర్గుణత్వంబుఁబడయును నిశ్చయముగ.
గీ. మాటిమాటికిఁ దా నుప్యమానమగుచు, క్షేత్రము కడు నిర్వీర్యతం జెందుచుండు
మగుడ సస్యప్రసూతికిన్ దగనిదగును, విత్తఁబడిన బీజంబును విఫలమగును. 457
గీ. ఇత్తెఱంగునఁ గామప్రవృత్తమైన, చిత్తము ప్రభూతకామాతిసేవచే వి
రక్తిఁ జెందును జుమి ధర్మరాజ! వహ్ని, పూర్ణఘృతధారలన్ శాంతిఁబొందినట్లు.
వ. ఏపురుషునకు వర్ణాభిసూచకంబగు లక్షణంబు ప్రోక్తంబయ్యెనది వర్ణాంతరంబునఁ
జూడంబడునేని దల్లక్షణంబునన తద్వర్ణనిర్దేశంబుఁ జేయనగు. 459

---

## అధ్యాయము 12.

### ఆశ్రమధర్మోపదేశము

నారదుఁడు:—

క. గురుకులమున వసియించుచు, గురుహితమొనరించుచున్ మిగుల దాంతుండై
గురునందుఁ జెల్మి దానుని, సరణిన్ నీచుఁడయి బ్రహ్మచారి మెలఁగనా. 460
వ. మఱియు వటుండు సమాహితచిత్తుండై సాయంప్రాతఃకాలంబుల గురుపావకార్యమ
దైవతోత్తముల నుపాసింపవలయు. మౌనవ్రతుండై యుభయసంధ్యల సేవింప
వలయు, ఆహూతుండగునేని నియమితుండై గురువువలన వేదాధ్యయనంబుఁ
గావింపవలయు, ఉపక్రమోప సంహారంబులయందు గురుచరణంబులకు శిరఃప్ర
ణామంబు లొనరింపవలయు, దర్భపాణియై యథాతథంబుగ మేఖలాజినవస్త్రం
బులును, జటాదండకమండలువులు, యజ్ఞోపవీతంబు ధరింపవలయు, సాయంప్రా
తఃకాలంబుల భిక్షాటనంబుఁ జేసి తద్భైక్షాన్నంబును గురువునకు నివేదింప

వలయు, తదనుజ్ఞాతుండై భుజింపనగు; లేకున్న నుపవసింపవలయు. సాధుశీలుండును మితభోజియు, సమర్థుండు, శ్రద్ధధానుండు, జితేంద్రియుండునై స్త్రీలయందును, స్త్రీలోలురయందును యథావసరముగ వ్యవహరింపవలయు. బ్రహ్మచారి యగృహస్థుఁడై ప్రమదాప్రసంగమును విసర్జింపవలయు. బలవంతములగు నింద్రియములు యతీంద్రులమనంబునేనిఁ బ్రసభంబునహరించు. యువకుండగు వటుఁడు గురుకాంతలచేతను దదితరయువతులచేతను, దనకుఁ గేశప్రసాధనోన్మర్దన్నపనాభ్యంజనాదికములు సేయింపరాదు. 461

గీ. తప్తపావకసంకాశశతరుణి యనఁగఁ, బూరుషుఁడు ఘృతకుంభసముండుఁగాన
దుహితనైననేకాంతమందుండరియఁగ, జనదు మెలఁగంగ నాఁబ్రయోజనముఁబట్టి.

వ. ఆత్మసాక్షాత్కారమునంజేసి యీదేహాదిక ప్రపంచం బాభాసమాత్రమని నిశ్చయించి జీవుం డెంతదనుక స్వతంత్రుండు కాఁడంతదనుక స్త్రీపుం భేదంబు విరమింపకుండు. ఆ ద్వైతభావంబు కతంబునన నీజీవునకు విపర్యయంబగుంగావున స్త్రీసంపర్కంబు సర్వదా విసర్జింపనగు. ఈ సమస్తంబు వ్రతస్థుండగు బ్రహ్మచారికి యతికిని సమామ్నాతంబయ్యె. ఋతుకాలంబున భార్యాసంగమంబుం జేయు గృహస్థునకు గురువృత్తి వికల్పంబుననగు, ధృతవ్రతులైనవారు శరీరాంజన శిరోభ్యంజనోన్మర్ద కాంతాచిత్రకర్మామిషమద్యాదికంబులను జందనమాల్యానులేపాలంకృతులను ద్యజింపవలయు. ఇట్లు ద్విజుండు గురుకులంబున వసించి శిక్షాద్యంగోపనిషత్సమేతంబగు వేదత్రయంబును బఠించి స్వాధికారానుసారంబుగఁ దదర్థంబును విచారించి శక్తుండగునేని యథార్హంబుగ గురుని యభిలషితంబగు కామంబు నొసంగి గృహంబునుగాని వనంబునుగాని బ్రవేశించి ప్రవ్రజించి యందు నైష్ఠికుండై యుండవలయు. 463

గీ. అగ్నియందు గురువునందునాత్మయందు, నఖిలభూతములందు నాశ్రయచ్యుతుహరి
స్వీయశక్తులచేతఁ బ్రవిష్టుఁగాఁగఁ, జిత్తమున సంతతంబు వీక్షింపవలయు. 464

వ. గృహస్థుఁ డీవిధంబున బ్రహ్మచారియు వానప్రస్థుండు యతియునై చరించుచు జ్ఞానోదయంబుగలిగి పరబ్రహ్మంబునొందు. 465

క. మునిసమ్మతములగు వనస్థుని నియమములన్ వచింతు క్షోణీశ్వర! వా
ని ననుష్ఠించినవాఁడగు, ముని వైశంబ ఋషిలోకముంబొందు నృపా! 466

వ. వానప్రస్థుండు కృష్టపచ్యంబును భుజింపరాదు. అకృష్టపచ్యంబునైనను నకాలమున నారగింపఁజనదు. అగ్నిపక్వంబొండె నామంబొండె భుజింపఁదగదు. అర్కపక్వంబైనదానిఁ గొనితెచ్చి భక్షింపవలయు, వన్యంబులచేతన నిత్యప్రేరితంబు

లగు చరుపురోడాశంబుల రచింపవలయు. అన్నాదికంబగు గ్రాంగ్రోత్తపదార్థంబు లభ్యంబైనప్పుడు పాత్రితపదార్థంబులు పరిత్యజింపవలయు. హిమవాయ్వగ్నివర్షాతపపీడలం దాను సహించువాఁడై యగ్నికార్యంబు నిమిత్తము పర్ణశాలయొండెఁ బర్వత కందరంబొండె నాశ్రయింపవలయు. జటాధరుండై కేశరోమశ్మశ్రునఖమాలిన్యంబులందాల్చుచు దండకమండల్వాజిన వల్కలాది పరిచ్ఛదంబులఁ బూనుచు నిపుణుండగు ముని పంద్రెండేండ్లుకాని యెనిమిదికాని నాలుగుకాని రెండుకాని వత్సరంబుకాని వనంబునం జరింపవలయు. నియతమతియై కష్టంబుల విపన్నుండు కాకుండవలయు. 467

గీ. తెవులునంగాని లేక ముసదిమిని గాని, క్రియలయందైన నాన్వీక్షకీసువిద్య
నైన దక్షుండుకానిచో ననశనాది, కంబుఁ గావింపవలయుఁ జగలంబుమీఱ. 468

వ. ఆత్మయం దగ్ని నారోపించి యహమ్మమత్వాభిమానంబు వర్జించి సర్వసంఘాతంబగు దేహంబును యథాయోగ్యంబుగఁ గారణంబులందు విన్యసింపవలయు. ధీమంతుండై యాకాశంబున దేహచ్ఛిద్రంబులను, వాయువున నిశ్వాసంబులను, పావకంబున నూష్మంబులను, సలిలంబున రక్తశ్లేష్మ పూయంబులను, పృథివిని శేషంబగు నస్థిమాంసాదికంబును, మఱియు యథోద్భవంబుగ వహ్నియందు వక్తవ్యాంశసహితంబగు వాక్కును, ఇంద్రునందు శిల్పసహితంబులగు కరంబులును, విష్ణునందు గతిసహితంబులగు పదంబులును, బ్రజాపతియందు రతిసహితంబగు నుపస్థంబును, మృత్యువునందు నుత్సర్గసహితంబగు పాయువును, దిక్కులయందు నాదయుతంబులగు శ్రోత్రంబులును, నధ్యాత్మమునందు స్పర్శయుక్తంబగు చర్మంబును,నాదిత్యునియందు రూపసహితంబులగు నేత్రములును, జలంబులందు వరుణసహితంబగు జిహ్వను, భూమియందు గంధసహితమైన ఘ్రాణంబును, జంద్రునియందు మనోరథసంయుక్తంబగు మనంబును, గవియైన బ్రహ్మయందు బోధ్యయుతంబగు బుద్ధిని, నహంమమతా క్రియాజనకుండగు రుద్రునియందు నహంకారసహితమమతయు, క్షేత్రజ్ఞునియందు సత్త్వసహితంబగు చిత్తంబును, పరబ్రహ్మమునందు గుణయుతుఁడగు క్షేత్రజ్ఞుని జొనుపందగు. మఱియుఁబృథివిని జలంబునందును, జలంబును పావకంబునందును, పావకంబును వాయువునందును, వాయువును నభంబునందును, నభంబును కూటస్థంబునందును, కూటస్థమును మహత్తత్త్వంబునందును, నది యవ్యక్తంబునందును, నవ్యక్తంబు నక్షర పరబ్రహ్మంబునందును బ్రవేశపెట్టనగు. ఇట్లక్షరత్వంబునఁ జిన్మాత్రంబుగ శేషించినవానిగఁ దన్నెఱింగి యద్వయుండై దగ్ధేంధనుండగు పావకుండుంబోలె నుపరతుండు కావలయును. 469

## అధ్యాయము 13.

### ప్రహ్లాదాజగరసంవాదము

నారదుఁడు:—

క. విను వానప్రస్థాశ్రమ, మున దక్షుండై శరీరమునమాత్రము ని
ల్చినవాఁడు ప్రవ్రజింపన్, జను నాపిమ్మటను ముక్తసంగుండగుచున్. 470

వ. మఱియు నొక్కొక్క గ్రామంబున నొక్కొక్క రేయిచొప్పున నిల్చుచు నిరపే
క్షుండై భూమిం జరింపవలయు. కౌపీనాచ్ఛాదనమాత్రంబగు వస్త్రముమాత్రము
ధరింపవలయు. దండకమండలువ్యతిరిక్తంబు త్యక్తంబెద్దియు నాపద్వ్యతిరిక్త
కాలంబున ధరింపం జనదు. ఆత్మారాముఁడును, నిరపాశ్రయుండును, నసహా
యుండునై భిక్షువు చరింపవలయు. సర్వభూతసుహృదుఁడు, శాంతుఁడు, నారా
యణపరాయణుఁడునై కార్యకారణరూపంబును నవ్యయంబును బరంబునగు
నాత్మమయం బీ విశ్వంబుఁ గానవలయు. అసద్రూపంబగు విశ్వంబునందంతట
నాత్మను బరబ్రహ్మంబును వీక్షింపవలయు. జాగ్రత్సుషుప్తి సంధియందు నాత్మ
దర్శియై నాత్మగతిని వాస్తవంబు గాక మాయామాత్రంబగు బంధమోక్షంబును
బరికించుచు దేహంబునకు మృత్యువు ధ్రువంబనియు, జీవితం బధ్రువంబనియుఁ
దెలియుచుఁ గేవలము భూతోత్పత్తి వినాశహేతువగు కాలంబునకుఁ బ్రతీక్షింప
వలయు. మఱియు ననాత్మపరంబులగు శాస్త్రంబులయందు సక్తుండు కారాదు.
జీవనోపాయ వృత్తిం గైకొనరాదు. వాదివాదంబులగు తర్కంబులఁ బరిత్యజింప
వలయు. ఆగ్రహంబున నేదే నొకపక్షంబు నాశ్రయింపంజనదు. శిష్యులఁ బెక్కురఁ
బరిగ్రహింపక బహుళగ్రంథంబుల నభ్యసింపక వ్యాఖ్యలనుపయోగింపక యెందు
నే యారంభంబుల నారంభింపక యుండవలయు. యతి కాశ్రమంబు ప్రాయికంబుగ
లేదు. మహాత్ముఁడును, శాంతుఁడును, సమచిత్తుండు నగువానికి ధర్మహేతువులగు
నేని దండలింగాదులు ధరింపవచ్చు లేక త్యజింపవచ్చు. అవ్యక్తచిహ్నుండును
నవ్యక్తార్థుండును మనీషావంతుండును గవియునగు ముని బాలోన్మత్తమూకులవలెఁ
దన్ను లోకులకు నగపఱపవలయు. 471

క. భూదయితా! వినుము సూనృత, వాదులు కవు లుదహరింతురు ప్రాక్తనమగు ప్ర
హ్లాదాజగర విమల సం, వాదమ్మనెడి యితిహాసవర మీయెడలన్. 472

సీ. కతిపయామాత్యసంయుతుఁ, డేఁచు భాగవ తాగ్రణియైన ప్రహ్లాదుఁడు మును
లోకతత్త్వ జిఘృక్షుఁడై లోకంబులం దగ, సంచరించుచు సహ్యసానువందుఁ
గావేరి తీరభాగంబున నత్యంత, ధూళిధూసరిత గాత్రుఁడయి మిగుల
గూఢతేజస్కుఁడగుచుఁ బడియున్నట్టి, యాజగరవ్రతుఁడగు యతినిఁ గాంచె

గీ. ఆ యతీంద్రుని కర్మల నాకృతులను, వాక్యముల లక్షణంబుల వర్ణమునను
నాశ్రమాదుల నీతఁడే యాతఁడగునొ, కాఁడొ తెలియఁగలేరు మునులన్నవారె.

ఆ. పరమభాగవతుఁడు ప్రహ్లాదుఁ డతనికి, మ్రొక్కి యర్హరీతిఁ బూజఁ జేసి
యడుగులన్ శిరమున నంటుచు జిజ్ఞాస, చేత నిట్టులడిగె నా తపసిని. 474

ప్రహ్లాదుఁడు:—

సీ. ఓ మహాభాగ! నీ వుద్యమయుతుఁడగు, భోగవంతుని చందమును ధరించి
యతిబలిష్ఠమగు కాయంబును దాల్చితు, ద్యమవంతునకు నె విత్తంబుఁ గల్గు
విత్తశాలికె భోగ మత్తమిల్లును భోగ, వంతుల దేహంబె బలిసియుండు
నన్యవిధంబున నది సంభవింప ద, నుద్యమతం బడి యున్న నీకుఁ

గీ. గలిగె నెచ్చటనుండి భోగములు? భోగ, రహితునకు నేగతిం బీవరమగు తనువు
విప్రసత్తమ! మాకు నివ్విషయ మెల్ల, వినుట కర్హులమేని నెమ్మిని వచింపు. 475

క. కవివి నిపుణుండవున్ సనుఁ, డవు ప్రియకరుఁడవును దక్షుఁడవునగు నీవీ
భువనంబు కర్మసలుపన్, దవులక పడియుందు వెట్లు దానిం గనుచున్. 476

నారదుఁడు:—

క. అని దైత్యభర్త యడుగన్, మునిపతి తద్వాక్సుధా వినోదితమతియై
వినయవినతుఁడగు ప్రహ్లా, దుని కిట్లని పలికె నవ్వు తోలుకాడంగన్. 477

బ్రాహ్మణుఁడు:—

గీ. ఆర్యసమ్మతుఁడ వగు నీ వసురనాథ!, వివిధనరుల ప్రవృత్తి నివృత్తి సూచ
కంబులగు స్థానముల నెఱుఁగంగఁగంటి, దివ్యతరమగు నాధ్యాత్మదృష్టితోడ.

గీ. అనఘ! భగవంతుఁడైన నారాయణుండు, నీదు హృదయాబ్జపీఠిని నిల్చి తాల్చి
విమలతరమైన భక్తి సంప్రీతుఁడగుచుఁ, దలఁగద్రోయు నదమము నజ్ఞానమోహ.

గీ. ఐన నీప్రశ్నములకు నీ స్థితిప! నే య, థాశ్రుతంబుగఁ దగు సమాధానమిత్తు
నాత్మశుద్ధి వాంఛించువాఁడాచరింప, నలయు నీతోడి యుచిత సంభాషణంబు.

సీ. భూరి కామంబులం బూరింపఁబడక సం, సృతివర్తకం బగు తృష్ణచేతఁ
గర్మముల్ సేయింపఁగాఁబడుచును నే వి, విధయోనులందుఁ బ్రాపితుఁడ నగుచు
దిష్టవశమునఁ బొందింపఁగాఁబడితి నీ, మనుజదేహంబున దనుజనాథ!
అది స్వర్గమోక్షతిర్యక్త్వ పునర్మాన, వత్వ సంప్రాప్తికి ద్వారముకద

గీ. ఇందు సుఖలబ్ధి దుఃఖనివృత్తులకయి
బహువిధకర్మలఁ జేయు దంపతుల యవ్వి
పర్యయము గన్గొని నివృత్తిపరుఁడ నగుచు
మెలఁగుచుంటిని వింటె యో మలఘు చరిత! 481

గీ. ఆత్మకు సుఖంబె రూపమౌ నఖిలకామ, విరతియే దేహమగు నిద్రయరసి నేను
భోగములమనస్స్ఫూర్జితములుగ నెంచి, సారిదిఁ బ్రారబ్ధ మనుభవింపుచుఁ బరుండు.

గీ. అనఘ! యిట్లాత్మరూపంబు స్వార్థయుతము
సతమునై యుండ మఱచి తా జనుఁడు జడత
ద్వైతమున సత్యమైన యీ తనువునందుఁ
జిత్రమున్ ఘోరమైన సంసృతినిఁ బొందు. 483

శా. శైవాలాదితదుద్భవ ప్రచయ సంఛన్నాంబు పూరంబులన్
దా వర్జించి జడాశయుండు జలతృష్ణన్ వే ప్రధావించు నెం
తే విభ్రాంతిని నెండమావులకు నట్లే యర్థదృష్టిన్ ఖలుం
డై వెన్నాడు స్వభిన్నమై పరగు దేహంబున్ విచిత్రంబుగన్. 484

గీ. కర్మపరతంత్ర దేహాదికంబుచేత, నాత్మకు సుఖంబు దుఃఖాత్యయంబుఁ గోరు
నట్టి నిర్భాగ్యులకును క్రియాతతులివి, వితథములగుఁ బునఃపునఃకృతములగుచు.

గీ. కడఁక నాధ్యాత్మికాది దుఃఖములచేత, నొక్కచోట విముక్తుఁడై యున్నఁ గాని
మర్త్యునకు నతిదుఃఖ సమార్జితార్థ, కామములచేఁ బ్రయోజనమేమి కలదు? 486

సీ. లుబ్ధులు నజితాత్ములును భీతికతన న, లబ్ధనిద్రులును నెల్లజనులందు
శంకమానులు నయిచరియించు ధనులకుఁ, గ్లేశంబె మదిఁ బరికించుచుండు
రాజులవలనఁ జోరతతి కతంబున, శత్రులవలన స్వజనుల వలనఁ
బశువులవలనను బక్షి సంఘంబు వ, లనఁ దనవలనఁ గాలంబువలనఁ

గీ. నర్థిజనములవలనఁ బ్రాణార్థవంతు
లకు భయంబుప్పతిలు మర్త్యులకు భయంబు
మోహమును శోకమును గ్రోధమును శ్రమంబుఁ
గూర్చుధనకాంక్ష వీడనగుం బుధుండు. 487

క. సరఘయు నజగరమును స, ద్గురు లీ లోకంబునందుఁ గొనకొని యేత
ద్గురుశిక్షన్ వైరాగ్యముఁ, బరితోషంబును గ్రమ్మనఁ బడసితి ననఘా! 488

గీ. సర్వకామవిరాగంబు సరఘవలన, నేను దగ శిక్షితుఁడనైతి దానవేంద్ర!
దుఃఖసముపార్జితమగు మధువును బోలె ధనముఁ దత్స్వామినుండి యితరుఁడుఁ గొనును.

క. అనఘ! యదృచ్ఛాలబ్ధం, బునఁ బరితుష్టుండ నౌదు మొగి నిస్పృహతన్
వినుమటు కాదే బలినై, పెనుబాముగతి శయనింతుఁ బెక్కు దినంబుల్. 490

మ. ఒకచో నల్పమ యారగింతు నధికంబొక్కచో మృష్టాన్న మిం
కొకచో దూషితమొక్కచో రసయుతంబొక్కొక్కచో నీరసం

బోకచో శ్రద్ధ సమర్పితంబు నొకచోఁ నుద్దేశ హీనంబు మా
నక భక్షింతు యదృచ్ఛమై గలుగు నన్నంబున్ దివారాత్రముల్. 491

సీ. కోమలక్షౌమదుకూలంబు జీర్ణవ, ల్కలమును నొకభంగిఁ గట్టుచుందు
హర్మ్యపర్యంకశయ్యలఁ బర్ణ భస్మాశ్మ, తృణముల నొకకరీతిశయనింతు
స్నాతానులిప్తుండ స్రగలంకృతుండను, సురుచిరాంబరుఁడనై కరిరథాశ్వ
ములనెక్కి తిరుగుదు నెలమితోడఁ బృథుగ్ర, హంబుచందమున దిగంబరుండ

గీ. నగుచునొక్కెడ మెలఁగుదు ననిశముఁ బ్రకృతి,విషమమగుజనంబునన్ దెగడఁ బొగడ
వారి శ్రేయంబెమనమునఁ గోరుచుందుఁ,బరమపురుషైక్యమునగడు వాంఛఁగొందు.

వ. తత్త్వదర్శియైన ముని వికల్పంబును జిత్తంబునందును; జిత్తంబును నర్థవిభ్రమం
బగు మనంబునందును; మనంబును సాత్వికాహంకారమందును; నయ్యహంకారం
బును మాయయందును; నమ్మాయ నాత్మానుభూతియందును హోమంబుఁ జేసి
స్వస్వరూపానుభూతిస్థితుండై యుపరతుండు కావలయు. 493

క. ధీయుతుఁడవు శ్రీమన్నా, రాయణభక్తుఁడవుగాన నతిలోకంబౌ
నా యాత్మవృత్తము బుధవి, ధేయా! యతిగుప్తమైనఁ దెలిపితి నీకున్. 494

నారదుఁడు:—

క. ఈరీతి మానివలనన్, బారమహంస్యమగు ధర్మపథము బుధాలం
కారుఁడు ప్రహ్లాదుఁడు విని,యారాధించి యతనిఁ జనె స్వాలయమునకున్. 495

---

## అధ్యాయము 14.

### గృహస్థ ధర్మోపదేశము

ధర్మరాజు:—

క. గృహసక్తబుద్ధియును స, స్పృహుఁడగు మాదృశుఁడై నగృహమేధి యెటుల్
గ్రహియించు నీ పథంబును, రహి నా కెఱిఁగింపుమా సురర్షితిలకమా! 496

నారదుఁడు:—

క. ధీనిధి! యుధిష్ఠిరా! లో, కానుగ్రహకాంక్ష లెస్సగా నడిగితి వె
ద్దానన్ దగఁ గర్మంబుల, కౌ నైష్కర్మ్యము వచింతు నది నే నీకున్. 497

క. క్షితిప! గృహస్థితుఁడై యచ్యుతార్పణముగాఁగఁ గ్రియలనొనరించుచుఁ దా
నతి విస్రంభముతోడుత, యతిసత్తముల న్నిరుం డుపాసింపవలెన్. 498

ఉ. శాంతజనావృతుండగుచు శ్రద్ధమెయిన్ దగుకాలమందు న
త్యంతము విష్ణుదేవు నవతారకథామృతమారగించుచున్

సంతత సాధుసంగతి నశక్తుఁడై రతి దారసుతాదిసంగవి
భ్రాంతిని వీడి యుత్థితుఁడు స్వప్నమునుంబలె వారిఁ జూడనౌ. 499

గీ. అవసరం బెంతొ యంతె దేహమున గేహ
మునను పాసీనుఁడగుచుఁ దా బుధుఁడు కడు న
సక్తుఁడయ్యు సక్తునిభంగి నల్పవలయుఁ
బురుషకారంబు నరలోకమున నరేంద్ర! 500

క. జ్ఞాతులుఁ బితరులుఁ బుత్రులు, భ్రాతలు సఖు లొరులు దేనిఁ బలఁతురొ దేనిన్
బ్రీతి వచింతురొ నిర్మముఁడై తత్సర్వము నొనర్పనగు సమ్మతిమై. 501

క. భౌమంబును దివ్యంబును, వ్యోమజమున్ దైవదత్తమున్ సర్వధన
స్తోమముఁ గొని ప్రాజ్ఞుఁడు నిష్కామతఁ జేయవలె నిత్యకర్మములెల్లన్. 502

గీ. ఎంతమాత్రాన కుక్షి భరింపఁబడునొ, యంత దేహులకున్ స్వత్వ మదలంప
నంతకెక్కుడు వాంఛించునాత్మ నెవ్వఁ, డతఁడు పాటచ్చరుండు దండార్హుఁడునగు.

క. మృగ గార్ద భోష్ట్ర శాఖామృగ మూషిక మక్షికా సరీసృపములఁ జూ
డఁగ నగుఁ దనవలె సుతులటు, వానికి వారి కెంత యంతర మెన్నన్. 504

క. తవిలి యతికష్టలబ్ధ, త్రివర్గమును గొల్వ రాదు గృహమేధియు భూ
ధవ! దేశకాలగతి దై, వవినిర్మితమును భుజింపవలయు నియతిమై. 505

వ. శ్వానంబులకుఁ బతితులకు నంత్యజులకుం గూడ యథాతథంబుగ స్వభోజ్యంబు
లగు కామంబుల విభజించి యొసంగవలయు. మమత్వ రూపాగ్రహాస్పదమైన
భార్యను నతిథిశుశ్రూషణంబున నియోగింపవలయు. 506

గీ. యన్నిమిత్తము ప్రాణంబులైన విడుచుఁ, బితరులన్ గురునైనను బలుకమాను
నట్టి స్త్రీయందు మమతఁ బాయంగలిగిన, నజితుఁడైనను నతనిచే జితుఁడె యగు.

గీ. రూఢిఁ దుదిఁ గ్రిమివిడ్భస్మరూప మొందు, నట్టి యీ కళేబర మేడ? యల తదీయ
రతికిఁ బట్టైన సతి యేడ? యతులమైన, మహిమ నభమును గప్పు నాత్మయది యేడ?

గీ. సిద్ధములు పంటె యజ్ఞావశిష్టములగు, నర్థములను గల్పింపఁగా నాత్మవృత్తి
మమత వర్జించి పిమ్మట మహితులైన, వారి పదవినిఁ బొందును బ్రాజ్ఞుఁడనఘ! 509

గీ. దేవతల ఋషులను బితృదేవతలను, జనుల భూతచయముల నాత్మను బ్రతిది
నము స్వవృత్త్యాగతమగు ధనమ్ముతో య, జింపవలయు నంతర్యామి గనింపుమీఱ.

వ. అధికారాదికంబులగు సర్వయజ్ఞసంపదలుఁ దనకుఁ గల్గుటఁ జేసి యాజ్ఞికంబగు
విధిచేత నాగ్నిహోత్రాదికంబుచేత యజ్ఞపురుషు యజింపవలయు. 511

చ. వరదుఁడు యజ్ఞభోక్త భగవంతుఁడు విష్ణుఁడు సర్వదైవతే
శ్వరుఁడు పరాత్పరుండు హరి బ్రాహ్మణవక్త్రమునన్ హుతంబులై
పరగెడువానిచేతఁబలెవహ్నిముఖంబున వేల్వఁబడ్డ యా
చరువుకతంబునన్ నృపతిసత్తమ! ప్రీతుఁడు గాఁడొకింతయున్. 512

క. కావున రాజా! బ్రాహ్మణ, దేవ నృ భూతోత్కరపితృ దేవతలందున్
నీ వీ క్షేత్రజ్ఞుని భూ, దేవముఖ యజింపు తగు గతిం గామతతిన్. 513

వ. విత్తవంతుండగు ద్విజుండు విభవానుసారంబుగఁ బితృదేవతలకుఁ దద్బంధులకు నపరపక్షీయంబగు శ్రాద్ధంబుఁ గావింపవలయు. మఱియు నయనంబునను విషువ కాలంబునను వ్యతీపాతయోగంబునను దినక్షయంబునందును సూర్యచంద్రోప రాగమందును, ద్వాదశియందును, శ్రవణనక్షత్రంబునను, అక్షయ తృతీయ యందును, శుక్లపక్ష నవమియందును, గార్త్తికమాసంబునను, జతురష్టకముల యందును, హేమంతశిశిరర్తువులయందును, మాఘమాసంబున శుక్లపక్ష సప్తమి యందును, మాసనక్షత్రయుక్తములగు రాకానుమతులయందును, అనూరాధా శ్రవణ ఉత్తరాత్రయ యుక్త ద్వాదశి యందును, ఉత్తరాత్రియ యుక్తైకాదశి యందును, జన్మనక్షత్ర శ్రవణయోగయుక్త దినంబునను యథావిధిఁ బితృదేవ తాదులను బూజింపవలయు. ఈకాలంబులు నరులకు శ్రేయోవివర్ధనంబులు. ఈకాలములయందు శ్రేయస్కాముఁడై కర్మంబులాచరించిన నమోఘాయుష్కు లగుదురు. ఈ పుణ్యకాలంబులయందు స్నానంబును, జపంబును, హోమం బును, దపంబును దేవద్విజార్చనంబును, బితృదేవనృభూతబలిదానంబును ననశ్వ రంబులై శ్రేయంబుఁగూర్చు. భార్యకుఁ బుంసవనాది కార్యంబును; నపత్యంబునకు జాతకర్మాదికంబును; దనకు యజ్ఞదీక్షాదికంబును; బ్రేతంబులకు దహనాదికము; సాంవత్సరికముఁ గర్మాభ్యుదయంబునకై యీ పుణ్యకాలంబుల నాచరించుట శ్రేయోదాయకంబగు. 514

సీ. ఇంక దేశముల వచింతు నాలింపు స, త్పాత్ర మెచ్చోటఁ బ్రాప్తమగుచుండు
నట్టి ధర్మాదిభద్రదానవహంబై పొలుపు మిగులు దేశంబుపుణ్యతమము
మఱియుఁ జరాచరాత్మకమగు భగవంతు, ప్రతిబింబ మెచ్చోటఁబరగుచుండు
నతిపావనంబయియలరెడు దేశము, య్యది శోభనమ్ములకాస్పదంబు

తే. అరయఁగఁ దపోవిద్యాదయాన్వితమగు
బ్రాహ్మణకులంబు నెచ్చోటఁబరగుచుండు

నెచట హరిపూజసంతతమెసక మెసఁగు
నట్టిదేశంబు మిగులపుణ్యమ్ము సుమ్ము. 515

ఆ. రాణమీఱఁగాఁ బురాణప్రసిద్ధగంగాదినదులుఁ బుష్కరాదిసరసు
లర్హసంశ్రితంబులైన క్షేత్రంబులుఁ, బొదలుదేశ మధికపుణ్యతమము. 516

వ. మఱియుఁ గురుక్షేత్రంబు, హయశీర్షంబుఁ బ్రయాగంబుఁ బులహాశ్రమంబు నైమిశంబు ఫల్గుణంబు సేతువుఁ బ్రభాసంబుఁ గుశస్థలంబు వారాణసి మధుపురంబుఁ బంపయు బిందుసరంబు నారాయణాశ్రమంబు నందయు సీతారామాశ్రమాదులు సర్వకులాచలంబులు మహేంద్రమలయాదులు హరిపూజాశ్రయంబులగు నివియెల్లఁ బుణ్యదేశంబులు. శ్రేయస్కాముఁడు పదింబదిగ నీదేశంబుల సేవింపవలయు. ఈ ప్రదేశంబులఁ గావింపఁబడిన ధర్మంబు పురుషునకు సహస్రగుణోదయంబగు. పాత్రజ్ఞులైన కవిపుంగవులచే నటఁ జరాచర మయుఁడగు నీహరియే పాత్రంబుగా నిర్ణయింపఁబడె. దేవతలు ఋషులు, నర్హులు, బ్రహ్మాత్మజాదులు నుండగాఁ ద్వదీయంబగు రాజసూయంబున నచ్యుతుండు సత్పాత్రంబుగ సమ్మతింపఁబడె. జీవరాశి పరివృతంబగు బ్రహ్మాండకోశపాదపంబునకు మూలభూతుండగుట నచ్యుతుండు పూజితుండగుడు సర్వజీవాత్మ తర్పణంబగు. దేవమానవ తిర్యగృషిరూపంబులగు దేహంబు లీ యధోక్షజుచే నిర్మింపఁబడియె. ఈ పరమపురుషుండు జీవరూపంబున నీ పురంబుల శయనించియుండు. ఈ పురంబులయందుఁ దరతమభావంబున సంతర్యామిరూపంబున వర్తించుచుండుఁగావున నీ పరమాత్మయగు హరియ సర్వవిధంబుల సత్పాత్రంబగు. పరస్పరము నసన్మానబుద్ధులై పరగు నీ నరులకుఁ ద్రేతాదియుగంబుల హరిప్రతిమ క్రియానిమిత్త మేర్పరుపఁబడియెఁ గావునఁ గొందఱు ప్రతిమయందు హరిని శ్రద్ధచేతను బూజచేతను నుపాసింతురు. అట్లుపాసింపఁబడినదయ్యుఁ బ్రతిమ హరిని ద్వేషించువారికిఁ బ్రయోజనకారి కానేరదు. తపస్సుచేతను, విద్యచేతను, దిష్టిచేతను, వేదమయంబగుహరి తనువునెవరు ధరింతురో యా బ్రాహ్మణులు పురుషులందు సత్పాత్రమని విజ్ఞులెఱింగిరి. 517

క. తమ పాదధూళిచే లోకములను మూఁడింటిఁ బూతములు సేయు ద్విజో
త్తములు జగదాత్మకుం డత్యమలుఁడునగు నీ హరికరయన్ దైవతముల్. 518

---

# అధ్యాయము 15.

## మోక్షలక్షణ కథనము

నారదుఁడు:—

గీ. కర్మనిష్ఠులు కొందఱు ధర్మతనయ!, కొందఱు సుతపోనిష్ఠులగుదురు ద్విజులు
ఇందు స్వాధ్యాయనిష్ఠులు కొంద ఱొరులు, జ్ఞానయోగనిష్ఠులగుచు సంచరింత్రు.

వ. అనంతఫలము నిచ్చగించు గృహమేధి పితృదేవతల నుద్దేశించి కవ్యంబును, దేవతల నుద్దేశించి హవ్యంబును నొసంగవలయు. దైవకార్యంబునకు నిర్వురను, పితృకార్యంబునకు మువ్వురను భుజింపఁజేయవలయు. లేకున్న నుభయకార్యంబుల నొక్కొక్కని నైన భుజింపఁజేయవచ్చు. సంపత్సంపన్నుండైనను శ్రాద్ధకార్యంబును విస్తరించి చేయంజనదు. దేశకాలోచితశ్రద్ధాద్రవ్య పాత్రార్హణంబులు యోగ్యంబులగునట్లు, స్వజనార్పణంబున విస్తారంబున యోగ్యంబులు కావు. దేశకాల సంప్రాప్తంబు నారణ్యంబునగు నన్నంబు హర్యర్పితంబై యథావిధిశ్రద్ధచేఁ బాత్రంబున సమర్పితంబైనయెడల నది యక్షయంబును గామదుఘంబు నగు. దేవర్షిపితృభూతగణంబులకుఁ దనకు స్వజనంబునకు నన్నంబు విభాగంబుఁ గావించుచు నదియెల్లఁ బరబ్రహ్మమయంబుగా నెంచవలయు. ధర్మతత్త్వవేత్తయగు వాఁడు శ్రాద్ధకర్మంబున మాంసంబు నొసంగరాదు; తాను భుజింపరాదు. వ్రీహ్యాదికంబగు మున్యన్నంబునంబలెఁ బశుహింసవలనఁ బ్రీతి జనింపదు. యోగ్యమైన ధర్మంబు నిచ్చగించు నరులకు మనోవాక్కాయజన్యంబగు భూతహింసను ద్యజించుటకంటె నుత్కృష్టంబైనధర్మంబు మఱొండెద్దియు లేదు. యజ్ఞవిద్వరులైన కొందఱు నిరీహులై జ్ఞానదీపితమైన ఆత్మసంయమనయోగాగ్నియందుఁ గర్మమయంబులగు యజ్ఞంబులను హోమంబుఁ జేయుదురు. "ఈతఁడు జాలిమాలినవాఁడై ప్రాణతర్పకుఁడై మనలహింసించు"నని పశుహింసచే యజించు నరులను గాంచి భూతంబులు జడియుచుండు. కావున ధర్మవిదుఁడు సంతుష్టుండై దైవోపపన్నంబగు నన్నంబుచే నన్వహము నిత్యనైమిత్తికక్రియలు గావింపవలయు. విధర్మము, పరధర్మము, ఆభాసంబు, ఉపధర్మము, ఛలంబునను నీయధర్మశాఖలైదింటిని ధర్మజ్ఞుండు వర్జింపవలయు. విధర్మంబు ధర్మబాధంబు; పరధర్మం బన్యచోదితంబు; ఉపధర్మంబు పాషండంబు; ఆభాసంబు దంభంబు; ఛలంబు శబ్దభేదియు నగు. 520

గీ. వినుము రాజోత్తమ! స్వభావవిహితధర్మ, మనుసముపశాంతికిన్ సుసమర్థమగును
ధర్మమునిమిత్తమైన యాత్రార్థమైన, నధనుఁడు ధనంబుఁ గోరరాదాత్మయందు.

క. ఈహారహితాత్మునకు న, నీహాయు భావించిచూడ నవృత్తిదమగుఁజూ
బాహాటంబుగ రాజ! మ, హాహికిఁ బలె నిందు సందియము లేదుకదా. 522

క. పౌరవ! నిరీహుఁడును స్వా, త్మారాముఁడు నిత్యతుష్టుఁ డైన సుఖముఁ జే
కూరుఁ జుమీ కామలోభ స, మారితుఁడై యర్థతృష్ణ మెలఁగు ఖలుఁడిలన్. 523

గీ. నిత్యసంతుష్టచిత్తుఁడై నెగడువాని, కెల్ల దిశలును శుభములై యెసఁగుచుండు
బాదములఁ జెప్పు లిడుకొన్నవాని కెట్లు, లావహిలు? శర్కరాకంటకాది బాధ?

వ. సంతుష్టుం డెవండును దుఃఖంబు నొందఁడు. జిహ్వోపస్థదైన్యంబునం గుందుజనుండు గృహపాలకశునక సదృశుండగు, అసంతుష్టుండగు విప్రునకు నింద్రియలౌల్యంబునఁ దేజోవిద్యాతపోయశంబులు, జ్ఞానంబును భిన్నఘటంబున జలంబుంబోలె స్రవించు. క్షుత్తృష్ణలచేఁ గామాంతంబును, ఫలోదయంబునఁ గ్రోధాంతంబును జనుండు పడయునుగాని సకలభూమండలంబును, దిశావలయంబును జయించి యనుభవించియు లోభాంతంబు నెవ్వండుం గనంజాలండు. 525

సీ. కామంబు నమితసంకల్ప వర్జనమునఁ, బ్రబలకోపము గామవర్జనమున
నర్థమునందు ననర్థేక్ష లోభమున్, దత్త్వవిజ్ఞానమునను భయంబు
సాదినాన్వీక్షికిన్ శోక మోహంబులు, మహితాత్మసేవ దంభంబు మఱియు
నమలమౌనమున యోగాంతరాయంబులన్, హింసను దేహాద్యనీహవలన

గీ. భూతజన్య దుఃఖంబు భూరికృపను, మానసిక పీడ లెల్ల సమాధిచేత
యోగశక్తిఁ దనూపీడ నుచితసత్త్వ, సేవచే నిద్రబుధుఁడు నిర్జింపవలయు. 526

క. తమమును రజమును ఘన స, త్త్వమునన్ సత్త్వమును గెలువఁదగు శమమున స
ర్వమును గురుభక్తిచేతన్, గ్రమమున నిర్జింపవలయుఁ గా పురుషుఁ డిలన్. 527

గీ. జ్ఞానదీప ప్రదుండు సాక్షాత్తు భగ, వంతుఁడగు గురునందు నెవ్వనికిఁ బొడము
మనుజుఁ డనెడి యసద్బుద్ధి మనుజనాథ!, వాని శ్రుతమెల్లఁ గుంజరస్నానసమము.

వ. ప్రధానపురుషేశ్వరుండును, సాక్షాద్భగవంతుండును, యోగేశ్వరగవేషణీయ పాదకమలుండునగు నీ కృష్ణుని నీలోకంబు నరునిగాఁ దలంచుచుండు. అరిషడ్వర్గ జయంబుఁ గలిగి యేకాంతులై యిష్టాపూర్తాదివిధు లాచరించుచుఁ దదేక నిష్ఠులయ్యు ధ్యానధారణసమాధియోగంబుల సాధింపకున్న వారు కేవల శ్రమభాజనులగుదురు. కృష్యాదులు దత్ఫలంబులు, నిష్టాపూర్తంబులు, మోక్షసాధకంబులు కావేని ననర్థదాయకంబులగు. చిత్తవిజయోద్యుక్తుండై నరుండు నిస్సంగుండు, నపరిగ్రహుండు, వివిక్తవాసియు, భిక్షువు, భైక్షమితాశనుండు నేకరూపుఁడునగుచుఁ బరిశుద్ధంబును, సమంబునగు ప్రదేశంబున స్థిరంబును, సుఖంబును

సమంబునగు నాసనంబుఁ గల్పించుకొని యందు ఋజుకాయుండై యాసీనుండు కావలయు. ఓంకారరూపప్రణవంబు నుచ్చరించుచు స్వనాసాగ్ర నిరీక్షణంబులచే మనంబును గామంబుల జయించుదనుక పూరక, రేచక, కుంభకంబులఁ బ్రాణాపానంబుల నిరోధింపవలయు, కామోపహతంబై భ్రమించుచు మనం బెందెందు నిర్గతంబగు నందందునుండి మరల్చి బుధుండు శనైర్గతి నమ్మనంబును హృదయంబునఁ జొనుపవలయు. ఇట్లభ్యాసంబుఁ గావించు యతీంద్రుని చిత్తం బల్పకాలంబున నిరింధనంబగు పావకంబుంబోలె నిత్యంబు నిర్వాణముం బొందు. కామాదులవలనఁ బ్రతిహతంబుఁగాక ప్రశాంతాఖిల వ్యాపారంబై యాత్మసుఖ సంస్పృష్టంబగు చిత్తంబు మఱియెన్నఁడును నుత్థితంబుకాఁజాలదు. త్రివర్గమూలంబగు. గృహంబునుండి తొలుతఁ బ్రవ్రజించి క్రమ్మఱ నా ధర్మార్థకామంబుల సేవించు భిక్షుండు నిరపత్రపుఁడై వాంతాన్నంబును దినువాఁడగు- ఎవ్వరు విట్క్రిమిభస్మాధీనంబు మ్రియమాణంబునగు దేహంబును, నాత్మగా భావింతురో వా రసద్బుద్ధులై యీ దేహంబును గొనియాడుదురు. గృహస్థునకుఁ గ్రియాత్యాగంబును, బ్రహ్మచారికి వ్రతత్యాగంబును, దపస్వికి గ్రామసేవయు, భిక్షువునకు నింద్రియలోలత్వంబును ననుచితంబులు. వీ రాశ్రమవిడంబనులగు నధములు. దైవమాయచే మోహింపఁబడిన వీరలను గృపారసంబున నుపేక్షింపవలయు. జ్ఞానంబున సమస్తవాసనలను దొలంగంజేసి పరమాత్మ నెఱింగిన యెడల నేకతమ్మున నేమి గోరుచుఁ బురుషుండు లంపటుండై దేహంబును బోషించు?

దేహంబె యరద మింద్రియములె హయములు, పగ్గము లింద్రియపతిమనంబె
పంచతన్మాత్రలు సంచారమార్గముల్, బుద్ధిసారథిచిత్తమున్ గ్రథనము
దశవిధప్రాణముల్ దలఁప నక్షంబు ధ, ర్మాధర్మములవి చక్రద్వయంబె
రథికుండు జీవుండు ప్రణవంబు ధనువు శ, రంబు జీవంబు పరంబగు గుఱి
భయ మద ద్వేష రాగ లోభములు శోక
మోహమానావమానముల్ మొగి నసూయ
మాయ హింసయు రజముఁ బ్రమాద నిద్ర
లాఁకలియు మున్నుగాఁగల వరిచయంబు. 530

ఇరవౌచున్ నరకాయ రూపక రథం బీరీతి స్వాధీనమై
పరఁగన్ సద్గురుపాదతోయరుహసేవాశాత విజ్ఞాన వి
స్ఫురితాసిన్ హరిసత్త్వుఁడై రిపుతతిం బోకార్చి యానందసు
స్థిరతన్ బూరుషుఁ డీ రథాదికము వర్జింపంగనౌఁ బిమ్మటన్. 531

శా. కాదేనిన్ నరునిం బ్రమత్తుని బలాత్కారంబునన్ ధర్మపు
త్రా! దుష్టేంద్రియవాజిసూతు లపమార్గంబందుఁ గొంపోయి పెం
పేదన్ దుర్విషయారికూటమును బొందింపంగ నవ్వారు మృ
త్యూదగ్రోగ్రభవాంధకూపమునఁ గూల్తుర్ సూతరథ్యాళితోన్. 532

వ. వైదికంబగు కర్మంబు ప్రవృత్తమనియు, నివృత్తంబనియు ద్వివిధంబై యుండు. అందుఁ బ్రవృత్తంబునన్ బునరావృత్తియు, నివృత్తంబునన్ మోక్షంబునుం బడయు. హింసప్రము ద్రవ్యమయము; కామ్య మశాంతిదంబు; అగ్నిహోత్రాదికంబు దర్శము పూర్ణిమాసయుఁ జాతుర్మాస్యముఁ బశుయాగము సోమయాగము వైశ్వదేవము, బలిహరణము నేవంయూపమగు నిష్టంబును సురాలయారామకూపోపాజీవ్యలక్షణంబగు పూర్తంబును ద్రవ్యసూక్ష్మ విపాకము, ధూమము, రాత్రియు, బహుళపక్షము, సోముఁడు నోషధీవీరుధంబులు దక్షిణాయనము నన్నంబు రేతంబుననునది పునర్భవంబైన పితృయానంబగు. ఆనుపూర్వికంబుగ నొక్కొక్క జన్మంబు జంతువు పొందుచుండు. ద్విజుండు నిషేకాదిశ్మశానాంతంబులగు సంస్కారంబులచే సంస్కృతుండై కర్మములను జ్ఞానదీపితంబులగు నింద్రియంబులయందును నింద్రియంబులను,సంకల్పమూలంబగు మనంబునందును, వికారయుక్తంబగు మనంబును వాక్కునందును, వాక్కును వర్ణసమామ్నాయమునందును, ఆ శబ్దంబు నోంకారమునందును, ఓంకారంబును బిందునాదంబునందును, ఆబిందువును ప్రాణాత్మకంబగు మహాబ్రహ్మమునందును న్యసింపవలయు. అగ్ని, సూర్యుఁడు, పగలు, పూర్వాహ్ణము, శుక్లపక్షము, బ్రహ్మయు, విశ్వ, తైజస, ప్రాజ్ఞ, తుర్యాత్మకుండగు నాత్మయు ననునది దేవయానమని చెప్పుదురు. ఇట్లానుపూర్వికంబుగ నాత్మయాజియు నుపశాంతాత్ముఁడు నాత్మస్థుండునగుచుఁ బునరావృత్తినొందక వేదనిర్మితంబులైన యీ పితృదేవయానంబుల నెవ్వఁడు శాస్త్రచక్షువున నెఱుంగు వాఁడు దేహస్థుండయ్యు మోహంబునొందఁడు. దేహముల యాద్యంతంబులు బహిరంతర్గతులు, ఉచ్చము నీచము, జ్ఞానము జ్ఞేయంబును, వచనంబుఁ వాచ్యంబు, ప్రకాశంబుఁదమంబు నన్నది తత్సర్వముఁ దానయని జ్ఞానియెఱుంగు. తర్కవిరోధంబున బాధింపఁ బడినదయ్యుఁ బ్రతిబింబాది రూపంబగు నాభాసంబెట్లు వస్తురూపంబునఁ దోఁచున ట్లింద్రియసంబంధమగు సర్వంబు నర్థత్వంబునఁ గల్పితంబయ్యు దుర్ఘటంబగుట పరమార్థంబుకాదు. ఇందు భూమ్యాద్యర్థములకు నాలంబనరూపమైన దేహ మెద్దియుం గాదు. ఇది సంఘాతంబును గాదు. వికారంబును భిన్నంబును గూడియున్నదియును గాదు. కావునఁ గేవలము మిథ్యయగు. మహాభూతం

బులుఁ దన్మాత్రంబులగు నవయవంబులం దక్కియుండవు. అవయవు లసత్యంబులుఁ గాఁగ నవయవంబులు నంతంబున నసద్రూపంబులగు. వస్తువునకు వికల్పకమగుచుండ సాదృశ్యభ్రాంతి యుత్పత్తిల్లు. స్వప్నంబున జాగ్రత్సుషుప్త్యవస్థలుంబలె శాస్త్రవిధినిషేధంబులగుచుండు. ఆత్మకు భావాద్వైతముఁ గ్రియాద్వైతమును ద్రవ్యాద్వైతమును యోచించుచు స్వానుభవమున ముని త్రివిధంబులైన స్వప్నంబుల నివర్తించుకొను. పటతంతువులకుఁబోలె వికల్పంబు మిథ్యయగుటఁ గార్యకారణరూపవస్త్వైక్యదర్శనంబు భావాద్వైతమనంబడు. సాక్షాత్ పరబ్రహ్మంబునందు మనోవాక్కాయంబులఁ గర్మసమర్పణంబు క్రియాద్వైతమని చెప్పంబడు. ఆత్మదారసుతాదులకుఁ దదితరదేహులకు నేకత్వంబు ద్రవ్యాద్వైతమనంబడు. ఏది యెవ్వనికి నెచ్చట దేనిచేత నెందువలనను నిషిద్ధంబుగాకయుండు నాద్రవ్యంబుచేతనే కర్మంబులునరుండు చేయనిచ్చగింపవలయు. తదన్యంబులచే నెన్నండు నాపన్నుండుగానివాఁడు ప్రవర్తింపరాదు. వేదోక్తంబులైన యీకర్మంబులచేతను, నన్యంబులచేతను నరుండు హరిభక్తియుతుండై గృహంబునఁ బ్రవర్తించుచున్నను దత్పరమగతిం బొందు. 533

చ. క్షితిప! యుధిష్ఠిరా! యెవనిశ్రీయుతపాదపయోజసేవ ని
ర్జితదిగిభవ్రజుండవయి చేవదలిర్పఁగ రాజసూయ మా
యతమగురీతిఁ జేసితివొ యాప్రభుచేతనె దుస్త్యజంబులౌ
వితతవిపత్పరంపరలఁ బీఁకమెయిం దరియింపుఁ డీరలున్. 534

క. ఉపబర్హణాఖ్యఁ బరగితి, నిపుణత గంధర్వుఁడనయి నే మున్ను ధరా
ధిప! గతకల్పంబున న, చ్చపుఁదనము గంధర్వులెల్ల సమ్మతి సేయన్. 535

ఆ. మహితరూపసౌకుమార్యమాధుర్య మా, నితుఁడ నగుచు దర్శనీయుఁడనయి
లౌల్యగరిమ నింతులకుఁ బ్రియతముఁడనై, మత్తవృత్తిఁ బ్రౌఢిమన్ మెలఁగితి.

క. ఒకనాఁడు విశ్వసృజు ల, య్యకలుషమగు దేవసత్రమందు రమానా
యకుగాథఁ బాడుటకుఁ బొం, దిక గంధర్వాప్సరస్తతిం బిల్చిరటన్. 537

క. అదియెఱిఁగి స్త్రీవృతుఁడ న, న్మదుఁడనగుచుఁ బోయి హేళనగఁ బాడితి నం
దది తెలిసి విశ్వసృజులపు, డెదఁ గ్రోధముఁ జెంది శాపమిడి రీపగిదిన్. 538

ఆ. హేళన నొనర్చితివిగాన లోలచిత్త, శ్రీఁదొఱంగి శూద్రత్వముఁ జెందుము వెస
ననుచు శప్తుండనయి జన్మమందినాఁడ, బ్రహ్మవాదిదాసికిఁ గొంతభాగ్యముంట.

వ. తద్బ్రాహ్మణాతి శుశ్రూషచేతను, దత్సంగంబుకతంబునను బిమ్మట బ్రహ్మపుత్రత్వంబు వడసితి. 540

క. మహిపై నేధర్మమునన్, గృహపతి సన్న్యాసి పదవినిం బడయునో పా
పహమగుచుం బరగెడు నా, గృహస్థ ధర్మంబు నీకు క్షితిప! తెలిపితిన్. 541

మ. నరదేహంబున గూఢరూపుఁడగుచున్ సాక్షాత్పరబ్రహ్మమౌ
హరి నీగేహమునన్ వసించెనని పుణ్యాత్ముల్ జగత్పావనుల్
వరమౌనుల్ చనుదెంత్రు నిచ్చలును భూపా! కావునన్ మీరలీ
నరలోకంబున నెంచిచూడఁగఁ గడున్ ధన్యుల్ మహాభాగులున్. 542

చ. ప్రియుఁడును మాతులేయుఁడు సుహృత్తముఁడున్ గురుఁడున్ నియోగకా
రియు నయి మీకు నే హరి చరించు నతండె యుధిష్ఠిరా! శుభో
దయు నిరుపాధి కేవల సుఖానుభవంబు మహద్విమృగ్య మ
వ్యయము నఖండమై పరఁగుబ్రహ్మముగాఁగ మదిందలంపుమా. 543

చ. ఎవని సమగ్రరూప మిదమిత్థమటంచును గేవలంబు నా
భవపరమేష్ఠి ముఖ్యులును వర్ణనముం బొనరింపలేరొ వా
స్తవముగ నేము మౌనమున శాంతిని భక్తిని సుప్రసన్నుఁగా
నెవనిని జేసికొందు మతఁ డెన్నఁ బ్రసన్నుఁడు మీకు నిచ్చలున్. 544

శ్రీశుకుఁడు:—

క. అనియిట్లు దేవముని చె, ప్పిన యదియెల్లవిని భరతవృషభుఁడు పూజిం
చెను సుప్రీతాత్ముండై, యనఘుమునినిఁ బ్రేమభరితుఁడై శ్రీహరినిన్. 545

గీ. పూజితుండయి యా దేవమునియుఁ గృష్ణ, పార్థులన్ వీడుకొని యేగెనలయు నెడకుఁ
బార్థివుఁడుఁ గృష్ణునిం బరబ్రహ్మముగను, విని యెదం బొందె నత్యంతవిస్మయంబు.

వ. రాజా! చరాచరంబులగు దేవాసుర మనుష్యాది లోకంబు లెందుఁ గలవో యట్టి
దక్షదుహితల వంశంబు లిత్తెఱంగున వేఱువేఱ నీకు వర్ణించి చెప్పంబడియె. 547

గద్యము.

శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, 'శ్రీరామనృసింహమూర్తి కవులు'
అను గంధం శ్రీరామమూర్తి, ఇట్రింకి నరసింహమూర్తులచే
రచింపఁబడిన శ్రీమదాంధ్ర భాగవతమున
సప్తమ స్కంధము సంపూర్ణము.

శ్రీరస్తు.

శ్రీరామకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## అష్టమస్కంధము

### అధ్యాయము 1.

—— స్వాయంభువాది మన్వంతరాభివర్ణనము ——

విష్ణురాతుఁడు:—

సీ. నాల్గువర్ణములు సంస్తుత మాశ్రయించు శుభంబులో వివిధధర్మంబు లెచట
జెలఁగు నెచ్చట విశ్వసృట్సర్గమొప్పు నా, స్వాయంభువమనువంశప్రశస్తి
వినియున్నవాఁడ సవిస్తరమ్ముగ నన్యులౌ మనువులఁ దెల్పుమయ్యా! యింక
ఘనుఁడగు హరిజన్మకర్మంబులగ్గింతు, రెందెందుఁ గవులు యతీంద్ర! వాని
గీ. వినఁగ వేడుకపడు నాకువిస్తరింపు, సర్వమన్వంతరముల విశ్వాత్ముఁడు హరి
చేసెనెది? చేయుచుండెను? జేయఁగలడు, లీల భూతభవద్భావికాలములను. 1

బ్రహ్మరాతుఁడు:—

క. ధీయుత! యీ కల్పంబున, స్వాయంభువుఁ డాదిగ మనుషట్కము గడచెన్
ఏమెడ దేవాదు లొందవి, రాయాద్యుండైనమనువుననాదిఁ దెలిపితిన్. 2

క. క్ష్మాకాంత! మనుదుహితలౌ, నాకూతియు దేవహూతియను సతులందున్
శ్రీకాంతుఁడయ్యె సుతుఁ డల, పోకన్ ధర్మమును జ్ఞానమును బోధింపన్. 3

క. నృపవర! భగవంతుండగు, కపిలునివర్ణనముఁ దొలుతఁ గావించితి నే
విపులంబుగాఁగ నింకఁ దె, లిపెదన్ యజ్ఞుండు దా సలిపినచరితమున్. 4

గీ. కామభోగంబులందును గడు విరక్తుఁ
డగుచు శతరూపభర్త స్వాయంభువుండు
రాజ్యమును ద్యజియించి భార్యాయుతుఁడయి
చనియెఁ దప మాచరింపఁగా వనమునకును. 5

ఆ. ఏకపాదమున మహిన్ స్పృశించుచు సునంద, నందలి గడంగి యుబ్బశతము
ఘోరమైన తప మపారముఁ జేయుచుఁ, బలికె నిట్లు భరతవంశముఖ్య! 6
మనువు: —

సీ. వసియించుచుండు నీవాసుదేవుఁడు సర్వ, దేహంబుల ననన్యదృష్టియగుచు
జగమును జేతనంబుగఁజేయు నా దేవుఁ, డతనిఁజేతనుఁగ జేయదు జగంబు
జగమిది శయనింపసాక్షియైయుండునా, తనిఁ దెలియఁగలేదు తజ్జగమ్ము
ఈ లోకమునయందునే గొంతగల దది, యెల్ల నాత్మవ్యాప్తమే యగుజుండి
గీ. కానఁ దత్పరివర్జితమైన ద్రవ్య, మీశ్వరార్పణబుద్ధి భుజింపుఁ డింతె
కాని యెవ్వానివిత్తంబునేని స్వార్థ, పరతఁ గాంక్షింపఁబోకుఁడీస్వాంతములను. 7
ఆ. చూచుచుండు నెవనిఁజూడఁగఁజాలక, నయన మక్షమత విన్నష్టమగునొ
యట్టి భూతనిలయుఁడగు దేవదేవుని, వేదవేద్యుఁగొల్వ వేడ్కపడుఁడు. 8
మ. నిజ మూహింపఁగ నే పరాత్పరునకున్ లే వాదిమధ్యాంతముల్
స్వజనుం డన్యుఁడునుండఁ డెవ్వనికి విశ్వవ్యాపియెవ్వండు స
ర్వజగదూర్తిపుఁ డెవండు విశ్వమది సర్వంబోలి నెవ్వానియం
దుజనించున్ బరిపూర్ణుఁ డవ్యయుఁడు నిత్యుండున్ విభుండాతఁడో. 9
మ. పరిపూర్ణుండును సర్వరక్షకుఁడు విశ్వాత్ముం డమేయుండు సు
స్థిరరూపుండుఁ బురాణమూర్తియగు నా దేవుండు భావింప న
బ్బురమై యుండెడు స్వీయమాయ జగము న్బుట్టించు గిట్టించు స
త్వర మా మాయను ద్రోసి వెల్గెడిని విద్యాశక్తి నిష్కాముఁడై. 10
వ. కావున శ్రేష్ఠులైన ఋషిపుంగవులు ప్రథమంబున మోక్షార్థంబు కర్మంబుల నాచరింతురు. పురుషుం డీహమానుఁడయ్యును బాహ్యికంబుగ మోక్షంబుం బొందు. 11

గీ. ఈహఁ జేయుచునుండు సర్వేశుఁడు హరి
తలఁప నవ్వానియందును దగులుకొనఁడు
అనుసరింతె త్త్వరతనిఁ బూర్ణార్థులగుచు
వారు తగులంబునొందక పరఁగుచుంద్రు. 12

మ. నిరహంకారుని నిర్మలున్ బుధవరున్ నిష్కాము సంపూర్ణునిన్
నరులన్ శిక్షయొనర్చుపొంటె బుధమార్యంబౌ స్వమార్గంబునన్
నిరతంబున్ జరియించుచుండువిభునిన్ దేవేశు సర్వాత్మునిన్
బురుషశ్రేష్ఠుని నీహమాను శరణంబుం బొందెదన్ భక్తిమై. 13

శ్రీశుకుఁడు:—

క. అని యీవడువున మంత్రో, పనిషత్తును ఘనసమాధిపరుఁడయ్యును బ
ల్కిన మనువుంగని యాతనిఁ, దినుటకునై యసురులు బఱతెంచిరి క్షుధలన్. 14

గీ. అట్లు మనుముట్టఁగమ్మిన యసురులఁ గని
సర్వగుఁడు హరి యజ్ఞుండు సరభసమున
యామదేవాన్వితుండయి యాక్షణంబ
కసిమసంగి యా స్వర్గలోకంబు నేలె. 15

వ. స్వారోచిషుండను రెండవమను వగ్నిసుతుండయ్యె. ద్యుమత్సుషేణుఁడును రోచిష్మంతుండు మున్నగు వారతనిపుత్రులై పరఁగిరి. ఆ మన్వంతరమున రోచనుం డింద్రుండయ్యె. తుషితాదులు దేవతలైరి. ఊర్జస్తంభాదులు బ్రహ్మవాదులగు సప్తర్షులైరి. వేదశిరుండను ఋషికిఁ దుషితయనుకాంత భార్యయయ్యె. ఆమెయందు వేదశిరునివలన విభుండని ప్రసిద్ధుండైన దేవుం డవతరించె. ధృతవ్రతులైన యష్టాశీతిసహస్రమహర్షులు కౌమారబ్రహ్మచారియైన యావిభునిచే వ్రతం బాచరింపఁజేసిరి. 16

ప్రియవ్రతసుతుండగు నుత్తముఁడనువాఁడు మూఁడవ మనువయ్యె. పావనుండును సృంజయుండును యజ్ఞుండును హోతయు మున్నగాఁగలవా రాతని నందనులైరి. వసిష్ఠతనయులగు ప్రమథాదులు సప్తర్షులు. సత్యభద్రాదులు దేవతలు. సత్యజిత్తనువాఁడింద్రుండు. ధర్మునకు సూనృతయను సతియందు భగవంతుండగు పురుషోత్తముఁడు సత్యసేనుండని ప్రఖ్యాతివడసి సత్యవ్రతులతోఁగూడి జనియించె. ఆసత్యసేనుం డనృతవ్రతదుశ్శీలురు నసజ్జనులునగు యక్షరాక్షసులను భూతద్రోహులగు భూతగణంబులను సత్యజిత్సహాయుండై వధియించె. 17

ఉత్తమభ్రాతయగు తామసుండనువాఁడు నాల్గవ మనువయ్యె. వృష, ఖ్యాతి, నర, కేతుప్రభృతులగు పదుం డ్రతనికిఁ బుత్రులై పరఁగిరి. సత్యక, హరివీరులు దేవతలు. త్రిశిఖుఁడనువాఁ డింద్రుఁడు. జ్యోతి ర్వ్యోమాదులు సప్తర్షులు. కాలవినష్టంబులగు వేదంబుల నిజతేజంబున నుద్ధరించిన విధృతిపుత్రులగు వైధృతులను వారు, మఱియు దేవతలుగఁ బరిగణింపఁబడిరి. హరిమేధునివలన హరిణియను కాంతయందు భగవంతుండు హరియను నామంబున నవతరించి గజేంద్రుని గ్రాహముక్తుంగావించె. 18

పరీక్షిత్తు:—

క. ఏగతి గ్రాహగ్రస్తుం, డౌ గజయూథపుని హరి దయన్ విడిపించెన్
యోగీంద్రా! దీనిన్ విన, గాఁ గోరెద నేను దెల్పఁగదవే తెలియన్. 19

గీ. ఏకథలయందు నుత్తమశ్లోకుఁడు భగ, వత్స్వరూపుఁడునగు హరి పలుకఁబడునో
యా కథలె యెన్న నధికపుణ్యములు మిగుల, ధన్యములు శోభనములు
వంద్యమ్ములు నగు. 20

శ్రీసూతుఁడు:—

గీ. అట్లు ప్రాయోపవిష్టుఁడై నట్టి యాప
రీక్షిదవనీంద్రుఁ డడుగ యోగీంద్రుఁడైన
బాదరాయణి పార్థివు నాదరించి
మునులు తమి వినుచుండ నిట్లని వచించె. 21

---

## అధ్యాయము 2.

### గజేంద్రమోక్షణ కథాప్రారంభము

శ్రీశుకుఁడు:—

సీ. కువలయాధీశ! త్రికూటంబునాఁ బ్రసి,ద్ధంబైన యొక గిరీంద్రంబు కలదు
క్షీరాబ్ధివృతము సుశ్రీమంతమై యోజ,నాయుతోచ్ఛ్రాయంబు నంతపఱపుఁ
గల్గి యెల్లెడలను గలయఁబర్వుచు నది, రాజత లోహ హిరణ్మయోరు
శృంగత్రయిన్ విరాజిల్లఁజేయుచునుండు,వారాశినిన్ దిశావలయములను

ఆ.వె. మఱియు వివిధధాతుమణివిచిత్రితములౌ,నితరశృంగముల ననేక తరుల
తానికుంజముల ననూననిర్ఝర ఘోష,ములను సర్వదిశల వెలయఁజేయు. 22

గీ. ఆ గిరీంద్రోరుకందరభాగములను,జారణులుఁ గిన్నరులును మహోరగులును
నప్సరస్సిద్ధసాధ్యవిద్యాధరులును,బ్రీతి గంధర్వులున్ విహరించుచుంద్రు. 23

క. సలలితసంగీతరవం,బులఁ దద్గిరిగుహలు మాఱుమ్రోగన్ సింగం
బులు పరశంకంగొని య,గ్గలమగు క్రోధమున నందు గర్జిలుచుండున్. 24

సీ. బహువిధారణ్యకపశువితానాత్యంత,సంకులితద్రోణ్యలంకృతంబు
నతివిచిత్రద్రుమాంచితసురోద్యానసం,స్థితకలరావపక్షివ్రజంబు
స్వచ్ఛాంబువాహినీహ్రదయుతంబును మణి, వాలుకాపులిన విభ్రాజితంబు
సురసతీమజ్జనసురభిళజలవాయు,యుతముసై యయ్యద్రియొప్పుచుండు

గీ. అధిప! తద్ద్రోణియందు మహాత్ముఁడైన,వరుణదేవుని సుందరోపవన మొక్క-
డమరభామినులకును విహారభూమి,యగుచు ఋతుమంతమను పేర నెగడుచుండు.

వ. మఱియు నది దివ్యంబులగు నిత్యపుష్పఫలద్రుమంబులచే నలంకృతంబును; మందార, పారిజాత, పాటలాశోక, చంపక, చూత, ప్రియాళు, పనసా మ్రామ్రాతక, క్రముక, నారికేళ, ఖర్జూర, బీజపూరక మధూక, తాల, సాల, తమాలార్జు నారిష్టోదుంబర, ప్లక్ష, వట, కింశుక, చందన, పిచుమంద, కోవిదార, సరళ, దేవదారు, ద్రాక్షేక్షు, రంభా, జంబు, బదర్యామలక, బిల్వ, కపిత్థ, జంబీర, భల్లాతకాది వృక్షపరివృతంబై యొప్పారుచుండు. 26

అందు సువిపులంబును నంచితకాంచన పంకజంబును, గుముదోత్పల కల్హార శతపత్రశోభా విరాజితంబును, మత్తమధుప కులసంకులంబును; హంస కారండవ చక్రవాక, సారస, జలకుక్కుట, కోయష్టి, దాత్యూహాది కలనిస్వనశకుంత సంతానపరివృతంబును; మత్స్య, కచ్ఛప, సంచార చలత్పద్మరజఃపరీవృతజలంబును; గదంబ, వేతస, నల, నీప, వంజులక, పరివేష్టితంబును; గుంద, కురవ, కాశోక, కుట జేంగుద సంవృతంబును; కుబ్జక, స్వర్ణయూథీ, నాగ, పున్నాగ, జాతి, మల్లికా, శతపత్రమాధవీ జాలకాది పరిశోభితంబును; దటజనిత్యర్త్వితర ద్రుమజాల విభాసితంబునైన యొక్క సరోవరంబు రాజిల్లు. 27

చ. అట నొకనాఁడు తద్గిరివనాశ్రయుఁడౌ గజయూథనాథుఁ డు
త్కటమదుఁడై కరేణుసము ♦ దాయముతో బహుకంటకాత్తమున్
బటుతర వేత్రకీచక స ♦ మావృతమున్ బృథుగుల్మకంబునౌ
నటవిఁ జరించుచుం దరుచ ♦ యంబులఁ గూల్చుచుఁ జేరె నేత్తెఱన్. 28

మ. ధరణీనాథ! తదీయతీక్ష్ణమదగం ♦ ధాఘ్రాణమాత్రంబునన్
గరులున్ సింగములున్ మహోరగములున్ ♦ ఖడ్గంబులున్ వ్యాళముల్
శరభంబుల్ చమరీమృగంబులు మహా ♦ శార్దూలముఖ్యంబులున్
బరువుల్ వాఱుచునుండు మెండుగ భయ ♦ భ్రాంతంబులై దిక్కులన్. 29

మ. లలి నక్కాననసీమ క్షుద్రతరముల్ ♦ సాలావృకంబుల్ వృకం
బులు గోపుచ్ఛగణంబులున్ శశచయం ♦ బుల్ సూకరవ్రాతముల్
సలుగుల్ దుప్పులు భల్లుకంబు లెనుముల్ ♦ శాఖామృగంబుల్ మృగం
బులు నందందుఁ జరించెడిం బరభయం ♦ బున్ వీడి తత్సత్కృపన్. 30

చ. అలఘునిదాఘతప్తుఁడయి ♦ యా గజయూథపుఁడున్ మదోదకం
బొలుకఁ గరుల్ కరేణువులు ♦ నుద్దవడిన్ దనుజుట్టిరా మదో
త్కలకలభవ్రజం బెదురు ♦ గాఁ బఱతేర మదంబుఁ గ్రోలి మ
త్తిలు నెలతేంట్లుఁ గొల్వ నరు ♦ దెంచె గిరిన్ వణఁకింపఁ జేయుచున్. 31

చ. వికచసరోజరేణుసముపేతసరోవరమారుతంబు మూ
రుకొనుచు దవ్వునుండి మదరూక్షవిలోచనయుగ్ముఁడౌచు ద
ప్పికఁ గడు దోగుచున్ దవిలి వెంబడివచ్చు స్వయూథపంక్తిఁ గూ
డి కొలని క్రేవన్ గడువడిన్ జనుదెంచె ననర్గళంబుగాన్. 32

మ. కరియూథాధిపుఁ డట్లువచ్చి కడువేడ్కన్ మడ్వులోఁ జొచ్చి భా
స్వరకార్తస్వరపంకజోత్పలరజస్సంవాసితంబున్ మనో
హరమున్ నిర్మలినంబునా నమృతతోయంబున్ యథేచ్ఛన్ స్వపు
ష్కరనాళంబున నెత్తి త్రావెఁ దనువున్ స్నానంబుఁ జేయించుచున్. 33

చ. ఎలమి గృహస్థుడై వడి గజేంద్రుఁడు తోడి కరేణులన్ మదా
విలకలభంబులం జెలఁగి స్వీయకరోద్ధృతశీకరంబులన్
దలకొని స్నానపాన ముదితాత్ములఁ జేయుచు మూరుకొంచు వి
చ్చలవిడి పేర్చుచున్ విధివశంబునఁ గష్టమునొందెఁ బిమ్మటన్. 34

శా. క్ష్మానాథా! విధిచోదితంబగు బలిష్ఠంబైన గ్రాహం బొకం
డానీటన్ వెసఁబట్టె దంతివిభుపూర్వాంఘ్రిద్వయిన్ గిన్కమైఁ
దా నీ మాడ్కి యదృచ్ఛమై ఘనవిపత్సంప్రాపితుండయ్యు న
న్యూనంబైన బలంబుతో నెదిరిచెన్ గుంభీంద్రుఁ డా గ్రాహమున్. 35

చ. ప్రసభమునన్ బలిష్ఠమగు గ్రాహముచే నపు డత్తెఱంగునన్
వెసఁ దివియంగఁబడ్డ యతివిహ్వలుఁ గుంజరనాథుఁ గాంచి పో
డిసెడి కరేణువుల్ మొఱలిడెన్ వెనువెంటమెలంగు నన్యకుం
భిసముదయంబు గూడ విడిపింపఁగ నేరక యుండె దీనతన్. 36

శా. ఉగ్రప్రక్రియ లోనికిన్ వెలికిఁ దమ్మొండొంటి బిట్టీడ్చుకొం
చా గ్రాహంబు నిభేంద్రమున్ బెనఁగుచున్ బ్రాణాలతో నుండఁ గా
లగ్రస్తంబగుచున్ గతించె నరపాలశ్రేష్ఠ! వెయ్యేండ్లు దే
వగ్రామం బిది యెంతొ వింతయనుచున్ భావించి రుల్లంబులన్. 37

మ. జలమధ్యంబున కీడ్వఁగాఁబడు చిటుల్ సారంబు గోల్పోయి వి
హ్వలతన్ జేడ్పడు నా గజేంద్రునకు నొయ్యన్ దీర్ఘకాలంబునన్
బల ముత్సాహముఁ దేజమున్ దరిగె భూపాలా! జలావాసియా
నల గ్రాహంబున కివ్వియొప్పెఁ గడుఁ బెంపై వైపరీత్యంబునన్. 38

చ. ఇటుల గజాధినాథుఁడు యదృచ్ఛను దేహియకానఁ బ్రాణసం
కటమును బొందె మిక్కుటముగా వివశుండయి యంతఁ దన్ను న

య్యటమటనుండి పాపుకొనునట్టి సమర్థతలేక ధ్యానము
త్కటముగ నాచరించెఁ జిరకాలము దాన సుబుద్ధినిన్ గొనెన్. 39

వ. అట్లు ధ్యానసముపార్జితబుద్ధియుక్తుండై యగ్గజేంద్రుం డిట్లని తలంచె 40

శా. నా యీ జ్ఞాతిగజంబులన్నియును నన్నన్ దప్పింపలేకుండె నో
రా! యెట్లో పునఃకన్ గరేణుసముదాయం బేవొ గ్రాహాత్మకా
మేయాత్యుగ్రవిధాతృపాశమున బల్మిం జేసి బద్ధుండనై
త్రోయన్ జాలకయుంటిఁ గాన పరమాత్మున్ శ్రీకరున్ జేరుదున్. 41

చ. కడువడిఁ బెంపుమై నెదురఁగాఁ బఱతెంచుచు బల్మిమీఱఁగన్
దొడరెడు నంతకోరగమునుండి ప్రపన్నుని భీతియుక్తు నె
వ్వఁడు తగఁ బ్రోచుచుండుఁ దలఁపన్ మఱియెవ్వని భీతి మిత్తి వె
గ్గడిలుచుఁ బాఱు నాతని జగత్ప్రభు నే శరణంబు వేడెదన్. 42

---

## అధ్యాయము 3.

### గజేంద్రకృత హరిస్తుతి

శ్రీశుకుఁడు:—

క. అని బుద్ధినిశ్చయించియు, మనము సమాహితముఁ జేసి మనుజేశ్వర! ప్రా
గ్జనియందు సుశిక్షితమగు, పునీతమా స్తోత్రరాజమున్ జపియించెన్. 43

గీ. ఎవనివలన దేహాదికమవు ప్రపంచ, మెల్లను జిదాత్మకంబయి యెసక మొనఁగు
పురుషుఁడును నాదికారణభూతుఁడైన, యా పరేశ్వరునకును జోహార్లొనర్తు. 44

గీ. ఎవని యందు నెవ్వనినుండి యెవనిచేత, నీ జగముపుట్టుఁ బెరుగు లయించు నెవఁడు
కార్యకారణపరుఁడు జగం బిదెల్లఁ, దానయగు నెవ్వఁడట్టి యాత్మభవుఁ గొల్తు.

మ. అమితంబౌ నిజమాయచే నెవఁ డభివ్యక్తంబుఁ గావించు లో
కము నొక్కప్పుడొకప్డు సంపిహితముం గావించు నా రెంటిచం
దము లెవ్వాఁ డకలంకుఁడౌచుఁ గనునో తా సాక్షియై యట్టి వి
శ్వమయున్ శాశ్వతునిం బరాత్పరు నెదన్ భావించి సేవించెదన్. 46

ఉ. కాలగతిన్ జగంబులు జగన్నిచయస్థితజంతువుల్ జగ
త్పాలురు నందఱొక్క మొగిఁ బంచత నొంద సుదుర్గమంబు నా
భీలము దుస్తరంబును గభీరమునౌ తమ మావరింపఁగా
లీల నెవండు దానికి వెలిన్ వెలుఁగొందునో వానిఁ గొల్చెదన్. 47

చ. ఎవనిపదంబు వేల్పులు మునీంద్రు లెఱుంగరొ దాని నన్యజం
తువులవి యెల్లెఱుంగుటకు నుద్భటకోపును? పోల్చిచూడ న
ట్టివు క్రియఁ బెక్కుమూర్తుల నగుంగడుఁ జిత్రముఁగాఁ జెలంగుఁ దా
నెవఁడు సుదుర్గమప్రతిభునీశుని వానిని సన్నుతించెదన్. 48

చ. మునులు విముక్తసంగులును భూతసమాత్ములు సర్వసాధువ
ర్తనులును నాచు మంగళతరంబగు నెవ్వని దివ్యమా పదం
బును గనఁగోరి నిష్కలుషమున్ శుభదంబు నలోకమా వ్రతం
బును బొనరించుచుందురొ వనభూముల నాతఁడు నాకు దిక్కగున్. 49

చ. గణుతియొనర్ప జన్మమును గర్మము నామము రూప మెన్నఁగా
గుణమును దోషమెల్లఁ దనకున్ లవమాత్రము లేక యుండియున్
గణఁకి నవన్ని యెవ్వఁడు జగంబులనెల్ల సృజింపఁ బెంపఁగా
నణఁప ధరించు నట్టి పరమాత్ముని నే శరణంబు వేడెదన్. 40

క. పరమేశ్వరుం డరూపుం, డురురూపుఁడు బ్రహ్మరూపుఁ డుజ్జ్వలశక్తి
స్ఫురితుండునై వెలింగెడు, పరమాద్భుతకర్మునకును బ్రణతు లొనర్తున్. 51

గీ. సాక్షియు స్వయంప్రకాశుండు నవ్యయుండు
వాక్కులను మానసంబునఁ బ్రకటచిత్త
వృత్తుల నగ్యముఁడును జగదీశుఁడునయి
పరఁగు పరమాత్మునకును నా వందనములు. 52

గీ. సత్త్వగుణయుతమైన నైష్కర్మ్యకలన
నిపుణునకు గమ్యుఁడగువాఁడు నిర్వృతిపర
వరసుఖానుభవుండు కైవల్యపతియు
నైన పరమేశ్వరునకు జోహా ర్లొనర్తు. 53

సీ. గూఢుండు శాంతుండు ఘోరుండు నిర్విశే,షుండును జ్ఞానఘనుండు సముఁడు
సత్త్వాదిగుణధర్మిసాక్షి క్షేత్రజ్ఞుండు, మూలప్రకృతి యాత్మమూలుఁడు నఖి
లాధ్యక్షుఁ డఖిలేంద్రియగుణ సంద్రష్ట స, దాభాసుఁడును బరమాత్ముఁ డనులు
డజుఁ డసచ్ఛాయాసమన్వితుఁడును నిఖి, లేంద్రియఘనవృత్తిహేతుమయుఁడు
గీ. సర్వకారణుఁ డరయ నిష్కారణుండు, నతివిచిత్ర కారణుఁడు నారాయణుండు
భూరిసకలాగమామ్నాయవారిరాశి, మోక్షరూపుఁడునగు పరముని భజింతు.

సీ. సర్వగుణారణిచ్ఛన్న బోధాగ్ని గు,ణక్షోభదీప్తమానసుఁడు మఱియుఁ
దత్త్వభావనివర్తితాగమరాశి స్వ,యంప్రకాశుండు నిరంజనుండు

దీనబంధుండు మద్విధపశుపాశ వి,మోక్షణుండును సదాముక్తుఁ డరయ
భూరికారుణ్య సముద్రుండు నవ్యయుఁ, డాద్యంతరహితుండు నచ్యుతుండు
గీ. స్వాంశమున సర్వజీవులస్వాంతముల మె, లంగువాఁడు నవిచ్ఛిన్నలక్షణుండు
నఖిలతనుభృన్నియామకుఁ డకలుషుండు, నైన సర్వేశ్వరేశ్వరు నభినుతింతు. 55

చ. వివిధనిజాత్మజాప్తగృహవిత్తజనాదిక బంధనంబులన్
దవిలినయట్టివారికి సతతంబును జేరఁగరానివాఁడు యో
గి వరహృదంతరాళపరికీలితుఁడై వెలుగొందువాఁడు దో
షవిరహితుండునైన గుణసంగవివర్జితు నీశుఁ గొల్చెదన్. 56

సీ. కడుఁబ్రీతి ధర్మార్థకామమోక్షములఁ గాం,క్షించు వారెవని భజించి తమయ
భీష్టగతిం గాంతు రింతియ కాక య,న్యములగు కోర్కులనశ్వరమగు
దేహంబుఁ గొందు రక్షింపక యున్నా, కరుణామయుండు లోకైకవిభుఁడు
నా కిప్పుడు విమోక్షణము కేవలముఁ బ్రసా,దించుఁ గావుత సమభ్యంచితమతి
గీ. రక్తి నేకాంతభక్తులు ముక్తులైన, పురుషులు భజించుచున్ మహాద్భుతము భద్ర
తరమునైనట్టి తచ్చరితంబుఁ బాడు,చంగ ముప్పొంగఁ గోర రెయ్యదియునుంత.

మ. నిరవద్యుండు నతీంద్రియుం డజుఁడు నిర్గుణుండు నాధ్యాత్మిక
స్థిరయోగప్రతిగమ్యుఁ డీడ్యుఁ డమలశ్రీయుక్తుఁడున్ సూక్ష్ముఁడున్
బరిపూర్ణుం డవికారుఁ డక్షరపరబ్రహ్మంబునైనట్టి యా
పరమేశుం గరుణార్ద్రు నిర్మలినభావంబొప్ప సేవించెదన్. 58

సీ. పరికింప నెవ్వని స్వల్పాంశమున నె త,త్తన్నామరూపభేదములచేత
నమరబృందంబులు నామ్నాయములుఁ జరా, చరలోకములును సృష్టంబులయ్యె
నగ్నియం దర్చు లర్కమునందుఁ దీప్తు లె,ట్లువెలయు నణఁగు నట్లెవనియందుఁ
గ్రమత గుణప్రవాహము బుద్ధి మన మింద్రి,యములును దనుసృష్టులడరు నణఁగు
గీ. దేవమానవదానవతిర్యగాకృ
తియును స్త్రీషండపురుషాకృతియును గుణము
కర్మమును సత్తసత్తుగాకయు స్వమాయ
నిన్నియును దానయగు నా పరేశుఁ గొల్తు. 59

మ. అవివేకావరణంబుచేత ననయంబంతర్బహిస్సంవృతం
బగు నీ కుంజరజన్మనేమి ఫలమా నన్నాట గ్రాహంబు నుం
డి విమోక్షంబును నిష్ఠ నేఁ బడసియున్ జీవింపఁగా నొల్ల నా
యవివేకావృతిమోక్షణంబును ద్రికాలాబాధ్యమున్ గోరుదున్. 60

గీ. ముక్తికాముఁడనగు నేను భక్తిమీఱ, విశ్వరూపుని విశ్వేశు విశ్వసృజుని
విశ్వుని నవిశ్వు నజు బ్రభు విష్ణు జిష్ణు, శాశ్వతబ్రహ్మరూపుని శరణుఁ జొత్తు. 61

క. యోగాగ్ని దగ్ధకర్ములు, యోగీశులు గాఢయోగయుక్తులగు హృ
ద్భాగములఁ గాంతు రెవ్వని, యోగేశ్వరు నమ్మహామహుని భజియింతున్. 62

గీ. కేవలుఁడనంతవేగశక్తిత్రయుండు, నఖిలబుద్ధీంద్రియగుణుండు నల ప్రపన్న
పాలకుండు దుష్టేంద్రియాప్రాప్యపథుఁడు, నగు దురంతశక్తికి మ్రొక్కులాచరింతు.

ఆ. ఎవనిమాయచేతఁ బ్రవిహతబుద్ధినై, యెఱుఁగకుంటి నన్ను నే దురూహ్య
మహిముఁడగుచు నొప్పు మహనీయమూర్తి యా, నావిభు భగవంతు నాశ్రయింతు.

శ్రీశుకుఁడు:—

శా. దంతీంద్రుం డిటు నిర్విశేషపరతత్త్వంబున్ బ్రశంసింపఁగా
నంతన్ మూర్తిభిదాభిమానులగు బ్రహ్మాదుల్ ధృతిం బూని త
త్ప్రాంతక్షోణికిఁ జేరరైరపుడు విశ్వాత్ముండు విష్ణుండు న
ర్వాంతర్యామి పరాత్పరుండు హరి యందావిర్భవించెన్ వెసన్. 65

మ. అటు లార్తుండగు నా గజేంద్రుని స్తవంబాలించి తన్ దేవతా
పటలంబుల్ స్తుతియించుచున్ గొలిచిరా బల్వేఁక ఛందోమయో
ద్భట పక్షిప్రవరోహ్యమానుఁడయి యా దంతీశ్వరుండున్న చ
క్కటికిన్ జయ్యన నేగుదెంచె హరి చక్రంబొప్ప హస్తంబునన్. 66

మ. ఉరునక్రప్రగృహీతుఁడేచు నటు లత్యుగ్రార్తినిం బొందు న
క్కరినాథుం డలచక్రిమాని గరుడస్కంధంబునన్ దోఁచు నా
హరిని న్గన్గొని మింట సాంబుజకరుండై పల్కె ని ట్లోజగ
ద్గురునారాయణ! దేవదేవ! గుణసింధూ! యంచు దా నెట్టకేన్. 67

ఉ. పీడితు నగ్గజేంద్రుఁగని వీఁక ఖగేంద్రునినుండి డిగ్గి దే
వేడితుఁడైనయట్టిహరి భీకరనక్రముఖంబు నెంతయున్
వాడగు చక్రధారలను వ్రయ్యఁగఁ జేసి సమస్తదేవతల్
వేడుకఁ జూచుచుండ విడిపించెఁ గృపామతి నయ్యిభేంద్రునిన్. 68

## అధ్యాయము 4.

### కరిమకర శాపవిమోచనము

శ్రీశుకుఁడు:—

క. కమలాసనశంభు పురో, గములగు దేవర్షివరులు గంధర్వులు ను
త్తమహరికర్మముఁ బొగడుచు, సుమవృష్టిం గురిసి రంత క్షోణీనాథా! 69

గీ. దివ్యదుందుభు లప్పుడు నల్దెసల మ్రోగెఁ
బాడి రాడిరి గంధర్వవరులుఁ బ్రీతి
చారణులు సిద్ధులును ఋషీశ్వరులు నెలమి
స్తోత్ర మొనరించి రా పురుషోత్తము హరి. 70

మ. బలవద్గ్రాహముకూడ భూరమణ! దైవప్రేరణం జేసి దే
వల శాపంబుననుండి తత్క్షణము తేవన్ ముక్తమై యద్భుతం
బొలయన్ జక్కనిరూపు దాల్చి యల హూహూనామ గంధర్వుఁడై
యలరెన్ జూపఱ మానసంబులకు నత్యాశ్చర్యము న్గూర్చుచున్. 71

గీ. ఉత్తమశ్లోకుఁడగు పురుషోత్తమునకు, నమలభక్తి శిరఃప్రణామములుఁ జేసి
స్తవ్యతర దివ్యగుణగణసత్కథమగు, తద్యశంబు నతండు చోద్యముగఁ బొగడె.

క. విను నృపవర! యతఁడు భగవ, దనుకంపితుఁడగుచు నా దయామయునకు వం
దన మాచరించి లోకము, తను జూచుచునుండఁ జేరెఁ దనలోకంబున్. 73

మ. జననాథాగ్రణి! వింటె యట్లు భగవత్స్పర్శంబునం జేసి నూ
తనబోధామృతసారసంకలితచిత్తస్ఫూర్తి నజ్ఞానబం
ధనముక్తుండయి యా గజేంద్రుఁడు నటన్ దద్రూపసాదృశ్యముం
దెను పీతాంబరుఁడున్ జతుర్భుజుఁడునై దేవాళి యగ్గింపఁగన్. 74

మ. అవనీనాయక! తొల్లి యీ గజకులాధ్యక్షుండు భావింపఁగా
ద్రవిడశ్రేష్ఠుఁడుఁ బాండ్యభూరమణుఁ డింద్రద్యుమ్ననాముండు వై
ష్ణవపుణ్యావ్రతతత్పరుం డలఘువిజ్ఞానుండు సాధూత్తముం
డవికారుండుఁ గృపాపరుండునయి యొప్పారెన్ ధరామండలిన్. 75

మ. అతఁ డొక్కప్డు సమర్చనావసరసంపద్యత్యంతలగ్నాత్ముఁడున్
ధృతమౌనవ్రతుఁడున్ జటాధరుఁడు యోగీంద్రుండునై భక్తిసం
స్థితచిత్తంబున నచ్యుతున్ హరిని దేవున్ సర్వలోకేశు భ
వ్యతపశ్శక్తి మెయిన్ భజించె మలయాహార్యాశ్రమోర్వీస్థలిన్. 76

చ. అపుడట కేగుదెంచె సుమహాయశుఁడైన యగస్త్యమౌని శి
ష్యపటల సంవృతుండగుచు నాఋషిసత్తము నల్లఁగాంచి భూ
మిపతి సపర్యసేయక యమిన్నక యుండె రహస్థలంబునన్
గుపితమనస్కుఁడయ్యె నృపకుంజరుపై ఋషివర్యుఁ డయ్యెడన్. 77

చ. జనపతి కిచ్చె శాపము నసాధుఁ డశిక్షితబుద్ధియైన దు
ర్జనుఁడితఁ డిట్లు మత్తుఁడయి సన్నుతవిప్రజనావమానమున్
వనమున సంచరించు మదవారణమట్లులు స్తబ్ధబుద్ధియై
పొనరిచెఁగాన నా గజముపోలెఁ దమిస్రముఁజొచ్చు నంచిటుల్. 78

శ్రీశుకుఁడు:—

క. భూప! యగస్త్యుం డీగతి, శాపంబిడిచనియె సానుచరుఁడై దైవ
ప్రాపితమని రాజర్షియు, శాపంబును స్వీకరించె స్వాంతమునందున్. 79

గీ. నరవరేణ్య! యాత్మస్మృతినాశనియగు, నట్టి కుంజరయోనినిఁ బుట్టె నతఁడు
హరి సమర్చనామహిమచేనా గజత్వ, మందునుం దా ననుస్మృతినొంది పరఁగె.

మ. గజయూథాధిపతి న్విమోచితునిగాఁ గావించి యాపిమ్మటన్
నిజదాసాగ్రణిఁగానొనర్చుకొని వానిన్గూడి బల్మీవి నం
బుజనాభుం డతిచిత్రహా స్వభువనంబుం జేరె రాజేంద్ర! యం
డజవాహుండయి సిద్ధసాధ్యసురగంధర్వేడితోత్కర్ముఁడై. 81

మ. క్షితినాథా! యిపు డేను నీకు ననురక్తిన్ దెల్పియున్నట్టి భూ
రితరంబైన గజేంద్రమోక్షమను శ్రీకృష్ణప్రభావంబు నం
చితబుద్ధి న్వినువారికిన్ ఘనయశశ్శ్రీస్వర్గముల్గల్గు న
ద్భుతరీతిన్ గలికల్మషంబు లడఁగున్ దుస్స్వప్ననాశంబగున్. 82

మ. ఏతత్పుణ్యగజేంద్రమోక్షకథ నెంతే శ్రేయమున్ గోరుచున్
బ్రాతఃకాలమునందు లేచి శుచులై భక్తిప్రపత్తిక్రియా
జాతోత్కంఠను సాధులేనుఱక దుస్స్వప్నాదిశాంత్యర్థమై
చేతఃప్రీతిగఁ బాడుచుందురు పరీక్షిద్భూమిపాలాగ్రణీ! 83

గీ. ఇదె నుడివెఁగౌరవేంద్ర గజేంద్రునకును
బ్రీతచేతస్కుఁడై సర్వభూతమయుఁడు
విభుఁడునైనట్టి హరి కడువేడ్క యగ్గ
లింప సర్వభూతంబు లాలించుచుండ. 84

శ్రీ భగవానుఁడు:—

వ. ఓ గజయూథాధిపా! నిశావసానంబున లేచి సమాహితమనస్కులై యెవ్వరు నన్నును, నిన్నును నీసరోవరంబును గిరికందరకాననంబులను వేత్రకీచకవేణుగుల్మంబులను సురపాదపంబులను బ్రహ్మకు నాకు శివునకు నాసనంబులగు యీశృంగంబులను నాకుఁ బ్రియనికేతనంబైన యీక్షీరసాగరంబును, భాసురంబగు శ్వేతద్వీపంబును మదీయంబులగు శ్రీవత్స, కౌస్తుభ, వనమాలా, కౌమోదకీ, సుదర్శన పాంచజన్యంబులను, బతంగేశ్వరుండగు వైనతేయుని, శేషుని, మదాశ్రయమైన శ్రీదేవిని, బ్రహ్మను, నారదమహర్షిని, మహేశ్వరుని, బ్రహ్లాదుని, మత్స్యకూర్మవరాహాద్యవతారంబులం జేయంబడిన నా యనంత పుణ్యకర్మంబులను, సూర్యుని, సోముని, బావకుని బ్రణవంబును, సత్యంబును నవ్యక్తంబును గోవిప్రులను, నవ్యయంబగు ధర్మంబును, దక్షకన్యలగు సోమ, కశ్యప, ధర్మపత్నులను, గంగా, సరస్వతీ, నందా, కాళిందీ ప్రభృతిక పుణ్యస్రవంతులను; ఐరావతంబును, ధ్రువుని, సప్త బ్రహ్మర్షులను, బుణ్యచరిత్రులైన మానవులను స్మరించుచుందురో వా రఖిలపాపంబులనుండి విముక్తులగుదురు. మఱియు, 85

గీ. అమితమగు భక్తితోఁడ నిశాత్యయమున
నెవరు మేల్కాంచి నను స్తుతియింతు రిట్లు
వారి కేను బ్రాణాత్యయావసరమున స
ముజ్జ్వలంబగు సద్బుద్ధినొసఁగుచుందు. 86

శ్రీశుకుఁడు:—

మ. అని దంభోదుఁడ్రిన కిత్తెఱంగున నయంబారన్ హృషీకేశుఁ డో
య్యన నాదేశమొనర్చి శంఖవరమానప్పాంచజన్యంబు నొ
త్తి నిలింపప్రకరంబులన్ ఘన ముదబ్ధిన్ దేల్చుచున్ లోకమో
హనుఁడై తార్క్ష్యుని స్కంధభాగమునయందాసీనుఁడయ్యె న్నృపా! 87

---

## అ ధ్యా య ము 5.

### క్షీరసాగరమథన కథనము

శ్రీశుకుఁడు:—

క. జనవర! గజేంద్రమోక్షం, బను పుణ్యము నఘహారంబునగు హరికర్మం
బును దెల్పినాఁడ విను మింక, మన మలరఁగ రైవతాఖ్యమన్వంతరమున్. 88

సీ. వసుమతీ రమణ! రైవతుఁడన నైదవ, మనువుగాఁ దనరె తామసుని భ్రాత
యర్జునపూర్వ కులగు ప్రతివింధ్యాదు, లాతని నందనులై పరఁగిరి
విభుఁ డింద్రుఁడై యొప్పె విబుధగణంబులై, యలరిరి భూతరయాదు లెల్లఁ
బొసఁగ హిరణ్యరోముఁడు వేదశిరుఁ డూర్ధ్వ, బాహ్వాదులొప్పిరి బ్రాహ్మణులయి

గీ. పత్నియయ్యె వికుంఠ శుభ్రాహ్వయునకు, వారలిరువురకున్ భగవంతుఁడు హరి
స్వకళచేతను దానె పుత్రకుఁడగుచును, బరఁగె వైకుంఠుఁడను పేరఁ బ్రభవమున.

గీ. శ్రీరమాదేవిచేతఁ బ్రార్థింపఁ బడుచుఁ, దత్ప్రియంబుఁగావించెడు తలఁపుతోడ
లోకనుతమగు వైకుంఠలోకము నల, వోక నిర్మించె వైకుంఠుఁడో కురువర!

గీ. తదనుభావంబు నుమహాభ్యుదయములైన, గుణములును జెప్పఁగా బడెఁ గురువరేణ్య!
యెలమి భూరేణువుల నేని నెన్న వచ్చుఁ, గాని విష్ణుని గుణము లగణ్యములగు. 91

సీ. ఆరవ మనువయ్యె నవనీతలేశ్వర!, చక్షువు కొడుకైన చాక్షుషుండు
పురువు సుద్యుమ్నుండు పురుషుండు మున్నగు, వారు చాక్షుషుని కుమారులింద్రుఁ
డరయ మంత్రద్యుముం డమరులాప్యాదిక, గణములు మునులునుగౌర వేశ్వ
రా! హవిష్మద్వీరకాదులు నై రాజు, నకును సంభూతికిన్ నందనుఁ డయి

గీ. అజితుఁడను పేర భగవంతుఁ డఖిలలోక, విభుఁడు స్వాంశమునం బ్రభవించి మించె
నా మహాత్ముని యద్భుతంబైన మహిమ, నెట్టివారికినే నుతియింపఁ దరమె? 92

గీ. దిరదిరన్నిటఁ దిరుగు మందరనగంబు, కూర్మరూపంబుఁ నందాల్చి కూర్మి మీఱ
క్షీరవారాశి ద్రచ్చి సుధారసమ్ము, నా విభుం డిచ్చె సాధించి యమరులకును. 93

పరీక్షిత్తు:—

మ. అనఘా! యేక్రియ క్షీరవార్ధి మథితంబయ్యెన్ గతంబేమి? యే
మి నిమిత్తంబునఁ గూర్మమౌచు హరి నెమ్మిన్ మందరాగంబు మో
సె నిలింపావళి కెత్తెఱంగున లభించెన్ నవ్యపీయూష మా
వనధింబుట్టెనె? యన్యమెద్దియయినన్ వాక్రువ్వుమా తత్కథన్. 94

క. ఉడుగక యిటు కీర్తింపం, బడు భగవత్కథలవినియుఁ బటుతాపమునం
బడి మ్రగ్గు నాదుమనమొ, క్కఁడు తృప్తింబొందకుండె గుణరత్ననిధీ! 95

సూతుఁడు:—

గీ. ఇట్లు భగవంతుఁడు శుకయోగీంద్రుఁ డా ప, రీక్షిదవనీంద్రుచేత సంపృష్టుఁడగుచు
నతనిఁ గొనియాడి శ్రీహరి యద్భుతప్ర, భావగరిమంబుఁ జెప్ప నుపక్రమించె. 96

శ్రీశుకుఁడు:—

మ. బవరంబం దతిశూరులైన యసురవ్రాతంబుచే వాడి కై
దువులం గూల్పఁగఁబడ్డ య య్యమరయోధుల్ లేవ దింక న్గతా

సువులై సేంద్రజగత్త్రయంబును గడున్ సొంపేదె నో రాజపుం
గవ! దుర్వాసుని శాపశక్తిఁ జెడె యాగాదిక్రియల్ సర్వమున్. 97

ఉ. ఆతఱి నమ్మహేంద్రవరుణాది సురప్రకరంబు లెల్లఁ దా
రీ తెఱఁగెల్లఁ గన్గొని యనేకవిధంబుల మంతనంబులన్
నీతిపథంబుజొప్పడఁగ నేర్పునఁ జేసియు నష్టు లెస్సయా
రీతి వినిశ్చయంబు నొనరింపఁగఁ జాలక యుండిరి దీనులై. 98

చ. పదఁపడి వాసవా ద్యమరవర్గము లెల్ల నిఁకొం డుపాయ మె
య్యదియును లేక మేరుశిఖరాగ్రమునన్నెలకొన్నయట్టి సొం
పిదమగు బ్రహ్మకొల్వునకు వేగమ పోయి విరించిఁ గాంచి త
త్పదములవ్రాలి సర్వమును దప్పక యప్పుడు విన్నవించినన్. 99

చ. సరసిజసూతి యప్డు గతసత్త్వులు నిష్ప్రభులైన జంభభి
ద్వరుణసమీరముఖ్యసురవర్యులఁ గాంచి మహావిపత్పరం
పరలకు నెల్లనగ్గమయి మ్రగ్గు జగత్త్రితయంబు దీని క
త్యురుతర వైపరీత్యమున నొప్పు సురారులఁ జూచె నేర్పడన్. 100

ఉ. చూచి కడంకఁ దామరససూతి సమాహితమానసంబునన్
ధీచతురత్వ మేర్పడఁగ దేవుఁ బరేశుని సంస్మరింపుచున్
సూచితశోభనంబులగు చూడ్కులతో వికచాననాబ్జుఁడై
లేచి పురందరాద్యఖిలలేఖులతో ననె నిట్లు భూవరా! 101

ఉ. నేను భవుండు మీరును గణింపఁగ నా యసురాదు లెల్లరున్
మానవతిర్యగాదులు ద్రుమాదులుగూడ మునీంద్రసంస్తుతి
స్థానమనంగ నా యదవతారకళన్ జనియింతు మట్టి తే
జోనిధి నీశునిన్నరణుజొత్తము రండు విలంబ మేటికిన్. 102

చ. అతని కుపేక్షణీయము సమాదరణీయమునైన పక్షమున్
వెతకిన లేద లేఁడు గమనింపఁగ వధ్యుఁడు రక్షణీయుఁడున్
గ్రతుభుజులార! యైనను జగంబు సృజింపను బెంపఁ ద్రుంప స
మ్మతిని రజంబు సత్త్వము దమంబును దాలుచుఁ గాలరూపుఁడై. 103

ఉ. దేవతలార! నిర్భయమతిన్ వినుఁ డా ఘనసత్త్వరూపుఁడా
దేవున కెన్నఁ గాలమిది దేహులసంసృతి నుండి ప్రోవఁగన్
గావున నేగి వేగమ జగద్గురునిన్ శరణంబుజొత్తమి
చ్ఛావిధి స్వీయులన్ మనల సాకు సురప్రియుఁడౌట సత్కృపన్. 104

శ్రీశుకుఁడు:—

క. అని సురలకు వాక్రుచ్చి న,లినసంభవుఁడా సురావళిని గూడి వెసన్
జనియె నపార తమఃపర, మును గేవలమైన యవ్విభుని నెలవునకున్. 105

వ. ఇట్లు చని యందు నదృష్టస్వరూపుఁడు శ్రుతపూర్వుండునగు నవ్విభుని నవహిత
చిత్తుండై దైవవాక్కుల నిట్లనిస్తుతించె. 106

మ. అవికారుండవు సత్యరూపుఁడవు సర్వాత్ముండవున్ గేవలుం
డ వనంతుండవు నిష్క్రియుండవు నఖండజ్యోతి వాద్యుండవున్
భువనాధీశుఁడ వప్రమేయుఁడవు సంపూర్ణుండవున్ సర్వదే
వ వరేణ్యుండవునైన నీకు నివె దేవా! మా నమోవాకముల్. 107

గీ. విభుని ప్రాణమనోబుద్ధివిదు ననిదురి, బరు నదేహు నర్థేంద్రియాభాసు జీవ
పరములైనవిద్యావిద్యలారయవెవని, నట్టియతనిఁ బ్రియుగుఁ బాయక
కొలుతుము. 108

ఉ. పంచదశారమున్ బటుజవంబు మనోమయము న్నట త్తటి
చ్చంచలమున్ ద్రినాభియు నజాపరిచోదిత మష్టనేమి యా
నంచితజీవచక్రము యదక్షముగా విబుధుల్ వచింత్రు ని
ష్కించనబంధు నయ్యమృతుఁ జేరుదు మేము విపన్నివృత్తికై. 109

గీ. ఏది తలఁప తమఃపరమేకవర్ణ, మగు నదృశ్య మవ్యక్త మనంతమునగు
నది సుపర్ణునిమీఁదఁ బ్రత్యక్షమయ్యె, ధీరు లురుయోగరథమున దీనిఁ గొల్త్రు.

సీ. ఏ మాయచేత మోహితుఁడై జనుండు దా,నాత్మస్వరూప మాత్మవంత యెఱుఁగఁ
డట్టి యవ్విభు మాయ ననధిగమింపఁగజాలు,నే? యెవ్వఁడేని యూహించి చూడ
నా పరేశుని నిర్జితాత్మమాయాశక్తి, గుణు భూతసమున్ బ్రణతిఁగొలుతు మేము
యీ మేము ఋషులు దక్షాదిశప్రియంబైన, తనువుతో శుద్ధసత్త్వంబుతోడఁ

గీ. బరగసృష్టింపఁగాఁబడ్డవారమయ్యుఁ, బ్రకటముగ బహిరంతరవ్యాప్తమైన
సూక్ష్మగతినిఁదెలియమన్న చోరజస్త, మోగుణులెఱుంగుదురెసురముఖ్యులెన్న.

చ. అలఘు జరాయుజప్రముఖమైన చతుర్విధభూతసృష్టి వ
ర్తిలునెట నా స్వయంకృతధరిత్రియ యెవ్వనికిం బదంబుతోఁ
దలఁపఁగ బ్రహ్మరూపుఁడు స్వతంత్రుఁడు దివ్యమహావిభూతియై
యలరెడు నమ్మహాపురుషుఁడా దృతి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 112

ఉ. ఎంచ జగంబులున్ జగదధీశ్వరులుం జనియించు చోయ్యు జీ
వించుచు సంతతంతకునుబెంపును జెందుచునుంద్రు దేన న

భ్యంచితమైన యా జల ముదారతరంబగు వీర్యమై ధృతిన్
మించునొ యట్టివాఁడు పరమేశుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్. 113

చ. అమరుల కన్నముం బలము నాయువునై తనరారువాఁడు వృ
క్షములకు నీశ్వరుండును బ్రజాపతికిం బరివర్ధకుండు సో
నమృతగభస్తి యెవ్వనికి నౌ మనమట్టి మహావిభూతి ది
వ్య మహిముఁడౌ విభుండు భగవంతుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్. 114

ఉ. రాణువ రాజునుంబలె భరంపడి మే మొనగూడియుండఁగా
రాణఁదనర్చు నే విభుని ప్రాణమునుండి చరాచరాళికిన్
బ్రాణము నోజముం బలముఁ బ్రాకటశక్తియునైన వాయువుం
బోణిమిపుట్టె నట్టి పరముం డిట మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్. 115

వ. సకలకర్మనిమిత్తజన్ముఁడై యంతస్సముద్రంబున స్వధాతువులం బచించు జాతవేదుం డెవ్వనిముఖంబగు నా మహావిభూతిసంపన్నుండగు దేవదేవుండు మాకుఁ బ్రసన్నుఁడగు. దేవయానస్వరూపుఁడును, త్రయీమయుండును, బ్రహ్మోపాసనాస్థానంబునగు సూర్యుం డెవ్వానికి నేత్రంబగు నట్టి దేవుండు మాకుఁ బ్రసన్నుండగు. మఱియు నెవ్వని శ్రోత్రంబునుండి దిశలును, హృదయంబునుండి దేహగతచ్ఛిద్రంబులును, నాభినుండి నభంబును, బలంబునుండి మహేంద్రుండును, బ్రసాదంబునుండి దేవతలును, గోపంబునుండి రుద్రుండును, బరుషంబునుండి బ్రహ్మయు, నింద్రియంబులనుండి ఛందంబులును ఋషులును, మేఢ్రంబునుండి ప్రజాపతియు, వక్షంబునుండి శ్రీదేవియు, ఛాయనుండి పితృదేవతలును, స్తనంబునుండి ధర్మంబును, పృష్ఠంబునుండి యధర్మంబును, శీర్షంబునుండి దివియు, హాసంబునుండి యచ్చరలును, ముఖంబునుండి విప్రుఁడును గుహ్యామ్నాయంబును, భుజంబులనుండి రాజన్యుండును బలంబును, నూరువులనుండి వైశ్యుండును నోజంబును, బదంబునుండి శూద్రుండును నవేదంబును, అధరోష్ఠంబునుండి లోభంబును, ఊర్ధ్వోష్ఠంబునుండి ప్రీతియు, నాసికనుండి ద్యుతియు, స్పర్శంబునుండి పశుహితంబైన కామంబును, భ్రూయుగంబునుండి యముండును, బక్షంబునుండి కాలుండును గలిగె నట్టి మహావిభూతిసంపన్నుండగు పరమేశ్వరుండు మాకుఁ బ్రసన్నుఁడగుఁగాక. ద్రవ్య వయః కర్మగుణవిశేషంబుల నెవ్వని యోగమాయావిహితంబులుగా చెప్పుదు రట్టి విభుండు మ మ్మనుగ్రహించుఁగాక. మఱియుఁ బ్రశాంతశక్తియుతుండును స్వారాజ్యలాభప్రతిపూరితాత్ముండును మాయారచితగుణంబులయందు వృత్తులచేతం దగులువడక వాయులీలావినోదుండగు వానికి మా

నమస్కారంబులు. కావున నట్టి నీవు ప్రపన్నులమును దిదృక్షులమునగు మాకు సుస్మేరంబగు భవన్ముఖారవిందంబు నయనగోచరంబుఁ గావింపుము. ప్రతికాలంబున స్వేచ్ఛంజేసి ధరింపంబడిన యాయాయి రూపంబుల మా కసాధ్యంబైన కర్మంబును గావించుచుందువుకదా! అధిక క్లేశంబులును నల్పసారంబులగుకర్మంబులు విఫలంబులు. త్వదర్పితంబులైన విషయార్థులగు దేహులకర్మంబులు నిష్ఫలంబులుకాఁజాలవు. అల్పంబయ్యును గర్మకల్పం బీశ్వరార్పితంబగునేని విఫలంబు కాదు. ప్రియుతుండును హితుండునగు నీశ్వరుండు పురుషునకు నాత్ముఁడగు. వృక్షమూలావసేచనంబువలన స్కంధశాఖాదులకుంబలె విష్ణుసమారాధనంబు సర్వారాధనంబు నాత్మారాధనంబును నగుఁ గావున ననంతుండవు నవితర్క్యాద్భుతకర్ముఁడవును నిర్గుణండవును గుణేశుండవును సత్వస్థుండవగు నీకు నిప్పుడు మేము ప్రణమిల్లుచుంటిమి. 116

---

## అధ్యాయము 6.

### అమృతోత్పాదనోద్యమము

శ్రీశుకుఁడు:—

క. ఈ తెఱఁగున గీర్వాణ, వ్రాతస్తుతుఁడై సహస్ర భానూదయ వి
ద్యోతుఁడగుచు భగవంతుఁడు, ప్రీతుఁడు హరి మోల నవతరించె సురలకున్. 117

గీ. ఆ మహాతేజమునఁనప్పుడఖిలసురలు,కనులు మిఱుమిట్లుఁగొలుప నాకసముదిశల
ధారుణిన్ దమ్ముఁ గానంగ నేరరైరి,యింక నావిభు నీక్షింపనెట్లు నేర్తురి? 118

వ. అంత. 119

సీ. స్వచ్ఛంబు మరకతశ్యామంబుఁ బంకజా,క్షంబును వనమాలికాన్వితంబు
తప్తకార్తస్వరోద్భాస్వరకౌశే య,వస్త్రంబుఁ జారుసర్వాంగయుతము
సుందరభ్రుపముసుముఖంబు మణికిరీ,టాంగదాఢ్యముఁ గౌస్తుభాభరణము
కర్ణాభరణదీప్తికలిత కపోల శో,భావిరాజిత ముఖవారిజంబు

గీ. హార నూపుర వలయ కేయూరరత్న, మేఖలాభాసితంబు లక్ష్మీయుతంబు
శంఖ చక్ర కౌమోదకీ శార్ఙయుతము, నైన విభురూపముంగాంచి హర్షమెనఁగ.

క. శర్వుఁడు దానును సర్వ సు,పర్వులు సాష్టాంగముగను బ్రణమిల్లి మహా
నిర్వాణపరుని హరినిన్, మూర్కొప్ప సరోజసంభవుఁడు స్తుతియించెన్. 121

బ్రహ్మ:—

మ. అతిసూక్ష్ముండవు దేవదేవుఁడవు సర్వాత్ముండవున్ జన్మసం
స్థితి నాశంబులు లేనివాఁడవు గుణాతీతుండవున్ భావనాం
చితనిర్వాణసుఖార్ణవుండవును నిర్ణిద్రుండవున్ నైగమ
స్తుతిపాత్రుండవునైన నీకు నివె మా జోహార్లు లోకేశ్వరా! 122

శా. శ్రేయస్కాములు సంతతంబుఁ బురుషశ్రేష్ఠా! భవద్రూప మా
మ్నాయోక్తస్థిరయోగనైపుణమునన్ బాగొప్పఁ బూజింత్రు దే
వా! యయ్యద్భుతపుణ్యమూర్తివగు నీయందున్ బొడంగాంతుఁ గా
దే? యే నిప్పుడు సర్వలోకములు వేయేలా? జగన్నాయకా! 123

గీ. ఆదిమధ్యాంతములును నీయందుఁదోఁచె, నఖిలమైన యీ జగమునకాత్మతంత్ర!
ఆదిమధ్యాంతములు దీనికగుదువీవ, ఘటమునకు మృత్తికయుఁబోలెఁగారణాత్మ!

మ. స్వవశంబైన త్వదీయమాయ నొగి విశ్వంబెల్ల నిర్మించి యం
దవికారత్వముతోడఁ జొత్తువు మహాత్మా! సర్వలోకేశ! వా
స్తవబుద్ధిన్ గుణయుక్తని న్నగుణుఁగాసద్యోగయుక్తాత్ములా
చు:విలోకించుచునుందు రెప్పుడు మనీషుల్ కోవిదశ్రేష్ఠులై. 125

చ. అమృతరసంబు ధేనువులయందు వసుంధరయందు నన్నమున్
సమిధల వీతిహోత్రు ఖననంబునఁ దోయము యోగ్యమైన యు
ద్యమమున జీవికన్ నరులుయత్నములన్ గనునట్లు బుద్ధియో
గమున గుణంబులందు నినుఁగాంచుచునుందురు పండితోత్తముల్. 126

చ. కమలదళాయతాక్ష! చిరకాలమునుండియుఁ గోరుచున్న య
ర్థమవయి ప్రోలఁదోఁచిన పరాత్పరు నిన్నును దావపావకా
ర్తమగు మతంగజవ్రజ ముదంచిత గాంగజలంబునుంబలెన్
దమిఁగని యిప్డు నిర్వృతి పదంబునుజెందితి మెల్ల మేమిటన్. 127

చ. వెరవఁటి యే ప్రయోజనము వేఁడుచు నిష్టు సమస్తలోకపా
లురమగు మేము భక్తజనలోలుఁడవైన త్వదంఘ్రిమూలమున్
స్థిరముగఁ జేరియుంటిమదిచేయుము దేవ! యశేషసాక్షివై
పరఁగెడు నీకు మేముఁ దెలుపం బనియున్నదె లోకనాయకా! 128

ఉ. పావకు విస్ఫులింగములభంగిని నేనును భూతనాథుఁడున్
దైవతముఖ్యులున్ మఱియుదక్షముఖుల్ పరికింపఁగా పృథ

ద్భావితులైనవార మెఱుఁగంగలవారమె యించుకంతయున్
దేవ! యొనర్పుమీవ గణుతించి యుపాయమొకండు సత్కృపన్. 129

శ్రీశుకుఁడు:—

ఉ. ఈ తెఱఁగొప్ప సారసభవేశ్వరముఖ్యసమస్తదేవతా
వ్రాతసమీడితుండగుచు వారి మనోగతముం గ్రహించి జీ
మూతగభీరవాక్కుల విభుండు కృతాంజలులున్ సుసంయమో
పేతమనస్కులైన సురబృందములంగని పల్కె భూవరా! 130

గీ. పార్థివా! దేవకార్య నిర్వహణమునకుఁ, దానొకండ దక్షుండయ్యు శ్రీనివాసుఁ
డబ్ధిమథనాదికవిహారమాత్మయందుఁ, గోరి యాదేశ మొనరించె వారికిట్లు. 131

శ్రీభగవానుఁడు :—

క. దివులేటి కో నలినసం,భవ! యోభవ! యో సురప్రవరులారా! మీ
రవహితచిత్తులరై యిప్డు వినుం డెల్లరును నా నుడుల్ భద్రమగున్. 132

క. మీకు సమగ్రాభ్యుదయము,చేకురునందాక సంధిఁ జేయుఁడు సురలా
రా! కాలానుగతికిఁ దగు,పోకగ దైతేయదానవులతో నోర్మిన్. 133

గీ. మొనసి కార్యార్థగౌరవమునను జేసి,యరులతోడను సంధి జేయంగఁ జెల్లు
నర్థసిద్ధికై కొన్న యనంతరంబు,బూనఁదగు నహి మూషికంబులవిధంబు. 134

క. అమరవరులార! వడిని, ష్టమృతోత్పాదనమునకుఁ బ్రయత్నము కార్యం
బమృతమదిగ్రోల జంతువు, ప్రముదితమై మిత్తివాతఁబడియు నమృతమా. 135

సీ. క్షీరాబ్ధిలో సర్వవీరుత్తృణలతౌష,ధీసముత్కరములు దెచ్చివైచి
వరమందరాద్రిఁ గవ్వముఁ జేసి వాసుకిన్,గడఁకఁ గవ్వపుఁద్రాఁడుగాఁగఁ జేసి
బాసటనై నేను వర్తింప నిర్జరో,త్తములార! మీరు నిస్తంద్రులగుచుఁ
ద్రచ్చు డద్దాన దైత్యపరికరంబు కే,వలము క్లేశమునకు భాజనమగు

గీ. మీరు ఫలమును బొందంగలారు చూడఁ, గాన మీ రసురాళితోఁ గలియుటకును
సమ్మతింపుఁడు కార్యముల్ సామమునను, బోలె సిద్ధింప వౌద్ధత్యమున ధ్రువంబు.

గీ. సాగరోన్మథనక్రియాజాతకాల, కూటవిషమునకును మదిఁ గొంకవలదు
వస్తుజాలంబునందు లోభంబుమఱియుఁ, గామరోషంబులుం బూనఁగా వలవదు.

శ్రీశుకుఁడు:—

క. అని సురలకు నాదేశం, బు నొసఁగి భగవంతుఁడైన పురుషోత్తముఁ డ
య్యనిమిషులు చూచుచుండం, జనియెన్ స్వస్థానమునకు స్వాచ్ఛందగతిన్. 138

క. ఆ కరుణాళునకు నమో, వాకములిడి నళినభవుఁడు భవుఁడును వెస స్వ
స్వాకములకుఁజనిరి సురా, నీకము బలిదానవేంద్రునిం జేరె నృపా! 139

క. సమరోద్యమ రహితసురచ, యముపైఁ గవియంగఁ దివురు నసురులఁగని యు
త్తముఁడగు బలి వారించెన్, సమర నయాభిజ్ఞుఁడగుట స్వభటగణములన్. 140

గీ. అసురయూథప పరివృతుఁడైనవాని, బ్రాభవ శ్రీసమేతుఁడై పరఁగువాని
నిర్జితాశేషశత్రుఁడై నెగడువాని, ఘనుని వైరోచనునిఁ డాసె సనిమిషతతి. 141

చ. మృదుమధురోక్తిచే ననునయించుచు నా దనుజేంద్రుతోడ స్వా
భ్యుదయముఁ గోరుచున్న పురుహూతుఁ డుదంచిత బుద్ధియౌచు నిం
పొదవఁగ నల్లనల్ల పురుషోత్తమశిక్షితమైన సర్వమున్
వదలక చెప్పె నప్డతని స్వాంతమునం గడు మెప్పు పుట్టఁగన్. 142

ఆ. అది రుచించె బలికి నన్యులౌ దానవే, శ్వరులు వీరవరులు శంబరుం డ
రిష్టనేమియు నల త్రిపురవాసులు దాని, కిచ్చగించి రాత్మహృదయములను. 143

గీ. అంత దేవాసురులు సమయంబుఁ జేసి, కొని పరస్పరమైత్రి నెక్కొనఁగఁ గడఁక
నమృతసంపాదనమునకు సుమహితోద్య,మంబుఁ గావించిరుమ్మడి మానవేంద్ర!.

చ. ఉరవడి వారలప్పుడు మదోజ్జ్వలులై సముదగ్రశక్తి మం
దరగిరిఁ బెల్లగించి బటునాదముఁ జేయుచు వార్ధిఁ జేర్చుచో
నరవర! దూరభారవహనక్లమపీడితులౌచు నా పురం
దరబలిముఖ్యులున్ వివశతం బడవైచిరి దారి నగ్గిరిన్. 145

క. మందరగిరిపడ బెక్కురు, బృందారకదైత్యు లధికవివశత్వమునన్
గ్రిందంబడి పొడిపొడియై, యందందం నలిగియుండి రవనీనాథా! 146

గీ. అక్కరణిఁ బెక్కురైన దేవాసురు లతి, భగ్నహృదయులు భగ్నోరుబాహుకంఠు
లగుచుఁ బడియుంట నెఱిఁగి దానచటికి భగ,వంతుఁడగు గరుడధ్వజుఁడంతఁ దోఁచె.

గీ. అద్రిపాతవినిష్పిష్టులైన దేవ, రాక్షసులను గృపార్ద్రకటాక్షరమ్య
వీక్షణంబులచేత జీవింపఁజేసె, నిర్వ్రణులు నిర్జరులునయి నెగడుచుండ. 148

క. గరుడుని మూపున మందర, గిరినిడి యలవోక నొక్క కేలన్ లీలన్
హరి దానునెక్కి చయ్యన, సురాసురగణాన్వితుఁడగుచుఁ జనె జలధికిన్. 149

చ. పతగకులోత్తముండగు సుపర్ణుని స్కంధమునుండి మందర
క్షితిధరరాజముం గడిమిఁ గ్రిందకు దింపి సుధాపయోధిలో
నతిసులభంబుగా నునిచి యంతట నచ్చటనుండి పోవ నా
నతియిడె నవ్విభుండు ఖగనాథునకున్ సమయజ్ఞుఁడౌటచేన్. 150

## అధ్యాయము 7.

### కూర్మావతారకథ, శివకృత హాలాహలభక్షణము

శ్రీశుకుఁడు:—

క. నాగేంద్రువాసుకిన్ ఫల, భాగంబున కియ్య కొలిపి వారు ముదముతో
నా గిరికిం దత్రాఁడుగ, లోఁగక వెసఁజుట్టి రమరులున్ దానవులున్. 151

క. అమృతార్థులగుచు నంబుధి, ని మథింపఁగ వారు దొరకొనిరి హరిప్రాగ్భా
గముఁ దా గ్రహించె నపుడ, య్యమరులతని ననుసరించిరతికుతుకమునన్. 152

చ. క్షితివర! యమ్మహాపురుషుచేష్టిత మొల్లక "జన్మకర్మవి
శ్రుతులము వేదమార్గపరిశుద్ధులమై తనరారునట్టి మే
మతికుటిలం బమంగళము నౌ నహిపుచ్ఛము ముట్ట" మంచు నా
దితిసుతవర్యుల ప్డనుమతింపక మిన్నకయుండ్రి మూర్ఖతన్. 153

గీ. మానవేశ్వర! విస్మయమానుఁడగుచు
నమరయుతుఁడయి యగ్రభాగముఁద్యజించి
పుచ్ఛముం గొనె హరి కశ్యపునిసుతులిటు
పరఁగ స్థానవిభాగ మేర్పరచుకొనిరి. 154

మ. అమృతార్థంబయి దేవదైత్యులు కరం బాయత్తులై క్షీరవా
ర్ధి మథింపంగ గడంగిరప్పుడు ధరిత్రీనాథ! యా మధ్యమా
న మహాంభోనిధియందు నా గిరివరేణ్యంబు న్నిరాధారమా
ట మునుంగం దొడఁగెన్ ధరింపఁబడియుండం బైన భారంబునన్. 155

ఆ. అంత నతిబలీయమైన దైవంబుచే, స్వీయపౌరుషంబు జేడ్పడంగ
నేర్పు లుడిగి వారు నిర్విణ్ణులై పరి, మ్లానవదనులగుచు మ్రానుపడిరి. 156

మ. పరమేశుండగు నా రమేశుఁడు ఘనప్రత్యూహముం గాంచి సు
స్థిర సంకల్పుఁ డనంతవీర్యుఁడు కృపాశీలుండు నన్ గాన న
చ్చెరువుం గూర్చెడునట్టి కూర్మతనువు న్నైకొంచుఁ దోయంబునం
దు రహిం జొచ్చి కులాచలేంద్రమును దోశ్శక్తి నెత్తె న్వెత్తుగన్. 157

ఉ. భూవర! నీట నిట్టులు సముత్థితమైన కులాద్రిఁ జూచి యా
దేవతలున్ సురారులు మథింపఁగ వెండి కడంగి రప్డు "పెం
దీ"వన లక్షయోజనమితింబొలుపౌ తన వీపునందు నా
దేవుఁడు మందరాచలము ధీరతమై ధరియించెఁ బేరిమిన్. 158

ఉ. ఆయెడ దేవదానవ మహోత్తరబాహుబలప్రకంపితం
బై యఱుదై భ్రమించెడు కులాద్రిని వీపునఁ దాల్చినట్టి య
త్యాయత మాదికచ్ఛపము తత్కుధరభ్రమణంబు నంగ కం
డూయన కర్మయంచని కడుఁ దలఁచెన్ దన మానసంబునన్. 159

వ. అంత నద్దేవుఁ డబోధరూపుఁడై యాసురరూపంబున నసురులయందును, దైవరూపంబున సురగణంబులయందును నాగేంద్రుండగు వాసుకియందును జొచ్చి బలవీర్యంబుల నుద్దీపనంబుఁ గావించుచుండె. మఱియు సహస్రబాహుండై యపరగిరీంద్రంబుంబోలె నా గిరీంద్రంబును హస్తంబునంబట్టి బ్రహ్మభవేంద్రముఖ్యులగు సురగణంబులచే సంస్తూయమానుండగుచుఁ బుష్పవృష్టి కురియింపంబడి యొప్పారుచుండె. గోత్రనేత్రంబులయందు నుపర్యధోభాగంబులఁ జొచ్చియున్న నా పరేశునిచే సంవర్ధితులగు నా దేవదానవులు మదవిహ్వలులై మందరమహాద్రిచేత సాగరంబును క్షోభిత నక్రచక్రంబుగా మథించిరి. ఫణిరాజగు నవ్వాసుకిఁ సహస్రదృఙ్ముఖశ్వాసాగ్నిధూమనిహతతేజస్కులై పౌలోను, కాలేయ, బలీల్వలాద్య సురనాథులు దవాగ్నిదగ్ధంబులైన దేవదారుతరువులుంబలె నైరి. అసురగణంబులును దచ్ఛ్వాసశిఖాహతప్రభావంబులును, ధూమ్రాంబరస్రగ్వరకంచుకాననంబులునై యుండ భగవద్వశంబులైన మేఘంబులువర్షించె, సముద్రవీచికామారుతంబులువీచె. 160

క. ఆవడువునఁ జల మొప్పఁగ, దేవాసురవీరవరమథితసాగరమం
దావిర్భవింప దమృతము, నా విధముం గని విభుఁడు తానంత మథించెన్. 161

సీ. సజలవలాహకశ్యాముండుఁ గనకాంబ,రుండును రక్తకంఠుండు మఱియు
శ్రవణయుగచలదుజ్జ్వలతటిత్కుండలా,ఢ్యుండు విశీర్ణకచుండునైన
యా యీశ్వరుండు లోకాభయదంబులౌ, జైత్రంబులైన భుజములచేత
నహిసార్వభౌమునిం గ్రహియించి, యుద్ధృత గిరియౌచు నొప్పె నపరగిరియన

గీ. మీనమకరాహి కూర్మతిమింగిల తిమి
కులములెల్లను మిగుల వ్యాకులతఁ జెంద
నుదధి మథియింపఁబడుడు నత్యుల్బణమయి
వెడలె హాలాహలాఖ్యమహావిషము తొలుత. 162

చ. గిరిగొని దిక్కుదిక్కులకుఁ గ్రిందికి మీఁదికిఁ బర్వుచున్ సుదు
స్తరము సుదుస్సహంబు భయదంబు మహోల్బణముం బ్రతిక్రియా
విరహితమై తదుగ్రతరవేగము నోర్వక భీతులై ప్రజో
త్కర మొరుదిక్కుఁ గానక సదాశివునిన్ శరణొంది రార్తులై. 163

ఉ. భూవర! యీ జగత్త్రితయమున్ సృజియింపను బెంప ద్రుంపఁగా
దేవినిఁగూడి కాప్యజగతీధ్రమునన్ వసియించువాని స
ద్భావుని మౌనికోటి కపవర్గముఁగూర్పఁ దపంబొనర్చు నా
దేవవరేణ్యుఁడైన హరదేవుని మ్రొక్కిరి సన్నుతింపుచున్. 164

ప్రజాపతులు:—

గీ. దేవదేవ! మహాదేవ! దివ్యరూప!, భూతభావన! భూతాత్మ! భూతనాథ!
జగములన్ దహియించు విషమంబువలన, నరసికాపాడుమా శరణార్థులమము. 165

గీ. దేవ! యఖిలజగంబులకీవొకఁడవ, బంధమోక్షముల్ గలిగింపఁ బ్రభుఁడ వగుదు
వట్లుగానఁ బ్రపన్నార్తిహారుని గురుని, నిన్ను నర్చించుచుందురు నిపుణమతులు.

గీ. బ్రహ్మవిష్ణుశివాఖ్యలన్ వరుసఁదాల్చి, గుణమయంబగు నిజశక్తిఁగూడిమాడి
విశ్వమునకు సృష్టిస్థితివిలయములను, గలుగఁజేయుదుగద స్వప్రకాశుఁడవయి.

సీ. దేవదేవా! సర్వదేవతాత్మకులైన, యగ్ని దేవుండు నీకాననంబు
వసుమతియుం బాదపద్మంబు కాలంబు, గతియెన్నఁగ దిశల్ కర్ణములగు
వరుణుండు రసన నభంబు నాభితలంబు, శ్వసనంబు వాయువు సకలదేవ
తాత్మకా! భాస్కరుండక్షులు రేతమా, నంబువు నీకుఁ బరాపరాత్మ

గీ. కాశ్రయంబౌ నహంకృతియాత్మయగును
సోముఁడు మనంబు దివి శిరంబో మహాత్మ!
సంద్రముల్ కుక్షి గిరులస్థిసంచయములు
మహిత సర్వౌషధులును రోమంబు లీశ! 168

గీ. ఛందముల్ సప్తధాతువుల్ సవనరూప!, ధర్మమెన్నంగ హృదయంబు నిర్మలాత్మ
పంచవదనంబు లుపనిషద్వర్గమట్టి, నీదుమూర్తి పరంజ్యోతి నిశ్చలంబు. 169

వ. దేవా! అధర్మోర్ముల యందు సంహారంబు నీఛాయ యగు. సత్త్వరజస్తమో గుణంబులు నీ నేత్రంబులగు. ఛందోమయంబగు ఋషియును, మనువును, శాస్త్రకారులును నీదృష్టియగు. మఱియు నిరస్తభేదంబును, సత్త్వరజస్తమో విరహితంబును, బరంజ్యోతియునగు నీరూపంబు సకలలోకపాలురకును బ్రహ్మవిష్ణ్వింద్రాదులకును నగమ్యంబై యుండు. కామాధ్వర త్రిపురకాలగరాదులైన యనేక భూతద్రోహుల సంహరించు నీకుఁ దత్కర్మంబు స్తుతిపాత్రంబు కాదు. మఱియు నీవు స్వనేత్రవహ్ని విస్ఫులింగంబుల నంతకాలంబున నీజగంబును భస్మసాత్కృతంబుఁ జేసియు నెఱుంగకుందువు. ఎవ్వ రాత్మారాములగు గురువులచే హృదయంబున నితాంతంబు చింతింపంబడు పాదద్వంద్వంబు కలవానిని, నుమాతపంబునం దపింప

బడినవానిని నుగ్రపురుషుని శ్మశానవాసునిఁగా నిందించుచుందురో వారు భవత్ప్రతాపంబుఁదెలియని లజ్జావిహీనులని చెప్పంగాఁదగుఁ గావున సదసత్పరుండవును బరమాత్ముఁడవైన నీ స్వరూపంబునుదెలియ బ్రహ్మాదులును సమర్థులు కారన్న నతనిచే సృజింపఁబడిన మేము గొనియాడ నెట్లునేర్తుము. మహేశ్వరా! నీకంటెఁ బరుండగువాని నెందునుం గానము. వ్యక్తకర్ముఁడవై లోకరక్షణంబు కొఱకె ప్రవర్తింతువు. త్వద్దర్శనంబువలన మేము కృతార్థులము, అని యిట్లు విషత్రస్తులైన ప్రజాపతులు కీర్తించిరి. 170

శ్రీశుకుఁడు:—

గీ. వారి వ్యసనంబుఁగాంచి యాకవ్యాజకరుణ
హృదయమున సందడింపఁగాఁకప్రియసతిఁగని
సర్వభూతసఖుండగుకశర్వుఁ డప్పుడు
పలికె నీరీతి మంజులకభాషణములు. 171

చ. అరరె! భవాని! వీరల సుకధాంబుధి నిర్మథనప్రభూత దు
స్తరతరకాలకూటవిషకజాతమహావ్యసనంబుఁజూడు కా
తరులయి ప్రాణరక్షణవికధానముఁగోరెడు నీ ప్రజాళి క
ద్దిర! యభయంబొసంగఁదగుకదీనజనావన మార్యధర్మమా. 172

గీ. భూతములు దైవమాయావికమోహితంబు, లయి పరస్పరశత్రువుకలగుచునుండఁ బుణ్యపురుషులునశ్వరంకబులగుతమదు, ప్రాణములఁబ్రోతు రితరమాకప్రాణితతిని.

ఉ. భూతదయాపరత్వమునకబొల్చెడువానికి శోభనాంగి! సం
ప్రీతుఁడగున్ జెలంగి హరికవిశ్వమయుండగు నవ్విభుండు దాఁ
బ్రీతుఁడుగాఁగ నేఁ గనుదుఁకబ్రీతిజగంబును బ్రీతిఁజెందు నే
నీతఱి నవ్విషంబు భుజికయింతును భద్రమగున్ బ్రజాళికిన్. 174

శ్రీశుకుఁడు:—

క. అనియిట్లుపర్ణతో మం, తనముం గావించి భూతకనాథుఁడు వేగం
బున విషముంఁదినదొరకొనె,మనుజేశ్వర! దానిక య్యుకమయు నియ్యకొనెన్. 175

క. పుడిసిట నిమిడ్చికొని య, ప్పుడు హాలాహల విషంబుకభూతాత్ముండా
మృడుఁడు ననుకంపపెంపునఁ, గడుకొని భక్షించెఁ బ్రజలఁకగాచుటకొఱకై. 176

గీ. ఆ విషంబునకుం బ్రముకథాధిపతియుఁ, దనదు శక్తిని జూపించెకజనవరేణ్యా! యప్పుడుశివునికంఠమునీలకమయ్యెఁదలఁప,సాధుపురుషులకదియుభూకషణముకాదె.

గీ. భూతసంతాపమున సాధుపురుషులధిక, తాపమును జెందుదురుగా ధరణినాథ!
యయ్యదితలంపఁగా నఖిలాత్ముఁడైన, నాథనాథు సమారాధనమ్ము సుమ్ము.

క. ఆదేవదేవుఁడైన మ, హాదేవుని మహితకర్మమప్డుగని భవా
నీదేవియుఁ బరమేష్ఠియు, శ్రీదయితుఁడుఁ బొగడి రిది విశేషం బనుచున్. 179

గీ. భవుఁడు త్రాగుచునుండఁ దత్పాణినుండి, క్రిందఁబడినట్టియా విషబిందువులను
వృశ్చికాహివిషౌషధీవిసరములును, దందశూకాదులుం గొనె ధరణినాథ! 180

---

## అ ధ్యా య ము 8.

### ఐరావతాద్యుత్పత్తికథనము

శ్రీశుకుఁడు:—

క. వృషభధ్వజుఁ డీతెఱఁగున, విషమును ద్రావంగ మగుడ విబుధులును సుర
ద్విషులు మథించిరి జలధిం, దృషితులగుచు నప్డు కామధేనువు వొడమెన్. 181

గీ. బ్రహ్మలోకసంప్రాపకక్రతువులందు, వేల్వఁబడెడు నాజ్యాది హవిస్సుకొఱకు
నైనయంబున నాహవిర్ధాని నిచ్చ, కలిమిఁగొని రప్డు బ్రహ్మవాదులగు ఋషులు.

గీ. చంద్రపాండురమైన యుచ్చైశ్శ్రవంబు, నాఁబరగు హయరాజమంతట జనించె
దానిఁ గైకొనె నబ్బలిదానవుండు, చేకొనం డిందుఁ డీశ్వరశిక్షఁ జేసి. 183

క. అంతట నైరావతమను, దంతావళ మొదవె నాల్గుదంతంబులతో
మంతునకు నెక్కుచు శిఖర, వంతంబగు శ్వేతగిరి విభవముఁ దెగడుచున్. 184

గీ. అమరలోకవిభూషణంబగుచు నంతఁ, బారిజాతద్రుమంబు నుత్పన్నమయ్యె
నధిప! యర్థిజనాళికినర్థములను, వసుమతి నీవువోలె నవ్వారి నొసఁగు. 185

క. కంబుగ్రీవలు నతిరుచి, రాంబరలున్ బెడగునడలఁ గ్రాల్గనుల నొయా
రంబుల స్వర్గులకున్ మో, హంబిడు నచ్చరలు వొడమిరట పై జలధిన్. 186

గీ. క్రొమ్మెఱుఁగు కైవడి న్దిగంతమ్ములందుఁ
గ్రుమ్మరించుచుఁ గాంతిపుంజమ్ము లపుడు
భగవదారాధన క్రియాపరవశయగు
నుజ్జ్వలాంగి రమాదేవియుద్భవించె. 187

క. ఆదేవి సముజ్జ్వల రూ, పౌదార్య వయో విశేష వర్ణసుగుణ శీ
లాది సమాకృష్ట హృదయు, లై దేవాసుర మనుష్యులట వలఁచి రొగిన్. 188

సీ. ఆ రమాదేవికి నభిషేక మొనరింప, ననిమిషనాథుఁ డాసనముఁ దెచ్చె
నాకృతిఁ గొన్న దివ్యాపగల్ హేమకుంభంబుల స్వచ్ఛజలంబు నిచ్చె
ధర యభిషేకోచితములైన సర్వంబు లగు నోషధిసముచ్చయమ్ముఁ గూర్చె
నంచిత ధేనువుల్ పంచగవ్యము లిడె, మాధవుండు ఫల సుమంబు లొసఁగె

గీ. మఱియు ఋషులు యథావిధి మంగళాభిషేక మొనరించి రపుడు విశేషగరిమఁ
బాడిరి శుభముల్ గంధర్వవరులుఁ బ్రీతిఁ, బాడి రాడి రచ్చర లింపు పెంపెసంగ.

క. తుములస్వనములగు మృదంగ మురజవర గోముఖానక ముఖ వివిధ వా
ద్యములును వీణావేణు దరములున్ మొఱయించె ముమ్మరము ఘనంబుల్. 190

ఆ. అంతఁ బద్మహస్తయైన శ్రీదేవిని, బ్రాహ్మణోక్తసూక్తవాకములను
సలిలపూర్ణకలశముల నభిషేకించె, నగ్గలిక దనర్ప దిగ్గజములు. 191

గీ. అతివిచిత్రములైన రత్నాభరణము లర్మిలిఁ దలిర్ప నా విశ్వకర్మ యొసఁగె
నా సరస్వతి హారంబు నబ్జభవుఁడు, పద్మమును గుండలంబుల ఫణు లొసంగె. 192

చ. వినదదళివ్రజంబును వినిర్మలమున్ శుభదాయకంబునై
యొనరినయట్టి చారువికచోత్పలమాలను గేలఁ దాల్చి లీ
లను సుకపోలకుండలవిలాసము సత్రపహాసమున్ సుశో
భనము మనోహరంబునగు వక్త్రముతో నడయాడె లక్ష్మియున్. 193

చ. సమము నిరంతరంబు నవచందనకుంకుమపంకిలంబుఁ బీ
నమును సువర్తులంబగు స్తనద్వయ మొప్పెసలార సింహ మ
ధ్యమ మణినూపురంబు లులియన్ నడయాడుచు నట్టునిట్టు నే
త్రములకుఁ బండువయ్యె రుచిరంబగు కాంచనవల్లికైవడిన్. 194

చ. అమల మనింద్యమున్ ధ్రువము నవ్యభిచారిగుణంబునైన యీ
డ్యమగు పదం బట స్దనకునై పరికించుచు లేశమేని నా
రమ మది నొల్లదయ్యెఁ గురురాజ! త్రివిష్టపవాసులైన య
య్యమరుల సిద్ధ చారణుల యక్షుల సాధ్యులఁ గిన్నరాదులన్. 195

వ. అంత నా రమాదేవి తనమనంబున నిట్లు విమర్శింపం దొడంగె. 196

ఉ. ఈ యది నిశ్చయంబు తప మెవ్వనికుండు నతండు కోపమున్
మాయఁగఁ జేయలేఁ డెవఁడు జ్ఞానయుతుండగు వాఁడు సంగముం
బాయఁడు కామబుద్ధి గెలువండు మహత్త్వసమన్వితుండు వ
హ్వా! యితరాశ్రయుండయిన వానిని వేఱుగఁ జెప్ప నేటికిన్. 197

వ. మఱియు నొక్కచో ధర్మంబు గలిగియున్న భూతమైత్రి సున్న. త్యాగంబు ముక్తికారణంబుఁ గాకుండు. విక్రమంబు కాలవేగంబునం బరిత్యక్తంబగుచుండు. ఒకచో శీలసౌభాగ్యంబున్నఁ జిరాయువు లేకయుండు. ఇట్టి సర్వలక్షణంబులు కలిగియుండి కల్యాణాకారుండగు మహాపురుషుండు నన్నుఁ గోరనొల్లక యుపేక్షించియుండె. 198

శ్రీశుకుఁడు:—

గీ. అని విమర్శించి రమ నిజైకకాశ్రయుండు,గుణసమన్వితుఁడున్ వీతగుణుఁడు నైన యమ్ముకుందుని నిరపేక్షుఁడైనఁగాని,వరునిఁగ వరించె హావభావములు సెలఁగ.

ఉ. ఆవిభు కంఠసీమను మదాళివరూథవిరావసంకులం
బౌ వికచాబ్జమాలనిడి యంతికభాగమునందు నిల్చె శ్రీ
దేవి స్వకీయధామముగ దివ్యము నౌ తదురస్స్థలంబు వ్రీ
డావృతభాసమానదరహాసవికస్వరదృష్టిఁ జూచుచున్. 200

మ. త్రిజగన్మాత విభూత్యుపేతయగు నా శ్రీదేవికిన్ మ్రొక్కి దో
యజనాభుండు జగత్త్రయీజనకుఁ డభ్యంచన్నివాసంబుగా
నిజవక్షంబును జేసె నా రమయు క్షోణీనాథ! యందుండియే
ప్రజలన్ సాధిపతి త్రిలోకములఁ గాపాడెం గృపాదృష్టితోన్. 201

గీ. శంఖతూర్యమృదంగాదిసకలవాద్య,నాదములు నృత్యగానవినోదులగుచుఁ దనరు సస్త్రీకులైన గంధర్వవరుల,నిస్వనంబులు ఘనములై నెగడెనపుడు. 202

గీ. బ్రహ్మరుద్రాంగిరోమునిప్రభృతికులును,విశ్వసృజులెల్లరును బుష్పవృష్టిఁ గురిసి పరమములును విష్ణుప్రతిపాదకములు,నైన మంత్రంబులం గొనియాడి రంత. 203

క. శీలాది గుణసమృద్ధులు, ధీలలితులునగు ప్రజాపతియుత ప్రజలున్
వేలుపులును సుఖముండిరి, శ్రీలలనామణి సుదృఙ్నిరీక్షితులగుచున్. 204

క. శ్రీలలనోపేక్షితులయి, లోలాత్ములు విగతసత్త్వులు హతప్రభులున్
బాలిశులు నిరుద్యోగులు, నై లోఁగిరి దనుజదైత్యులందఱు నధిపా! 205

గీ. అంతటం బద్మలోచనయైన కన్య, వారుణీదేవి క్షీరార్ణవమునఁ బుట్టె
శ్రీనివాసుని యనుమతిఁ జేసి దాని,నెల్ల యసురులుఁ బ్రీతి గ్రహించి రపుడు. 206

గీ. అయ్యనంతరమం దమృతార్థులగుచుఁ
గాశ్యపులు వెండియు మథింపఁగాఁ బయఃప
యోధినుండి నరేంద్ర! సముత్థితుఁడయి
పొల్చెఁ బరమాద్భుతుండగు పురుషుఁ డొకఁడు. 207

గీ. భూతసంతాపమున సాధుపురుషులధిక, తాపమును జెంచుందు రిగాధరణినాథ!
యయ్యుదితలంపఁగా నఖిలాత్ముఁడౌ న, నాథనాథు సమారాధనమ్ము సుమ్ము.

క. ఆదేవదేవుఁడైన మ, హాదేవుని మహితకర్మమప్డుగని భవా
నీదేవియుఁ బరమేష్ఠియు, శ్రీదయితుఁడుఁ బొగడి రిది విశేషం బనుచున్. 179

గీ. భవుఁడు త్రాగుచునుండఁ దత్పాణినుండి, క్రిందఁబడినట్టియా విషబిందువులను
వృశ్చికాహివిషౌషధీవిసరములును, దందశూకాదులుం గొనెధరణినాథ! 180

---

## అ ధ్యా య ము 8.

### ఐరావతాద్యుత్పత్తికథనము

శ్రీశుకుఁడు:—

క. వృషభధ్వజుఁ డీతెఱఁగున, విషమును ద్రావంగ మగుడవిబుధులును సుర
ద్విషులు మథించిరి జలధిం, దృషితులగుచు నప్డు కామధేనువుపొడమెన్. 181

గీ. బ్రహ్మలోకసంప్రాపకక్రతువులందు, వేల్వఁబడెడు నాజ్యాది హవిస్సుకొఱకు
నై నయంబున నాహవిర్ధాని నిచ్చ,కలిమిఁగొని రప్డుబ్రహ్మవాదులగుఋషులు.

గీ. చంద్రపాండురమైన యుచ్చైశ్శ్రవంబు, నాఁబరగు హయరాజమంతట జనించె
దానిఁ గైకొనె నబ్బలిదానవుండు, చేకొనం డిందుఁడీశ్వరశిక్షఁజేసి. 183

క. అంతట నైరావతమను, దంతావళ మొదవె నాల్గుదంతంబులతో
నంతునకు నెక్కుచు శిఖర, వంతంబగు శ్వేతగిరి విభవముఁ దెగడుచున్. 184

గీ. అమరలోకవిభూషణంబగుచు నంతఁ, బారిజాతద్రుమంబు నుత్పన్నమయ్యె
నధిప! యర్థిజనాళికినర్థములను, వసుమతి నీవుపోలె నవ్వారి నొసఁగు. 185

క. కంబుగ్రీవలు నతిరుచి, రాంబరలున్ బెడగునడలఁ గ్రాల్గనుల నొయా
రంబుల స్వర్గులకున్ మో, హంబిడు నచ్చరలు పొడమిరట పై జలధిన్. 186

గీ. క్రొమ్మెఱుఁగు కైవడి న్దిగంతమ్ములందుఁ
గుమ్మరించుచుఁ గాంతిపుంజమ్ము లపుడు
భగవదారాధన క్రియాపరవశయగు
నుజ్జ్వలాంగి రమాదేవియుద్భవించె. 187

క. ఆదేవి సముజ్జ్వల రూ, పౌదార్య వయో విశేషవర్ణసుగుణ శీ
లాది సమాకృష్ట హృదయు, లై దేవాసుర మనుష్యులట వలఁచి రొగిన్. 188

బొదలి కదలాడు చున్నట్టి పదములందు
మొఱయుచున్నట్టి నూపురంబుల నలరుచు. 216

గీ. పుచ్ఛడీకతనంబుతోఁ బొదువఁబడిన, లేనగవుతోడ విక్షిప్తమైన భ్రూవి
లాసములతో నెసఁగు చూడ్కులందగనది, దితిజమనముల వలపులఁ దీపుఁ గూర్చె.

---

## అ ధ్యా య ము 9.

### జగన్మోహినీ వేషధారణము

శ్రీశుకుఁడు:—

గీ. అసురు లట్లు సుహృద్భావమవలఁ ద్రోచి, యొండొరుల చేతి యమృతంపు గుండ నాచి
కొనుచు దస్యులభంగిఁ బైకొనుచు నెదుట, నేగుదెంచుచునున్న యయ్యింతిఁ గనిరి.

సీ. బాపురే! రూపలావణ్య విశేషంబు, వహ్వారె! కాంతిసౌభాగ్యగరిమ
మాయురే! నవకంపుఁ బ్రాయంపుమిసిమి మే, ల్భళిర! క్రేఁగంటి చూపుల బెడంగు
అబ్బురం బని మదనావేశవివశులై, యసురు లక్కామిని ననుసరించి
పరువులు వాఱుచుఁ బ్రశ్నించి రీరీతిఁ, గోర్కులు మనములం గుల్కులాడ

ఆ. ఎవతెవీవు? తరుణి! యెందుండి రాక నీ, వేమిచేయ నిప్పుడిచ్చగింతు
వెవని దానవగుదు వెఱిగింపు కమలాక్షి!, యుల్లములను గలఁచుచుంటివిట్లు. 219

ఆ. గరుడ, సిద్ధ, సాధ్య గంధర్వ, చారణ, విబుధ, దైత్య, యోగవిభులచేత
నతివ! నీవునిక్కమస్పృష్టపూర్వవం, చెఱిఁగితిమిఁకఁ జెప్ప నేల నరుని. 220

చ. తరుణి! శరీరధారులకుఁ దా నఖిలేంద్రియ చిత్తమోదమున్
వెరవునఁ గూర్పనెంచి విధి నిన్నిటు పంపె నటంచు నాత్మలన్
స్థిరముగ నెంచుచుంటి మిది సిద్ధము కావున పద్మలాక్షి! నీ
యురుకృప మాపయి న్నెరపు మోలి నధీనులమైతి మీయెడన్. 221

గీ. బద్ధవైరులమై యేకవస్తువుకయి, స్పర్ధగావించుకొను మాకు జ్ఞాతులకును
మదినిఁ బారపొచ్చెములు సదమదముఁ జేసి, సంవిధానంబుఁ గావింపు సారసాక్షి!

క. అతివా! మే మల కశ్యపు, సుతులము భ్రాతలము తలఁప సుధకు సమముఁగా
జతనముఁ జేసితి మగుట న, మృతము న్విభజించి యొసఁగు మీ పోరలుడుఁగన్.

మ. అని యా దైత్యులచేత నర్థిమెయి నిట్లామంత్రితుండై విమో
హనమాయావనితాతనుండు హరి యొయ్యారంబుగా నవ్వి యొ

య్యన నవ్వారల నెల్ల ధీరరుచిరాపాంగంబులం గాంచు చి
ట్లనియె న్మంజులవాక్యపుంజముల నాహ్లాదంబు పుట్టించుచున్. 224

శ్రీభగవానుఁడు:—

గీ. కశ్యపతనూజులార! యిక్కరణిమీఱ, నకట! పుంశ్చలినైన నాయందు నిపుడు
ప్రత్యయము నుంచితిరి బాగు! పండితజను, లంగనల నమ్మజాల రొక్కప్పుడేని.

గీ. క్రొత్తక్రొత్తరుచుల కోఱకు నన్వేషించు, స్వైరిణులగు స్త్రీల సఖ్యము లవి
యేల? యసురులార! సాలావృకంబుల, చెలుముల ట్లసత్యములగుఁ గాదె! 226

శ్రీశుకుఁడు:—

క. అని నుడివిన విని యసురులు, మనమున నూఱటలు వొందిమందస్మింబుగ న
ల్లన నగి చేతి కమృతభా, జనము నొసంగి రపుడు వివశతఁ గురుముఖ్యా! 227

ఉ. భారతవర్య! య య్యమృతభాండముఁ గైకొని విష్ణుఁడంత సు
స్మేరముఖంబుతోఁ బలికె మీరిట నుంచిరొ చెడ్డరో నరో
దారత నా యొనర్చిన విధంబిది కాదన కీయకొందురేన్
నేరిమి మీఱఁ బంచుదు ననే నమృతంబును మీకు వింటిరే? 228

క. అనిపల్కిన తజ్జల్పిత, మునువిని యాదైత్యయూథపులు తన్మర్మం
బును దెలియలేక యట్లే, యని తమ యనుమతినిఁ దెల్పిరందఱు నొకమై. 229

మ. క్షితివర! యంత వా రుపవసించియు స్నానముఁ జేసి శౌచ సం
భృతులయి పావకంబును హవిస్సుల లెస్సగ వేల్చి విప్ర గో
తతులను దద్ధితంబులిడి తన్పి ద్విజాతివరేణ్యు లెల్లరున్
స్తుతమతులౌచు స్వస్త్యయనసూక్తములం బఠియింప ధన్యతన్. 230

క. నూతన వస్త్రంబుల సం, ప్రీతిని ధరియించి పేరిమి విభూషితులై
యా తఱినిం బ్రాగగ్రము, లై తగు దర్భలను జొచ్చి రందఱు నసురుల్. 231

ఆ. ఆజ్యదీపకలిత యగరు ధూపామోద, సంభరితయునైన శాలయందు
సురలు దానవులును నిరుపమమైన సం, తుష్టిఁ బ్రాఙ్ముఖోపవిష్టులైరి. 232

సీ. అవనీశ! యాశాలయందుఁ బ్రవేశించెఁ, దత దుకూలాఢ్య నితంబభాగ
మందయానయు నతిమదవిహ్వలాక్షియు, సర్వాంగలావణ్యసంకలితయుఁ
గలభోరువున్ స్వర్ణకలశస్తనియు హేమ, నూపురవిరుతులన్ మొఱయునదియుఁ
గనకకుండల చారుకర్ణ నాసా కపో, లాస్యయు పరదేవతాఖ్యయునగు

గీ. శ్రీసఖి స్ఖలితస్తనచేలనుగని, వెఱపుగదిరిన చూడ్కుల మఱియు మఱియుఁ
జూచి చూచి సురాసురుల్ చోద్యపడుచుఁ, బ్రబలతర మోహవార్ధి నిమగ్నులైరి.

గీ. పాములకుఁ బాలుపోయుటశుభంగిదాన, వాళి కమృతంబొసఁగుట యన్యాయమయని
యరసి జాతినృశంసకులైనవారి, కమృత మొసఁగ నొల్లం డయ్యె నచ్యుతుండు. 234

గీ. అంత వేర్వేఱపంక్తులనా రమేశుఁ, డాదితేయ దైతేయుల ననువుపఱచి
వారు తమతమ శ్రేణులం గూరుచుండ, నియమముం జేసె నప్డు క్షోణీకళత్ర! 235

గీ. కలశముం గేలఁ దాల్చి రాక్షసుల నెల్ల, సబహుమాన ప్రియోక్తులఁ జక్కమొఱఁగి
దవులనున్న సుపర్వులం ద్రావఁ జేసె, నల జరామృత్యుహారమగు నమృతరసము. 236

మ. పరగన్ దత్కృతపూర్వమా సమయముం బాలించుచు న్మేదినీ
శ్వర! యా దైత్యులు స్త్రీవివాదన జుగుప్సం జేసి తత్స్నేహ బం
ధురులై మిన్నక యుండి రా పడఁతియందు న్గాఢమా ప్రేమ పెం
పు రహిం బాయునో యన్న భీతి పలుకం బో కప్రియంబా నుడిన్. 237

గీ. అసుర వేషంబుఁ దాల్చి యయ్యమరపంక్తిఁ, జొచ్చి స్వర్భానుఁ డప్పుడు సుధను ద్రావె
సూర్యచంద్రులు వానినిఁ జూచి వేగ, హరికి సూచనఁ జేసిరి ధరణినాథ! 238

క. అమృతము గ్రోలు నతని శీ, ర్షముఁ దునిమెన్ హరి నిశాతచక్రాహతి భూ
రమణ! విను తత్కబంధం, బమృతాప్లావితమగుచు రయంబునఁ బడియెన్. 239

క. అమరత్వముఁ బడసిన శీ, ర్షము న య్యజుఁ డప్డుఁ జేసె గ్రహముగఁ దాఁ బ
ర్వమునం జంద్రార్కుల వై, ర మనస్కుండగుచు వాఁడు రవశిం బట్టున్. 240

క. దేవతలచేత నమృతము, ద్రావంబడినంత లోకరక్షకుఁడగు నా
దేవుఁడు నిజరూపముఁ గొనె, భూవర! య య్యసురవరులు గనుఁగొనుచుండన్. 241

మ. క్షితివర! దేవదైత్యతతికిం దగ దేశముఁ గాల మర్థమున్
మతియును గర్మ మిన్నియు సమంబులె యయ్యు ఫలంబునందు భి
న్నత గనుపట్టె నా కమలనాభపదాబ్జసమాశ్రయంబునన్
ధృతి నమృతంబునొందిరి సురేభ్యులు నిష్ఫలులైరి దానవుల్. 242

శా. పార్థక్యంబున దేనిఁ బ్రాణధన హృద్వాక్కర్మలన్ లేశమున్
సార్థక్యంబది లేక యే తనుతనూజాతాదికంబంనుఁ దా
రర్థింజేయుదు రద్ది వమ్మొయగు మూలాసేచనంబుం బలెన్
బార్థక్యంబును వీడి చేయు క్రియ లెల్ల భద్రంబులౌఁ బార్థివా! 243

## అధ్యాయము 10.

-:o:- దేవాసుర యుద్ధప్రారంభము -:o:-

శ్రీశుకుఁడు:—

గీ. వాసుదేవపరాఙ్ముఖస్వాంతులగుట, దృప్తులగుటను సర్వదైతేయదాన
వులను దత్కర్మయుక్తులై మెలఁగినను నృపాల! యట్లమృతంబును బడయరైరి.

క. సాధించి యమృతమును వసుధాధవ! స్వీయులగు సురలఁ ద్రావించి జగ
న్నాథుఁడు గరుడారూఢుం డై ధృతిఁ జనె భూతసంచయము గనుచుండన్. 245

చ. క్షితిప! సపత్నకోటి ఫలసిద్ధిఁ గనుంగొని యోర్వరామి నా
దితిసుతు లుద్యతాస్త్రులయి దేవగణంబులమీఁదఁ జుట్టి యు
ద్ధతిఁ బడి రా సుపర్వులు సుధారసపానవివృద్ధశక్తులై
ప్రతిరణమిచ్చి రచ్యుతపరాయణతన్ వివిధాయుధంబులన్. 246

క. రోమాంచముఁ గూర్చు చతిస్థేమముఁ దుములంబు నగుచు దేవాసుర సం
గ్రామం బతిభీమంబై, భూమీశ్వరవర! జరిగె నపుడు వార్ధితటిన్. 247

క. వివిధాయుధులై యట నా దివిజులు దితిజులును మిగుల ధృతి నొండొరులన్
బవరమునఁ గొట్టుకొనిరి యిషువులఁ గృపాణముల సరభసులయి యురవడిన్.

క. పొంగారు శంఖతూర్యమృదంగపటహభేరి డమరుతతి నిస్వనముల్
సంగరభువి రథహస్తితురంగ పదాతిసముదగ్రరవములు సెలఁగెన్. 249

క. తలపడె నట రణమున రథికులతో రథికులును నేనుఁగులతో నేనుం
గులుఁ గాల్వురతోఁ గాల్వురు, నలఘుగతి హయములతోడ హయములు నధిపా!

సీ. కొంద ఱుష్ట్రంబులఁ గొంద ఱేన్గుల మఱి, కొందఱు ఖరములఁ గ్రోలుపులుల
గౌరమృగంబులఁ గంకగృధ్రంబుల, శ్యేనభాసంబుల సింహశరభ
గవయ భల్లుక వృకఖడ్గ గో వృష మహిష తిమింగిలంబుల గజంబు కాఖు
శునక బస్త మనుష్యసూకర కృష్ణసారంబుల మఱియు నన్యంబులైన

గీ. స్థల జల ఖగంబులన్ వికృతాకృతులగు, వివిధ సత్త్వములం గడు వేడబమున
నుభయసైన్యంబులం గల యోధులు రణభూమిఁ జొచ్చిరి దారు ముమ్ముందునగుచు.

సీ. రాజేంద్ర! రుచిరచిత్రధ్వజాంశుకములుఁ, బ్రస్ఫీత ధవళాతపత్రములును
అత్యర్ఘ వజ్రదండాత్తవ్యజనములుఁ, జారు కోమల బర్హచామరములు
నురువాతధూతోత్తరోష్ణీషములును విస్ఫుర దుదంచిత మణిభూషణములు
ఖద్యోతదీధితిప్రద్యోతమానోగ్ర, నానాయుధవిరాజమానములును

గీ. నై చెలంగెడునట్టి దేవాసురభట, సేనలవి వీరకోటి విశిష్టములయి
బహుళ జలజంతువులతోడఁ బఱఁగునట్టి, రెండు సాగరములు బోలెఁ గండుమిగిలె.

వ. అయ్యవసరంబున 253

సీ. సర్వాద్భుతము సర్వసాంగ్రామికయుతంబు, మయనిర్మితంబు కామగము ఘనము
దృశ్యమానంబు నదృశ్యం బనిర్దేశ్య, మప్రతర్క్యంబు నుదీప్రమాన
మునగు వైహాయసమను విమానము నగ్ర, భాగంబునన్సర్వవాహినీశ
సంవృతుండై ఛత్రచామరాదులతోడ, బలిదానవేంద్రుండు ప్రౌఢి మెరయ
గీ. నుదయశైలాగ్రమున సమభ్యుదితుఁడైన, పూర్ణచంద్రుండువోలెను బొలుపుమిగిలె
దైత్యగణములకెల్ల నుత్సాహశక్తు, లాత్మలం గల్గఁజేయుచు నవనినాథ! 254

సీ. ఆ బలివీరునకన్నితట్టులఁ జమూ, పతులైన దైత్యులు ప్రౌఢియుతులు
నముచి శంబర కాలనాభ ద్విమూర్ధ వి, రోచన వజ్రదంష్ట్రులును మఱియు
నిల్వల హేతి ప్రహేతి హయగ్రీవ, శకుని తారక మయ శంకు శిరులు
శుంభ నిశుంభులు జంభుఁడు మహిషుఁ డ, రిష్టుండుఁ గపిలుఁ డరిష్టనేమి
గీ. కెరలి పౌలోములును గాలకేయులును ని, వాతకవచులు మున్నుగాఁ బఱఁగు లాఁతి
యసురులును గ్లేశభాగులై యమృతభాగ, మం దమిన్నిల్చి రని మొనలుక పేర్మి.

ఉ. భీషణసింహనాదములఁ బేర్చుచు నార్చుచు దగ్రులై సుర
ద్వేషులు భూరిరావ సముపేతములైన స్వకీయశంఖముల్
రోషముతోడ నొత్తిరి కురుప్రవరా! బలసూదనుండు వి
ద్వేషులఁ గాంచి క్రుద్ధుఁడయి ధీరత నిల్చె రణాంగణంబునన్. 256

క. గగనమున నమ్మహేంద్రుఁడు, దిగిభము నైరావతం బధిష్ఠించి కడున్
నెగడె స్రవత్ప్రస్రవణం, బగు నుదయశిఖరినిఁ దోఁచు నర్కుఁడు వోలెన్. 257

చ. నరవర! వాయు వహ్ని వరుణప్రముఖాఖిల లోకపాలకుల్
సురగణయుక్తులై బలసి చుట్టును నిల్చిరి స్వామియా పురం
దరునకు బాసటౌచు వివిధాయుధ వాహన కేతుయుక్తులై
దురమున శత్రువీరుల మదోద్ధతి నెల్ల నణంచు పూన్కితోన్. 258

ఉ. వారు పరస్పరంబు నిరువాగులవారును ముట్టడించుచున్
వీరవిహారకేళి నతిభీకరవృత్తిని బిట్టు నెట్టుచున్
పేరులఁ బెట్టి యొండొరులఁ బిల్చుచుఁ బెల్చన ముందుఁ జొచ్చుచున్
దారుణమౌ రణంబు సముదగ్రతఁ జేసిరి కౌరవేశ్వరా! 259

వ. ఆ సంకులసమరంబున బలిదైత్యేంద్రుండు నిర్జరేంద్రుని, తారకుండు గుహుని, హేతి వరుణుని, ప్రహేతి మిత్రుని, కాలనాభుఁడు యముని, మయుఁడు విశ్వకర్మను, శంబరుండు త్వష్టను, విరోచనుండు సవితృని, నముచి పరాజితుని, వృషపర్వుండశ్వినీదేవతలను, బాణప్రముఖ బలిపుత్రశతము సూర్యుని, రాహువు సోముని, పులోముఁ డనిలుని, నిశుంభశుంభులు దేవియైన భద్రకాళిని, జంభుండు వృషాకపిని, మహిషుండు విభావసుని, ఇల్వలవాతాపులు బ్రహ్మపుత్రులను, దుర్మర్షుండు కామదేవుని, ఉత్కళుండు మాతృగణంబులను, శుక్రుండు బృహస్పతిని, నరకుండు శనైశ్చరుని, నివాతకవచులు మరుత్తులను, గాలకేయులు వసువులను, పౌలోములు విశ్వేదేవులను, క్రోధవశులు రుద్రులను గవిసి ఘోరంబగు పోరుసలిపిరి. ఇట్లు దేవదానవు లన్యోన్యజిగీషలం జేసి ద్వంద్వసమరంబునఁ దీక్ష్ణంబులగు బాణ, కృపాణ, తోమర, చక్ర, గదా, ముశుంఠి, పట్టస, శక్తి, ప్రాస, పరశ్వధ, నిస్త్రింశ, భల్ల, పరిఘ, ముద్గర, భిండివాలా ద్యాయుధవిశేషంబుల నొండొరుల శీర్షంబులఁ దెగవేయందొడంగిరి. అప్పు డా సంకులసమరంబున రథ, గజ, తురగ, పదాతి సమూహంబు లారోహ వాహసందోహ సమన్వితంబులై చిత్రవిచిత్రంబులుగా ఖండింపఁబడియె. మఱియు నికృత్త బాహూరుకంధర చరణాది వివిధావయవులై ఛిన్నధ్వజ జ్యా తనుత్రాణ భూషణులై యోధవీరులు పాడగట్టిరి. గజ తురగ పదాతి పదాఘాతంబులను, రథాంగనేమి ఘట్టనంబులను జూర్ణీకృతంబై యువ్వెత్తుగఁ బైకిలేచిన సంగరభూమి పరాగంబు దశదిశలను నాకాశంబును దివాకరునిఁ గప్పుచుఁ గ్రమ్మఱ శోణితప్రవాహంబుల నణఁచివేయంబడుచుండె. ఉద్వృత్త కిరీటకుండలంబులగు శిరంబులచేతను, సంరంభోపేతములైన పరిదష్ట దంతచ్ఛదంబులతోడను, నాయుధసహితంబులు నావరణయుతంబులు నగు మహాబాహువుల తోడను, గరభసదృశంబులగు నూరుకాండంబులతోడను బ్రచ్ఛాదితంబయి యా సంగరాంగణంబెంతయు శోభిల్లె. శిరంబులు నఱుకంబడి కబంధంబులు కేలం గైదువులఁ దాల్చి యావేశంబునఁ బరుగులిడుచుండెను. 260

క. బలి యపు డింద్రునిఁ బదిశరముల నైరావతగజేంద్రమును మూఁడిట వా
జుల నాల్గిటి నాల్గిటఁ బెంపలరఁగ మావంతుఁ నొక్కటయమ్మున నేసెన్. 261

క. వడియును వాడియుఁ గల్గిన బెడిదములగు నన్నిభల్లవిశిఖంబుల నే
యడరించి వచ్చుశరముల నడుమన ఖండించె నమరనాథుఁడు కడిమిన్. 262

చ. కనుఁగొని తత్ప్రశస్తమగు కర్మమునుం బలి యీసు పెంపునన్
గొనె నొక శక్తిబాణమును గొంకక యంత సుపర్వనాయకుం

డును భయదోల్కాకై వడిఁ గదుంగను మండెడు నయ్యుదగ్ర శ
క్తిని కరమందునుండఁగ నెఱతీవ్రతమై నురుమాడె వ్రేల్మిడిన్. 263

గీ. అయ్యనంతరమున శూలమువలఁ బ్రాస, మాపయిన్ దోమరంబు నిట్లలుక మీఱఁ
జెలఁగి బలిదైత్యుఁ డేదేని చేతఁబట్టె, వాని నెల్లను దునిమె నవ్వాసవుండు. 264

శా. అంతన్ భీషణరోషపూర్ణహృదయుండై యా బలీంద్రుండు దా
నంతర్ధానముఁ బొందె నాసురము ఘోరాంతంబు నా మాయ న
త్యంతోపప్లవదాయకంబయి మహాహార్యం బొకం డడ్డు భూ
కాంతా! నిర్జరసైన్యకోటులపయిన్ గన్పట్టె దుర్దాంతమై. 265

చ. నృపవర! యత్యుదగ్రమగు రీతి దవానలదహ్యమాన పా
దపనివహంబు టంకసముదగ్రమహోగ్రశిలాసముచ్చయం
బు బడియె బిట్టు వేలుపులమూక లవెల్లను బిండిపిండియై
యపుడు కలంగి రూపుసెడి యత్యధికంబగు భీతిఁ జెందఁగన్. 266

సీ. అలఘుతరోరగంబులు దందశూకముల్, వృశ్చికంబులుఁ జేరి బిట్టుముట్టె
నురువరాహమహాగజోగ్రశార్దూల భీ, కరసింహముల్ కడగి గండ్లఁ బెట్టె
బృథుశూలహస్తులు విగతవస్త్రులునయి, 'యడువుండు పొడువుఁ' డంచార్పు లిడిరి
యాతుధానాంగనలడరి వేనకువేలు, రక్షోగణంబులు క్రందుకొనియెఁ

గీ. బ్రబలవాతాహతంబులై పరుషతర గ, భీరనిర్ఘోషయుతములై భూరితరము
లైన జలధరపటలము లతిభయంక, రముగ నంగారవృష్టి మొత్తములఁ గురిసె.

మ. అవనీంద్రా! బలిసృష్టమై విలయకాలాభీలమౌ లీలగాఁ
బవనప్రేరితమైన పావకము తీవ్రంబున్ మహోగ్రంబునై
దివిజానీకములం దహింపఁగడఁగెన్ దద్ధృత్యున్నతిం గోలుపో
యి వివేకంబులు దూల నెల్లఱును నిశ్చేష్టాత్ములై మ్రాన్పడన్. 268

క. ఆతఱిఁ బ్రచండవాతో, ద్ధూత తరంగోత్కరంబుతో వెడిదంబై
యే తట్టుఁ గన్నఁ దోఁచెను, భీతి నిడుచు సాగర మతివేలంబగుచున్. 269

చ. నరవర! వింటె? యీ వడువునం గడు ఘోరులు లక్ష్యమూర్గ భీ
కరులును గ్రూరచిత్తులును గర్వులు నా దితిపుత్రు లన్యులున్
నిరుపమశక్తి మాయల ననేకములన్ సృజియించుచుండఁగా
వెరవరి యప్పుడెల్ల సురవీరులు గుందిరి ఖిన్నచిత్తులై. 270

క. ఆ కుహనాకర్మలకుఁ బ్రతీకారము నెఱుఁగకుండిరి దేవేంద్రాదుల్
క్ష్మాకాంతా! యంతట లక్ష్మీకాంతుఁడుఁ దోఁచె వారికి సదయుండై. 271

మ. గరుడస్కంధకృతాంఘ్రిపద్ముఁడుఁ బిశంగస్ఫీతవస్త్రుండుఁ దో
యరుహాక్షుండు విశాలవక్షుఁడుఁ బ్రకృష్టాష్టాయుధోపేత సుం
దరబాహుండుఁ గిరీటకుండలసముద్యత్కౌస్తుభాలంకృతుం
డు రమానాథుఁడు దృష్టిగోచరత నొప్పం బొందె దేవాళికిన్. 272

ఉ. ఆ హరి సుప్రసన్నుఁడయి యందుఁ బ్రవేశముఁ జేసి సంత దే
వాహితకూటకర్మజనితాఖిలవిస్తృతమాయ లెల్ల దూ
రాహతమయ్యె స్వప్న మరయం బ్రతిబోధమునందుఁ బోలెఁ ద
న్మోహనశక్తిచేతను విభుస్మరణం బఘనాశమౌఁగదే. 273

ఉ. భండనభూమి నగ్గరుడవాహనునిం బొడఁగాంచి సింహ వా
హుండగు కాలనేమి నిశితోజ్జ్వలశూలము వైచెఁ బద్మనా
భుం డలవోకమై గరుడమూర్ధమునం బడు దానిఁ బట్టి యు
ద్దండత దానిచేతన యుదగ్రసవాహుని గొట్టె శాత్రవున్. 274

ఉ. మానవనాథ! మాలియు సుమాలియుఁ దాకిరి విష్ణు నాజి న
న్యూనబలాఢ్యులై హరి యనుద్ధతి వారలఁ జక్కడంచె నా
లోనన మాల్యవంతుఁడు బలోగ్రతఁ దార్క్ష్యునిఁ గొట్టెఁ బెన్గదన్
బూనిక నప్డు వానిని విభుండు వధించెను జక్రధారచేన్. 275

---

## అ ధ్యా య ము 11.

### దేవ విజయము

శ్రీశుకుఁడు:—

చ. ఉరుమహిమాఢ్యుఁడైన పురుషోత్తము సత్కృప నప్పు డా పురం
దరవరుణానిలాద్యమరనాథులు పోడిమిఁ జెంది క్రమ్మఱన్
దురమునఁ దమ్ము మున్నట నెదుర్కొనినట్టి యరాతివీరులన్
సరభసవిక్రమక్రమ మెసంగఁగఁ గొట్టిరి వాడికోలలన్. 276

మ. దురమందున్ బలిదైత్యుముట్టి భగవంతుండైన పాకారి బి
ట్టురుదా వజ్రము సాచి వైచెఁ బ్రజ హాహాకారముం జేసె న
స్తురుసంరంభసమేతు మానధను యుద్ధోర్వీచరిష్ణుం బలిన్
సురనాథుండుఁ దిరస్కరించి పలికెన్ సోనాఘు చక్రస్థుఁడై. 277

క. మాయాధీశులమగు మము, మాయలచే గెలువ నటునిమాడ్కిఁ బఱఁగు దే?
యో యజ్ఞుఁడ! బాలుర నటుఁ,డోయనఁ గనుగట్టి కొనుగదోయి ధనంబున్.

క. దారుణమాయలచే నె, వ్వారలు స్వర్గాపవర్గఫలముల నొందన్
గోరుదురో యుభయగతులకు, దూరులుగా వారిఁ జేయుదు న్మాధాత్మా! 279

క. శతపర్వోజ్జ్వలకులిశ, క్షతి దుర్మాయులగు మిమ్ము జ్ఞాతియుతముగా
హతమార్తు నిల్వు మెదుటన్, మతిహీనుఁడ! ఖలుఁడ! పెక్కుమాట లిఁ కేలా!

బలి:—

సీ. కాలప్రచోదితకర్ములై భీషణ, సంగ్రామమునఁ బేర్చు సర్వజనుల
కపకీర్తి కీర్తి జయాజయమృత్యువు, లందెదియే నొక్కఁడావహించు
సూరివర్యులు కాలసూత్రితమీజనం, బని కనుచుంద్రు దానమాత్మలందుఁ
బొంగ రావంతయుఁ గుంగ రెవ్విషయంబు, నందు వివేకశూన్యాత్ములరయ
గీ. నందు దేహమె సాధనమంచుఁ దలఁచు
చుంద్రు జడులరు శోచనీయులరు నైన
మీదు మర్మస్పృశములైనయీ దురుక్తు
లను సరకుసేయుదుమె? మేము మనములందు. 281

మ. క్షితినాథోత్తమ! యిట్లు దేవవిభు నాక్షేపించి వీరోత్తముం
డతిధీరుండగు దైత్యరాజు బలి యస్త్రాకర్ణకృష్టంబులౌ
శితనారాచగణంబులన్ మును ఘనాక్షేపోక్తి బాణచ్ఛటా
హతుఁడౌ నాతనిఁ గొట్టె గ్రమ్మఱ నుదగ్రాటోప మేపారఁగన్. 282

ఉ. సూనృతవాదియుం బృథుయశోధనుఁడు న్ఘనుఁడైనయట్టి యా
దానవనాథుచే నిటులఁ దాను నిరాకృతుఁడై వెస న్మహా
మాని మహేంద్రుఁ డట్టి యవమానము నోర్వక యంకుశాహతం
బైన మదేభరాజము క్రియం బొలుపాఱె నుదగ్రమూర్తియై. 283

ఉ. ఆతఁడు గోత్రభేది బలియా బలిమీఁద నమోఘము నిష్ఫ
వ్రాతమదాపహంబునగువజ్రము వైచె బిరాన దాన ధా
త్రీతలనాథ! యప్డు బలి తెక్కలఁ గొట్టిన యద్రికైవడిన్
జేతనశూన్యుఁడై పడియె స్వీయవిమానసమేతుఁడై వడిన్. 284

చ. అతిరభసంబునన్ ఘనరణాంగణపాతితుఁడైన యట్టి యా
దితిసుతసత్తముం బలిని ధీరు సుహృత్తముఁ గాంచి తత్సఖుం

డతులితశౌర్యశాలియు మదాఢ్యుఁడునై తగు జంభుఁ డప్పుడా
హతుఁడయియున్న మిత్రునెడ నాదృతిఁజూపు చెదిర్చె శక్రునిన్. 285

శా. ఆ జంభుండు మృగేంద్రవాహుఁడయి యుగ్రాటోప మేపారఁగా
సాజంబౌ పృథువిక్రమంబున గదన్ సారించి దిఙ్నాగమున్
దా జత్రుస్థలమందుఁ గొట్టె గజముం దద్గదాపీడితం
బై జానుద్వయి నేలముట్టు చమితాయాసంబు నొందె న్నృపా! 286

క. రయమున మాతలి దశశత, హయములతోఁ గూడినట్టి యరదము దేరన్
భయయుతకరిని విడిచి హరి, హయుఁ డా స్యందనముఁ దోన నధిరోహించెన్. 287

క. ఆసారథికృత్యంబు 'సె, బా' సని మెచ్చుకొని దానవశ్రేష్ఠుఁడు సం
త్రాసకరశూలమున న్మయ, భాసురుఁడై మాతలిని జవంబున నేసెన్. 288

క. ధీరత నవలంబించి యు, దారుఁడు మాతలి సహించె దజ్జనితార్తిన్
గ్రూరుఁడగు జంభుఁ గినిసి శ, తారమ్మగు వజ్రమున శతమఖుఁడు దునిమెన్.

గీ. రాజ! దేవర్షియైన నారదునివలన, జంభుఁ డీల్గుట విని వానిజ్ఞాతులైన
నముచి బలుండు పాకుండు నాఁబరఁగెడు, వార లతిరభసంబున వచ్చి రటకు. 290

గీ. పోటుమాటలమర్మముల్ మట్టుపట్టు, లమరవిభు నధిక్షేపించుచ ద్దనుజులు
వర్షధారల మేఘముల్ పర్వతమును, బోలె శరముల నాతని ముంచిరపుడు. 291

గీ. హస్తలాఘవ మొప్ప నయ్యమరవిభుని, దశశతతురంగముల యుద్ధంబునందు
నన్ని శరములచేత నేయబ్బురంపు, నురవడిం గొట్టె బలదైత్యుఁ డొక్కమొగిని.

గీ. భూవరా! సకృత్సంధానమోక్షణములఁ, బాకుఁడు న్మాతలిని శతబాణములను
నొవ్వనేసి రథంబును గ్గు సేసెఁ, దిలలయంతగఁ బెనువింత గలిగె నంత. 293

గీ. స్వర్ణపుంఖంబులై యొప్పు పంచదశమ, హాశరంబులఁ గొట్టి యాహవమునందు
సజలమై యొప్పు జలదంబు చాడ్పున న్మ, హానినాదంబుఁ జేసె భయంకరముగ.

క. సారథిరథయుతుఁడగు రిపు, వీరున్సుత్రాము బాణవృష్టులచే దే
వారులు గప్పిరి ప్రావృ, ట్కారుని నంభోధరము లట్టుల్ నృపవర్యా! 295

చ. అనిమిషనాథుఁ గానక భయాతురులై దివిషద్గణంబు లె
ల్ల ననుగయుక్తులై రిపుబలప్రతికల్పిత దుర్భరవ్యథన్
వనరు చనాయకత్వమునవందురుచు న్మొఱవెట్టి రుమ్మడిన్
వననిధి భిన్ననౌకులగు వర్తకసంఘములట్లు భూవరా! 296

ఉ. ఆయెడ మేఘవాహనుఁడు సాశ్వరథ ధ్వజయంత్రయుక్తుఁడై
సాయకపంక్తిపంజరము సంగతిఁ బాసి వెలింగె నంతటన్

స్వీయరుచి న్నభంబు పృథివి న్దిశల న్మిగుల న్వెలుంగఁగాఁ
జేయుచు సుప్రభాతమునఁ జెన్నెసలారెడు సూర్యుకైవడిన్. 297

గీ. ఆజి శత్రు నిపీడితమైన తనదు, సైన్యమును బొడగాంచి యాశతమఖుండు
ప్రకటరోషమునం జేతివజ్రమును వి, పక్ష సంహారమునకునై పఱపెఁ గడిమి. 298

క. ఆ కులిశధారచేతన్, బాకబలుల శీర్షములను బ్రౌఢి హరించెన్
లోక మగల జ్ఞాతులును వి, లోకించుచునుండ నాకలోకవిభుఁ డనిన్. 299

క. నముచి యపుడు స్వజ్ఞాతివ, ధముఁ గని శుగమర్ష రోషధర్షితుఁడగుచున్
వినుతుని నింద్రునిఁ జంపఁ బ, రమమగు నుద్యమ మొనర్చె రాజవరేణ్యా! 300

గీ. స్వర్ణకింకిణీయుత మశ్మసారమయము,నైన శూలంబుఁ దాల్చి యద్దానవుఁడు తె
గించి చచ్చితి వనుచు భర్జించు చప్పు,డెసరగాఁ బఱతెంచె నయ్యింద్రునకును.

చ. వెసఁ బఱతెంచి యద్దనుజవీరుఁడు గర్జిలుచున్న సింగ మ
ట్లెసగుచుఁ బ్రౌఢిమీఱ నమరేశ్వరుపైఁ జటులోగ్రశూలమున్
విసరె నభంబునందు నదివేడబమై పరతేఱఁ గేళి లా
లసుఁడగుచు న్సహస్రశకలంబులుగా నఱకె న్సురేంద్రుఁడున్. 302

క. నృపవర! సుపర్వవల్లభుఁ, డపుడు మహారోషసంభృతాత్ముండగుచున్
రిపువీరుని కంధరము దె, గిపడ న్గులిశాయుధ మ్మొగిఁ బ్రయోగించెన్. 303

చ. శతమఖుచేత నట్లు రభసంబున నేయఁగఁబడ్డ విక్రమో
ర్జితమగు వజ్ర మయ్యసురశేఖరు చర్మము నేనిఁ ద్రెంపలే
క తొలఁగెఁ జూడఁ జిత్ర మిదిగా యతివిక్రమవృత్రభేదనా
ప్రతిహతవజ్రరాజము తిరస్కృత మా నముచిత్వచంబునన్. 304

సీ. వజ్రాయుధం బిట్లు ప్రతిహతంబై నంత, దివిజేంద్రుఁ డిట్లు చింతించె భీతి
నిది యేమి విధియోగ మెఱుఁగంగరాదహో!, భూతలోకంబును మోహపఱచె
భారయుతంబులై పక్షంబులన్ భూమిఁ, బడుచుఁ బ్రజాక్షయంబడరఁ జేయు
శైలంబులకును బక్షచ్ఛేదఘనకార్య, మును జేయునపుడేని మొక్కవోదు
గీ. మఱియుఁ ద్వాష్ట్రితపస్సారమయునివృత్రుఁ, జంపు నపుడేని గొంకదు సర్వశత్రు
సంచయాక్షతగాత్రులశౌర్యయుతుల, దనుమఁ జాలినదికద భీకర మిదౌర! 305

శా. ఆవజ్రం బిది యొక్కఁ డల్పుఁడగు దేవారాతిపై ముక్తమై
చే వెల్లంజెడి మొక్కవోయినది యక్కీ! యింక నే దండమున్
శేవం దాల్పఁగనేల? నింక పరిపాటిన్బ్రహ్మతేజంబునున్
దా వమ్మై చెడెఁగాదె? యెందుపలుకున్వ్యాక్రువ్వఁగా నేటికిన్. 306

చ. అని మదిఁ గుందుచుండెడు బలారికి నప్డశరీరవాణి యి
ట్లనియె 'మహేంద్ర! యీ యసురుఁడార్ద్రము శుష్కమునైన దానిచే
తను దెగఁ డట్టిదా వర ముదగ్రతపంబున మెచ్చియిచ్చితిన్
విను మును గాన యారయుము వీనినిఁ ద్రుంచుట కొం డుపాయమున్'. 307

గీ. అనభోవాణి నమరేంద్రుఁ డాలకించి, క్రమసమాహిత మతిని ధ్యానమునొనర్చి
యార్ద్రమును శుష్కమునుగానియట్టి దొక్క, ఫేనమే యని తెలిసెఁ బృథ్వీశఛత్ర!

క. పూనిక శుష్కము నార్ద్రము, గాని నురువుచేత నముచికంధరమును బొం
కానఁ దెగనఱికె నింద్రుఁడు, మానులు వొగడిరి ప్రసూనమాల్యము లిడుచున్.

గీ. ఎలమి విశ్వావసు పరావసులనఁబరఁగు
ప్రథితగంధర్వవర్యులు పాడి రప్డు
ముఖ్యమగు దేవదుందుభుల్ మొఱసె మఱియు
నాట్య మొనరించి రింపొప్ప నటగణంబు. 310

క. ఆయదనున నన్యులయిన, వాయుకృశాను సమవర్తివరుణాదులు తే
జోయుతులయి గెడపిరి దై, తేయగణంబులను మృగతతిన్ హరులు గతిన్. 311

క. పరమేష్ఠి ప్రేరితుఁడయి, సురముని నారదుఁడు పృథుయశుం డటకుం దా
నరుదెంచి యసుర విలయముఁ, బరికించి దివౌకసులను వారించె నిటుల్. 312

నారదుఁడు:—

శా. శ్రీవైకుంఠ మహాభుజాశ్రితులరై చెన్నారు మీ రిప్డు సు
శ్రీ విభ్రాజితభాగధేయులరునై సిద్ధామృతంబంది యో
దేవవ్రాతములార! యొప్పితిరి కాదే? కాన మీరల్సుహృ
ద్భావంబొప్పఁగ నింక దైత్యులపయిన్వైరంబుఁ జాలింపుఁడీ. 313

శ్రీశుకుఁడు:—

చ. అని యనువొంద నారదమహర్షి పితామహు నాజ్ఞగా వచిం
చిన వచనంబు నాదరముఁ జేయుచుఁ గ్రోధము నుజ్జగించి య
య్యనిమిషవర్యులెల్లరు నిజానుచరు ల్కొనియాడుచుండఁ బెం
పెనయఁ ద్రివిష్టపంబునకు నేగిరి దోఁగిరి హర్షవారిధిన్. 314

ఉ. రాజవతంస! యీ కదనరంగమునందు హతావశిష్టులై
తేజముఁ దక్కి స్రుక్కిన దితిప్రభవు ల్సురమానియాజ్ఞచే
నాజి విపన్నుఁడైన బలి నస్తగిరిన్ దరియంగఁ జేర్చి ర
ష్టోజదలిర్ప నార్యుఁడు భృగూద్వహుఁడుం జనుదెంచె నద్రికిన్. 315

గీ. ఉశనుఁ డంత శిరోధరశ్రయుక్తులగుచుఁ, బ్రిబలనష్టావయవులయి పరఁగువారి
నారసి మృతసంజీవనియనఁబరఁగు స్వ, విద్యచేతను బ్రేర్మి జీవింపఁజేసె. 316

మ. భృగువర్యుండగు కావ్యుఁ డప్పుడు మహావిద్యాఢ్యుఁడై తన్నుఎల్ల శిం
పఁగ నైదైత్యాధిపుఁడైన యా బలియు సంప్రాప్తేంద్రియజ్ఞానుఁడై
తగ నానావిధలోకతత్త్వవిదుఁడై తా నొప్పుటంజేసి లో
వగ నొందండు పరాభవంబు దనకుం బ్రాపించిన న్బాధ్ధి వా! 317

---

## అధ్యాయము 12.

### మోహినీ దర్శనజాత శివుని విభ్రమము

శ్రీశుకుఁడు:—

క. మాయావనితాకృతి నై, తేయుల వంచించి హరి యదితినందనులన్
పీయూషముఁ ద్రావించిన, యీ యఖిలోదంతము స్మరహరుఁడు వినియెన్. 318

క. దేవీయుతుఁడగుచు మహా, దేవుఁడు వృషభేంద్రు నెక్కి తద్భృతి భూతవితా
నావృతుఁడై చనియెన్ శ్రీ,దేవుఁడు గలచోటికి న్మదిన్ ముదమొందన్. 319

ఉ. అంత రమామనోహరుఁ డుమా మాన్వితుఁడైన మహేశుఁ బ్రీతి న
త్యంతము గౌరవింప నుచితాసనమందు సుఖోపవిష్టుఁడై
యెంతయు నెమ్మి శంభుఁడు రమేశునకుం బ్రీతిపూజఁజేసి పె
న్వింతను బొందుచున్న మదిఁ వేడుక దీరఁగఁ బల్కె నీగతిన్. 320

వ. దేవదేవా! నీవు జగద్వ్యాపకుండవు, జగదీశ్వరుండవు, జగన్మయుండవు, సర్వభావంబులకు హేతుభూతుండవు,పరమాత్మరూపుఁడవు. ఈ జగంబున కాదిమధ్యాంతములు నీవ. అంతర్బహిర్వ్యాపకుండవు నీవ. అవ్యయుండవగు నీకు జగదాదులు లేకుండుంగావున సత్యజ్ఞానానందస్వరూపుఁడవై వెలుంగుచుందువు. శ్రేయస్కాములైన మునులు ఉభయసర్గంబును బరిత్యజించి భవచ్చరణాంబుజంబును ఉపాసించుచుందురు. పరిపూర్ణంబును, అమృతంబును, గుణరహితంబును, విశోకంబును, అవికారంబును, ఆనందమాత్రంబునగు పరబ్రహ్మంబు నీవ. అనపేక్షుండవై జగదుత్పత్తిస్థితిలయంబులఁ గల్పించుటకుఁ దదపేక్షకత్వంబున నాత్మేశ్వరుండవైన నీవు ప్రవర్తించుచుందువు. నీ వొక్కండవ సదసద్రూపుఁడవు. అద్వయుండవు, నుభయుండవగుదువు. స్వర్ణంబు వస్తుభేదంబున విభిన్నంబుగానియట్లు నీ వవిచ్ఛిన్నుండవై విరాజిల్లుచుందువు. జను లజ్ఞానవశంబున నిరుపాధికుండ

వైన నీయందు గుణవ్యతికరంబు గల్పించుచుందురు. కొందఱు నిన్ను పరబ్రహ్మ
వని చెప్పుదురు. మఱికొందఱు ధర్మంబుగా వక్కాణింతురు. వేఱొకకొందఱు
సదసత్పరుండవగు పురుషుండవని పల్కుచుందురు. అన్యులు కొందఱు నవశక్తి
యుతుండవగు పరమపురుషునిగా నుగ్గడింతురు. ఇతరులు మఱికొందఱు అవ్య
యాత్మకతత్త్వస్వరూపుఁడవగు మహాపురుషునిగా వక్కాణింతురు. మహాయుస్సం
పన్నుండనగు నేనును, మరీచిప్రభృతులైన ఋషులును, సత్త్వగుణప్రధానులమైనను
భవత్కల్పితమైన మాయాపరిభావంబు నెఱుంగంజాల మనిన యశుభప్రవర్తనులు
త్వన్మాయావంచితమనస్కులునగు దైత్యమర్త్యాదు లేమెఱుంగనేర్తురు? అట్టి
నీవు భూతంబులకు జన్మస్థితినాశంబులును భవబంధమోక్షంబులును గల్పించు
చుందువు. వాయు వెట్లాకాశంబునుజొచ్చునట్లు స్థావరజంగమాత్మకంబగు నీసర్వ
విశ్వంబును తదాత్మకత్వంబున జొత్తువని నేఁ దలంచెద. 321

గీ. ఈశ! గుణములతో రమి✽యించునట్టి, నీ శుభావతారమ్ముల✽నేను గంటి
నిపుడు మోహిత్తనువుఁదాల్చి✽యింపుసొంపు, నింపు నవతారమును జూడ✽నేఁ
దలఁచితి. 322

ఉ. ఏ యవతారలీల నసు✽రేంద్రులు మోహితులైరి వేల్పు లా
ప్యాయముగా సుధారసము✽పానముఁ జేసిరి లోకమోహనా!
యా యవతారవైభవము✽నర్మిలిఁ జూడఁగఁ గోరి మేము దే
వా! యిటువచ్చినారము మ✽హాత్తరమైన కుతూహలంబునన్. 323

శ్రీశుకుఁడు:—

గీ. అని గిరీశునిచేత న✽భ్యర్థితుఁడయి, విష్ణుదేవుండు భావగం✽భీరముగను
నవ్వి యా శూలపాణి యా✽సనముఁ జూచి, ప్రతివచన మిచ్చెనీగతిఁ✽బార్థివేంద్ర!

శ్రీహరి:—

గీ. అమృతభాజన మపహృత✽మగుడు సకల, నిర్జరులకార్యములఁజూచు✽నేను దైత్య
గణములకుఁ గౌతుకంబెదఁ✽గలుగుపొంకెఁ, బూనినాఁడ మోహిద్రూప✽మునుగిరీశ!

క. కామిజనాదరణీయము, కామోద్దీపకమునగుచుఁ✽గమనీయంబౌ
భామినిరూపముఁ జూడం, గామించెదు నీకుఁ జూపఁ గలను మహేశా! 326

నారదుఁడు :—

క. అని నుడువుచునే కమలన, యనుఁ డంతర్ధానమొందె✽నన్నిదెసలకున్
గనుగవఁ ద్రిప్పుచుఁ గాత్యా, యనితో నా చంద్రమౌళి✽యటనుండె నృపా!

చ. అపుడు నవప్రవాళకుసు✽మాంచితవృక్షవిరాజమానమౌ
నుపవనసీమఁ గాంచె శివుఁ✽డొప్పుగఁ గందుకకేళిసక్తయై

నిపుణత నాడుచున్ హూయలు ƒ నింపుచుఁ జారు దుకూలచేల యు
క్తపృథునితంబభాగమునఁ ƒ గాంచినిఁ దాల్చిన మోహనాంగినిన్. 328

చ. అనుపమసౌకుమార్యఖని ƒ యై నమనోన్నమనప్రకంపిత
స్తనపృథుహారభారవశ ƒ తం గృశమధ్యమునం బదింబదిం
దునిసెడుభంగిఁ జూడ్కికిని ƒ దోఁచుచుఁ గమ్రపదప్రవాళ మి
ట్టునటు గదల్చుచుం దనరె ƒ దున్ లలితాంగి వినోదభూమియై. 329

చ. దెసల భ్రమించు చెండువయి ƒ దృష్టు నిగుడ్చుచుఁ గర్ణకుండలో
ల్లసితకపోలయుగ్మయుఁ జ ƒ లచ్చికురాళివృతాననాబ్జయై
వసనము జాఱఁ గొప్పువిడ ƒ వామకరంబునఁ జక్కనొత్తుచున్
వెసఁ బెఱకేలఁ జెండు విను ƒ వీథికిఁ గొట్టుచుఁ దన్వి చేర్చెడిన్. 330

చ. భువనము నాత్మమాయఁ గడు ƒ ముగ్ధముఁ జేయు చొకించుకంత సి
గ్గు వొడమఁ బిన్ననవ్వొలయఁ ƒ గూర్మిఁ గనుంగొనఁ దాన వంచితుం
డవుచు భవుండు నివ్వొలత ƒ రాశయుఁడై తనుఁ జెంతనున్న యా
శివను స్వభృత్యవర్గమును ƒ జిత్తమునందు నెఱుంగఁ డయ్యెడన్. 331

ఉ. ఆ యువతీలలామ స్వక ƒ రాగ్రమునుండి సుదూరభూమికిన్
బోయిన చెండుకై వెనుకఁ ƒ బోవుచునుండఁ దదీయవస్త్రమున్
వాయుకిశోర మా వృషభ ƒ వాహుఁడు సూడ హరించె నంతఁ దా
నా యెలనాగ సోయగము ƒ నందు మనంబిడెఁ గామవైరియున్. 332

క. భూనాథ! త దపహృతవి, జ్ఞానుండయి పంచశర వ ƒ శంకరుఁడగుచున్
దా నా శంకరుఁ డప్డు భ, వాని గనం దానివెంటఁ ƒ బడియె న్వింటే. 333

గీ. విగతవస్త్రయు మిగుల సƒవ్రీడయునయి,తన్నుఁ దరియంగవచ్చుభూƒతపతిఁగాంచి
తరుచయంబులమాటునƒదాగు చామె,యల్లనవ్వుచు నటనుండƒనొల్ల కరిగె. 334

క. ప్రమథితసకలేంద్రియుఁడగు, ప్రమథాధిపుఁ డప్డు కామ ƒ వశుఁడయి తా నా
రమణి న్వెన్నంటిచనెన్, దమిఁ గరిణిన్ దంతివిభుఁడు ƒ దవిలినభంగిన్. 335

ఆ. అనుగమించి పోయి ƒ యమ్మహాదేవుండు, వలవకున్నసతిని ƒ బలిమిఁబట్టి
కేశబంధమునను ƒ గీలించి బాహుల, లీలబిగ్గఁ గౌఁగి ƒ లించుకొనియె. 336

క. కరిచేఁ గరిణితెఱంగున, హరుచే గాఢోపగూఢ ƒ యై యిట్టటు లా
తరుణి పెనంగుచు విలులిత, శిరోజయై పొలుపుమిగిలె ƒ క్షితివరమౌళీ! 337

గీ. ఎట్టకేలకుఁ దన్బ్రమథేశు సుదృఢ, బాహువులమధ్యనుండి వీƒడ్వడఁగఁ జేసి
విష్ణుకృతమాయయైనయాƒపృథునితంబ,రభసగతిఁ బాఱిపోయె నోƒరాజతిలక! 338

క. అరినిర్జితుండువోలెన్, స్మరనిర్జితుఁడగుచునపుడు శంకరుఁడు మహా
పరమాద్భుతకర్ముండగు, హరిజాడంబట్టిపోయె నవనీనాథా! 339

మ. ఎదఁగొన్నట్టి కరేణువుం దవిలి యుద్వృత్తిన్ వెసం బాఱు ను
న్మద దంతీంద్రమువోలె నయ్యువిద వెంటంబోవ సత్పూజకున్
బదమా దేవు నమోఘవీర్యము పడెన్ మార్గంబునన్ స్కన్నమై
మదిరాక్షీనవయౌవనార్ణవవినిర్మగ్నాత్ముఁడై యుండుటన్. 340

గీ. ఎటనెట నమోఘవీర్యుఁడౌ నీశు రేత, మట్లు మార్గమునంబడెనవ్వియెల్ల
రౌప్యహేమంబులకును క్షేత్రంబులయ్యె, వసుమతీనాథ! భూరికృపాసనాథ! 341

గీ. నదులయందును బెంపగునదములందుఁ
బర్వతములందును వనోపవనములందు
ఋషులుగల స్థలములయందు వృషభవాహుఁ
డు హరుఁ డప్పుడు పేర్మి సన్నిహితుఁడయ్యె. 342

క. ఘనమగు శ్రీవైష్ణవమా, యను మృత్యుంజయుఁడు స్కన్నమగు నిజరేతం
బునను జడీకృతుఁడన్నన్, గనుఁగొని వినివృత్తుఁడయ్యెఁ గలుషపథమునన్. 343

మ. జగదాత్ముండును దేవదేవుఁ డమలజ్ఞానాత్ముఁడున్ బుణ్యుఁడున్
భగవంతుండు విభుండునైన హరి దివ్యంబైన మాహాత్మ్యమున్
దగురీతిన్ స్వమహత్త్వముం దెలిసికొంటం జేసి యా సర్వభూ
తగణాధీశ్వరుఁ డంత స్వాంతమున వింతంజెందఁ డావంతయున్. 344

చ. అవికృతుఁ డత్రిపుండును సమాహితచిత్తుఁడునై చెలంగు నా
భవుఁ గని దేవదేవుఁడు నభంగుర నిష్కలుష ప్రభావుఁడున్
భువననుతుండునైన హరి పూని స్వపూరుషమూర్తిఁ దాల్చి దీ
ప్తివికసితాననుండయి గభీరతరోక్తులఁ బల్కె నీక్రియన్. 345

క. నాయువతీరూపంబగు, మాయ న్మోహితుఁడవై యుమారమణా! నీ
వీయెడల నాత్మనిష్ఠ న,జేయుఁడవై నిల్చితివి వశీకృతచిత్తా! 346

క. అకృతాత్ములైన పూరుషు,లకు దుస్తరభావవికృతులం గూర్చెడు మా
మకమాయావాగుర జి,క్కక యెవ్వఁడు నీవు దక్క గడవ న్గల్గున్. 347

గీ. కాలరూపుని నన్ను భాగములతోడఁ
గూడివర్తించునట్టి యాగుణమయమగు
మాయ నిన్నును బరిభవింపంగలేదు
మహితసద్గుణపూత! యుమాసమేత! 348

శ్రీశుకుఁడు:—

క. శ్రీవత్సలాంఛనునిచే, నీవడువున సత్కృతుఁడయి వృషభధ్వజుఁ డా
దేవుని వీడ్కొని స్వీయగణావృతుఁడయి చనియె వెస నిజాలయమునకున్. 349

క. తనచే ననుభూతంబగు, ఘనమగు హరిమాయఁ దెలిపె గౌతుకమెసఁగన్
మునిముఖ్యులెల్లరుం దమి, వినఁ గాత్యాయనికి మానవేశ్వర! వింటే? 350

రుద్రుఁడు:—

ఉ. మోహవశంబునం బరమపూరుషుఁడుం బరదైవతంబు నా
నా హరిమాయచేత నణిమాదికళాపతినైన నేనె దూ
రాహృతమానసుండనయి యట్లు గలంగితి నన్న నింక నో
హోహహా! యెరుల్ భరించుటకు నోస్తురొకో పరతంత్రులౌ జనుల్. 351

గీ. శైలనందన! వేయేండ్లు చన్న పిదప, యోగముననుండి యప్పుడ యుపరతుండ
నైన నను డాసి యడిగి తెవ్వానిఁ గాల, వేదగమ్యుఁడుగాని యవ్విభుఁడితండె.

శ్రీశుకుఁడు:—

గీ. జలధిమథనంబునం గులాచలము పృష్ఠ, భాగమునఁ దాల్చె నెవ్వాఁడు ప్రథితవిక్ర
మక్రముండగు నా హరి మహిమ మిపుడు, నీకుఁ దెల్పితి నో ధరణీకళత్ర! 353

ఉ. ఈ కథ నెవ్వఁడేనిఁ బఠియించిన విన్న నొకప్డు వాని య
స్తోకతరప్రయత్నములు దొడ్డడివో వవనీంద్ర! యుత్తమ
శ్లోకగుణానువర్ణనము శోభనమై కలయంతకాలమున్
భీకరమైనసంసృతి జనించెడుదుఃఖము నిస్తరించెడున్. 354

చ. జనవర! సాగరోన్మథనసంజనితామృతముం బ్రియన్నలౌ
ననిమిషకోటిచేత ముదమారఁగఁ ద్రావఁగఁ జేసి క్రూరులం
దనుజుల మోహపెట్టి కుహనాంగనరూపముఁ గొన్న మేటి స
జ్జన గణగోప్తయుం గుజనశాస్తయునైన హరి న్స్మరించెదన్. 355

---

## అధ్యాయము 13.

### వైవస్వతాదిమను వృత్తాంతము

శ్రీశుకుఁడు:—

గీ. శ్రాద్ధదేవుండు మనువయ్యె నస్తముండు
వర్తమానుం డతఁడు వివస్వంతుసుతుఁడు

వాని పుత్రులు పదుగురు వారి నామ
ధేయములు దెల్పెదను విను ధీవరేణ్య! 356

వ. ఇక్ష్వాకుండు, నభగుండును, ధృష్టుండును, శర్యాతియు, నరిష్యంతుఁడు, నాభాగుండును, దిష్టుండును, గరూశకుండును, బృషధ్రుండును, వసుమంతుండు నని వారి నామంబులు ప్రసిద్ధంబయ్యె. ఆదిత్యులు, వసువులు, విశ్వేదేవతలు, మరుద్గణంబులు, అశ్వినీదేవతలు మున్నగువారమరులు, పురందరుం డింద్రుండు, కశ్యపాత్రివసిష్ఠ విశ్వామిత్ర, గౌతమ, జమదగ్ని భరద్వాజులనువారు ఋషులై పరఁగిరి. అందుఁ గశ్యపునివలననదితియందు భగవజ్జన్మంబుగలిగె. భగవంతుండగు విష్ణుండు వామనరూపధరుఁడై యాదిత్యుల కవరజుండయ్యె. ఇట్లు సప్తమమన్వంతరంబునకు సంక్షేపంబుగా నాచేఁ జెప్పంబడియె. విష్ణుశక్తి బృంహితంబులగు భవిష్యన్మన్వంతరములుగూడ చెప్పెద వినుము. వివస్వంతునకు విశ్వకర్మ దుహితలైన సంజ్ఞాఛాయలనువార లిరువురు భార్యలు. వారు పూర్వము నీకుఁజెప్పంబడిరి. బడబయను మూఁడవభార్యకూడ కలదనికొందఱు చెప్పుదురు. వారలలో సంజ్ఞకు యముఁడు, శ్రాద్ధదేవుఁడు నని యిరువురుకుమారులును యమున యనునొక కుమార్తెయుఁ గలిగిరి. ఇఁక ఛాయ యపత్యంబును వినుము. ఆ ఛాయకు సావర్ణియు, సంవరణునిభార్యయగు తపతియనుకన్యయు, శనైశ్చరుఁడును నుద్భవించిరి. బడబకు నశ్వినీదేవతలు జన్మించిరి. రాబోవు నష్టమమన్వంతరంబున సావర్ణిమనువు కాఁగలఁడు. సావర్ణిమనువునకు నిర్మోహవిరజస్కాదులగు నృపాలురు తనయులగుదురు. అందు సుతపస్కులు, విరజులు, నమృతప్రభులు నగువారు దేవతలు, వారికి విరోచన సుతుండగు బలి యింద్రుండు కాఁగలఁడు. అతండు పదత్రయంబును యాచించు విష్ణువునకు నీ భూమినొసంగి సమిద్ధంబగు నింద్రపదవిననుభవించి యనంతరంబు సిద్ధింబొందఁగలండు. ఆ బలిసార్వభౌముఁడు సుతలలోకంబున భగవంతునిచే బద్ధుండై పదంపడి సంప్రీతుండగు నతనిచే స్వర్గంబునకన్న మిన్నయగు నాలోకంబున నివేశితుండై యింద్రుండుంబోలె నిప్పుడు విరాజిల్లుచుండె. గాలవుండును, దీప్తిమంతుండును, పరశురాముఁడును, ద్రోణపుత్రుండగు నశ్వత్థామయుఁ, గృపుఁడును, ఋష్యశృంగుండును, నాకు దండ్రియు భగవంతుండునగు వ్యాసుండు నా మన్వంతరంబున సప్తర్షులు కాఁగలరు. ఇప్పుడు స్వయోగంబునవారు తమతమ యాశ్రమంబులనుండిరి. వేదగుహియగు సరస్వతియందు సార్వభౌముఁడని ప్రసిద్ధుండై పరమేశ్వరుండగు హరియింద్రునుండి స్థానంబు హరించి బలికి నొసంగఁగలఁడు. వరుణసంభవుండైన దక్షసావర్ణి నవమ మనువు కాఁగలఁడు. ధృతకేతు, దీప్తకేతుప్రభృతులగు నృపాలురు తత్పుత్రకులై పరఁగు

దురు. పరుఁడు మరీచి గర్గుఁడు మున్నగువారు దేవతలు. అద్భుతుండనువాఁ డింద్రుండు, ద్యుతిమత్ప్రముఖు లందు ఋషులు కాఁగలరు. ఆయుష్మంతునకు నంబుధారయందు భగవంతుం డవతరించు. ఆ భగవంతునిచే గుప్తంబగు త్రిలోకంబును నద్భుతుం డనుభవింపఁగలండు. ఉపశ్లోకసుతుండగు బ్రహ్మసావర్ణి దశమ మనువు కాఁగలఁడు. భూరిషేణాదులగు తత్పుత్రకులు నృపతులు. హవిష్మత్తు, సుకృతి, సత్యుఁడు, జటామూర్తి, ఋషులు. శంభుండనువాఁ డింద్రుండు, విరుద్ధాదులు దేవతలు, విశ్వసృజునకు విషూచియందు బొడమిన విష్వక్సేనుఁడు శంభునకు శక్తి నొసంగఁగలఁడు. ధర్మసావర్ణి యేకాదశమనువు కాఁగలఁడు. సత్యధర్మాదులు పదుం డ్రతనిపుత్రులు భూపతులు. విహంగములు, కామగములు, నిర్వాణులు, రుచులు ననువారు దేవతలు. వైధృతుఁ డింద్రుండు, అరుణాదులు ఋషులు. అందు సూర్యునకు ధర్మసేతువను సుతుండై హరి వైధృతునకుఁ ద్రిలోకధారణశక్తి నొసంగఁగలఁడు. భద్రసావర్ణి ద్వాదశమనువు కాఁగలఁడు, దేవవంతుఁడు, ఉపదేవుఁడు, దేవశ్రేష్ఠుఁడు మున్నగు తత్సుతులు నృపతులు, ఋతుధాముం డింద్రుండు, హరితాదులు దేవతలు, తపోమూర్తి, తపుండు, ఆగ్నీధ్రకుండు మున్నగువారు ఋషులు. సత్యతపసూనృతులకు సంభవించు స్వధామాఖ్యంబగు విష్ణ్వంశం బామనుప్రయోజనంబు సాధించు. దేవసావర్ణి త్రయోదశమనువు కాఁగలఁడు. చిత్రసేనవిచిత్రాదు లతనిపుత్రులు నృపతులు కాఁగలరు. సుకర్మ, సుత్రామసంజ్ఞాకులు దేవతలు. దివస్పతి యింద్రుండు. నిర్మోహ, తత్త్వదర్శాదులు ఋషులు. దేవహోత్రునకు బృహతియందు సంభవించిన విష్ణ్వంశుండగు యోగేశ్వరుండు దివస్పతికి సంపాదకుండు కాఁగలఁడు. ఇంద్రసావర్ణి చతుర్దశ మనువగు. ఉరుగంభీరవస్వాదు లతనిసుతులు భూపతులు. పవిత్రులు, చాక్షుషులు అనువారు దేవతలు. శుచియనువాఁడింద్రుఁడు. అగ్నియు, బాహువు, శుచి, శుక్రుఁడు, మాగధుఁడు మొదలుగాఁగలవారు ఋషులు. సత్రాయణునకు వితానయందు కుమారుఁడైన బృహద్భానుండను హరి కర్మసంతానంబుల విస్తరింపఁ జేయు. రాజేంద్రా! యీ త్రికాలానుగతంబులైన చతుర్దశమన్వంతరంబులు నీకుం దెలుపంబడె. నీ మన్వంతరంబులచే యుగసాహస్రపరివర్తంబగు కల్పంబు సమ్మతంబయ్యె. 357

---

## అధ్యాయము 14.

### జగత్పరిపాలనక్రమము

విష్ణురాతుఁడు:—

గీ. వరమునీశ్వర! సకలమన్వంతరముల, నీ మనుప్రభృతుల నెవ్వరే క్రియలను
జేయ నియమించుచుందురు చెప్పుమయ్య, యయ్యుదంతము వినవేడ్క యయ్యె నాకు.

బ్రహ్మరాతుఁడు:—

క. మనువులు మనుపుత్త్రకులును, మునులును శక్రాదిసుర సమూహంబులు నో
జనవర! పరమపురుషు శా, సనమున వర్తించుచుందురు సర్వవిధములన్. 359

గీ. క్షితివరా! మున్ను నాచేతఁ జెప్పఁబడిన, యట్టి యజ్ఞప్రభృతిపూరుషావతార
ములను జోదితులై మునిముఖ్యులెల్ల, నయగతి లోకయాత్ర నడుపుచుండ్రు.

గీ. ఘనచతుర్యుగాంతమ్మున గాలకబళి, తంబులగు శ్రుతిగణముల దపముచేతఁ
బడయుదురు ఋషుల్ క్రమ్మఱ వానివలనఁ, దనరుఁగాదె సనాతనధర్మ మధిప!

క. ఆదృతి మీఱఁగ శ్రీహరి, నోదితులై ధర్మమును మనువు లెల్లఁ జతు
ష్పాదముల నడుపుచుందురు, గాదే? నృపవర్య! స్వస్వకాలములందున్. 362

క. విను మన్వంతరములు కడ, చనుదనుక విభక్తులయి ప్రజాపాలురు భూ
మిని బాలింతురు సురలు స, వనభాగంబులు భుజింత్రు పార్థివముఖ్యా! 363

క. భగవద్దత్తంబైన త్రి, జగదూర్జితలక్ష్మిఁ బొంది శక్రుఁడు తగ ము
జ్జగముల నేలుచు నుండును, మిగులం గామములఁ గురియు మేదిని మీఁదన్. 364

గీ. ఒసఁగు జ్ఞానోపదేశంబు యుగయుగమున
హరి సమిద్ధసిద్ధేశదేహంబుఁ దాల్చి
మఱియు ఋషిరూపమునను గర్మంబుఁ దెల్పుఁ
దెల్పు యోగంబు యోగేశదేహమునను. 365

క. వినుము ప్రజాపతి రూపం, బున సృష్టి యొనర్చు రాజమూర్తియగుచు ద
స్యునిధనముం జేయును నే, ర్పున నభవము నిచ్చుఁ గాలరూపుం డగుచున్. 366

గీ. నామరూపాత్మకంబు ననంతమునగు, ప్రబలమాయావిమోహితస్వాంతులైన
జనులచే బహురూపశాస్త్రములచే ను, తింపఁబడుచుండియున్ హరి దెలియఁబడఁడు.

---

# అ ధ్యా య ము 15.

## బలియుద్ధయాత్ర—వామనావతారకథా ప్రారంభము

విష్ణురాతుఁడు:—

క. మూఁడడుగుల నేలను హరి, వేఁడెన్ బలి నేల? గృపణువిధి విభుఁడయ్యున్
బోఁడిసెడి యే లతని మో, మోడక యర్థంబువడసి యు న్బంధించెన్. 368

చ. ఇది తెలియంగ మాకు నుదయించె ఘనంబగు కౌతుకంబు మా
హృదయములందు సంయమివరేణ్య! మహాత్మ! యెఱుంగఁ జెప్పు మా
ముదమున యజ్ఞనాయకుఁడు పూర్ణుఁడు నా హరిదేవు విస్మయ
పదమహిమోన్నతి న్నిరపరాధుని బంధనము న్గ్రమంబునన్. 369

శ్రీశుకుఁడు:—

చ. బలరిపుచేఁ బరాజితుఁడు ప్రాణవియుక్తుఁడునై నయట్టి యా
బలివిభుఁ డప్పు డార్యభృగువర్యులకుం బ్రియశిష్యుఁ డౌచుఁ గే
వలమగు భక్తి పెంపున నువారలకుం దగు పూజఁ జేసె న
త్యలఘుతరాశయుండగుచు నర్థసమర్పణబుద్ధితోడుతన్. 370

ఉ. ఆతని భక్తి పెంపునకు నర్థనివేదనబుద్ధికి న్మదిం
బ్రీతినిఁ జెంది బ్రాహ్మణవరేణ్యులు శ్రీభృగువుల్ జగత్త్రియీ
జేతృతఁ గోరుచున్న బలిచే ఘనవిశ్వజిదధ్వరంబు వి
ఖ్యాతిగఁ సల్పఁజేసి రధిపా! యభిషేకవిధు ల్సలంగఁగన్. 371

గీ. పడఁపడి హిరణ్మయోజ్జ్వలపట్టబద్ధ, మైన రథమును హర్యశ్వహయసమాన
వర్ణతురగంబులును సింహభాసమాన, కేతువును నవనాగ్ని నుద్భూతమయ్యె.

మ. స్మయదూరా! విను పస్డు హేమలతికాసంబద్ధమౌ చాప మ
క్షయతూణీరయుగంబు భవ్యమగు భాస్వద్వర్మముం బుత్రమో
హయుతుండై యొసఁగెం బితామహుఁడు బ్రహ్లాదుండు శుక్రుండు వి
స్మయమౌ వాడనిపూలదండను మహాశంఖంబు నిచ్చెం గృపన్. 373

మ. అవనీనాయక! యిట్టులా బలియు నాశ్యా న్విప్రసంపాదితా
హవసామగ్రిని బొంది స్వస్త్యయనముల్ హర్షించి యా బ్రాహ్మణ
ప్రవరుల్ సెప్పఁగ సప్రదక్షిణనమోవాకంబు లర్పించి తా
తవు ప్రహ్లాదుని కర్మిలి న్సలిపె సాష్టాంగప్రణామంబులన్. 374

ఉ. అంత మహారథుండు బలియా భృగువర్య సమర్పితంబు న
త్యంత మనోహరంబునగు స్యందనరాజము నెక్కి పేర్చి య

క్లాంత లతాంతమాల దనకంఠమున ధరియించి యెంతయున్
వింతగు బాణతూణములు విల్లును దాల్చి కడు న్విరాజిలెన్. 375

గీ. స్వర్ణకేయూరవిలసితబాహుయుగుఁడు, మకరకుండలయుగళ సన్మండితుఁడయి
కుండనంజ్వలితాగ్ని హోత్రుండువోలెఁ, దేరుపై నెక్కె యా బలి తేజరిల్లె. 376

చ. ధృతిమెయి నంతరిక్షమును దృక్కులఁ గ్రోలెడులీల నత్యహం
కృతిమెయి దిక్కుల న్నమలి క్రమ్రింగెడుభంగిఁ జెలంగుచున్న యా
త్మతులితవైభవాఢ్యులగు దైత్యవతంసులతోడఁ గూడి యా
దితిసుతసత్తముండు బల తేజముల న్వెలుగొందె నెంతయున్. 377

క. ఘనమగు రాక్షససేనలఁ, గొనుచు న్రోదోంతరాళ కుహరంబును బె
ల్చన వణఁకించుచుఁ జెల్వొం, దిన సురనగరంబునకుఁ జనె న్రభసగతిన్. 378

వ. ఇట్లుచని కూజద్విహంగమిథునంబులును, విరుతమత్తమధువ్రతంబులును, ప్రవాళ ఫలపుష్పభారానతశాఖామర ద్రుమంబులును, శ్రీమంతంబులు నగు నందనాద్యుపవనోద్యానంబులచే రమ్యంబును, హంస సారస చక్రాహ్వయ కారండవ కులాకులంబులై సురసేవితప్రమదాజనవిహారభాసురంబులగు సరోవరంబులచే మనోహరంబును, బరిఘభూతంబగు నాకాశగంగాస్రవంతిచే నావృతంబును, అగ్నివర్ణంబు సట్టాలకసహితంబు సమున్నతంబునగు ప్రాకారంబుచేఁ బరివృతంబును, హిరణ్మయపట్టకవాటంబులగు ద్వారంబులచేతను స్ఫటికమయంబులగు గోపురంబులచేతను బరివేష్టితంబును, విశ్వకర్మవినిర్మితంబైన సభాచత్వర రథ్యాఢ్యము, న్యర్బుదవిమాన సమన్వితము, మణిమయ శృంగాటక వజ్రవిద్రుమవేది సంకలితము, విభక్తపథంబునగు సభాస్థానంబును బొందినదియు, నిత్యవయోరూపాభిరామలు, శ్యామలు, విరజవస్త్రలు, రూపవతులు నగు సుదతులచే నర్చులచే నగ్నియుంబోలె విభ్రాజమానంబైనదియు, నమరాంగనాకేశవిభ్రష్టసౌగంధిక స్రగామోదభరిత మారుతసురభిత వివిధమార్గంబును, జాంబూనదజాలవినిర్యద గరుగంధిపాండరధూపపరిచ్ఛన్న పథంబును, ముక్తావితానమణిహేమకేతు నానాపతాకవలభి పరివృతంబును, శిఖండి పారావత భృంగనాదితంబును, వైమానికస్త్రీ కలగానమంజులంబును, మృదంగ శంఖానకదుందుభిస్వనంబులచేతను, దాళయుక్త వీణామురజ వేణు నాదంబులచేతను, వాద్యసంయుక్త నృత్యంబులచేతను, ఉపదేవగీతంబులచేతను, హృదయంగమంబును స్వప్రభావినిర్జిత సమస్తప్రభంబును, అధర్మిష్ఠ, ధర్మవిద్రోహ, శఠ, దురభిమాని, కాముక, లుబ్ధాగమ్యంబును నగు నా దేవనగరంబును జమూసమేతుండై బహిర్భాగమునందంతటను

నా బలిసార్వభౌముఁడు నిరోధించి మహాస్వనంబును నాచార్యదత్తంబునగు శంఖంబును నింద్రకాంతలకు భయోత్పాదకంబగునట్లు పూరించె. 379

క. శతమన్యుం డంతట నా, దితిజేంద్రు మహోద్యమంబుఁ దెలిసి సురగణా
న్వితుఁడయి నిజగురు వాచ,స్పతినిం గని పలికె నిట్లు సవినయ భణితిన్. 380

గీ. పూర్వరిపుఁడైన బలిదైత్యసార్వభౌముఁ, డిపుడు గ్రమ్మఱఁ గావించు విపులమైన
యద్భుతోద్యమ మిది దవార్యమంచుఁ దలఁతు, నిట్టి తేజము బలికిప్పు డెట్లు గలిగె?

చ. ఎవఁడును దీని మానవ నధీశుఁడు కాఁడని తోఁచుచుండెఁ దీ
వ్రవిలయకాలవహ్నివలెఁ బైకొని లోకములం దహించు రీ
తి వెలుఁగుచున్ గడంగి పదిదిక్కుల మ్రింగుగతిం జెలంగె శా
త్రవుఁ డిటు లోజముం బలము దర్పముఁ బొందుట కేమి హేతువో! 382

వాచస్పతి:—

క. శతమఖ! విను శాత్రవు ను, న్నతి కే నెఱుఁగుదును గారణము భృగువులచే
నతని కమిత తేజము సం,భృతమయ్యెన్ శిష్యుఁడగుట నిది నిక్కువమా. 383

క. ఒక్కవిభుండగు శ్రీహరి, దక్కఁగ మఱి నీవుగాని త్వాదృశుఁడగు వే
ఱొక్కఁడుగాని యెదుటఁ దా, నొక్కగడియయేని నిల్వనోపఁ డతనికిన్. 384

క. కావున మీ రెల్లరు నిఁక, స్వావాసంబగు త్రివిష్టపంబు విడిచి పోం
డా వైరివిపర్యయకా, లావధి నిన్వేచియుండుఁ డమరాధీశా! 385

క. విప్రబలోదర్కుండై, దీప్రప్రతిభం జెలంగె దితిజవిభుఁడు ద
ద్విప్రావమతికరుఁడు దా, స్వప్రభ సెడఁ జెడును సపరివారుండగుచున్. 386

గీ. అధిప! యీరీతి కార్యజ్ఞుఁడైన గురుఁడు, కార్యనిశ్చయ మొనరింపఁగా సురులు
సరభసంబగు గతిఁ ద్రివిష్టపము విడిచి, యెల్లఱును గామరూపులై యెటకొ చనిరి.

క. సుర లిట్టు లణఁగియుండన్, విరోచనసుతుండు బలి త్రివిష్టపమును జే
చ్చెర నాక్రమించి త్రిజగము, లురవడిఁ దన వశముగాఁగ నొప్పె నరేంద్రా!

చ. భృగువులు శిష్యవత్సలులు విశ్వజయంబును బొంది సత్ప్రథన్
మిగిలెను నాత్మశిష్యు హయమేధశతంబొనరింపఁ జేసి సొ
ప్పుగ బలిసార్వభౌముఁడును బూర్ణశశాంకుఁడువోలె దిక్కులం
దగణిత కీర్తిచంద్రికలు వ్యాప్తముఁ జేసెఁ దనుజ్జ్వలప్రభన్. 389

క. కృతకృత్యునిఁగాఁ దన్ను, న్దితిజవరుఁడు దలఁచికొనుచు ద్విజవర్యప్రా
పితమగు సమృద్ధలక్ష్మిం, గుతుకంబున ననుభవించెఁ గురుకులముఖ్యా! 390

# అధ్యాయము 16.

## —అదితిప్రార్థనము—

శ్రీశుకుఁడు:—

వ. అంత. 391

క. స్వతనయులీ చాడ్పునఁ బెను, వెతలంబడి చెడుటయుం ద్రివిష్టప మసురా
వృతమగుటయుఁ గని యదితి ప,రితపించె ననాథక్రియ ధరిత్రీనాథా! 392

గీ. కశ్యపబ్రహ్మ దాఁ జిరకాలమునకు, నురుసమాధివిరతుఁడయి యొక్కనాఁడు
వ్యపగతోత్సవము నిరాహ్లాదమునగు, నదితియాశ్రమభూమికి నరుగుదెంచె. 393

గీ. అదితిదేవీసమర్చితుండగుచుఁ దత్కృ, తాసనంబున నుపవిష్టుండై నరేంద్ర!
దీనముఖియైన భార్యను దేఱిచూచి, న్యాయసమ్మతమగు వచనంబుఁ బలికె. 394

క. ఓ కల్యాణీ! భద్రం,బే కద గోబ్రాహ్మణులకు నిప్డు జగమునన్
బ్రకటధర్మమునకును భ,యాకరమృత్యువశవర్తి యా జనమునకున్. 395

క. ఏ గృహములఁ గనుచుందు ర,యోగులు ధర్మార్థకామ యోగవిధానం
బా గృహములందు నకుశల,మో గృహమేధిని! యొకింతయును లేదుకదా. 396

మ. చెలియా! స్వీయకుటుంబసక్తవగు నీ చేఁ బూజితుల్గాక ని
ష్ఫలులై పోవుచునుందురోక్కా! యతిథుల్ భావించి వీక్షింపఁగన్
సలిలాభ్యర్చితులైనఁగా కతిథులే సద్మంబులందుండి వి
హ్వాలతం బోదురొ యాగృహంబులు సృగాలావాసతుల్యంబులౌ. 397

గీ. తోయజాక్షిరో! నే బ్రోషితుండనగుడు, మద్వియోగాసహిష్ణుత మదిఁ గలంగ
వేళయందు నీచేత హవిస్సులందగ, నగ్నులు యథావిధి హుతంబులగుట లేదె?

గీ. నిఖిలదేవాత్మకుండయి నెగడు విష్ణు, వునకు బ్రాహ్మణుఁడగ్నియు ముఖముఁగాదె!
కాన వారిని బూజింపఁగా గృహస్థు, కామదుఘములౌ లోకముల్ గాంచుచుండు.

గీ. మానినీమణి! నీదు కుమారులెల్ల, లోక బెడద లేక కుశలులై యున్నవారె?
నిన్ను నస్వస్థచిత్తఁగా నెన్నుచుంటి, వెలఁది విపరీతలక్షణములను బట్టి. 400

అదితి:—

గీ. బ్రాహ్మణులకు గోవులకు ధర్మంబునకును, జనమునకుఁ గుశలమ్మె సూమునివతంస!
ప్రకటధర్మార్థకామంబులకును క్షేత్ర, మగుచు గేహంబులెల్లఁ జెలఁగు గృహపతి!

గీ. అగ్నులతిథులు భృత్యులు నర్థులైన, భిక్షువులు నెల్లరుం దగు విధముఁ గాఁగ
నిన్ను ధ్యానించుకొనుటనో నిర్మలాత్మ, వరమునీంద్ర! యారాధింపఁబడుచునుండ్రి.

గీ. అనఘమతిఁ బ్రజాధ్యక్షుండ వైన నీవు, ధర్మముల నిట్లు నాకు బోధపఱుపంగ
మునివతంసమ! నామనంబునఁ గలిగిన, కామ మేది సంపన్నముగాక యుండు? 403

చ. సదమలదివ్యరూప! మునిసత్తమ! సత్త్వరజస్తమోగుణా
స్పదులగునట్టి యీ ప్రజలు త్వచ్ఛుభమానసదేహజాతులే
కద? యఖిలాసురప్రభృతి కప్రజలందు సముండవయ్యు నీ
పదభజనంబులన్నలుపు వారియెడ న్దయయుంతు వెంతయున్. 404

ఉ. కావునఁ జిత్తమందు నధికంబగు భక్తి భజించు మా కిటన్
నీవు శుభంబుఁ గూర్పు మవి నింద్యచరిత్ర! మహానుభావ! యో
దేవ! సపత్నకోటు లతి దృప్తత శ్రీపదవుల్ హరింపఁగా
లావఱియున్న నా కొడుకుల న్గరుణించి యనుగ్రహింపవే! 405

గీ. పరజనంబులచేత నుద్వాసితనయి, వ్యసనసాగరనిర్మగ్న నైతి నేను
ప్రబల వైరులచే మదైశ్వర్యము మఱి, శ్రీయు యశము స్థానము నప
హృతము లయ్యె. 406

శ్రీశుకుఁడు:—

క. అని యీరీతి నదితిచే, ననఘుండగు కశ్యపుఁడు సమభ్యర్థితుఁడై
జననాథోత్తమ! తగ ని ట్లనె మృదుమధురోక్తు లొలయ నల్లన నగుచున్. 407

కశ్యపుఁడు:—

శా. ఆహా! యద్భుతమానుగాదె? హరి మాయాశక్తి యత్యంతమున్
స్నేహవ్యాపృతమైన దీ భువన మిస్సీ! భౌతికంబైన యీ
దేహం బేడ? పరాత్మ యేడ? పతిపత్నీపుత్రమిత్రాదిక
వ్యూహం బెవ్వరి కెవ్వ రెన్న నిట మోహోద్రేకమే హేతువౌ. 408

గీ. సర్వభూతగుహావాసు జగదధీశు, వాసుదేవుని భగవంతుఁ బరమపురుషు
నా జనార్దను నత్యంతమైనభక్తిఁ, బూజఁ జేయంగవలయు నో పూవుఁబోఁడి. 409

క. దీనదయాళుండగు లక్ష్మీనాథుఁడు హరి యొసఁగుఁ జుమీ నీ కోర్కుల్
శ్రీనాథార్చ యమోఘంబౌ నన్యంబట్లు కాదటంచుఁ దలంతున్. 410

అదితి:—

క. నందనసహితముగా గడు, వందురు నాయెడలఁ బ్రీతిఁ బరఁగునటుల గో
విందుని పూజావిధి నా, కుం దగ నుపదేశమిమ్ము గుణరత్ననిధీ! 411

కశ్యపుఁడు:—

క. మగువ! ప్రజాకాముఁడనయి, భగవంతుండైన పద్మభవు మును ప్రశ్నిం
పగ నాకుఁ దెల్పెనది యీ, భగవత్ప్రీతికరమైన వ్రత మెఱిఁగింతున్. 412

గీ. ఫాల్గుణంబునఁ దగ శుక్లపక్షమందుఁ
బరమభక్తిసమేతుఁడై సరసిజాక్షి!
శ్రీమదరవిందనయను నర్చింపవలయు
ద్వాదశాహంబులుం బయోవ్రతముచేత. 413

క. వనకిటి విదీర్ణమృత్తిక, యొనఁగూడినమేన నలఁదియు నదీస్రోతం
బునఁ దానమాడి కర మర్థిని నీ మంత్రంబు నుదహరింపఁగవలయున్. 414

క. మేదిని! స్థానముఁగోరెదు, నాదివరాహమ్ముచే రసాభ్యుద్ధృతవై
తో దేవి! నీకు మ్రొక్కులు, నా దురితసముచ్చయం బణంపుము వేగన్. 415

వ. అని భూదేవిఁ బ్రార్థించి మఱియు నిర్వర్తితనిత్యనైమిత్తికకర్ముఁడై సూర్య జల
వహ్ని గురువులందు దేవభావముంచి యర్చింపవలయు. 416

గీ. సర్వభూతాశ్రియుండవు శాశ్వతుఁడవు, పరమపురుషుండవును భగవంతుఁడవు వి
భుఁడవు, సాక్షివి, వాసుదేవుండవునగు, నీకుఁ గావింతు నే నమోవాకములను.

వ. అవ్యక్తుండవును సూక్ష్ముఁడవును బ్రధానపురుషుండవును జతుర్వింశగుణజ్ఞుండవును
గుణసంఖ్యానహేతుండవునగు నీకుఁ బ్రణామంబు. ద్విశీర్షుండవు, త్రిపదుండవు,
చతుశ్శృంగుండవు, తంతురూపుఁడవు, సప్తహస్తుండవు, యజ్ఞమయుండవు, త్రయీ
విద్యాత్మకుండవునగు నీకు నమస్కారంబు. శివుండవు, రుద్రుండవు, శక్తిధరుం
డవు, విద్యాధిపతివి, భూతపతివినగు నీకు వందనంబు. హిరణ్యగర్భుండవు, ప్రాణ
రూపుఁడవు, జగదాత్మకుండవు, యోగైశ్వర్యశరీరుండవు, యోగహేతు
భూతుఁడవునగు నీకుజొహారు. ఆదిదేవుండవు, దేవదేవుండవు, నారాయణుండవు,
నరుండవునగు నీకుఁ బ్రణతులు. మరకతశ్యామలదేహుండవు, పీతాంబరుండవు,
శ్రీమంతుండవు, కేశవుండవునగు నీకు నా మ్రొక్కులు. దేవా! నీవు పురుషులకు
సర్వవరదాయకుండవు కావున పండితోత్తము లాత్మశ్రేయంబునకై భగవత్పా
దారవిందరేణువు నుపాసించుచుందురు. మఱియు వేల్పు లెవ్వాని ననుసరించు
చుందురు, శ్రీయును నెవని పాదపద్మంబుల పరిమళంబుఁగోరుచుండు నట్టి భగ
వంతుండవునగు నీవు నాకుఁబ్రసన్నుఁడ వగుము. అను మంత్రంబులచే నావాహన
పురస్సరంబుగా శ్రద్ధాయుక్తుండై పాద్యోపస్పర్శనాదుల హృషీకేశు నర్చింప
వలయు. గంధమాల్యంబులచే నర్చించి యవ్విభుని క్షీరంబులచే స్నానమాడింప
వలయు. పదంపడి వస్త్రోపవీతాభరణపాద్యోపస్పర్శనంబులను, గంధపుష్పాదు
లను ద్వాదశాక్షరవిద్యచే నా పరమపురుషు నభ్యర్చింపవలయు. యథావిభ
వంబుగ సఘృతంబును, సగుడంబును, క్షీరసిక్తంబునునగు శాల్యన్నంబును నైవే

ద్యంబొసంగి మూలవిద్యచే హోమంబుఁ గావింపవలయు. హృషీకేశనివేదితం బగు నీపదార్థంబును భక్తునకొసంగవలయు లేదేని తాను స్వయముగ భుజింప వలయు. ఆచమనం బొసంగి యర్చించి తాంబూలంబును సమర్పింపవలయు. అష్టోత్తర శతస్తోత్రంబులచే నవ్విభుని జపింపవలయు. అనంతరంబు ప్రదక్షిణంబుఁజేసి భూమియందు సాష్టాంగదండ ప్రణామంబులు గావింపవలయు. తచ్ఛేషంబును శిరస్సునం దిడుకొని యద్దేవు నుద్వాసం బొనర్పవలయు. పిదప నిరువురకంటెఁ దక్కువకాని బ్రాహ్మణులకు యథోచితంబుగఁ బాయసాన్నంబుచే భోజనంబు పెట్టవలయు. ఆ బ్రాహ్మణులచే ననుజ్ఞాతుండై శేషపదార్థంబును నాప్తసహితుండై భుజింపవలయు. ఆ రాత్రి బ్రహ్మచారిణియై ప్రభాతంబుకాఁగ ప్రథమదినంబున స్నానంబుఁజేసి శుచియై యథావిధి సమాహితుండై పయస్స్నానంబు గావించి వ్రతసమాప్తి పర్యంతంబు నర్చింపవలయు. విష్ణ్వర్చనాదర సంభృతుండై యీ పయోభక్షవ్రతంబు నడుపవలయు. యథాపూర్వకంబుగా నగ్నిని వేల్వవలయు, విప్రులను భుజింపంజేయవలయు. ఇట్లుప్రత్యహంబును ద్వాదశాహంబులు పయోవ్రతంబుఁ గావింపవలయు, విష్ణుసమారాధనంబును, హోమంబును, బూజయును ద్విజతర్పణంబును, బ్రతిపద్దినంబు మొదలుకొని శుక్లత్రయోదశి పర్యంతంబుఁ జేయవలయు. అనంతరంబు బ్రహ్మచర్యంబును స్వప్నంబును, స్నానంబును, త్రిషవణంబు నొనర్పవలయు. అసద్గోష్ఠియును ఉచ్చావచంబులగు భోగంబులును విసర్జింపవలయు. వాసుదేవపరాయణుండై సర్వభూతంబులను హింసింపక త్రయోదశియందుఁ బంచగవ్యంబులచే విభుండగు విష్ణుదేవుని స్నానమాడింపవలయు. శాస్త్రదృష్టంబగు విధానంబున విత్తశాఠ్యంబు గానరానీయక విధిజ్ఞులైన విప్రులచే మహాపూజఁగావింపవలయు. జగత్స్వరూపుఁడగు విష్ణువునకుఁ బయస్సినందు చరువును నిహుపించి సమాహితబుద్ధియై సూక్తంబుచే నప్పరమపురుషుని యజింపవలయు. అధికగుణంబుగల పురుషోత్తమతుష్టిప్రదంబగు నైవేద్యంబు నొసంగవలయు. జ్ఞానసంపన్నుండగు నాచార్యుని, ఋత్విజులను, వస్త్రాభరణ ధేనుగణంబులచే సంతోషపఱచవలయు, త దారాధనంబు విష్ణుసమారాధనంబని యెఱుంగందగు. గుణవంతంబగు మృష్టాన్నంబున నవ్విప్రుల భుజింపఁజేయవలయు. మఱియు నితరులైన యుక్తబ్రాహ్మణు లెవ్వరచ్చటికి వచ్చిరో వారికి దక్షిణల నొసంగవలయు. గురువునకు, ఋత్విజులకును యథార్హసత్కారంబులు గావింపవలయు. అన్నాదికంబుచే శ్వపాకులుకాని వారిని బ్రీతింబొందింపవలయు. దీనాంధకృపణాదులగు నెల్లరును భుజించినయెడల దాన విష్ణువు సంప్రీతుండగు. అనంతరంబు బంధుసహితుండై తాను భుజింప

వలయు. నృత్త, వాద్య గీతంబులను, స్వస్తివాచకంబులగు స్తుతులను, భగవత్కథలను, భగవత్పూజ ననుదినంబు గావింపవలయు. ఇది పయోవ్రతంబను పేరం బరమపురుషారాధనంబై పరంగుచుండు. బ్రహ్మచేం దెల్పంబడిన యీ వ్రతంబు నాచే నిప్పుడు నీ కుదాహృతంబయ్యె. నీవును ఓ మహాభాగురాల! యీ వ్రతంబుచే లెస్సగం జేశవు నర్చింపుము. శుద్ధభావంబగునాత్మచే నియతచిత్తవై యవ్యయుండగు నా మహాపురుషు నర్చింపుము. ఈ వ్రతంబు సర్వయజ్ఞాఖ్యంబనియు, సర్వ వ్రతంబనియుం జెప్పంబడు. ఈ వ్రతంబు తపస్సారంబును నీశ్వరతర్పణంబును నై యొప్పారు. కళ్యాణీ! అవే నియమంబులు. అవే ప్రశస్తయజ్ఞంబులు. కావున ప్రవృద్ధంబగు శ్రద్ధ నీ వ్రతం బనుష్ఠింపుము. దానం బరితుష్టుండై భగవంతుండు నీకు సత్వరంబ వరప్రదానంబు గావింపంగలండు. 418

---

## అధ్యాయము 17.

### పయోవ్రత విధానము

శ్రీశుకుఁడు: —

క. అవనీశా! యి ట్లదితి స్వ, ధవుచేం దెల్పంగంబడి యతంద్రితమతియై
యవలంబించెను స్తవ్యం, బవురీతిం ద్వాదశాహమగు నా వ్రతమున్. 419

చ. అరసి తదేకబుద్ధియయి యవ్విభు నెంచుచు నెమ్మనంబుచే
దురుసగు నింద్రియంబులను దుష్టహయంబుల బిగ్గంబట్టి సు
స్థిరతరబుద్ధి నమ్మనము దేవునియందునం బాదుకొల్పి య
త్యురు నియమంబులొప్పంగం బయోవ్రతము న్నడపెన్ యథావిధిన్. 420

వ. అంత. 421

మత్తకోకిల. ఆదిపూరుషుఁడుం జతుర్భుజుఁ డబ్జనాభుఁడు స్వచ్ఛవి
చ్ఛాదితేతరకాంతిపుంజుఁడు శంఖచక్రగదాదులౌ
కైదువుల్గలయిట్టి యొన్న దేవుం డఖండరూపుఁడునైన దా
మోదరుం డల దేవమాతకు మ్రోలం దోంచెం గృపామతిన్. 422

గీ. అక్షిగోచరుఁడైన యా యబ్జనాభుం, జూచి సంభ్రమాదరములు లేచియంతం
బ్రీతివిహ్వలహృదయయై పృథివి దేహ, మంట దండప్రణామంబు లాచరించె. 423

ఉ. అంతట లేచి యా యమ కృతాంజలియై పృథుభక్తి నా రమా
కాంతు నుతింప నెంచియును గన్నుంగవన్ బ్రమదాశ్రు పూరముల్

దొంతరలై దొరంగ నొడలెల్లం బులకింపంగ గాత్రకంపమున్
వింతగు దర్శనంబున జనింపంగ మిన్నక యుండె వేడుకన్. 424

చ. ఒదవిన వేడ్కం గొంతతడవుండి పదంపడి నెట్టకేల కా
యదితి రమాసతీపతి నిజయజ్ఞపతిం ద్రిజగత్పతిన్ శుభ
ప్రదుం దమిం దిరంగాం గనులం దాల్చి వు తెఱంగునం జూచుచుండి గ
ద్గదమధురోక్తు లొప్ప వసుధావర! ప్రస్తుతిం జేసె నీగతిన్. 425

అదితి:—

తరల. శ్రవణమంగళనామధేయ పరాత్పరా! క్రతుపూరుషా!
సవననాథ! కృపాసనాథ! ప్రసన్నరూప! విపన్నులో
కవృజినోపశమోదయా! సనకాది సన్నుతపాద! నీ
వవికృతుండ వనాథనాథుండవౌట మా కిడు భద్రముల్. 426

మ. భువనశ్రేణికి సృష్టిసంస్థితిలయంబుల్ సేయ స్వేచ్ఛ స్థిరిం
తువు మాయాగుణముల్ దలంపంగ జగద్రూపుండ వీవౌదు ని
త్యవివృద్ధామలబోధ నిర్దళితమాయాశక్తి వప్రాకృతుం
డవు స్వస్థుండవునైన నీకు హరికిన్ దండంబుం గావించెదన్. 427

శా. దేవా! తుష్టుండవైన నీవలనం బ్రాపింతు రెల్లరశ్రేణికిన్
భావింపంగం జిరాయువు న్సిరియు దివ్యంబైన దేహంబునున్
ద్యావాపృథ్విరసాతలంబులును యోగైశ్వర్యముల్ జ్ఞాన యో
గావిర్భాతి త్రివర్గమన్న నుడువంగా నేల యన్యంబులన్. 428

శ్రీశుకుండు:—

క. అని యిట్లు లదితి తన్నుం, విూనుతింపంగ నాలకించి ప్రీతుండగుచున్
వనజాక్షుండు భూతేశుండు, ననఘుండునగు హరి వచించె నాయమతోడన్. 429

శ్రీభగవానుడు:—

మ. రిపుసంఘంబులచే బలాదపహృతశ్రీకుల్ పదభ్రష్టులై
విపులార్తింబడియున్న మీ చిరమనోభీష్టంబు స్పష్టంబు నా
కిపు డో నిర్జరమాత! యా విమతులన్ దర్పోన్నతాత్ములం దానవా
ధిపులం గెల్చి సమృద్ధులౌ సుతుల యుక్తైకంబు వాంఛింతుగా. 430

మ. ధృతిమీఱన్ రణరంగమందు మఘవజ్జ్యేష్ఠ స్వపుత్రాళిచే
హతులౌ దైత్యులం జూచి దూపిలు తదీయస్త్రీల వీక్షింపంగా
మతి వాంఛింతువు వెండి కీర్తి సిరి సంపాదించి స్వస్థాన ము
న్నతిం గైకొంచు సమృద్ధులైన సుతులన్ దర్శింపం గాంక్షింతుగా. 431

ఉ. ఐనను దేవమాత! వినుమా యిపు డేరికవారణీయు లా
దానవయూథనాథు లదితథ్యము సుమ్మనుకూల దక్షులౌ
మానిత విప్రపుంగవులు మన్నన వారినిఁ గాచుచున్కి యు
న్న్యానపరాక్రమం బిచట నొప్పదు సౌఖ్యము నీ దొకింతయున్. 432

శా. దేవీ! విన్మటులైన నీ వ్రతవిధిం దృప్తుండనై నేను నీ
కీ వేళన్ సదుపాయ మేదయిన నూహింపంగ నోఁ గాదె నా
సేవాకర్మ నిరర్థకంబగుచు నష్టిం జెంద దద్దేని ని
ష్టావాప్తిం గలిగించుఁ దత్తదుచితశ్రద్ధానురూపంబుగన్. 433

మ. అమలోద్యాపనమౌ పయోవ్రతమునన్ స్వాపత్యగుప్త్యర్థమో
యమ! నీచేత సమర్చితుండనయి యయ్యర్చావిశేషప్రభా
వమునం జేసి సకృత్సమీరితుఁడనై స్వాంశంబున న్నీకు నా
ర్య మరీచాత్మజ సంగతి న్సుతుఁడనై రక్షింతు నీపుత్రులన్. 434

క. విను దేవరూపసంస్థితు, ననుగాఁగఁ బ్రజాపతియు ననఘుఁడు నగు మహా
త్ముని నీపతి నిన్నిర్జర, జననీ! భావించు చతని సంగతిఁ గనుమా. 435

గీ. ఇంతకున్నించి యిఁక వచియింపరాదు, దేవగుహ్యము సుమ్మిది దేవమాత!
అరసిచూడ సుసంవృతం బయ్యెనేని, దేవగుహ్య మభీష్టసిద్ధిప్రదమగు. 436

శ్రీశుకుఁడు:—

చ. నృపవర! యింతవట్టు వచియించి తిరోహితుఁడయ్యె నా విభుం
డపు డట దేవమాతయు ననన్యసుదుర్లభమైనయట్టి ది
వ్యపురుషుజన్మమట్లు తనయందు ఘటిల్లుట కాత్మఁ బొంగి క
శ్యపు స్వపతిన్ భజించె నధికామలభక్తిఁ గృతార్థచిత్తయై. 437

గీ. ఘనసమాధియోగంబునఁ గశ్యప ప్ర
జాపతి యమోఘదృష్టియై జ్ఞానశక్తి
నపుడు దనయందు నత్యద్భుతాచ్యుతాంశ
మొలమిఁ జొచ్చుట యది గ్రహియించె నధిప! 438

ఆ. ఉరుతపంబు కలనఁ జిరసంభృతంబగు, నాత్మవీర్య మదితియందు నునిచె
మునివరుఁడు సమాహితమనస్కుఁడై యర్చి, ననిలుఁ డెలమి దారువందుఁ బోలె.

ఆ. అంత నదితిగర్భమం దధిష్ఠితుఁడయి, పరఁగు నచ్యుతు భగవంతు నెఱిఁగి
నలినసూతి బ్రహ్మనామంబులం దగఁ, బ్రస్తుతించె నిట్లు ప్రౌఢి మెఱయ. 440

బ్రహ్మ:—

సీ. ఉరువిక్రమాఖ్యాయ పరపురుషాయ సు,జ్ఞానస్వరూపాయ తేనమోస్తు
పృశ్నిగర్భాభిధేయ వేదగర్భాయ సు,ధీరాయ వేధసే తే నమోస్తు
విష్ణవే జీవప్రవిష్టాయ స్వాశ్రితా,ధీనాయ భూయసే తే నమోస్తు
త్రిభువననాథాయ విభవే త్రిపృష్టాయ, దేవాదిదేవాయ తే నమోస్తు

గీ. దీనసంరక్షణచణాయ తే నమోస్తు, మానివ్యాలోకటరచరాయ తే నమోస్తు
శ్రీనివాసోరువక్షసే తే నమోస్తు, మానితానంతశక్తయే తే నమోస్తు. 441

ఉ. ఆరయ నీ జగంబునకు నాదియు మధ్యము నంతమౌచు నొ
ప్పారెడు దేవుని న్విబుధు లందురు గాదె యనంతశక్తి వి
స్ఫారితుఁడైన పూరుషుగ సర్వజగంబును గాలరూపతన్
దారిచి యీడ్చుచుందు స్వగతంబగు దానిని స్రోతముం బలెన్. 442

ఉ. స్థావరజంగమంబులుఁ బ్రజాపతి సంచయమున్ బ్రజాళియున్
దావకమాయచే నవతతం బొడము న్వెరుగు న్నశించుఁగా
దేవ! త్రివిష్టపచ్యుతుల దేవతలం జలరాశిమగ్నులన్
నావయుఁబోలె వేగమ పునస్స్వపదస్థుల జేయుమా ప్రభూ! 443

---

## అ ధ్యా య ము 18.

### వామనమూర్త్యావిర్భావ ఘట్టము

శ్రీశుకుఁడు:—

గీ. ఈ తెఱంగున మహితవిధాతృవినుత, కర్మవిక్రముఁడైన లోకైకనాథుఁ
డదితిదేవిగర్భంబునయందునుండి, యవనినాథ! ప్రాదుర్భూతుఁడయ్యె నప్పుడు.

సీ. శ్యామలాంగుఁడు శంఖచక్రగదాబ్జయు, తుండు మనోజ్ఞచతుర్భుజుండు
మకరకుండలదీప్తినికరరంజితవద, నేందుండు నలినాయతేక్షణుండు
శ్రీవత్సలాంఛనాంచితమహోరస్కుండు, కౌస్తుభాలంకృతకంధరుండు
దృప్తాళికలనినాదితవినిర్మలవన, మాలాభిరాముండు బాలరూపుఁ

గీ. డైన శ్రీవిష్ణుదేవుఁ డత్యచ్ఛమైన,తగ తనూకాంతిపటలిచే ననఘుఁడైన
యా ప్రజాపతివర్యు గేహాంధకార, మెల్ల మాయింపఁజేసె మహీతలేంద్ర! 445

చ. దెసలుఁ గొలంకులుం గలకదేరెఁ బ్రజాసముదాయమెల్ల సం
తసమునఁ దోఁగె నంచితగుణాన్వితమై ఋతుషట్క మొప్పె నా

కనమును నాకలోకము నగంబులు గోవులు విప్రకోటులున్
వసుమతియుం బ్రమోదకలనన్విలసిల్లెఁ గురుక్షితీశ్వరా! 446

ఆ. మొఱసె శంఖదుందుభులు మురజ పణవా, నక మృదంగములును సకలచిత్ర
వాద్యతూర్యముల రవము తుములంబై చె, లంగె నెల్లదిక్కుల న్నరేంద్ర! 447

తే. ఆడి రచ్చరల్గిన్నరుల్ పాడి రప్డు, మునులు వేల్పులు పితరులు మనువు లగ్ను
లురగ గరుడ విద్యాధ్ర కింపురుష కిన్న, రులును యక్షరక్షఃప్రవరులుఁ బొగడిరి.

క. పాడుచుఁ గొనియాడుచుఁ దమి, నాడుచు విబుధానుయాయులందఱును బ్రజల్
సూడ నదితియాశ్రమమునఁ, గూడికొని ప్రసూనవృష్టిఁ గురిసిరి పెలుచన్. 449

ఉ. అంత స్వగర్భజాతుఁడగు నా భగవంతుని నాదిపూరుషున్
వింతదలిర్ప నయ్యదితి వేడ్కమెయిన్ గని మోదమందె న
త్యంతము విస్మితుండగుచు నమ్మునియు న్నిజయోగమాయ శ్రు
త్యంతమనోజ్ఞమా తనువుఁ దాల్చిన దేవు జయింపు మం చనెన్. 450

మ. అరుదౌ చిన్నెలతోడ నీపగిదిఁ దా నవ్యక్తచిద్రూపుఁడౌ
హరి నానావిధభూషణాయుధములన్ వ్యక్తస్వరూపంబుఁ దా
ల్చి రిరంసారతి వామనుండగుచుఁ దోఁచె న్భూవరా! తల్లి దం
డ్రి వీక్షించుచునుండ నర్తకునిమాడ్కి న్విస్మితిం గూర్చుచున్. 451

గీ. వామనుండగు నవ్వటుఁ బ్రవరుఁ గాంచి, ముదముఁ గనుచుఁ బ్రజాపతి న్ముందిడుకొని
యంతట మహర్షిపుంగవులనువు మీఱ, జాతకర్మాదికంబును సలిపి రధిప! 452

క. ఉపనయనవేళ నతనికిఁ, దపనుఁడు గాయత్రిఁ జెప్పెఁ దగ గీష్పతియున్
నృప! బ్రహ్మసూత్రమిడెఁ గ, శ్యపుఁడొసఁగె న్మేఖలం బ్రహర్షకలితుఁడై. 453

గీ. భూమి యొసఁగెఁ గృష్ణాజినము దమి న్వ, నస్పతియగు సోముండు దండంబు నిచ్చె
మాత కౌపీనము నొసంగెఁ బ్రీతి మెఱయ, ధరణినాథ! నభంబు ఛత్రంబు నిడియె.

గీ. నలినసంభవుఁడుం గమండలువు నిచ్చె, దర్భల నొసంగిరపుడు సప్తర్షివరులు
నవ్యయాత్మున కతనికి నక్షమాల, నిమ్మగ సరస్వతీదేవి యిచ్చె నధిప! 455

క. ఈ వడువున నుపనీతుండై వటువునకిచ్చె పాత్ర నర్థపతియు నా
దేవి జగదంబ యీశ్వరి, కేవలము నొసంగె భిక్ష క్షితిలోకేశా! 456

క. ఈ విధి సమస్తజనసం, భావితుఁడౌ వటువరుండు బ్రహ్మర్షి వితా
నావృతమగు నా సభను బ్ర, భావంబున మించి యొప్పె వసుధానాథా! 457

గీ. తనర నాహితాగ్నిని సమిద్ధంబుఁ జేసి, ప్రోగుగా నున్న దానిని సాగఁ దివిచి
పూజఁ గావించి యవ్వటుపుంగవుండు, సమిధల న్హోమ మొనరించెఁ గ్రమము మీఱ.

చ. అలఘుతరప్రభావకలి ✤ తార్యభృగుప్రవరపరివర్తితం
బులయిన యశ్వమేధములఁ ✤ బూనికి యజించెడు వానిఁ గా బలిం
దెలిసి వటూత్తముం డటకు ✤ ధీరతనేగ నశేషభారసం
కలితత నుండుగాన నడు ✤ గడ్డున భూమినిఁ గ్రుంగఁజేయుచున్. 459

మ. తగ రేవోత్తరతీరభూమి భృగువ ✤ త్సక్షేత్రమందున్ బ్రశ
స్తగతిన్ భూరితరంబుగాఁగ బలి య ✤ జ్ఞంబు న్బరివర్తింపఁజే
యు గురుశ్రేష్ఠులు భార్గవు ల్సుగుణధు ✤ ర్యుల్చెంగటం గాంచి రా
భగవంతు న్వటురూపు న ప్రదితుఁడౌ ✤ భాస్వంతు చందంబునన్. 460

గీ. నృపవరా! యజమానుఁడున్ ✤ ఋత్విజులును, వామనుని తేజమునఁ దమ ✤ ప్రభలు సెడఁగ
నెంచిరప్పుడు యజ్ఞదృ ✤ క్షు రవియొ, వహ్నియొ సనత్కుమారుఁడో ✤ వచ్చెననుచు.

చ. అలఘుతరపరిభావులగు ✤ నా భృగుసత్తము లీ గతిన్ సశి
ష్యులయి వితర్కముల్సలుపు ✤ చుండఁగ వామనదేవుఁడయ్యెడన్
జలయుతమౌ కమండలువు ✤ ఛత్రిము దండముఁ గేలనుండఁగా
సులలితవిభ్రమం బెసఁగఁ ✤ జొచ్చె మహాహయమేధవాటికన్. 462

చ. వినుము నృపాలవర్య! యుప ✤ వీతముగా నజినోత్తరీయమున్
గొనబుగఁదాల్చి దర్భమొల ✤ నూలునుజుట్టియుఁ జొచ్చినట్టి వా
మనుఁ గుహనావటుం గని క్ర ✤ మంబునఁ దన్మహిమాభిభూతులై
వనరుహసంభవోపములు ✤ భార్గవులప్పుడు లేచి రల్లనన్. 463

మ. వసుధాధీశ్వర! దర్శనీయతరది ✤ వ్యద్రూపు రూపానురూ
పసమస్తావయవు న్వటుప్రవరు దృ ✤ క్పర్వంబుగాఁజూచి య
య్యసురేంద్రుం డుచితాసనంబు నిడి యొ ✤ య్యన్స్వాగతంబడ్గి యిం
పెసఁగం బాదయుగంబునుంగడిగి య ✤ ర్చించె ఘను న్వామనున్. 464

మత్తకోకిల:— దేవదేవుఁడు చంద్రమౌళి సు ✤ ధీనుతుండు గిరీశుఁడున్
దీవరంబగు భక్తిపెంపున ✤ దేనినిం దలఁదాల్చె నా
పావనంబు నఘాపహంబగు ✤ పాదశౌచముఁబూనె ధా
త్రీవరేణ్యా! స్వధర్మమర్మవి ✤ ధిజ్ఞుఁడౌ బలి యాదలన్. 465

బలి:—

గీ. స్వాగతంబు మహాత్మ! బ్రహ్మస్వరూప!, నతులివే నీకు నే నే మొ ✤ నర్పవలయు
రూపుఁగన్న బ్రహ్మర్షివ ✤ర్యులమహోగ్ర, తపముగా నిన్ను నే నాత్మ ✤
దలఁచుచుంటి. 466

ఆ. ఆర్య! నీవు మాగృహంబునకరుదేర, నిపుడు మా పితరులు తృప్తులైరి
అరయ మా కులంబు నతిపునీతంబయ్యె, నీ మఖంబు సమ్యగిష్టమయ్యె. 467

క. నిజ మాడెదఁ ద్వత్పదపం, కజసేచనపావనోద కధ్వస్తమహా
వృజినుఁడనగు నా యగ్నులు, ద్విజసుత! యిప్పుడు యథావిధి హుతములయ్యెన్.

క. వడుగా! సూక్ష్మములగు నీ, యడుగుందమ్ములు శుభంబులై సోఁకఁగ నీ
పుడమి యిపుడు దలపోయం, గడుఁబావనమగుచునొప్పెఁగాదె నిజముగన్. 469

క. నిను నే నర్థినిగా నా, మనమున భావించితిని స మంచితమతిఁ గా
వున మాణవకోత్తమ! నీ, కు నిపుడు వాంఛిత మదేదోకోరు మొసఁగెదన్. 470

శా. భూమీమండలమో గజవ్రజమొ గో వ్యూహంబొ సంపన్నమా
గ్రామవ్రాతమొ స్యందనప్రచయమో కన్యాజనంబో హయ
స్తోమంబో సుఖదాయకావసథసం దోహమ్మొ మృష్టాన్నమో
హేమంబో యివికాక విప్రసుత! యొం డెద్దేని నర్థింతువో. 471

---

## అధ్యాయము 19.

యాష్ట

శ్రీశుకుఁడు:—

క. అని యీ వడువున నుడివిన, యనఘము సూనృతము ధర్మ్యమగు నవ్వైరో
చని వచనమ్మును విని వా, మనదేవుఁడు మెచ్చి పలికె మదిఁ బ్రీతుండై. 472

శ్రీభగవానుఁడు:—

ఉ. దానవనాథ! నీపలుకు ధర్మయుతంబుఁ గులోచితంబు స
త్సూనృతమున్ యశస్కరము స్తుత్యమునై కడు నివ్వటిల్లె వి
జ్ఞానవినోదులైన భృగు సత్తములున్ గులవృద్ధు శాంత తే
జోనిధి నీ పితామహుఁడు చూడఁ బ్రమాణము నీ సుబుద్ధికిన్. 473

మ. అలఘుప్రాభవయుక్తులై పృథులకీర్త్యావాసులై యొప్పు త్వ
త్కులసంజాతులఁజేరి దానకదనార్థుల్ వ్యర్థులై రిత్తచే
తులతోఁబోవుట గల్గనే యచటఁ జంద్రుం డంతరిక్షంబునం
బలెఁ బ్రహ్లాదుఁడు నీపితామహుఁడు బర్వంజేయుఁ గీర్తిద్యుతుల్. 474

మ. అధిపా! మీ కులమందుఁబుట్టిన హిరణ్యాక్షుం డొకండే గదా
యుధుఁడై గ్రుమ్మఱుచుండి వీరభటు నన్యుం గానఁ డీ యుర్వినం

తద్ధరోద్ధారపరుండు విష్ణుఁ డెటో యా దైత్యేంద్రు నిర్జించి త
త్ప్రభుశౌర్యంబు స్మరించి తన్ను జయింగా నెన్నుఁడు స్వాంతంబునన్. 475

మ. పూతమతీ! హిరణ్యకశిపుండను నాతని భ్రాత యంత స్వ
భ్రాతృవధంబును వ్విని దురత్యయభీషణరోషమూని యా
భ్రాతృనిహంతయౌ హరిని బల్మి వధింపఁగ నిశ్చయించి ప్ర
స్ఫీతగదాధరుండగుచుఁ జేరె రయంబున విష్ణుగేహమున్. 476

ఉ. కావర మొప్పఁగా విలయకాలకృతాంతునిచాడ్పునన్ భయం
బావహిలంగఁ జేయుచును బై పఱతెంచెడు దైత్యుఁ జూచి మా
యావివరుండు కాలవిదుఁడైన ముకుందుఁడు పద్మలోచనుం
డా విషయంబు నెల్ల దన స్వాంతమునం దలపోసె నీగతిన్. 477

ఉ. ఏ నెట కేగిన న్విడువఁ డీతఁడు వెంబడి నేగుదెంచెడున్
దానట కెల్లఁ బ్రాణిసముదాయమునొంచెడు మిత్తికై వడిన్
గాన బహిఃప్రదేశమున నన్ను గవేషణముం బొనర్చు ని
ద్దానవలోకనాయకు హృదంతరభాగముఁ జొత్తు నిత్తఱిన్. 478

మ. తన హృత్కోటరసంస్థితుండనగు నన్ దాఁ జూడఁగాఁ జాలఁ డీ
దనుజేంద్రుం డని నిశ్చయించి హరి యంతన్ జొచ్చెఁ బై వచ్చు శ
త్రుని మేనన్ బహుసూక్ష్మరూపుఁడయి తోడ్తో ఘ్రాణరంధ్రంబునన్
దనుజాధీశ్వర! చొచ్చెఁ గంపితమతిన్ దచ్ఛ్వాసలీనాంగుఁడై. 479

మ. అతివీర్యుండగు నా హిరణ్యకశిపుం డా శూన్యగేహంబు ను
ద్ధతిమై డగ్గఱి యందు విష్ణు గనకాత్మన్ గ్రుద్ధుఁడై యార్చి భూ
రితరాటోపముతోడఁ బిమ్మట ధరిత్రిన్ నాకమున్ మిన్ను ది
క్తతులన్ వార్ధుల విష్ణుని న్నెమకుచున్ గానం డతం డాతనిన్. 480

చ. సకలజగంబులందు జలజాక్షుని విష్ణునిఁ గాన కా హిర
ణ్యకశిపుఁ డిట్లనున్ నెమకులాడితి నే నిఖిలంబు భ్రాతృహం
తకుఁ డెచటన్ గనంబడఁడు తథ్యము నాదగు ధాటికోర్వ నే
రక తనుదాన వాఁ డపునరాగమమైన పదంబుఁ జెందెఁగా. 481

గీ. మృత్యుపర్యంతమయగు శరీరధారు, లకును వైరానుబంధంబు ప్రకటగతిని
జర్చసేయంగ నజ్ఞానజన్యమగుట, నెన్నఁ గ్రోధ మహామ్మానసబృంహితమగు. 482

ఉ. ఓ దితిజేంద్ర! యో వరగుణోదయ! యో బలిసార్వభౌమ! ప్ర
హ్లాదసుతుండు నీ పితయునైన విరోచనుఁ డింపుమీఱ దా

మోదరతత్పరుండయి పవిత్రమోదమున ద్విజవేషధారులౌ
ఆ దివిజవ్రజంబునకు నర్థితుఁడై యొసఁగె న్నిజాయువున్. 483

క. ద్విజులున్ గృహమేధులు పూర్వజులున్ దదితర మహాప్రభావగరిమ యు
క్తజనులు నొనర్చు ధర్మములు జనప్రీతికరముగ సలుపు దీ వధిపా! 484

క. కాన వదాన్యశిఖామణి, వైనవినున్ భూమి యించుకంత యడిగెదన్
నే నిట మత్పదసమ్మిత, మైన పదత్రయము నొసఁగుమా బలిరాజా! 485

చ. దనుజకులాగ్రణీ! విను వదాన్యుఁడవున్ జగదీశ్వరుండవున్
ఘనుఁడవునైన నిన్ను నడుగన్ మతి యెద్దియు నర్థసంగ్రహం
బును విబుధోత్తముండు సలుపున్ దగినంతయ యంతకెక్కుడౌ
ధనమును గోరుచో ద్విజుఁడు దండ్యుఁడగున్ జుమి పెక్కులేటికిన్. 486

బలి:—

చ. భళిర! ద్విజాత్మజోత్తమ! భవద్వచనంబులు వృద్ధసమ్మతం
బులు మతి నీవు బాలుఁడ వబుద్ధుఁడవైతివి స్వార్థలబ్ధిఁ గే
వలము జడాశయుండవు సువాక్కులఁ దన్పియుఁ ద్వీపమున్ జగ
ద్వలయవిభున్ ఘనున్ నను బదత్రయి వేడునె? ప్రాజ్ఞుఁ డెవ్వఁడేన్. 487

ఉ. మాణవకాగ్రగణ్యా! వినుమా ననుఁబొందియుఁ బూరుషుండు దాఁ
బోణిమిదక్క కిమ్మనఁగఁ బోవుట గల్గునె యన్యు వేడ సం
ప్రీణితమానసుండవయి వృత్తికి నీకును జాలినంత నీ
క్షోణితలమ్ము నావలనఁ గొమ్ము ముదమ్మున నీ కొసంగెదన్. 488

వామనుఁడు:—

చ. ఎవఁడు నిజేంద్రియంబుల జయింపఁగఁ జాలఁడొ యట్టిపూరుషున్
భువనచయంబునందలి ప్రభూతములౌ సకలార్థజాలముల్
వివిధములౌ విభూతులును లేశముఁ దృప్తిపరీతుఁ జేయ నే
ర విది యథార్థమింతయును రాజవతంసమ! పెక్కులేటికిన్. 489

క. మూఁడడుగులతోఁ దనియని, వాఁడిఁక నవవర్ష యుతశుభద్వీపంబున్
గూడియుఁ దృప్తిం జెందునె, యేడగు దీవులను బడయు నిచ్చ జనించున్. 490

ఉ. హేలగ నేడుదీవులకు నేలికలై నృగ వైన్యముఖ్య భూ
పాలురు గూడ నో దనుజపాలక! యాత్మను దృప్తి నొందిరే?
లోలత నర్థకామములలోఁగి కలంగిరిగాని యింక వే
యేల? నిజాశ కంత మొకయించుక యేనియుఁ బొందఁజాలిరే? 491

మ. శ్రమకుం బాల్పడకుండఁ బార్థివ! యదృచ్ఛాలబ్ధమైనట్టి య
న్నముచేఁ దుష్టినిఁ జెందువాఁడు సుఖియై నానాఁడు వర్ధిల్లు భా
వమునన్ దా నజితేంద్రియుండు తనకున్ బ్రాప్తంబులౌ మూఁడు లో
కములన్ దృప్తినిఁ బొందలేక మిగులన్ గాసింబడున్ దీనతన్. 492

మ. నుతశీలా! విను మర్థకామములయందున్ దుష్టిలేకుంట సం
సృతికి న్గారణమౌను బూరుషునకున్ సర్వేశా! యదృచ్ఛాగతిన్
బ్రతిలబ్ధంబగుదానఁ దృప్తి వడుటే భావింపఁగా ముక్తి సం
గతికిన్ గారణమౌనటండ్రు బుధలోకగ్రామణుల్ వింటివే? 493

మ. జననాథాగ్రణి! విప్రకోటికి యదృచ్ఛాలాభసంతుష్టిచే
ననయంబున్ గడువృద్ధి సెందును దదీయంబైన తేజమ్ము సు
మ్మనలంబంబువుచేతనుంబలె నదృశ్యంబై యతుష్టాత్ముఁడౌ
జను తేజంబు నశించు నన్వహము నిస్సందేహ మూహింపఁగన్. 494

క. కావున మూఁడుపదంబుల, నే వేఁడెద దానశౌండని న్నసురేంద్రా!
యావత్ప్రయోజనంబగు, నో విత్తం బంతమాత్ర నొందుదు సిద్ధిన్. 495

శ్రీశుకుఁడు:—

క. అని యీ వటువున నుడువన్, విని నవ్వుచుఁ గోరుము భవ దభీష్టంబని వా
మనునకు మహీనాథుఁ డై, కొనె జలకలశంబు బలి యకుంఠితమతియై. 496

మ. భగవంతుండగు విష్ణుదేవునకు సద్భావంబు సంధిల్ల నీ
జగతిన్ దానముఁ జేయనున్న బలిరాజన్యున్ విపశ్చిద్వరుం
డగు నా శుక్రుఁడు గాంచి శ్రీవిభుని చేయంబోవు చెయ్దంబు ని
మ్మగ నాత్మన్ గనుచున్ స్వశిష్యు బలినిన్ బోధింపఁగా నిట్లనున్. 497

శుక్రుఁడు :—

ఉ. ఉద్భవమందెఁ గశ్యపునకుత్తమయౌ సురమాతయందు సా
క్షాద్భగవంతుఁ డవ్యయుఁడు సర్వవిభుండగు విష్ణుఁ డీతఁ డ
త్యద్భుతమైనరీతి నమరావళికార్యముఁ జక్కఁ బెట్టఁగాఁ
దద్భరమూని వచ్చె నిటు దక్షత దానవలోకనాయకా! 498

చ. క్షితివర! భావ్యనర్థము నొకింత యెఱుంగక యీ గతిన్ బ్రతి
శ్రుత మొనరించి తీతనికి రూఢిగ క్షేమకరంబుగాదు నా
మతినిఁ దలంపఁబో నిది సమంజసకార్యమటంచు దైత్య సం
తతికి నుపప్లవం బొదవె దారుణమై యనివార్యమై యిటన్. 499

శా. మాయామాణవకుండు విష్ణుఁ డితఁ డిమ్మాడ్కిన్ నినుం గోరి నీ
శ్రీయుం దేజము వైభవమ్మును యశశ్శ్రీయున్ భవత్స్థానమున్
వేయేలా! సకలంబు బల్మిఁ గొని యీ బృందారకశ్రేణికిన్
ధీయుక్తిన్ గ్రమ మొప్ప నీఁగలఁడు దైత్యేంద్రోత్తమా! ప్రౌఢిమై. 500

క. మూఁడుపదంబులతోడన్, మూఁడుజగంబులను విశ్వమూర్తియగుచు నీ
ప్రోడ వడి నాక్రమింపఁగఁ, బోడిమిసెడి మెలఁగుదెట్లు మూఢుని పగిదిన్. 501

క. ఒకయడుగున భూమిని వే, నొకయడుగున దివము నభము నురుతనువున నిం
డికొని హరి యాక్రమింపఁగ, నిఁక మూఁడవ యడుగు నిల్ప నేది గతి నృపా!502

సీ. అధిప! ప్రతిశ్రుతం బగుదాని నీకున్న, నీకును నరకంబు నిశ్చయంబు
మొనసి ప్రతిశ్రుతంబును ద్రోసిపుచ్చ నీ,వసమర్థుఁడవ యౌదు వసురనాథ!
ఐన నాలింపు మే దానంబునన్ వృత్తి, యడఁగు దానమ్ము గాదంద్రు దాని
దానమ్ము యజ్ఞమ్ము తపమును గర్మంబు, వృత్తిమంతునకె యుర్విం జెలంగు
గీ. కడఁక ధర్మార్థములకును గామమునకు, సద్యశమునకు స్వజనవ్రజంబునకును
బంచవిధములుగా విభజించి విత్త, మిందు నందును మోదంబు నొందు జనుఁడు.

వ. మఱియు దైత్యోత్తమా! యీవిషయంబున బహ్వృచ మను గీతం బొండు కలదు
వినుము. ఓ ననుట సత్యంబు, కాదనుట యనృతంబు. 504

సీ. ఆత్మవృక్షమునకు ననృతంబు మూలంబు, సత్యంబు ఫలపుష్పసముదయంబు
ఫలపుష్పములు లేక బ్రతుకును వృక్షంబు, మూలంబు లేకున్నఁ గూలుఁ గాదె
అట్లై నష్టానృతం బగు నాత్మ శోషిల్లుఁ, జర్చింప నిందు సంశయము లేదు
సర్వంబు నతిథి కొసంగెద ననరా దె, దో కొంతయిడిన రిక్తుండుఁ గాఁడు
గీ. ఉన్న యఖిలంబు నర్థికి నొసఁగ నేని, తనకు లేదు కావున ననృతంపుఁ బలుకు
సమరు సంశయుఁ బోవ లేదంచుఁ జెప్పు, వాఁడె మహికీర్తియుతుఁడు జీవన్మృతుండు

క. పరిణయ, వృత్తి, స్త్రీజన, పరిహాస, ప్రాణభంగ వైశసగతులన్
వర గో విప్ర హితార్థము, ధరఁ బొంకుట యది జుగుప్సితము గా దధిపా! 506

---

## అధ్యాయము 20.

### బలి నిశ్చయము

శ్రీశుకుఁడు:—

క. కులగురుఁడగు శుక్రుఁడిటుల్, దెలుపన్ క్షణమూరకుండి తేజోనిధి యా
బలిచక్రవర్తి గురునకుఁ, బలికెన్ రాజేంద్ర! ధీరభావముతోడన్. 507

బలి:—

క. భగవత్స్వరూపయుక్తుఁడ, వగు నీచేఁ దెలుపఁబడినయది సత్యం బె
న్నఁగ నర్థకామవృత్తుల, కగు నీధర్మం బఖిలగృహస్థులకుఁ దగున్. 508

క. ఏ దడిగిన నిచ్చెదనని, సాదరముగఁ జెప్పి విత్తశాఠ్యంబునఁ బో
లే దను టెట్టులకో! ప్ర, హ్లాదకులుఁడ నేను గితవునట్లు మహాత్మా! 509

ఆ. ఎన్న సత్యంబుకన్న నన్యమిన్నదైన, ధర్మమున్నదె? భూదేవి ధాతతోడ
అనృతమాడునరునిఁ దక్క నఖిలము న్వ, హింపఁజాలుదు ననివచియింపదే? మును.

ఉ. కొంకను పాపలోకమునకు న్గను దుర్భరమైన లేమికిన్
జంకను దుఃఖసాగరమునం బడియుండుటకున్ దలంక నే
నింక మహాపదచ్యుతికి నేని వణంకను మృత్యుదేవికిన్
బింకము వీడి భీతిలను విప్రనిరాకరణంబునం బలెన్. 511

క. మృతుని విడుచు నీజగమున, క్షితిముఖ సకలంబు దానిచే విప్రుఁడు ప్రీ
ణితమతి గాకున్నన్ ద, త్కృతమగు త్యాగమ్మువలన నేమిఫలమగున్? 512

ఉ. మానితకీర్తిసాంద్రులు సమగ్రగుణాఢ్యులు సాధుసత్త్వముల్
ధీనుతసత్త్వశాలులు దధీచి శిబి ప్రముఖుల్ త్యజింపఁగా
రాని యమూల్యకంబులగు ప్రాణములన్ దగ భూతకోటి కెం
తేనియు మేలుకూర్చిరిఁక నేటికిఁ జెప్ప ధరాదికాన్యమున్. 513

ఉ. ఎందఱు రాజు లీపుడమి నేలఁగ లే దధికారగర్వముం
బొందఁగ లేదు దిగ్విజయముం గొని మిట్టిపడంగ లేదు వా
రందఱు నిల్చిరే యిట గతాయువులై వెసఁ బోరి పోవుచో
వెందగిలించుకొంచు పదవి న్గొనిపోయిరె? చెప్పు భార్గవా! 514

క. కలన వెనుదివని దైత్యే, భ్యులచే నీభూమి సముపభుక్తము కా? వా
రల భోగములను గాలము, బలిమి గ్రసించెను యశోవిభవ మది నిలిచెన్. 515

చ. అతి సులభక్రమంబున ద్విజాగ్రణి! పూర్వము ధీరు లాహవ
క్షితిఁ దమదైన దేహముఁ ద్యజించిరి కొంకక పాత్రదాన సం
గతి దొరకొన్న యప్పు డటుగాక ధనంబు పరిత్యజింప లే
క తికమక న్నలంగి రటుగాన ధనంబు త్యజించు టొప్పదే? 516

చ. ధృతిమెయి నర్థి కామితముఁ దీర్చుటచే నుపపన్నమైన దు
ర్గతి యది మానవంతునకుఁ గారుణికాగ్రణికిన్ శుభంబె సు
వ్రతులగు బ్రహ్మవిద్వరుల వాంఛలు దీర్పఁగఁ జెప్పనేల? వి
ప్రతిలక! యట్లుగాన వటు వాంఛితమున్ దగఁ దీర్తు నిత్తఱిన్. 517

మ. క్రతుయజ్ఞాదులతోడ నిత్యము జగత్కల్యాణము న్గోరి యా
దృతి నామ్నాయ విధానకోవిదులు మీ రెవ్వాని నర్చింతు ర
య్యతులుండా వరదుండు విష్ణువె యితండౌఁగాక కాకున్నచో
నితఁడుండే యగుఁగాక యివ్వటువరాభీష్టంబు నేఁ దీర్చెదన్. 518

ఉ. ఈతఁ డధర్మమార్గమున నిప్పుడు న న్నకృతాపరాధునిన్
గైతవవేషధారియయి కట్టిసెఁ గట్టఁగనీ ద్విజోత్తమా!
ఈతఁడె బ్రహ్మమూర్తి ధరియించిన యీ పరమాత్ము విష్ణునిన్
బ్రీతిభరింతుఁగాని వినుమీ యొకసేగి నొనర్పఁబో నిటన్. 519

గీ. ఉత్తమశ్లోకుఁ డితఁడు నిజోరుయశముఁ, బాపుకొనకున్న నన్ను నిన్ బట్టికట్టు
లేక నాచేత నిహతుఁడై వీఁకమెఱయ, వీరశయనంబు నొందు నో విప్రవర్య! 520

శ్రీశుకుఁడు:—

మ. తన యాదేశమునందు లేశమును శ్రద్ధన్ జూపకున్నట్టి య
ద్దనుజాధీశు స్వశిష్యు మానధను సత్యాఢ్యు న్బలిం గాంచి చి
వ్వన శాపంబు నొసంగె నీపగిది దైవప్రేరితస్వాంతుఁడై
ఘనతేజుండు భృగూద్వహుండునగు నా కావ్యుండు క్షోణీధవా! 521

శుక్రుఁడు:—

ఉ. పండితమాని వజ్ఞుఁడవు బాల్పడి మమ్ము నుపేక్షఁ జేయుచున్
దండితనంబుఁ గోల్పడిన స్తబ్ధుఁడ విప్పుడు మా నిదేశ మొ
క్కండు నిరాకరించితివి గావున స్వీయపదంబునుండి భ్ర
ష్టుండవు కమ్ము సర్వులును జూచుచునుండఁ వదాన్య డాంబికా! 522

శ్రీశుకుఁడు:—

మ. స్వగురూత్తముఁడు శుక్రుఁ డట్లు తనకున్ శాపం బొసంగంగ స
త్యగరిష్ఠుండు మనస్విశేఖరుఁడు దైత్యాధీశముఖ్యుండు ధ

ర్మగుణోపేతుఁడునైన యాబలి చలింపంబోక వాఃపూర్వకం
బుగ దానం బిడనెంచె వామనున కీభూభాగ ముర్వీశ్వరా! 523

ఉ. భూవర! యంత దానవవిభుండగు నాబలియాజ్ఞఁ జేసి త
ద్దేవి యరాళకుంతల సుధీనుతశీల మరాళయాన విం
ధ్యావళి స్వచ్ఛవారికలితంబగు హేమఘటంబు దెచ్చె నా
పావనుఁడౌ వటూత్తమునిపాదముల న్గడుగ న్నయంబునన్. 524

క. ఆ యజమానుఁడు బలి తా, నై యా వామను శుభావహంబగు నడుగుం
దోయిఁగడిగి పావనతర, మై యొప్పు తదంబుకణములౌదలఁ దాల్చెన్. 525

మ. గగనంబందున నిల్చి దేవగణముల్ గంధర్వ విద్యాధరో
రగ కింపూరుష సిద్ధు లమ్మహితకర్మమ్మున్ బ్రశంసించుచున్
మిగులన్ బ్రస్తుతిపాఠముల్ సలుపుచున్ బృథ్వీస్థలం బంతటన్
సొగసొప్ప న్గురియించి రంత సుమవృష్టుల్ రాజచూడామణీ! 526

మ. ఉరురావంబున దుందుభుల్ మొఱసె నింపొప్పంగ గంధర్వ కి
న్నర కింపూరుష సిద్ధచారణవితానంబుల్ నభోవీథిఁ బా
డిరి లోకత్రితయంబెఱింగి యిడెఁ బ్రౌఢిన్నెవ్వరికి న్నెల్మహా
త్తరకార్యంబొనరించె నీ బలినృపోత్తముండటం చెంచుచున్. 527

ఉ. అంత ననంతుఁడుం బరముఁడాద్యుఁడునౌ హరి గుజ్జురూప మ
త్యంతమువృద్ధిఁ జెందెఁ ద్రిగుణాత్మకమై పరిపూర్ణమౌచు న
ల్లంత నృమౌని తిర్యగమరాస్పద సాగర శైల భూ రసా
భ్యంతర నాకలోక వివరాదులకు న్నిఘ్ను లాలవాలమై. 528

ఉ. ఆర్యనుతప్రభావుఁడగునా బలి దైత్యవిభుండు ఋత్విగా
చార్యసదస్య దైత్యగణసంయుతుఁడై త్రిగుణాత్మకంబు గాం
భీర్యయుతంబునైన హరిమేన గుణాత్మక సర్వవిశ్వ మా
శ్వర్యముతోఁ గనుంగొనియె స్థావరజంగమసంయుతంబుగన్. 529

వ. మఱియు నిండ్రసేనుఁడగు నా బలిసార్వభౌముఁడు విశ్వరూపుఁడగు నా త్రివిక్రమదేవుని పాదతలంబున రసాతలంబును, పాదంబుల మహీతలంబును, జంఘల శైలంబులను, జానువులఁ బతత్త్రిగణంబులను, ఊరువుల మరుద్గణంబులను, వసనంబున సంధ్యలను, గుహ్యంబున బ్రజాపతులను, జఘనంబున నాత్మముఖ్యులను, నాభియందు నభంబును, కుక్షియందు సప్తసింధువులను, నురస్థలంబున నక్షత్రగణంబులను, హృదయంబున ధర్మంబును, స్తనంబుల ఋతసత్యంబులను, మనంబునఁ

జంద్రుని, వక్షంబున నరవిందహస్తయగు శ్రీదేవిని, కంఠంబున సామాది సమస్త వేదంబులను, భుజంబుల నింద్రాది బృందారకబృందంబులను, కర్ణంబుల దిక్కులను, మూర్ధంబున దివంబును, కేశంబుల మేఘంబును, నాసికయందు శ్వసనంబును, నయనంబుల సూర్యుని, వదనంబున వహ్నిని, వాణియందు ఛందంబులను, రసనయందు వరుణుని, భ్రూయుగంబున విధినిషేధంబులను, పక్ష్మంబుల నహోరాత్రంబులను, లలాటంబునఁ గ్రోధంబును, అధరంబున లోభంబును, స్పర్శంబునఁ గామంబును, రేతంబున జలంబును, పృష్ఠంబున నధర్మంబును, క్రమణంబుల యజ్ఞంబును, ఛాయయందు మృత్యువును, హాసంబున మాయను, రోమంబుల నోషధిజాతంబులను, నాడులయందు నదులను, నఖంబులయందు శిలలను, బుద్ధియందజుని, ప్రాణములయందు దేవగణంబులను ఋషులను, గాత్రంబున స్థావరజంగమంబులను దర్శించె. సర్వాత్ముఁడగు నమ్మహాపురుషునం దీసకల ప్రపంచంబును వీక్షించి సర్వసుపర్వులుం బరమాశ్చర్యచకితులై యుండి రంత. 530

సీ. ప్రకటతేజము సుదర్శననామచక్రంబుఁ, జారునిర్ఘోషంబు శార్ఙ్గ ధనువు
జలదస్వనముఁ బాంచజన్యాఖ్యశంఖంబు, వేగాత్తకౌమోదకీగదయును
శతచంద్రవర్మ సంశయుతమగు విద్యాధ, రాఖ్యఁ జెల్వొందెడు నసివరంబు
అక్షయసాయకంబగు తూణయుగమును, గలిగి విభ్రాజిల్లు నలఘుమహాప్రు

గీ. నున్నతస్ఫూర్తి హరినిభృత్యోత్తములగు, సల సునందముఖ్యులు స్తోత్రములు సలిపిరి
సకలలోకపాలకవర్యసహితులగుచు, డెందమందు నానందంబు సందడింప. 531

మ. విభుఁ డొప్పారెఁ ద్రివిక్రమస్ఫురణఁ బ్రస్ఫీనాథ! శ్రీవత్స కౌ
స్తుభకాంచీ గుణకాంచనాంబర పరిష్కృతుండున్ మదద్భృంగపుం
జధరాంచద్వనమాలికాకలితుఁడున్ శోభాయుతాంభోద స
న్నిభుఁడున్ గ్రముకరీటకుండల సమన్వీతుండునై యత్తఱిన్. 532

మ. ఒక పాదంబున నాక్రమించె హరి యాశాయుక్తభూతలంబెల్ల మే
చక దేహంబున మీసబాహువుల నాకాశాస్త్రముమున్ వ్యోమమున్
బ్రకటంబౌ గతి నిండియుండె దివముం జేర్చి వ్యాపించె వేఱొంట లే
దిఁక లేశంబుఁ దృతీయపాదమున కుర్వీశా! స్థలం బెంమునున్. 533

వ. ఇట్లింతింతగుచు నయ్యురుక్రమము పాదంబు మీఁదిమీఁదికిం బరిక్రమించుచుం గ్రమంబున మహర్లోక, జనోలోక, తపోలోకంబుల నతిక్రమించి సత్యలోకంబునుం జేరె.

## అధ్యాయము 21.

### త్రివిక్రమ విజృంభణము

శ్రీశుకుఁడు:—

చ. ఘనతరలీల నీగతి జగంబులనెల్ల నతిక్రమించి చ
య్యన నరుదెంచినట్టి హరియంఘ్రినఖేందుమరీచికోటులన్
దనదగు సత్యలోకమును దానును దీప్తిఁదొఱంగి బ్రహ్మ యా
సనకమరీచిముఖ్యమునిసంయుతుఁడై యెఱఁగెన్ దదంఘ్రికిన్. 535

వ. మఱియు వేదోపవేద నియమయుక్తులు, నయాన్వితులును, దర్కేతిహాసపురా
ణాంగపారంగతులును, యోగానిలదీపితజ్ఞానానలనిర్దగ్ధకర్మకలుషులు నగు నన్య
యోగిపుంగవులును బ్రణమిల్లి తత్స్మరణ ప్రభావంబునంజేసి నైష్కర్మ్యలలితం
బగు స్వాయంభువధామంబుం బొందిరి. అంతఁ బ్రోన్నమితంబగు విష్ణుపాదంబునకుఁ
బద్మోద్భవుం డర్ఘ్యోదకంబును గొనితెచ్చి యాత్మప్రభవకారణంబగు నాభిపంకే
రుహంబుచే నొప్పారు శ్రీవిష్ణుదేవుని చరణంబు నర్చించె. 536

ఉ. ధాతృకమండలూదకముతత్పదముం గడుగం బునీతమై
భూతలనాథ! యప్పు డదివ్యోమమునం బ్రవహించి మించి య
త్యాతతరీతి స్వర్గధునియై భువనత్రితయంబుఁ జేర్చి సం
పూతముఁజేయు చొప్పుఁ బరపూరుషు నిర్మలకీర్తియో యనన్. 537

సీ. అంతట నుపసంహృతాత్మవిభూతియై, వామనాకృతిఁ దొంటివడువునం ద
నర్చించు నిజనాథునకు సమాదరమున, ననుచరయుక్తులై యబ్జజాదు
లగు లోకనాథులుఁ దగ బలిఁదెచ్చిరయ్యొ, సంగిరి భరతవంశాగ్రగణ్య!
సలిలార్హణస్రగక్షతమాల్యగంధాను, లేపన సురభిళధూపదీప

గీ. ఫలములఁ దదీయవీర్యప్రభావవైభ, వాంకితములగు విజయశబ్దముల స్తుతుల
నృత్తవాద్యగీతంబులనిబిడములగు, శంఖదుందుభిధ్వనులఁ బ్రశస్తగతిని. 538

క. ప్రౌఢి జాంబవంతుఁడు ఋక్షపతి మనోజవంబుతోడ భేరీనినాదంబు చెలఁగ
నద్భుతానందపారవశ్యమునఁజేసి, సర్వదిశల విజయమహోత్సవముఁజాటె. 539

ఉ. దైత్యులు విష్ణుఁడిట్లు త్రిపదచ్ఛలయాచ్ఞ సమస్తపృథ్వి నా
దిత్యులకై హరించుట మదిన్ గమనించి యమర్షతోడి సా
ద్ధత్యమునం జెలంగుచు నుదారుని దీక్షితు నాత్మనాథు సం
స్తుత్యగుణున్ బలీంద్రు గనుచున్ రభసంబునఁబల్కిరీగతిన్. 540

దైత్యులు:—

గీ. అరరె! బ్రహ్మబంధుండు మాయావివరుఁడు, విష్ణుఁ డీతఁడు బ్రాహ్మణవేషియగుచు
దేవకార్యభారంబు నుద్దీర్పఁ దలఁచి, యిట్టి యత్యాగతంబు గావించి యుండె.

క. వటురూపధారియై రిపుఁ, డిటులితనిం గొనెఁ బదత్రయీయాఘలమున న
క్కట! యస్మత్పతి బలియుఁ గ, పటమెఱుఁగక కోరినట్లు వాని కొసంగెన్. 542

గీ. సత్యసంధుండు సతతదీక్షాయుతుండు, నగుట మనవిభుఁ డనృతంబు లాడఁజనదు
కానఁ గపటుని నీవటుం గసిమసఁగుట, భర్తృశుశ్రూషణంబు నుబాడి మనకు. 543

శ్రీశుకుఁడు:—

చ. అని బలిచక్రవర్తి యనుయాయులు సర్వనిశాచరాధిపుల్
ఘనతరశూల పట్టిస ముఖాఖిలశాతముఖాయుధంబులన్
గొని తమ తేనియాజ్ఞఁ గయిక్కోక యనాదృతిఁ జేసి యంత వా
మను వధియింపఁ గ్రోధగరిమ న్బఱతెంచిరి సంభ్రమంబునన్. 544

చ. అలఘుబలంబుతోడ నెదురై పఱతెంచెడు దైత్యయూథ ము
ఖ్యులఁ గని పెల్చ నవ్వి విజయుండు జయాహ్వయుఁడున్ సునంద నం
దులు ప్రబలోద్భలుల్ వినుత దోర్బలు లచ్యుత కింకరుల్ చలం
బలరఁగ నొక్కపెట్టున గదాయుధులై యరికట్టి రందఱన్. 545

వ. మఱియుఁ గుముదుండును, గుముదాక్షుండును, బతత్రినాథుండగు విష్వక్సేనుం
డును, శ్రుతదేవుండును, బుష్పదంతుండును, నన్యులగు విష్ణుభటులును వారలకు
బాసటయై నిలిచి రంత. 546

మ. సరనాథోత్తమ! యిట్లు కూడుకొని యానాగాయుతప్రాణులౌ
హరిభృత్యోత్తములెల్లరున్ బ్రబలదైత్యానీకము న్బిట్టు కొ
ట్టిరిటుల్ వైష్ణవహన్యమానులయి నష్టింబొందు నాత్మీయులన్
గురుశాపంబు స్మరింపుచున్ బలి విధిజ్ఞుండై యని న్మానిచెన్. 547

బలి:—

శా. ఆయాసంపడనేల నాదువచనం బాలింపుఁ డో విప్రచి
త్తీ! యో రాహువ! దైత్యులార! రణనీతిం బూని మీరెల్ల రిం
కీ యుద్ధంబును జేయమానుఁడు చలం బేలా? సమస్తంబుఁ గా
లాయత్తం బదియెన్న నిష్ఠననుకూలంబయ్యె దైత్యాళికిన్. 548

ఆ. అఖిలభూతములకు సుఖదుఃఖములుఁ గూర్ప, నెవఁ డధీశుఁడగుచు నెనయునట్టి
ప్రభుని దైత్యులార! పౌరుషవృత్తుల, దాటఁజాల రెట్టి దక్షులైన. 549

క. మనకును మును సంపత్తియు, ననిమిషతతికిని విపత్తియగునట్టులు చే
సిన విభుఁడే నేఁడీ రీ, తిని జేసె విపర్యయంబు దితిసుతులారా! 550

గీ. బలముచేఁగాని సచివులవలనఁగాని
దుర్గబుద్ధిమంత్రౌషధాదులనుగాని
అరయ సామాదిచతురుపాయములఁగాని
జనుఁడు గాలంబుఁగడవ సశక్తుఁ డగును. 551

క. పలుతడవలు మీచే మును, గెలువఁబడినయట్టి విష్ణుకింకరులు సము
జ్జ్వలులయి దైవబలంబున, గెలిచి మనల నొత్తుచుండిరి కృతనుతులగుచున్. 552

ఉ. దైవ మనుగ్రహించిన ప్రదంపడి దానవులార! చేవయున్
లావు సెలంగ నీ యరిబలంబుల నెల్ల జయింతు మూర్ధతిన్
గావున స్వానుకూలమగు కాలము గైకొని తగ వేచియుండుఁడీ
తీవరపాటుఁ బూనఁదగదేరద యేరికి నస్వదప్పదోన్. 553

శ్రీశుకుఁడు:—

క. తమపతి నుడి విని పురుహూ, త్తను భటపీడితులు దైత్యదానవనాథుల్
క్రమమునఁ జొచ్చిరి రాజో, త్తను పాతాళమును గావ్యతంత్ర మెఱుఁగుచున్. 554

గీ. అంతఁ దార్క్ష్యసుతుండు ఖగాగ్రగణ్యుండు, బుద్ధి నీశు దీక్షితంబును గ్రహించి
అమల సోమాభిషవదినంబందు బలిని, బలిపశుంగ గట్టె వారుణాఖ్యపాశములను. 555

క. శ్రీహరి యనుమతిచే బలి, బాహులు పాదములు నిట్లు బంధింపఁబడన్
హాహాకారములొదవెన్, బాహుళ్యముగ మేదినిని నభంబున దిశలన్. 556

ఉ. వారుణపాశబద్ధు స్థిరభావు నుదారయశస్కుఁ బ్రాజ్ఞునిన్
ధీరుని నష్టవైభవు సుధీవినుతున్ బలిసార్వభౌము నే
పారఁగఁ జూచి యప్డు భగవంతుఁడు వామనమూర్తి మేఘగం
భీరతరోక్తులన్ జలముమీఱఁగ నిట్లనిపల్కెఁ బార్థివా! 557

క. మూఁడడుగులభూమి నొసఁగి, నాఁడవు నా కీవు ద్విచరణాక్రాంతంబో
ఱేఁడా! యీ పుడమి యింకన్, మూఁడవయడుగునకు స్థానము చూపఁగదే. 558

చ. మిహిరుఁడు స్వీయభానువులమించి తపించినయంతమేర యీ
తుహినకరుండు తిక్కగమికిం జరియించిన యంతవట్టు దా
దహనుఁడు వారివాహుఁడు ముదమ్మున గ్రుమ్మఱు నంతదవ్వు ని
మ్మహి యిదియెల్ల నాకు గరిమంబున గైవసమయ్యె దానవా! 559

క. ఏకపదంబున నీ భూ,లోకము నాకసము దిక్కు-లు న్నిండితి స్వ
ర్లోకము ద్వితీయపదమున, వీఁకన్గప్పితిని నీవుఁ బవీక్షింపంగన్. 560

సీ. ఎవ్వఁడిచ్చెదనని యీయాకుండు వానికి, నిరయనివాసంబు నిశ్చయంబ
యదిగాన గురునిచే ననుమోదితుండవై, నిరయలోకంబును జొరుము దైత్య!
యర్థికిచ్చెదనన్న యర్థమొసంగ నో, పనివానికిన్ రిక్తవాంఛగాని
స్వర్గంబు దూరమా జను నధోగతికిని, మనమునందు సుభగమ్మన్యుఁడవగు

గీ. నీవు దైత్యేంద్ర! నాతోఁ ద్వదీప్సితంబు, నిచ్చెదనటంచుఁ జెప్పి వంచించి తిట్టు
లట్లగుట నళీకఫలంబు ననుభవింపు, కతిపయాబ్దముల్ నిరయలోకమునఁ గూలి.

---

## అధ్యాయము 22.

### బలి సుతల ప్రవేశము

శ్రీశుకుఁడు:—

క. నృప! యిట్లు వామనునిచే, నపకృతుఁడై భిద్యమానుఁడయ్యున్ దైత్యా
ధిపుఁడు చలింపక హరికి న్నకృపణంబగు వచనము పలికెన్ స్థిరబుద్ధిన్. 562

బలి:—

ఉ. ఓ కమలాయతాక్ష! వినుమో భువనత్రయనాథ! యుత్తమ
శ్లోక! మదీయవాక్యము ప్రలోభనమంచుఁ దలంతువేని నే
శ్రీకరసత్యవాక్యమును జేయుదు నాకు నళీకదోషమున్
దేకిట నిల్వు నీదగు తృతీయపదంబును నా శిరంబునన్. 563

ఉ. భీతిలనేఁ బదచ్యుతిని భీతిల నారకలోకలబ్ధినిన్
భీతిల నర్థకృచ్ఛ్రమున భీతిల నీదగు నిగ్రహంబునన్
భీతిలఁ బాశబంధమున భీతిల దుర్వ్యసనానుభూతినిన్
భీతిలుచుందు నిత్య మపనిందను నాహృదయాంతరంబునన్. 564

క. మాతాపితరులు మిత్రులు, భ్రాతలు బోధింపలేని పరమార్థము వి
ఖ్యాతిగఁ దెల్పెడి యార్యుల,చేతన్ దండంబు గొను టుచిత మని యెంతున్. 565

సీ. అధికమదాంధులమగు మాకు విభ్రంశ, చక్షువు న్బేర్మి నొసంగుచున్కి
నసురులమగు మాకు ననరయ నీవు పరోక్ష, పరమగురుండవు భవ్యచరిత!
రూపింప నీయందు రూఢనై రానుబం,ధముఁ బూని పెక్కు-రు దనుజవరులు
వరయోగిసత్తముల్ వడసినసిద్ధినిఁ, గనిరికాదే? భూరికర్ముఁడవగు

గీ. నీవు నన్నిఁ దెలియంగ నన్నిగ్రహించి, వరుణపాశబద్ధునిఁ జేసితరయ దాని
కేను లజ్జింపఁ గుంద నన్నిట్లనుగ్రహించుటకె చేసితని మదినెంచుచుంటి. 566

మ. అతిపుణ్యుండగు నా పితామహుఁడు ప్రహ్లాదుండు త్వద్భక్త స
మ్మతుఁడున్ దత్పరముండునై పరఁగి దుష్కర్ముండు త్వద్వైరి త
త్పితయౌ దానవభర్తచే వినుతబుద్ధిన్ బీడితుండయ్యు ధీ
రతఁ ద్వత్పాదముఁ జేరె సంసరణభారక్లిన్నచేతస్కుఁడై. 567

వ. మఱియు నా ప్రహ్లాదుండు తన మనంబున నిట్లు చింతించె. 568

చ. తనువు త్యజించు నంతమున దస్యువులట్లు చరింత్రు బంధువుల్
ధనము హరింతురు పుత్రకులు దారలు సంసృతిహేతుభూత ల
త్యనుపమమైన యాయువు వ్యయంబున కిక్కలు మందిరంబులున్
మనుజున కిట్టివానివలనన్ ఫలమున్నె? యొకించుకేనియున్. 569

మ. అని యీరీతిని నిశ్చయించి ఘనబోధానందసాంద్రుండు స
జ్జనగణ్యుండగు మత్పితామహుఁడు సంసారాటవీత్రస్తుఁడై
యనిరోధుండగుచున్ స్వపక్షజనసంహారుండవైనట్టి నీ
యనపాయం బకుతోభయంబునగు పాదాబ్జంబుఁ సేవింపఁడే? 570

ఉ. కావున శ్రీనిఁ బాపి కడఁక న్నను మాపయి నిచ్చలున్ ద్విష
ద్భావముఁ దాల్చు నీకడకు దైవము దెచ్చె నటంచు నెంచెదన్
శ్రీవిభవంబుచేత గమనింపఁడు నన్నిహితోగ్ర మృత్యువా
జీవితమున్ జనుండు మతిఁ జేష్టడి నిక్కువ మింత యో ప్రభూ! 571

శ్రీశుకుఁడు:—

క. అని బలిదైత్యోత్తముఁ డొయ్యనఁ బల్కుచునుండ నుదితుఁడగు రాకేందుం
డునుబోలెను బ్రహ్లాదుఁడు, కనుపట్టె నరేంద్ర! తత్ప్రకాశమునందున్. 572

మ. కనియెన్ మ్రోల బలిప్రభుం డసురలోకగ్రామణిన్ ధీమణిన్
ఘనపీతాంబరధారు ధీరు విమలాకారున్ సదాచారు ఫు
ల్లనవాంభోజదళాయతాక్షు సువిశాలప్రోల్లసద్వక్షు మో
హనివృత్త్యుజ్జ్వలభక్తి దత్తహరిచిత్తాహ్లాదుఁ బ్రహ్లాదునిన్. 573

చ. బలిదనుజోత్తముం డపుడు దుర్వారణవారుణపాశబద్ధుఁడై
తొలుతటియట్టు లర్హణవిధుల్ సలుపంగ నశక్తుఁడౌట ప్రే
కలితవినమ్రవక్త్రుఁడు సాశ్రుసమాకులనేత్రుఁడౌచుఁ గే
వలము శిరమ్ముతోడుత నెగవంగి ప్రణామముఁ జేసెఁ దాతకున్. 574

శా. ఆ దైతేయకులావతంసుఁడగు ప్రహ్లాదుండు నెమ్మినన్ సునం
దాదిస్వానుచరార్చితుండగుచు నందాసీనుఁడై యున్న యా
శ్రీదేవీవిభు లోకనాథుఁగని ధాత్రీనాథ! రోమాంచ స
మ్మోదాశ్రుల్ నిగుడన్ సమచ్ఛిరమునన్ మ్రొక్కె స్థర న్వ్రాలుచున్. 575

ప్రహ్లాదుఁడు:—

శా. దేవా! నీవ యొసంగి తింద్రపద మాదిన్ బ్రీతిమైఁ గ్రమ్మఱన్
నీవే దాని హరించినాఁడ విది చింతింపంగ భద్రంబె కా
దా? వేయేటికి నాత్మమోహక వినిద్యచ్ఛ్రీపదభ్రంశితుం
గా వేగం బొనరించు టీతని యెడన్ గాఢప్రసాదంబె యా. 576

మ. స్థిరచిత్తుండగు కోవిదుండు నమితశ్రీసంయుతుండైన చో
నురుమోహంబున మగ్నుడన్న మఱి యన్యుండింక నేరీతి నా
సిరి గల్గంగ సుదుర్గమాత్మగతి వీక్షింపంగలండో పరా
త్పర! నారాయణ! దేవ! నీకివె నమోవాకంబు లర్పించెదన్. 577

శ్రీశుకుఁడు:—

వ. అనియిట్లు ప్రహ్లాదుం డార్తత్రాణపరాయణుండగు నారాయణు నగ్గించి కృతాంజలియై నిలువంబడి యాకర్ణించుచుండ భగవంతుండగు హిరణ్యగర్భుండు మధుసూదనుం గనుంగొని యత్యించిద్వక్తుకాముండగుడు నంత. 578

తే. పావనశీల సాధ్వి బలిపత్ని సమిద్ధగుణానపేత విం
ధ్యావళి బద్ధుఁడైన నిజనాథుఁగనుంగొని దుఃఖితాత్మయై
భావమునందు భీతిఁగొని వామనమూర్తి కుదగ్రభక్తి భా
రావనతాంగియై యెఱఁగి యంజలిఁబూని వచించె నీగతిన్. 579

వింధ్యావళి:—

శా. క్రీడార్థంబు ప్రకల్పితంబులగు లక్ష్మీనాథ! యీ లోకముల్
మూఁడున్ నీకట స్వాధికారమును జాల్మల్ పూనుచుం దుష్ఠిత
ప్రీఁతుల్ గావున కర్తవున్ బ్రభుఁడవున్ విధ్వస్తవౌ నీకు నే
జాడన్ దేని నొసంగఁజాలుదురు విశ్వాత్ముండ వీవౌటచేన్. 580

బ్రహ్మ:—

క. భూతభావన! భూతేశ! భూతరూప!, దేవదేవ! జగన్మయ! దివ్యపురుష!
వీని నపహృతసర్వస్వుఁ విడువుమయ్య! నిగ్రహార్హుండు గాఁడౌట ననుగ్రహింపు. 581

సీ. అఖిలమగు భూమినిచ్చెఁ గర్మార్జితంబు, లగు జగంబులఁగూడ నొసఁగెఁగడకును
నాత్మసర్వస్వమును దా సమర్పణంబు, సల్పె నవికృతమతి రాక్షసప్రభుండు.

మ. సలిలంబైన నొసంగి నిశ్చలమతిన్ శ్యామదూర్వాంకురం
బులచేనైన యథార్థరీతిని భవత్పూజావిధానక్రియల్
సలుపన్ సద్గతినందుచున్న మతివైక్లబ్యంబు లేకీతఁడె
ట్టులు త్రైలోక్యము నీకొసంగియును గీడున్బొంద నర్హుండగున్? 583

శ్రీవామనుఁడు:—

చ. ధనమదసంగతుండగుచు స్తబ్ధమతిన్ బురుషుండు దా జగం
బునకును నాకుఁగూడ పరిభూతి నొనర్చుచు సంచరించుఁ గా
వునఁ జతురాస్య! యే నెవనిఁ బూనిక తోడ ననుగ్రహింతుఁ ద
ద్ధనము సమస్తమున్ సదమదంబొనరించెద ముందు వింటివే? 584

ఉ. జీవుఁడు స్వీయకర్మములచే నవశుండయి సంతతంబు నా
నావిధయోనులందు జననంబును బొందుచునుండు నాపయిన్
జావును జెందెడున్ నలినసంభవ! వేయు నికేలఁ దెల్పఁగా
దైవవశంబునం గడకుఁ దానిటఁ బూరుషజన్మము న్గొనున్. 585

గీ. జన్మ కర్మ వయో ధనైశ్వర్య రూప
వంశ విద్యాదికముల నెవ్వనికి డంభ
మొదవదో మదనుగ్రహమదియటంచుఁ
దెలియుమా హృదయమ్మున జలజగర్భ!. 586

గీ. మాన దంభ నిమిత్తములై నితాంత, మెల్ల శుభములఁ బ్రతిఘటియించునట్టి
జన్మరూప ధనాదిక సకలమందు, మదిని మోహంబునొందఁడు మత్పరుండు. 587

ఉ. దానవదైత్యశేఖరుఁ డితండు యశోవిభవాభివర్ధనుం
డై నెగడొంది యెవ్వరికినైనఁ దరింపఁగరాని మాయనున్
దాను జయించి మించె బహుధావ్యథితుండయి దుర్భరార్తికిన్
లోనయియుండియున్ మనములోఁ బెను మోహమునొందఁ డింతయున్. 588

సీ. క్షీణవైభవుఁ డధిక్షిప్తుండు స్థానవి, భ్రంశితుండును బాశబద్ధతనుఁడు
బంధువర్జితుఁడును బాధితుండును గురు, శప్తుండునయ్యుఁ దా సత్యపథముఁ
దప్పఁడీతండు కైతవవాక్యముల నేను, ధర్మంబుఁ దెల్ప సత్పథము విడఁడు
కాన నమర్త్యులకేనిఁ బొందఁగరాని, నా స్థానమితఁడు పొందఁగలండు
తే. క్రమత సావర్ణిమన్వంతరమున మత్స, దాశ్రయుండైన యింద్రుఁడై యనంతదనుక
కష్టవిరహితమున్ విశ్వకర్మకృతము, నైన సుతలలోకంబున నధివసించు. 589

వ. అని పద్మగర్భునకుం దెల్పి యప్పురుషోత్తముండు బలిదిక్కు మొగంబై. 590

శా. రాజేంద్రోత్తమ! యింద్రసేన! విను భద్రప్రంబోజుమీా నీకు ని
ర్వ్యాజానందకరంబు స్వర్గులకునుం బ్రార్థ్యంబు సంపత్తులన్
సాజంబై విలసిల్లు నా సుతలమున్ జ్ఞాతుల్ స్వభృత్యవ్రజం
బోజంగూడి వసింప నందు సుఖివై యుండంగ దే? పేర్మిమై. 591

మ. బలిరాజోత్తమ! నిన్ను నుం బరిభవింపం జాల రా లోకనే
తలు నిం కన్యులం జెప్ప నేల వినుమా త్వచ్ఛాసనంబున్ మదో
జ్జ్వలులై దైత్యు లతిక్రమించు నెడ మచ్చక్రాయుధం బాత్మని
స్తులధారాహతిచేత వారి శిరముల్ దున్మాడు నువ్వెత్తుగన్. 592

ఉ. సానుచరుండవైన నిను సాకుచునుందు స్వయంబుగన్ సదా
జానుగఁ జూచుచుందువట సన్నిహితత్వమున న్మెలంగు నన్
దానవదైత్యసంగమున దట్టెడు నాసుర భావమున్ మద
న్వ్యాన మహాత్త్వముంగన వినున్న మగున్ విను తత్క్షణంబునన్. 593

---

## అధ్యాయము 23.

### ఇంద్రోపేంద్ర స్వర్లోక గమనము

శ్రీశుకుఁడు:—

చ. అనియిటుఁ బల్కుచున్న నిగమాంతవినోదుఁ బురాణపూరుషుం
గనుఁగొని సాధుసమ్మతుఁ డఖండయశోనిధి సుప్రభావుఁడౌ
దనుజవతంసుఁ డా బలి ముదశ్రుకళాకులనేత్రుఁడౌచు నిం
పెనయఁగ దోయిలొగ్గి వచియించెను దా నిటు గద్గదోక్తులన్. 594

బలి:—

మ. పురుషశ్రేష్ఠ! కృపాగరిష్ఠ! వరదా! మున్నెన్నఁడే లోకపా
లురు నే వేల్పులుఁ బొందరాని త్వదసంగలుప్త ప్రసాదంబుఁ బా
మరుఁడన్ దైత్యుఁడనైన నాపయిని బ్రేమంబొప్పఁ జూపించితో
పరమేశా! నిను నెన్న నేరితర మవ్యాజానుకంపామతీ! 595

శ్రీశుకుఁడు:—

చ. అని వచియించి దైత్యవిభుఁ డా హరికిన్ బరమేష్ఠికిన్ గిరీ
శునకు నమస్కరించి కడుఁ దేజోద్యముగా ననుయాయియుక్తుఁడై
చనె సుతలంబుఁ జేర నృపసత్తమ! యా పరముం డొనంగి శ
క్రునకుఁ ద్రివిష్టపం బదితి కోరిక దీరిచి యేలె లోకముల్. 596

చ. భగవదనుగ్రహంబుఁ గని వంశసముద్ధరణంబుఁ జేసి వా
సిఁ గొనినయట్టి యీ బలివిశిష్టతకున్ బ్రమదంబు నొంది భ
క్తిగరిమఁ దత్పితామహుఁడు ధీరమనస్కుఁడు వల్కె నిట్లు లా
నిగమశిరోవతంసము ముని స్తుతుఁడౌ హరి యాలకింపఁగన్. 597

ప్రహ్లాదుఁడు:—

చ. నలినజుఁ డీ ప్రసాదముఁ గనండు భవుండును బొందఁ బోఁడు శ్రీ
లలనయుఁ గాంచ బో దితరులన్ మఱి వేఱుగఁ జెప్పనేల దై
త్యులమగు మాకు నెల్లరకు దుర్గవిభుండగు నీ బలీంద్రుఁడే
తలఁపఁగ విశ్వవంద్యవినుతాంఘ్రియుగుండయి నొప్పుచుండుటన్. 598

చ. ప్రకటభవత్పదాబ్జ మకరందరసాభ్యనుభూతిచేత వీ
తకలుషులై విరించిముఖదైవతముఖ్యులె సిద్ధిపొంది రి
ట్లిఁక ఖలయోనిజన్ములము హీనచరిత్రులమైన మేము తా
వక కరుణార్ద్రదృష్టులకుఁ బాత్రులమైతి మదేమి భాగ్యమో! 599

చ. ఘనమగు యోగమాయఁ ద్రిజగంబుల నిర్మితిఁ జేసి మెప్పు వాం
దినచతురుండ వీ వరయ నీదు సమీప్సిత మద్భుతం బహో!
అనుపమదివ్యరూప! సకలాత్ముఁడవున్ సమదర్శనుండ వ
య్యును విషమాత్మకుండవగు దొక్కెడఁ గల్పతరుస్వభావతన్. 600

శ్రీభగవానుఁడు:—

గీ. శుభమగున్నికుఁ బ్రహ్లాదసుతలమునకు, నీవునుం జనుమయ్య విశ్వనిర్మలాత్మ!
నీదుమనుమనిఁ గూడి ప్రమోదమందు, చెలిమి సుఖమును నీదు జ్ఞాతులకుఁ గూర్పు.

గీ. అనిశమును గదాపాణినై యటవసించు, నన్నుఁ గనుగొనుచుండు మానందమలర
నాదు దర్శనజనిత ప్రమోదకలన, ధ్వస్తమగు నీదు కర్మబంధనంబు లెల్ల. 602

శ్రీశుకుఁడు:—

శా. ఆ దైతేయకులాగ్రగణ్యుఁడగు ప్రహ్లాదుండు శ్రీనాథు ది
వ్యాదేశంబు శిరంబునం గొని యనింద్యప్రజ్ఞుఁడై నిర్భరా
హ్లాదం బొప్పఁగ దోయిలొగ్గి నిజదైత్యానీకసంయుక్తుఁడై
యా దేవుం బ్రణమిల్లి వీడ్కొని చనెన్ హర్షించి యా లోకమున్. 603

గీ. వేదవాదులసభను ఋత్విజులమధ్య, సారిది నాసీనుఁడై యున్న శుక్రుఁ జూచి
అంత నారాయణుఁడు హరి యచ్యుతుండు, కువలయేశ్వర! యిత్తెఱంగున వచించె.

శ్రీభగవానుఁడు:—

క. భృగువర్యా! నీశిష్యుం, డగు బలికర్మమునఁ గొఱంతయది దీర్పుము వి
ప్రగణము గన్నన్ విషమం, బగునదియెల్లను సమంబయగుఁ గాదలఁపన్. 605

శుక్రుఁడు:—

సీ. కర్మవైషమ్య మెక్కడిది? యో పరమేశ!, సకలకర్మముల కీశ్వరుఁడ వీవ
యజ్ఞేశ్వరుండవు యజ్ఞపూరుషుఁడవు, ప్రత్యక్షముగ భగవంతుఁడవగు
నీ వెన్నఁగా సర్వభావంబులన్ దగఁ, బూజింపఁబడితివి పుణ్యపురుష!
మంత్రతంత్రంబుల మఱి దేశకాలవ, స్తువులఁ గొఱంతఁ దీర్చును ద్వదీయ
గీ. కీర్తనం బట్టులయ్యును గేవలముగ, నీవు సెప్పితి గావున నిర్వహింతుఁ
గడమపడియున్నయట్టి యీ కర్మములను, భద్రదంబు త్వదాజ్ఞానుపాలనంబు.

శ్రీశుకుఁడు:—

క. హరియానతిఁ గొని యా భృగు, వరుఁడు గొఱంతపడినయట్టి బలిదైత్యుని య
ధ్వరకర్మంబును బ్రాహ్మణ, పరివృతుఁడై పూర్తిఁ జేసెఁ బార్థివముఖ్యా! 607.

గీ. ఈ పగిది రాజ! వామనరూపుఁడు హరి, బలిని యాచించి ధరణి వడసి యన్న
యైన యింద్రున కొసఁగెఁ దపహృతమగు, త్రిదివలోకంబుతోఁ గూడఁ బృథివినాథ!

సీ. జననాథ! యంత బ్రజాపతీశ్వరుఁడగు, సారసగర్భుండు సమ్మదమున
అంగిరోదక్షభృగ్వాదులతోడ దే, వర్షి మనుక్ష్మాపతులతోడ
కృత్తికానందనకృత్తివాసులతోడ, నదితికశ్యపుల ప్రీత్యర్థ మఖిల
భూతకోటికి సుఖమును గూర్చుపొంటె మ, హావిభవాతిశయంబు సెలఁగ
గీ. లోకసంచయములకుఁ దల్లోకపాల, కులకు నేకైకవిభునిఁగా సలిపె నంత
వామనున్ సర్వభూతరక్షామనున్ శు, భావహంబగు కోర్కెతోఁ బార్థివేంద్ర!

గీ. వేల్పులకును సర్వమునైన వేదములకుఁ, దపమునకు ధర్మమునకు వ్రతంబులకును
భద్రములకును స్వర్గాపవర్గములకుఁ, బాలనక్షము వామనుఁ బతినిఁ జేసె. 610

క. అప్పు డఖిలవిభూతికి నయి, యుపేంద్రుఁగా వామను విధి యొనరించెఁ దగన్
నృప! సర్వభూతములు మో, దపరీతస్వాంతములయి తనరెన్ మిగులన్. 611

చ. పదఁపడి దేవయానమున వామను మున్నిడుకొంచు గోత్రభే
ది దుగినుసమ్మతిం జనియె దిక్పతిసంయుతుఁడౌచు మంగళా
స్పదము దివం బుపేంద్రభుజపాలితలోకము లంది భూరి సం
పద సకులోభయుండయి యపార ముదంబునఁ బేర్చె నింద్రుఁడున్. 612

చ. శతధృతి శంకరుండు శరజన్ముఁడు నా భృగుముఖ్యులౌ మునుల్
పితరులు సర్వభూతములు వేల్పులు సిద్ధులు సాధ్యులున్ జగ
త్పతియగు విష్ణుదేవుని శుభప్రదకర్మములన్ స్తుతించుచున్
సతి నదితిన్ నుతించుచు నజయ్యనఁ జేరిరి స్వీయధామమున్. 613

క. శ్రోతలకుఁ బాపమోచక, మై తనరు త్రివిక్రముని యుదంతం బిది వి
ఖ్యాతముగ నీకుఁ జెప్పితిఁ, జేతఃప్రీతి యొదవంగ క్షితిలోకేశా! 614

గీ. ఆ త్రివిక్రమదేవుని యద్భుతగుణ, మహిమల గణింపలేఁ డణుమాత్రమేని
పార్థివములగు రేణువుల్ పంతమూని, తగ గణింపఁగఁ జాలినఁ దా నెవఁడును. 615

చ. పొడమిన వాఁడుగాని మఱి పుట్టఁగఁ బోయెడు వాఁడుగాని యొ
క్కఁడును గణింపనేరఁ డధికాద్భుతవిష్ణుగుణంబు లంచు నే
ర్పడఁగ వసిష్ఠమౌని మును పల్కెడి నిర్మలమంత్రదర్శియై
నుడు లవి సత్యముల్ మదిఁ గనుంగొన నో కురురాజసత్తమా! 616

గీ. పార్థివా! మానుషములు పైతృకములు, దైవములు నగు కర్మములు తగ నొనర్చు
నదనులం దిది కీర్తితమైన యెడల, సుకృతము లభించు నందురు సూరివరులు. 617

---

## అధ్యాయము 24.

### మత్స్యావతార కథాప్రారంభ ఘట్టము

పరీక్షిత్తు:—

మ. అనఘా! యద్భుతకర్ముఁడైన హరి మాయామత్స్యరూపప్రథా
ఘనమౌ నాద్యకథన్ వినంగ మదిలోఁ గౌతూహలం బయ్యె న
ర్వనుతప్రాభవుఁ డా రమాధవుఁడు కర్మగ్రస్తుఁడుం బోలె నెం
దు నిమిత్తంబు ధరించె మత్స్యతనువున్ దుర్ఘర్షమున్ హేయమున్. 618

క. ఏత దుదంతము మాకు య, థాతథముగఁ జెప్పు యతివతంసమ! చేతః
ప్రీతికరంబులు కావే, భూతశ్రేణికిఁ బురాణపురుషు చరితముల్. 619

సూతుఁడు:—

గీ. అని పరీక్షిన్నరేంద్రుచే నడుగఁబడి మ, హాత్ముఁడగు బాదరాయణి యా నృపునకు
వాసుదేవుఁడు మాత్స్యరూపమునఁ జేసె, నెద్ది యా భవ్యచరితంబు నిట్లు సెప్పె. 620

శ్రీశుకుఁడు:—

మ. అనఘాత్మా! విను గోద్విజాత్యమరసాధ్వామ్నాయ ధర్మార్థ గో
పనముం జేయ విభుండు తాల్చుఁ దనువున్ వైచిత్ర్య సంయుక్తభూ

త నికాయంబులయందు గాలిగతి నిత్యంబున్ బ్రవర్తించు చు
న్నను దా నిర్గుణుఁడౌట నే వికృతినొందం డందు ధాత్రీశ్వరా! 621

సీ. క్ష్మాధవ! యతీత కల్పాంతసమయమునను
బ్రాహ్మమనెడు నైమిత్తికప్రళయమందుఁ
బరఁగ నుద్వేలసాగరోపద్రుతంబు
లయ్యె భూరాదిలోకచయంబు లెల్ల. 622

గీ. పెద్దకాలంబు నిద్దురవిడిచియుంట,జలమునన్ బవ్వళింపఁగాఁదలఁచి బ్రహ్మ
కన్నుమూయఁగ నతనిముఖంబునుండి, వేదములు నాల్గు నత్తఱి వెలికి వెడలె.623

క. ఈ విధిని వెలికివెడలిన, యా వేదము లంతికమునహరియించె హాయ
గ్రీవుఁ డనియెఱిఁగి హరి వే,దావనతత్పరత మత్స్యతనువున్ దాల్చెన్. 624

మ. నియమాఢ్యుండు మహాయశుండును మహానిష్ఠుండు సత్యవ్రతా
హ్వయరాజర్షివరేణ్యుఁడందు హరిసేవాతత్పరుండై శుభో
దయబుద్ధిన్ సలిలాశనుండగుచు నిర్ధంబౌ తపశ్చర్య స
ల్పె యతిశ్రేష్ఠులకే నసాధ్యమగు పోల్కిన్ రాజవంశోత్తమా! 625

గీ. అరయ నితఁడు వివస్వంతునాత్మజుఁడయి, శ్రాద్ధదేవుండునా నొప్పుసంజ్ఞఁబరఁగి
యీ మహాకల్పమునఁబరమేశు చేతఁ,బొలుపుగ మనుత్వమున నెలకొలుపఁబడియె.

మ. అనవద్యుం డితఁ డొక్కనాఁడు కృతమాలాభిఖ్య పుణ్యస్రవం
తినియందున్ జలతర్పణంబు గర మర్థిన్ జేయుచుండంగ నా
తనిదోయింటి జలంబునం దపుడు మత్స్యంబొండు గన్పట్టె దా
నిని దత్తోయముతో నదిన్ విడిచె క్షోణీనాథుఁ డుద్యత్ప్రభన్. 627

ఉ. ఆతఱి మత్స్యపోతము దయామయమానసుఁడైన యా ధరా
నేతను గాంచి యీ గతి ననెన్ 'వసుధారమణాగ్రగణ్యా! యీ
జ్ఞాతివధోద్యతోగ్రజలజంతుచయంబున కిత్తెఱంగునన్
భీతినిగుందుచుండు నను వీడఁగఁజన్నె? సరిజ్జలంబునన్.' 628

శ్రీశుకుఁడు:—

ఆ. త న్ననుగ్రహింపఁదా మత్స్యరూపంబు, గొన్నహరిగఁదెలిసికొనఁగ లేక
సదయహృదయుఁడై నసత్యవ్రతుండు మ,త్స్యమునుగావమదినిసమ్మతించె. 629

ఉ. దీనదయాళుఁ డాతఁ డతిదీనములైన తదీయవాక్యముల్
జానుగ నాలకించి కలశాంబువులన్ బదిలంబుగాఁగ నా

మీనమునుంచి మించి మెలఁకమిన్ గొనిపోయె నిజాశ్రమోర్వి కా
పై నొకరాత్రిలోఁ బెరిగెఁ బాత్రము నిండఁగ మీనడింభమున్. 630

చ. కలశమునం దొకింత యవకాశము లేమి నిలాతలేశ! న
ర్మిలిఁగని పల్కె నీవగిది మీనము 'నే నిఁక నిప్పు డీ కమం
డలువున నుంట కష్టమగుటన్ నివసింపఁగఁ జాలఁ జాలఁగా
నెలవు ఘటింపు మెందు ధరణీధవ! నే సుఖినై మెలంగఁగన్.' 631

శ్రీశుకుఁడు:—

క. అలిపలికిన యా మత్స్యం,బును గలశము నుండి దివిచి భూనాథుఁడు దా
నునిచెఁ బృథుశరావోదక,మున హస్తత్రయము మూర్తమున నది పెరిగెన్. 632

ఉ. క్రిమ్మఱ నా ఝషంబనియెఁ 'రాజవతంసమ! యిందు నేను సౌ
ఖ్యమ్ముగ నుండఁజాల నధికమ్ముగ నొందు పదంబు నాకు నీ
విమ్ము నయమ్ముతోడ నినునే శరణొందితిగాన' నంచు మ
త్స్యమ్ము వచింప నప్పలుకు సమ్మతితో వినియెన్ దయానుతిన్. 633

ఉ. ఆతఱి నా ఝషంబుఁ గొని యా నృపుఁ డొక్క సరోవరంబునన్
బ్రీతిగ నుంచె మీను పెను మేన సరోవర మాక్రమించి 'యో
క్ష్మాతలనాథ! నా కిది సుఖం బొనరింపదు గాన నింత క
త్యాతతమైన స్థానమునఁ దార్పుము మత్తనుగోపనార్థమై'. 634

చ. అని వచియింప నా ఝషము నయ్యయి తావులఁ దార్చి తార్చి చ
య్యన నవి యెల్ల నిండుటయు నంతకు నంతకు వృద్ధిఁ జెందఁగాఁ
గని నృపసత్తముండు కడకన్ గొనిపోయి మహాజలార్ణవం
బున నునిచెన్ ధరారమణ! ప్రమోదము స్వాంతమునందు నెక్కొనన్. 635

శ్రీశుకుఁడు:—

ఉ. అంబుధి నుంపఁగాఁ బడుచు నా ఝష మిట్లను 'భీమఘోరసము
ద్రాంబువులందు నన్ను విడనాడితహా! ప్రబలంబులైన న
క్రంబులు మున్నుగాఁగల కరాళమహాజలజంతుకోటు లు
గ్రంబగురీతి మీఁదఁబడి క్రక్కున మ్రింగక యున్నె నన్నిటన్. 636

క. కావున నో సత్యవ్రత!, యీ వీ జలరాశి విడువ నెంచుట తగ' దం
చీ వడువునఁ బల్కఁగ నుర్వీవరుఁ డా మీను పల్కు విని యిట్లనియెన్. 637

సీ. ఎవ్వాఁడవీవు మోహింపఁ జేయుచు నన్ను, మత్స్యరూపంబునం జరఁగుచుంటి
కన్నది విన్నది కాదు మాచేత నీ, దృగ్వీర్యయుత ఝషం బెనియుఁ దొల్లి

ఒకనాట వ్యాపించియుంటివి నీ వహో!, యోజనశత మురుతేజ మొనఁగ
భగవంతుఁడవు పరాత్పరుఁడ వవ్యయుఁడవు, సాక్షాత్తు హరివి నారాయణుఁడవు

గీ. అఖిల భూతగణానుగ్రహార్థమిట్లు, లీల మత్స్యరూపంబుఁదాల్చితి ధ్రువంబు
లోక సృష్టిస్థితిలయేశ! నీకు నతులు, మాకు భక్తుల కీవె యాత్మవు నిజంబు.

గీ. తావకములగు లీలావతారము లవి, యెల్ల భూతవిభూతికి హేతువులగు
దేవ! యెందుల కీ రూపమిపుడుదాల్చి,నాఁడవో యెఱుంగఁగోరెద నాకుఁజెపుమ.

గీ. జ్ఞానరూప! దేహాద్యభిమానులైన, యితరులంబోలె నిన్నాశ్రయించువారి
యభిమతార్థంబు నిష్ఫలమగుటకాన, మేల చూపి తద్భుతమైన యీ తనువును.

శ్రీశుకుఁడు:—

మ. అని యీరీతి వచించుచున్న జనలోకాధీశు సత్యవ్రతుం
గని యత్యద్భుతమత్స్య రూపతనుఁడై కల్పాంతవేళన్ లయా
బ్ధిని గ్రీడించు తలంపున న్మెలఁగు చాత్మీయాళికిన్ గామ సి
ద్ధిని గావించెడు నవ్విభుండు భువనాధీశుండు తా నిట్లనెన్. 641

శ్రీభగవానుఁడు:—

గీ. జనవరా! నేటి కేడవదినమునందు, భూర్భువాదికలోకముల్ మూఁడు నొక్క
పెట్టునన్ బ్రళయాంభోధివీచికలను, భంగపాటును గనుచు మునుంగఁగలవు. 642

క. విలయజలంబున లోకం,బులు మూఁడును లీనమగుచు భూమీనాథా!
అలఘుతరనౌక యొక్కటి, చెలువుగ మత్ప్రేరితమయి చేరు న్నిన్నున్. 643

క. రాజా! పెక్కువిధములగు, బీజము లఖిలౌషధులును వెంటఁగొని సుహా
తేజుఁడవయి సప్తర్షుల,తోఁ జయ్యన నావ యెక్కుదువు నీ వెలమిన్. 644

శా. ఈరీతిన్ బెనునావ నెక్కి నృప! సప్తర్షి ప్రభావంబుచే
ధీరస్వాంతుఁడవై తమోవృతలయాబ్ధిన్ సంచరింతీవు సు
మ్మో రాజర్షివతంసమా! ప్రబలవాతోద్ధూతమౌ నావ బెం
పారన్ జేరిన నాదు శృంగమునకున్ బంధింపు బెన్పాముతోన్. 645

గీ. పార్థివోత్తము! సప్తర్షివరులతోడ, నిన్ను బ్రళయార్ణవంబునన్ దిప్పు చేను
బ్రహ్మకున్ రేయిగడచు పర్యంతమందు, సంచరించుచునుందును స్వైరగతిని.

గీ. నా యనుగ్రహమునను బ్రశ్నములమిగుల,బ్రకటితంబగుచున్ బరబ్రహ్మమనుచుఁ
బలుకఁబడు నాదుమహిమంబుఁ దెలియఁ గలవు, నీవు సత్యవ్రతాఖ్యావనీ కళత్ర!

క. అని యాగతి హరి రాజేం, ద్రున కానతి యిడి తిరోహితుండయ్యె నృపుం
డును వేచియుండె మధుసూ, దనుచే నాదిష్టమైన తత్కాలముకై. 648

గీ. అధిప! యా రాజయోగి ప్రాగగ్రములుగ
దర్భలం బఱచియుఁ బ్రాగుదఙ్ముఖుఁడయి
భావవీథిని మత్స్యరూపధరుఁడయిన
విష్ణుపాదముల్ దలఁచుచు వెలయుచుండె. 649

గీ. అంత నుద్వేలమౌ ప్రళయార్ణవమ్ము, క్షోణిమయనౌక నెలమిఁ దేల్చుచుఁ జెలంగి
పెరుగుచున్ బిట్టుగురిసెడు పెనుమొయిలుల, మొత్తములతోడఁ జూపట్టె భూపవర్య!

మ. హరిపాదంబుల సంస్మరింపుచు ఘనుం డా రాజచంద్రుండు దా
దరికి న్వచ్చిన నావఁ గన్గొనియె నంతన్ సర్వబీజౌషధుల్
వరశక్తింగొని యెక్కె నా ఋషులతో వాక్రుచ్చి రా ఱేనికిన్
'హరి ధ్యానింపు శుభంబుఁ గూర్చు వెతఁ బాయఁ జేయు'నం చా మునుల్. 651

మ. అమలాత్ముండగు రాజసత్తముఁడు తద్ధ్యానింపఁగా మ్రోల హై
మమునన్ న్యర్బుదయోజనాయుతము నా మత్స్యంబు దృశ్యత్వ మం
దె మహీశుండు పురాకృతాచ్యుతశుభాదేశంబునన్ దాని శృం
గమునందున్ బెనుపాఁపత్రాటఁ బృథునౌకన్ గట్టె నుత్సాహియై. 652

రాజు:—

మ. తతమైనట్టి యవిద్యచేఁ బ్రవిమలాత్మజ్ఞానమెల్లన్ బరా
హతమై పోవఁగ దాన సంసృతిగతాయాసమ్మునన్ గ్రుంగుచున్
వెతలం బ్రుంగుచు నీ యనుగ్రహమునన్ నీ ప్రాపుగాం బట్టి యా
శ్రితబంధుండవు నీవు సద్గురుఁడ వక్షీణప్రభావోదయా! 653

మ. అవివేకుండగుచున్ జనుండు నిజకర్మాయాస సంబద్ధుఁడై
పవలున్ రేయు సుఖేచ్ఛచే నసుఖరూపంబైన కర్మంబు స
ల్పు విభూ! యెవ్వనిసేవచేఁ దెగు నసద్బుద్ధ్యాహ్వయగ్రంథి యా
భువనేశుండవు నీవె సద్గురుఁడ వెస్డున్ మాకు లోకేశ్వరా! 654

మ. పరికింపన్ భువిఁ గాంచనం బనలసంపర్కంబునం బోలెఁ దాఁ
బురుషుం డెవ్వనిసేవ హృద్గతమలంబున్ సర్వమున్ బాసి సు
స్థిరమై యొప్పెడునట్టి స్వీయమగు శక్తిన్ బొందునో యట్టి యా
పరమేశుండవు నీవె సద్గురుఁడ వోపద్మాక్ష! మా కెప్పుడున్. 655

చ. గురువులు నన్యదేవతలుఁ గూడి స్వయంబుగఁ బూని యే మహా
పురుషు ప్రసాదభాగలవము న్గలిగింపఁగ నేరరట్టి యీ

శ్వరుఁడు పరాత్పరుండు భగవంతుఁడునై చెలువొందు నిన్ను నే
శరణము వేఁడెదన్ మదినిఁ సర్వజగద్వలయాధినాయకా! 656

ఉ. కానని వానికిన్ గనులు గల్గినవాఁడును బోలె నిప్పుడ
జ్ఞానహతాత్ములై చెడు జనంబులకున్ సకలార్థవేత్త వ
న్యూనకృపారసార్ద్రహృదయుండవు నీవు గురుండవై తిగా
భానుదృశుండవై కడు బ్రభానిచయంబులఁ బర్వఁ జేయుచున్. 657

మ. తలఁపన్ బ్రాకృతుఁడో గురుం డతి దురంతంబైన సంసార చిం
తలు గల్గించు నసద్గతిన్ దెలుపు తథ్యంబింత నీ వన్నఁ గే
వలమున్ స్వీయపదంబుఁ జేర్చెడు నఖర్వజ్ఞానయోగంబు న
గ్గలి బోధించెడు సద్గురూత్తముఁడ వర్థిన్ మమ్ము రక్షింపుమా! 658

శా. నీవే యీ యఖిల ప్రపంచమునకున్ నేస్తుండ వీశుండవున్
భావింపంగ గురుండ వాత్ముఁడవు తద్వాంఛార్థ సంధాయివిన్
దేవా! యైనను లోక మన్యమతియై నిత్యంబు హృత్సంస్థితున్
దేవేశున్ నిను గామబద్ధమగుచున్ చింతింపలే దింతయున్. 659

ఉ. దేవవరున్ బరున్ జగదధీశుని నిన్ శరణంబుఁ బొందితిన్
గావున నాకు జ్ఞానమును గల్గఁగఁ జేయుము త్రెంచివేయు మ
య్యా! విపులార్థదీపకములౌ నుడులన్ హృదిలోని గ్రంథులన్
భావనమౌ స్వరూపము కృపామతి మాకు ననుగ్రహింపుమా. 660

శ్రీశుకుఁడు:—

క. అని యీగతిఁ బలుకు మహీ, పునిగని భగవంతుఁ డాదిపురుషుండు మహాం
బునిధిన్ వరఝషరూపం, బునఁ గ్రుమ్మఱు చాత్మతత్త్వమున్ బోధించెన్. 661

గీ. అమలమును సాంఖ్యయోగ క్రియాన్వితంబు
నగు పురాణ సంహితఁ దెల్పియవల నాత్మ
గుహ్యము నశేషముగ నృపకుంజరుఁడయి
పొదలు సత్యవ్రతునకును బోధఁ జేసె. 662

ఆ. నావయందు ఋషిగణంబుతోఁగూడ నా, సీనుఁడైన రాజశేఖరుండు
భగవదుక్తమగుచుఁ బరఁగు పరబ్రహ్మ, తత్త్వమును మహాముదమున వినియె.

గీ. ప్రళయకాలికమైన యుపప్లవంబు, తొలఁగ నుత్థితుండగు నలువకు హరి
క్రూరుఁడగు హయగ్రీవాసురున్ వెసన్ వ, ధించి గ్రమ్మఱ వేదముల్ తెచ్చియిచ్చె.

గీ. జ్ఞానవిజ్ఞాన సంయుతుఁడై నిపుణత, నెసఁగు సత్యవ్రతాఖ్యరాజర్షి వరుఁడు
పరఁగ నీ కల్పమునను వైవస్వతమను, వయ్యె విష్ణ్వనుగ్రహముననవనినాథ! 665

గీ. అధిప! రాజర్షియైన సత్యవ్రతునకు, మత్స్యరూపధరుండగుమాధవునకు
నైన సంవాదరూప కాఖ్యానము విని, పురుషుఁడప్పుడె కలుషవిముక్తుఁడగును.

క. ఎవఁడు ప్రతిదినము నీ హరి, యవతారముఁ బొగడుచుండునా నరువాంఛా
నివహములు సిద్ధిఁ బొందును, స్తవనీయంబగు సుగతి నతండును బొందున్. 667

మ. విలయాబ్ధిన్ విధివక్త్ర నిర్గతములౌ వేదంబుల న్బల్మి మ్రు
చ్చిలి గొంపోయిన దైత్యుఁ దున్మి యల జేజేపెద్ద కర్పించి కే
వలమున్ నిత్యమునై తనర్చు పరబ్రహ్మంబు సత్యవ్రతా
దులకుం దెల్పిన మత్స్యరూపు నఖిలాత్మున్ శ్రీహరిం గొల్చెదన్. 668

గద్యము.

శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, 'శ్రీరామనృసింహమూర్తి కవులు'
అను గంధం శ్రీరామమూర్తి, ఇట్టింకి నరసింహమూర్తులచే
రచింపఁబడిన శ్రీమదాంధ్ర భాగవతమున
అష్టమ స్కంధము సంపూర్ణము.

---

శ్రీరస్తు.

శ్రీరామకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ మ దాం ధ్ర భా గ వ త ము

## నవమ స్కంధము

### అ ధ్యా య ము 1.

సూర్యవంశాభి వర్ణనము, సుద్యుమ్నోపాఖ్యానము

విష్ణురాతుఁడు:—

గీ. ఋషివతంసమ! నీచే వచింపఁబడిన, యఖిలమన్వంతరంబులునం దనంత
వీర్యుఁడగు హరిచేతఁ గావింపఁబడిన, విక్రమక్రమములుఁ బ్రీతి వింటి నేను. 1

క. ద్రవిడేశుఁడు రాజర్షి, ప్రవరుఁడు సత్యవ్రతుండు బ్రహ్మజ్ఞానం
బు వడసెఁగాదే? యతిపుంగవ! హరిసేవల నతీతకల్పాంతమునన్. 2

గీ. ఆ వివస్వంతుసుతుఁడు సత్యవ్రతుండు, తాను మనువయ్యె నని వింటి తాపసేంద్ర!
వానినందనులైన యిక్ష్వాకుముఖ్యు, లధిపులైరంటిగా తదనంతరమున. 3

గీ. సంయమీశ్వర! వారివంశము వేఱు, వేఱ వంశానుచరితంబు విస్తరింపు
భూరికౌతుకమున వినఁగోరుమాకు, నో మహాభాగ! సాజమౌ ప్రేమతోడ. 4

సూతుఁడు:—

గీ. బ్రహ్మవాదులసభయందు రాజవర్యుఁడగు పరీక్షితుచే నిట్లులడుగఁగఁబడి
పరమధర్మవిదుఁడు భగవంతుఁడునగు, శుకమహర్షి వచించె రాజునకు నిట్లు. 5

శ్రీశుకుఁడు:—

క. మనువంశంబును దెల్పెద,విను సంక్షేపముగ నది విస్తారముగా
జననాథా! వర్ణింపఁగఁ, జన దెవ్వరికేని వర్షశతమునవైనన్. 6

మ. పరుఁడెవ్వాఁడు నమేయమౌ ప్రకృతికిన్ బల్భంగులౌ నీ పరా
పరభూతంబుల కాత్మ యెవ్వఁడల కల్పాంతంబునం దాతఁడౌ

క్కరుఁడే యీ సకలంబు విశ్వము నగుం గా! యన్య మొం డెద్దియున్
ధరణీనాయక! లేదు లేశమును దథ్యం బింతవట్టారయన్. 7

గీ. ఉద్భవించె నా హరినాభినుండి యోజ, స్వర్ణమయమగు పద్మకోశంబు రాజ!
పొడమె నందు స్వయంభువు భువనకర్త, తన్మనమున మరీచి యుద్భవము నొందె. 8

గీ. ఆ మరీచికిఁ బుట్టెఁ గశ్యపమహర్షి, కశ్యపప్రజాపతికి దాక్షాయణియగు
నదితియందు వివస్వంతుఁ డుదయ మయ్యె, నధిక తేజముతోడ ధరాధినాథ! 9

గీ. ఆ వివస్వంతునకు సంజ్ఞయందుఁ బొడమె, శ్రాద్ధదేవుండు మనువు రాజన్యతిలక!
ఆత్మవంతుఁ డతండు శ్రద్ధాఖ్యయందుఁ, బుత్రకులను బదుండ్రను బొడమఁ జేసె.

వ. వారలు ఇక్ష్వాకు, నృగ, శర్యాతి, దిష్ట, ధృష్ట, కరూశక, నరిష్యంత, పృషధ్ర,
నభగ, కవి నామధేయంబులఁ బరఁగిరి. 11

గీ. మున్ను మను వనపత్యుఁడై యున్నతఱి వసిష్ఠముని యాతనికిఁ బుత్రసిద్ధికొఱకు
నెలమి మిత్రావరుణేష్టి సలిపె, విధివిధానంబున నృపవీతలేంద్ర! 12

గీ. అంత మనురాజవరపత్ని యైన శ్రద్ధ
కూఁతుఁ గొఱకునై కరమర్థి హోతఁ జేరి
శ్రద్ధ యొప్పంగ ఘన పయోవ్రత మొనర్చి
ప్రణతి నొనరించి యాచించెఁ బార్థివేంద్ర! 13

గీ. కౌరవా! మునిపత్నిసమీరితుఁడయి, దానినఁ దలంచుచుండి హోతయు యజించె
గడఁగి యాజ్యాదిక హవిస్సు గైకొనినప్పు, డాపగిది వషట్కారంబు నాచరించె. 14

గీ. కూఁతురు జనింపవలె నని హోత వేల్వ, నిలయనెడు కన్య యట జనియించె నధిప!
మనువు దానిం గని వసిష్ఠమౌనితోడ, నాతిహృష్టమనస్కుఁడై యనియె నిట్లు.

మ. అమలాత్మా! విపరీతమయ్యె నిది యేలా? యిట్లు బ్రహ్మర్షిస
త్తములౌ మీ దగు కర్మపూత వరమంత్రం బొందఁబో దన్యథా
త్వము మంత్రజ్ఞులు యోగయుక్తులుఁ దపోదగ్ధాఘులౌ మీ శుభో
ద్యమసంకల్పము తారుమారగునె? వ్యర్థంబౌనె యార్యోక్తియున్. 16

ఉ. ఆతనివాక్యముల్ విని మహామహుఁడైన వసిష్ఠుఁ డాత్మలో
హోతవ్యతిక్రమం బిదని యోజ నెఱింగి వచించె నర్కనం
జాతునికిట్లు హోతవ్యభిచారమునన్ విషమత్వ మేర్పడెన్
ఖ్యాతిగ నా ప్రభావమున నాత్మజుఁ జేసెదఁ జూడు మిత్తఱిన్. 17

చ. అని మది నిశ్చయించి సుమహాయశుఁడున్ ఘనుఁడౌ వసిష్ఠస
న్మునికులవర్యుఁ డయ్యిలకుఁ బుంస్త్వముఁ గూర్పఁగ నాదిపూరుషున్

వినుతి నొనర్చ హృష్టుఁడయి విష్ణువుతీర్చ మునీంద్రు వాంఛితం
బు నిలయుఁ దత్ప్రభావమునఁ బూరుషుఁడై తనరారె నయ్యెడన్. 18

మ. విను సుద్యుమ్న సమాఖ్య నప్పురుషుఁ డొప్పెన్ ఖ్యాతిమీఱంగ నా
మనుపుత్రుం డొకనాఁడు దాఁ గతిపయామాత్యాన్వితుండై వనా
వనియందున్ మృగయానురక్తి జవనాశ్వం బెక్కి విల్లమ్ములన్
గొని యేగెన్ హరిణంబువెంబడి నుదగ్భూభాగమున్ జేరఁగన్. 19

గీ. ఎట నుమాదేవితోఁ గూడి యీశ్వరుండు
గోరి రమియించుచుండు నా మేరునగము
క్రిందనొప్పారు నుపవనక్షితినిఁ జేరె
మారసముఁడు సుద్యుమ్న కుమారుఁడధిప! 20

గీ. అవ్వనంబుఁ బ్రవేశించి యనంత శత్రు, మారకుండు సుద్యుమ్న కుమారకుండు
పడఁతిగానైన తన్ను నుబడబ్బెన, వారువమ్మును గాంచె నబలింబుతోడ. 21

అ. అంత నా కుమారునను చరులందఱు, నాత్మలింగ భేదమగుట నరసి
కొనుచు నొండొరులను గనుఁగొంచుఁ గడు విమనస్కులై రివింటె నరవరేణ్య! 22

రాజు:—

ఆ. ఆ ప్రదేశ మట్టిదగుట యెల్లెవ్వని, చేత మున్న దట్లు చేయఁబడియె
తెలుపుమయ్య మాకుదీని యుదంతంబు, వినఁగ వేడ్కయయ్యె విప్రముఖ్య! 23

శ్రీశుకుఁడు:—

మ. ఒకనాఁ డచ్చటికి న్నరేంద్ర! ఋషివర్యుల్ సుచరితుల్ స్వప్రభా
ప్రకరధ్వస్తసమస్తదిక్తిమిరులై భర్గుం గనంబోయి రం
బిక యుత్సర్జితవస్త్ర వారిఁ గని సిగ్గింగూర్చి స్వప్రాణనా
యకు నుత్సంగమునుండి లేచి పృథు లజ్జాయత్త చిత్తంబునన్. 24

క. రమమాఖలగుచుఁబరఁగెడు, నుమామహేశ్వరుల బ్రణయయుక్తినిఁ గని నం
యము లరిగిరి మగిడి శుభోద్యమ నరనారాయణాశ్రమావనికి వెసన్. 25

చ. పదఁపడి నా భవుండు భగవంతుఁడు స్వప్రియురాలి కోలి స
మ్మదమును గూర్ప నెంచి మృదుమంజుల వాక్కులఁ బల్కె నిట్టు లో
సుదతి! యెవ్వఁ డీ వనముఁ జొచ్చునొ వాఁడు పడంతియౌ నటం
చది మొదలెల్ల పూరుషులు నా వనభూమిఁ ద్యజించి రో నృపా! 26

శా. ఆ సుద్యుమ్న కుమారుఁడీపగిది రాజా! యింతియై యౌవన
శ్రీ సంపత్తిఁ దలిర్పఁ గా ననుచరీ బృందంబులు న్వెంటరా

నాసల్ మీఱ వనంబునుండి వనమొయ్యన్ జేరుచున్ గ్రుమ్మరెన్
భూసంచారముఁగోరి ద్రిమ్మరెడు వేల్పుంబోటి చందంబునన్. 27

చ. మెలఁతలఁగూడి యాశ్రమసమీపమునన్ జరియించుచున్న యా
నెలఁతలమిన్నఁగాంచి యవినింద్యయశుండు బుధుండు కూరిమిన్
వలచె నరేంద్ర! యామె యుమనాథసుతుం బతిఁగా వరించె నిం
పలరఁ బురూరవుండు సుతుఁడై జనియించెను వారి కయ్యెడన్. 28

మ. జననాథోత్తమ! దైవయోగమునకున్ స్వాధీనుఁడై యీ విధం
బున స్త్రీత్వంబును దాల్చినట్టి మనురాట్పుత్రుండు సుద్యుమ్నుఁ డా
త్మను భావించె వసిష్ఠునిన్ గులగురున్ దా నవ్వసిష్ఠుండు నా
తని సంశోచ్యదశం గనుంగొని కృపాతంత్రితుండయ్యెం గడున్. 29

క. తమి సుద్యుమ్నునకుం బుం, స్త్వముఁ గోరుచుఁ బ్రస్తుతించె శంభుని నతఁడున్
బ్రముదితుఁడై యా ఋషిస, త్తమునకు నని తనదు నుడి యథార్థపఱచుచున్.

క. ఒకనెల పురుషుండగు వే, ఱొకనెల యింతియగుఁ జూ త్వదుగ్రతపమునన్
ఇఁక నీవ్యవస్థతోఁ బుం, డిక సుద్యుమ్నుండు దా క్షితివలయ మేలున్. 31

శ్రీశుకుఁడు:—

చ. కడవని గుర్వనుగ్రహముఁ గల్మినిఁ బుంస్త్వము నీ వ్యవస్థతోఁ
బడసి యిలాతలంబుఁ బరిపాలనఁ జేయుచునుండు నంత నా
యొడయని తద్విధంబుఁ గని యుల్లములం దొకయించుకేనిఁ దా
రొడఁబడకుండి రొక్కనెల యుగ్మలియాటకు ధారుణీప్రజల్. 32

గీ. ఉత్కలుఁడు విమలుండు గయుండు ననఁగ
ముగురుపుత్రు లా రాజోత్తమున కొదవిరి
ధర్మవత్సలులౌ వారు ధరణినాథ!
యుత్తరాపథరాజులై యొప్పెనఁగిరి. 33

గీ. వార్ధకమునఁ బ్రతిష్ఠానపత్తనేశ్వ, రుండు సుద్యుమ్ననృపతి పురూరవుఁడను
నిజకుమారునకున్ ధరణీతలంబు, నిచ్చి తాను వనంబున కేగె నధిప! 34

# అ ధ్యా య ము 2.

## పృషధ్రు చరిత్రము

శ్రీశుకుఁడు:—

సీ. ఈగతి సుద్యుమ్నుఁడేగ వైవస్వతుఁ, డై నట్టిమనువు పుత్రార్థియగుచు
యమునాతటిని శతహాయనంబులు మహో, గ్రమగు తపంబును గడకఁ జేసె
బిమ్మటఁ ద్రిభువనవిభుఁడును దేవదే,వుండు నౌ విష్ణుదేవుని యజించె
నంత శ్రీహరి పరిసాదాతిశయమున నా, మనురాజతిలకుండు వినుతయశుల
గీ. నాత్మసదృశులఁ బదుగురనాత్మజులను, పూతహృదయుల నిక్ష్వాకుపూర్వజులను
బడసెఁదన్నామధేయముల్ వరుసనీకు, మున్ను వివరించితినిజుమీ భూపవర్య! 35

మ. మనుపుత్రుండు పృషధ్రనామకుఁడు నేమం బొప్ప గుర్వాజ్ఞఁ గై
కొని వీరాసనయుక్తుఁడౌచు నిశలన్ గోపాలనంబున్ జలం
బునఁ గావించుచునుండ నొక్కనిశి జీమూతంబు వర్షింప క్రి
క్కున శార్దూలమొకండుసొచ్చె నటఁ దద్గోష్ఠంబునన్ భూవరా! 36

చ. కలుగుడువాటునొంది భయకంపముతో శయనించియున్న గో
వులు వడి లేచి పాఱెఁ బలుపోకలుగా నపు డొక్కధేనువున్
బలిమినిఁ బట్టెఁ గ్రూరమగువ్యాఘ్రము కుయ్యిడె గోవు దానినిం
దెలిసి పృషధ్రుఁడంతఁ బఱతెంచె రయంబున మందలోనికిన్. 37

ఉ. శాతకృపాణముం గొని పృషధ్రుఁడు వేగమ వచ్చి ఋక్షసం
జాతముగోచరింపని నిశానమయంబున వ్యాఘ్రశంకచే
నాతఱి నానవాలు తెలియందగు జ్ఞానములేక నో వసుం
ధాతలనాథ! ధేనువు శిరమ్ముఁ గఱుక్కునఁ గోసె నుగ్రతన్. 38

మ. కరవాలాగ్రనికృత్తకర్ణమయి వ్యాఘ్రంబున్ వడిం బాఱె నె
త్తురుమార్గంబునఁ గారుచుండఁ గడుబీతుం జెందుచున్ ధీరుఁడున్
బరవీరఘ్నుఁడునౌ పృషధ్రువిభుఁ డావ్యాఘ్రింబె యప్డిగ్గె నం
చరసెన్ వేకువ ఖండితంబయిన యయ్యావున్ గనెన్ దుఃఖియై. 39

చ. హాతవిధిదుర్విపాకమునరనాతఁడు భ్రాంతమనస్కుఁ డౌట నా
గతి నపరాధి యయ్యె నదిగాంచి గురుండు శపించె వాని దు
ర్గతిమెయి క్షత్రబంధుఁడవుగాక దురాగతమైనకర్మచే
క్షితితలమందు నీవు పరికింపఁగ శూద్రుఁడ వౌదు వంచిటుల్. 40

శా. భూనాథా! యతఁ డీగతిన్ స్వగురుశప్తుండై వెసన్ దోయిటన్
దా నా శాపము సంగ్రహించుకొని యాత్మం దూర్ధ్వచేతస్కుఁడై
శ్రీనారాయణదేవునందుఁ గర మర్థిన్ భక్తిఁ గావించుచున్
నానాభూతసుహృత్తముండు సముఁడున్ శాంతుండునై భాసిలెన్. 41

సీ. నియతేంద్రియుండు వినిర్మలమతి యదృచ్ఛోపలబ్ధార్థతుష్టుండుఁ బుణ్యుఁ
డపరిగ్రహుండు సమాహితచిత్తుండు, జ్ఞానతృప్తుండునై సంతతంబు
నాత్మరూపంబున నాత్మను నెలకొల్పి, బధిర జడాంధ వేషములుఁ దాల్చి
ఈ మేదినీచక్రమెల్లెడఁ జరియించె, నేకాంతభావంబు నేర్పడంగ
గీ. నిట్లుమెలఁగుచు వనమున కేగియందుఁ, బ్రజ్వరిల్లుచునుండు దావానలంబుఁ
గాంచి యట దగ్ధదేహుఁడై ఘనతరమగు, బ్రహ్మపదమును బొందె నా పార్థివుండు.

మ. కవి నాముండు కనిష్ఠపుత్రుఁడు మదిం గామంబులన్ ద్రోసి బం
ధువులన్ రాజ్యము మందిరంబులను దోస్తో వీడి సుజ్ఞాననై
భవుఁడై నిల్పె స్వయంప్రకాశుని హరిన్ భావంబునందున్ గిశో
రవయస్కుండయి పొందె నుత్తమగతిన్ రాజేశ్వరా! చెచ్చెరన్. 43

వ. మఱియు మనుసంభవుం డగు కరూశుం డనువానివలనఁ గరూశ క్షత్రజాతు లుత్పన్నంబయ్యె. బ్రహ్మణ్యులు ధర్మవత్సలులునై వా రుత్తరాపథంబునకు నేలికలైరి. ధృష్టుండనువానివలన ధార్ష్ట్యంబను క్షత్రియవంశంబు కలిగి బ్రాహ్మణప్రియంబై ధరిత్రి నొప్పారె. నృగుండనువానివలన సుమతియు, నతనికి భూతద్యోతియు, నతనికి వసువును గలిగిరి. వసువునకుఁ బ్రతీకుండును, నతనికి నోఘవంతుండును, నతనికిఁ దన్నామధేయుండగు పుత్రుండును, నోఘవతియను కన్యకయుం గలిగిరి. ఆ కన్యను సుదర్శనుండు పరిణయం బయ్యె. నరిష్యంతుండను వానివలనఁ జిత్రసేనుండు వొడమె. అతనికి దక్షుండను వాఁ డుదయించె. దక్షునకు మేఢ్వంతుఁడును, మేఢ్వంతునకు శర్వుండు, నతనికి నింద్రసేనుండును బొడమిరి. ఇంద్రసేనునివలన వీతిహోత్రుండును, నతనికి సత్యశ్రవుండును, వానికి నురుశ్రవుండును, నతనికి దేవదత్తుండును సుతులైరి. దేవదత్తునకు నగ్నివేశుండు పుత్రుండయ్యె, నతండు కానీనుం డని ప్రసిద్ధిఁబడసి జాతుకర్ణుండను మహర్షి యయ్యె. అతనివలన నాగ్నివేశ్యాయనం బను బ్రహ్మకులంబు సంజాతంబయ్యె. రాజేంద్రా! యిట్లు నరిష్యంతువంశంబుఁ దెల్పంబడియె. ఇఁక దిష్టవంశంబు వివరించెద వినుము. దిష్టపుత్రుండగు నాభాగుండనువాఁ డన్యుండు కర్మంబునం జేసి వైశ్యత్వంబునుం బడసె. హాలంధనుం డనువాఁ డా నాభాగుని కొమరుఁ

డయ్యె. హాలంధనునకు వత్సప్రీతియు, నతనికిఁ బ్రాంశువును, బ్రాంశువునకుఁ బ్రమతియు, బ్రమతికి ఖమిత్రుండును, నతనికి చాక్షుషుండును, నతనికి వివింశతియు, వివింశతికి రంభుండును, రంభునకు ఖనినేత్రుండును, ఖనినేత్రునకుఁ గరంధనుండును తనయులై జన్మించిరి. ఆ కరంధనునకు నవిక్షిత్తుండును, నతనికి మరుత్త చక్రవర్తియును బొడమిరి. 44

సీ. ఆ మరుత్తునిచేతఁ యజ్ఞంబుఁ జేయించె, నంగిరస్సుతుఁడు మహర్షివరుఁడు
సంవర్తనాముండు జగతి మరుత్తుని, యజ్ఞంబుసాటి యన్యంబు లేదు
పాత్రాదికంబు సర్వంబును నీయజ్ఞమున హిరణ్మయము శోభనము నయ్యె
మత్తిల్లె నింద్రుఁడీమఖమున సోమపానమున ద్విజులుదక్షిణల మురిసిరి
గీ. యల మరుత్తులు పరివేష్టలైరి మఱియు, నా క్రతువున విశ్వేదేవులమలమతులు
సభ్యులై యొప్పి రన్న యజ్ఞప్రభావ, మింక వేఱుగ వాక్రువ్వనేల యధిప! 45

వ. ఆ మరుత్తచక్రవర్తికి దముండను సుతుఁడు వొడమె. అతనికి రాజవర్ధనుండును, నతనికి సుధృతియు, నతనికి నరుండును, ఆనరునకుఁ గేవలుండును, గేవలునకు బంధువంతుండును, నతనికి వేదవంతుండును, నతనికి బంధుండును, బంధువునకుఁ దృణబిందుండును గ్రమంబునఁ బొడమిరి. 46

తరల. వినుత సద్గుణుఁడైన యా తృణబిందుభూపతిఁ గాంచి యొ
య్యన నలంబున పేర నొప్పెడు నప్సరోంగన మానకే
తనుని పెంపగు పూవుటంపర దాడికోర్వఁగలేక యా
జనవరేణ్యుని పొందుఁ బొందెను సంభ్రమాగతయై నృపా! 47

వ. అంతఁ దృణబిందునకు నయ్యలంబుసవలనఁ గొందఱు పుత్రులును, నిలబిల యను కన్యకామణియుఁ బొడమిరి. ఆ యిలబిలయందు విశ్రవసుండు కుబేరునిఁగల్గించె. ఆ ధనదుండు యోగేశ్వరుండగు తండ్రివలనఁ బరవిద్యంబడసె. విశాలుండు, శూన్యబంధుండు, ధూమ్రకేతుండు నను వారు తృణబిందు పుత్రకులు. వంశకరుండగు విశాలుండనురాజు తనపేర వైశాలీపురంబు నిర్మించె. ఆ విశాలునకు హేమచంద్రుండును, హేమచంద్రునకు ధూమ్రాక్షుండును గొడుకులైరి. ధూమ్రాక్షునకు సహదేవుండును, సహదేవునకుఁ గృశాశ్వుండును బొడమిరి. కృశాశ్వునకు సోమదత్తుండు పుట్టె. అతఁ డశ్వమేధంబుల నిడస్పతి యగు పురుషుయజించి యోగేశ్వరాదృతంబగు పరమగతిం బొందె. సోమదత్తునకు సుమతియు, సుమతికి జనమేజయుండును బొడమిరి. వీరు వైశాల భూపాలులని ప్రసిద్ధిం బడసి తృణబిందుకీర్తి విస్తరింపఁజేసి రాజ్యంబు పాలించిరి. 48

---

## అధ్యాయము 3.

### శర్యాతి చరిత్రము, సౌకన్యోపాఖ్యానము

శ్రీశుకుఁడు:—

సీ. వినుము శర్యాతినాఁజను మనుపుత్రుండు, బ్రహ్మణ్యుఁడై కడుఁబ్రజ్ఞ కెక్కె
నంగిరసత్రంబునందు నాతఁడు ద్వితీ,యాహ్నికవిహితకృత్యంబు సెప్పె
కమలలోచనయగు కన్య సుకన్యాభి,ధేయ శర్యాతికి నామె సుహిత
యా కన్యఁ గూడి శర్యాతి కాననకు నేగి, చ్యవనాశ్రమంబు డాయంగఁ జేరెఁ

గీ. జెలులతోఁ గూడి ఫలపుష్పములకుఁ దరుల
నెమకు చోకపుట్టబిలమున న్నిణుగురులన
వెలుఁగుజ్యోతుల రెంట నవ్వేలఁది కాంచి
కంటకంబునఁ బొడిచె మౌగ్ధ్యమునఁ జేసి. 49

ఉ. క్షోణితలేశ! యిట్లు విధిచోదితయాను సుకన్య గ్రుచ్చఁగా
శోణితధార లొల్కె నటఁ జోద్యముగా మలమూత్రబంధ మా
రాణువ కంతకు స్గలిగె రాజవరేణ్యుఁడు విస్మితాత్ముఁడై
పోణిమిఁ దప్పియున్న నిజపూరుషులం గని పల్కె నీ గతిన్. 50

క. ఈ యాశ్రమమున మీ రెవ, రే యపరాధము సలిపిరో? యెఱిఁగింపుఁ డికన్
వేయేటికి సువ్యక్తం, బాయెన్ భార్గవుని చెయిదమని యిది మనకున్. 51

ఉ. అంత సుకన్య భీతమతియై తనతండ్రికిఁ బల్కె నిట్టు లా
క్రాంత యకృత్య మిప్పు డొనరించితి నే నిట తండ్రి! వింటి మె
న్వింతగఁ బుట్టలో వెలుఁగు నెల్గుల రెంటిని జూచి చంచల
స్వాంతముతో నిజం బెఱుఁగఁ జాలమి గ్రుచ్చితిఁ గంటకంబునన్. 52

ఉ. కూఁతురు చెప్పినట్టి పలుకుల్ ములుకుల్వలె వీనుసోఁక శ
ర్యాతి మనంబునన్ బ్రబలమైన భయంబును బొంది యంత న
త్యాతతమైన వల్మికమునందుఁ దిరోహితుఁడైన భార్గవున్
జేతమున బ్రసన్నునిగఁ జేసె శనైర్గతి సాంత్వనోక్తులన్. 53

చ. చ్యవనమహర్షి యాశయము నా నృపవర్యుఁ డెఱింగి యా ముని
ప్రవరునకున్ స్వపుత్రికను బ్రాభవ మొప్ప నొసంగి యీమె ము
గ్ధ వెత లెఱుంగ దించుకయుఁ గావునఁ గావుమటంచు నప్పగిం
చి వెడలెఁ బట్టణంబునకు స్వీయులతోఁ దదనుజ్ఞఁ బొందియున్. 54

గీ. పరమకోపనుఁ జ్యవనునిఁ బతినిఁ గాఁగఁ, బడసి యాతని చిత్తము వచ్చునట్లు
నప్రమత్తానువృత్తుల ననహరహంబు, నా సుకన్య యాతనిఁ బ్రీతాత్ముఁ జేసె. 55

ఉ. ఆ యెడఁ గొంతకాలమున కా చ్యవనాశ్రమభూమి కుజ్జ్వల
శ్రీయుతు లశ్విదేవతలు చేరఁగ వారల కర్హరీతి నా
ప్యాయముతో నుదంచిత సపర్యలుఁ జేసియు వారిఁ జూచి తే
బ్రాయము నాకు నిం డనుచుఁ బ్రార్థనఁ జేయుచు మౌని యిట్లనెన్. 56

ఆ. సోమపానభాగశూన్యులౌ మీకును, సోమపాత్రమిడుదు సొంపుమీఱ
అంగనలకు నిష్టమైన ప్రాయ మొసంగుఁ, డయ్య నాకు మీరలశ్వులార! 57

చ. అని యడుగంగ వల్లె యని యా సురవైద్యులు విప్రవర్యుఁ గాం
చి నియమ మొప్ప నీ విపుడు సిద్ధవినిర్మితమైన నీ హ్రదం
బునను మునుంగుమంచు మునిముఖ్యునిఁ బెన్మదిమి న్నలంగు వా
ని నమరవైద్యు లా మడుఁగు నీటను జొన్పిరి తాము దోడుగన్. 58

క. వనితాప్రియులు మనోజ్ఞులు, వనజస్రగ్భూషితులును వరకుండలులున్
ఘనతుల్యరూపు లమల వ, సనులు ముగురుపూరుషులు వెసన్ లేచి రటన్. 59

ఉ. అంతటఁ దుల్యరూపుల సహార్కతి తేజులఁ దేఱిచూచి య
క్కాంత పతివ్రతామణి స్వకాంతు నెఱుంగఁగలేక దీనయై
స్వాంతమునందు నయ్యమరవర్యులఁ దా శరణంబుఁ జొచ్చె న
త్యంతము నామె భక్తికిఁ బ్రియంపడి రాత్మల నశ్విదేవులున్. 60

గీ. ఆ సుకన్య పాతివ్రత్యహర్షితులయి, పతినిఁ జూపించి యామెకు యతివరేణ్యు
భవ్యుఁ జ్యవనుని వీడ్కొని వారిచేతఁ, బొగడఁ బడుచుఁ ద్రివిష్టపమునకుఁ జనిరి. 61

క. చ్యవనాశ్రమభూభాగము, సవన మొనర్పంగఁ జేరె శర్యాతి యటన్
రవితేజుం బురుషు సురూ, పవంతుఁ బొడఁగాంచె దుహితృపార్శ్వమునందున్. 62

క. పాదాభివందనము తన, కాదరమునఁ జేసినట్టి యాత్మజ కాశీ
ర్వాదము లొసఁగక మనమున, మోదించక పల్కె నిట్లు పుత్రికతోడన్. 63

శర్యాతి:—

చ. తనయ! యిదేమి నీ యభిమతం బల లోకనమస్కృతున్ మహా
మునిని జరావిజీర్ణు నతిపూజ్యు ననమ్మతితోడ నిట్లు వం
చన మొనరించి యధ్వగుని జారుని నీతనిఁ గూడి యుండఁగా
ననుమతిఁ జేసి తిట్లు కులటా! పతినిం బెడఁబాయు టొప్పునే? 64

మ. అకటా! సత్కులజాత వీ వెటులు నింద్యంబయ్యె నీ బుద్ధి య
మ్మక చెల్లా! కులదూషణమ్మొదవె జారమ్మా నీదు మూలమ్మునన్
ఇక లజ్జన్ ద్యజియించి కూడితి వహో! యీ జారుని స్వీవు తం
డ్రి కులంబున్ బతివంశమున్ జెఱిపితే నిర్భాగ్యురాలా! యిటుల్. 65

క. అని వచియించెడు తండ్రిం, గని స్మయమానయయి చిరునగవు మొలకెత్తన్
జనకా! యీతఁడు భృగుసం, దనుఁడగు నీ యల్లుఁడె యనితతనుణి వచించెన్. 66

గీ. మఱియుఁ బతివయోరూప సంప్రాప్తి విధము, సర్వమున్దెలుపంగ విస్మయముఁ జెంది
అమితసంతుష్టుఁడగుచు శర్యాతివిభుఁడు, కన్నకూఁతు సుకన్యను గాఁగలించె. 67

గీ. చ్యవనుఁ డంత శర్యాతి నిజశక్తి మెఱయ, సోమమున యజింపం జేసి సోమపాత్ర
మును గ్రహించియు నిజతేజమునను జేసి, సోమపానంబులేని యశ్వుల కొసంగె.

మ. చ్యవనుం జంపఁ దలంచి యస్త్రతి నమర్షావేశముంబూని దు
శ్చ్యవనుం డుగ్రతనెత్తెఁ గ్రూరమగు వజ్రంబున్ ధరాధీశ! భా
ర్గవవర్యుండు నుదాత్త శక్తిని సవజ్రంబై విరాజిల్లు వా
సవు నుద్యద్భుజదండ మద్భుతగతిన్ స్తంభింపఁ జేసెన్ ధృతిన్. 69

గీ. వైద్యులనుచును మును సోమభాగమున బ్రహ్మకృతుల సర్వదేవులు నెలమి సోమ
భాగము నొసంగఁగా సురప్రకర మెల్ల, ననుమతిం జూపె నయ్యెడ మనుజనాథ!

వ. ఆ శర్యాతి మహారాజునకు నుత్తానబర్హి, ఆనర్తుండు, భూరిషేణుండను ముగ్గురు పుత్రులు బొడమిరి. అం దానర్తునకు రైవతుండు కలిగె. అతండంతస్సముద్రంబునఁ గుశస్థలియను పట్టణము నిర్మించి యందుండి యానర్తాది దేశంబులఁ బాలించె. ఆ రైవతునకుఁ గకుద్మిజ్యేష్ఠులగు నూర్వురుకొడుకు లుదయించిరి. రైవతుండును రేవతియను తన కుహితకు వరుం గోరఁదలంచి యపావృతంబగు బ్రహ్మలోకంబునకుఁబోయి యందు గంధర్వులసందడి నలభ్యావకాశుండై క్షణం బూరకుండె. అయ్యనంతరం బాద్యుండగు విరించిం బూజించి తన యభిప్రాయం బెఱింగించె. అదివిని భగవానుండగు బ్రహ్మదేవుండు పెల్చన నవ్వి యా రైవతున కిట్లనియె. ఓరాజా! నీవు హృదయంబుననిడుకొన్న రాజకుమారు లందఱుఁ గాల గ్రస్తులైరి. తత్పుత్ర, పౌత్ర, నప్తృ, గోత్రంబులు నిప్పుడు వినంబడవు. ఇప్పటికి సప్తవింశతి చతుర్యుగవిభక్తంబగు కాలం బతిక్రమించె. 71

సీ. కావున నందిష్టుఁ దేవదేవాంశుఁడౌ, బలదేవుఁడను మహాబలుఁడు గలఁడు
ఆ నరాగ్రణికి కన్యారత్నమైన యీ, రేవతీదేవి నీఁ బ్రీతిమీఱ

నోనఁగుము రాజేంద్ర! వసుమతీభారావ, తరణార్థ మఖిలభూతప్రియుండు
నుత్తమశ్లోకుఁడై యొప్పారునట్టి శ్రీ, హరి నిజాంశమున నిట్లవతరించె
గీ. అని విరించి వచించిననాలకించి, యతనికి నమస్కరించి రైవతుఁడు స్వపురి
కరుగుఁదెంచి జక్కులభీతిఁ బురి విడిచిన, భ్రాతలు దిగంతములకుటఁ గ్రమత నేఁగె.

క. బలశాలికి బలునకు నుజ్జ్వలగాత్రిన్ బుత్రినొసఁగి జనపతి దపమున్
సలుప బదర్యాఖ్యము నిర్మలమా నారాయణాశ్రమంబును జేరెన్. 73

---

## అధ్యాయము 4.

అంబరీషోపాఖ్యానము

శ్రీశుకుఁడు:—

క. మనుపుత్రుఁడైన నభగున, కును నాభాగుండనంగ నొడుకుఁ గలండా
తని బ్రహ్మచారి కవియని, ధన మొసఁగక పంచికొనిరి తద్భ్రాతలోగిన్. 74

సీ. అంతట నాభాగుఁ డటకరుదెంచి యో, భ్రాతలారా! నాకుఁ బంచినట్టి
భాగ మేదన నీకు భాగము తండ్రియే, యనఁ దండ్రిఁ జేరి యో యయ్య! నిన్ను
నాకు భాగముగ నన్నలు పంచిరేమన, నది విశ్వసింపరాదైన వినుము
అధికమేధావు లీయంగిరుల్ సత్రయాగమున షష్ఠదినార్హకర్మమందు
గీ. మూఢు లయ్యెద రప్పుడు పోయి నీవు, దకుతన్ వైశ్వదేవసూక్తములు రెండు
దెలిపిన న్నీకుఁ దుదివారు దివి కరుగుచు, సత్రపరిశిష్టధనము నొసంగఁగలరు. 75

క. కావున నీ వట కేగుము, నావుడు నది యాలకించి నాభాగుఁడు తా
నా విధి నొనర్ప నంగిరు, లా విభునకు ధన మొసంగి యరిగిరి దివికిన్. 76

ఉ. ఈగతి నంగిరుండు తన కిచ్చిన యజ్ఞధనంబు నెల్ల నా
భాగుఁడు స్వీకరించు నెడ బల్మినిఁ గృష్ణశరీరుఁడున్ మహా
భాగుఁడు పూరుషుం డొకఁడు వచ్చి నృపాలకుమార! యజ్ఞభూ
భాగధన మ్మదెల్లఁ దలపంగ మదీయమునుమ్ము పొమ్మనన్. 77

క. మునివరదత్తం బిది నా, దని నాభాగుండు పలికె నంత నతఁడు నీ
జనకుఁడు చెప్పిన చందం, బున విందము మన ముభయులము దగ ననినన్. 78

శా. ఆ నాభాగుఁడు తండ్రి నడ్డిగె నాయంశంబు నాతండనెన్
జ్ఞానుల్ మానులు యజ్ఞవాస్తుగతమా సర్వంబు నుచ్ఛిష్టమున్

జానా రుద్రునకున్ విభాగ మని యోజన్ జెప్పి రక్షాట వ
ద్దానిన్ మానక రుద్రదేవుఁడె సమస్తంబున్ గొనంగాఁ దగున్. 79

మ. నరనాథా! పితృవాక్యమెల్ల విని యానాభాగుఁ డంతన్ మహే
శ్వరుఁడౌ రుద్రుని పాలికిం జనియు సాష్టాంగంబుగా మ్రొక్కి యీ
శ్వర! మృత్యుంజయ! దేవ! వాస్తుగతమాసర్వంబు నీదంచుఁ బం
డిరి వాక్రుచ్చెఁ గృతాపరాధు నను మన్నింపన్ నినున్ వేడెదన్. 80

రుద్రుఁడు:—

గీ. పలికె నీతండ్రి ధర్మంబుఁ బలికి తీవు, సత్యవచనంబు గావున సత్రిశిష్ట
ధన మొసంగితి మఱి సనాతనము మంత్ర, ఘనము నైన బ్రహ్మజ్ఞానమును నొసఁగితి.

చ. కడవఁగరాని యాపదలు గల్గిన నొక్కఁడుడే నసత్యమున్
నుడువఁగరాదు సత్యమున నునున్ బరితుష్టుఁడనైతి నేను నా
తఁడుఁ బ్రియుఁడౌను నాకు నిదె దివ్యము గొమ్మఖిలమ్ము నిష్ఠ నీ
కిడితి నటంచు రుద్రుఁడు వచించి తిరోహితుఁ డయ్యె నయ్యెడన్. 82

మ. అతిభక్త్యున్నతిమై ప్రభాతమున సాయంకాలమందున్ సమా
హితచిత్తుండయి సంస్మరించునొ యెవండీ పుణ్యచారిత్రమున్
మతిమంతుండగు నా జనుండు కవియున్ మంత్రజ్ఞుఁడై యాత్మస
ద్గతినిం బొందు నిజమ్ము సుమ్మిది నరేంద్రా! పెక్కులిం కేటికిన్. 83

ఉ. ఏ గుణశాలినిన్ భృగుసుతేరితభీషణ బ్రహ్మశాసమున్
లోఁగి స్పృశింపలేక యవలోపముఁ జెంది యడంగె నట్టి నా
భాగజుఁ డంబరీషుఁడు ప్రభావధురంధరుఁ డీశ్యుఁడున్ మహా
భాగవతోత్తముండునయి వన్నెకు నెక్కె ధరాతలంబునన్. 84

విష్ణురాతుఁడు:—

ఉ. మానివిమోచితంబు గ్రసమాన దిగంతదురంతతీవ్రకృ
త్యానల మెవ్వనిం జెఱుపదక్షముఁగాక యడంగె నట్టి భూ
జానివతంసుఁడున్ బృథుభుజాబలగణ్యుఁడు పుణ్యుఁడైన యా
శ్రీనిధి యంబరీషుని ప్రసిద్ధచరిత్ర వినంగఁ గోరెదన్. 85

శ్రీశుకుఁడు:—

మ. పరిస్ఫూర్తోత్కృష్టత భూరిసంపదలు సప్తద్వీపసంయుక్తమా
వసుధం బొందియు నంబరీషుఁడు మహాభాగుండు పుంస్కోటికిన్
బొనగం దుర్లభమైన తత్సకలమున్ బుద్ధిన్ విమర్శించి స్వ
ప్నసమానం బనియెంచు నిత్యమును దసన్నాశంబు గుర్తించుచున్. 86

మ. భగవంతుండగు విష్ణునందు మఱి తద్భక్తవ్రజంబందు సా
ధుగణంబందును మానిబృందములయందున్ భక్తిఁ గావించు స
త్యగవేషుండగు నంబరీషుఁడు సమస్తంబైన నిస్సారమా
జగమున్ డెందమునన్ నికృష్టమగు లోష్టంబట్లు భావించుచున్. 87

సీ. హృదయంబు శ్రీకృష్ణ పదపద్మములయంద, సూక్తు లీశగుణప్రసక్తియంద
పాణులు విష్ణుభవనమార్జనములంద, వీనులు హరికథల్ వినుటయంద
కనులు వైకుంఠు నాకారదర్శనమంద, మూర్ధంబు కేశవు మ్రొక్కులంద
ఘ్రాణంబు తత్పదకంజసౌరభమంద, తగులంబు విభుని యాత్రాదిగమునంద
గీ. సంగము ముకుందజన తనుస్పర్శమంద, రసనయుం దులసీదళ గ్రసనమంద
పొసఁగఁ గామ్యకర్మంబుల పొంతఁబోక, శ్రీకరగుణాకరుం డంబరీషుఁ డలరె. 88

మ. సతతంబిట్లు స్వకర్మకాండమును యజ్ఞాధీశుఁ డామ్నాయసం
స్తుతుఁ డాత్మేశుఁడునా యధోక్షజునియందున్ భక్తి నర్పించుచున్
కృతకృత్యుండయి యంబరీషుఁడు మహానిష్ఠన్ ద్విజేంద్రప్రచో
దితుఁడై యేలెఁ గురుక్షితీశ్వర! ధరిత్రీమండలం బంతయున్. 89

సీ. అలఘు సరస్వతీ పులినభాగముల ని, ర్జలదేశమునఁ బ్రకృష్టత వసిష్ఠ
గౌతమాసితముఖ్య కారితంబులు భూరి, దక్షిణంబులు విస్తృతములునైన
అశ్వమేధంబుల యజ్ఞేశు హరి నదో, షుండగు నంబరీషుఁడు యజించెఁ
దత్క్రతువులను సదస్యులు ఋత్విజుల్, జనులును గీర్వాణ సదృశరూపు
గీ. లగుచు ననిమిషభావంబునందుచుండ్రు, విష్ణుదేవుని చెయిదముల్ వినుచుఁ బాడు
చుండుఁ దజ్జనుల్ స్వర్గమే నొల్లరన్న, నింక నయ్యంబరీషు వచింపనేల. 90

గీ. శ్రీమహావిష్ణు మదిని వీక్షించుచున్న, అంబరీషుజనుల భ్రమయంగఁ జేయ
వలఘుతరములై సిద్ధులకైనఁ గాని, యందఁగారాని కామమ్ములైన నధిప! 91

గీ. ధరణివిభుఁ డంబరీషుఁడు ధర్మయుతము, నురుతపోయుక్తమగు భక్తియోగ
మునను
హరినిఁ బ్రీతునిఁ జేయుచు నఖిలసంగ, ములను మెల్లన వర్జించె నలఘుశక్తి. 92

ఉ. దారసుతాదులం దవసథంబులయందు రథంబులందుఁ బె
న్వారణవాజులందు వసనాభరణాయుధరాజులందు భం
డారములందు బాంధవగణంబులయందును నంబరీష ధా
త్రీరమణాగ్రగణ్యుఁ డొనరించె ననన్మతి సంయతాత్ముఁడై. 93

గీ. ఘనతరైకాంతభక్తియోగమునఁ జేసి, ప్రీతుఁడై హరి రిపుజనభీషణంబు
భక్తజనపోషణంబునై పరఁగు చక్ర, రాజమును నొసంగె నమ్మహారాజునకును. 94

క. సమశీలయైన నిజప, ట్టమహిషితోఁ గూడి పెనుగడంకన్ బురుషో
త్తము నారాధింపఁగ న, బ్దము పూనెన్ ద్వాదశీవ్రతము యుక్తుండై. 95

చ. కడఁక మెయిన్ వ్రతాంతమునఁ గార్తికమాసమునన్ ద్రిరాత్రమున్
బుడమివిభుండు దాను సముపోషితుఁడై యమునాసరివంతినిన్
గడునియమంబు నిష్ఠయెసఁగన్ దగ స్నానముఁ జేసి భక్తిసం
దడి నొకనాఁడు దా మధువనంబున నర్చ నొనర్చె శ్రీహరిన్. 96

గీ. అఖిలసంభారములను మహాభిషేక, విధుల హరి నభిషేచించి వివిధగంధ
మాల్యభూషణవస్త్రాది సమస్తవస్తు, తతులఁ బూజించె నవ్విభుఁ డస్మయుఁడయి.

వ. మఱియు సిద్ధార్థులును, మహాభాగులు నగు బ్రాహ్మణోత్తములను బరమభక్తిం
బూజించి. 98

ఉ. రాజవరుండు రాజతఖురంబులు భాసురహేమశృంగముల్
రాజిల లేఁతప్రాయమునఁ గ్రాలుచుఁ గ్రేపులతోడ నొప్పుచున్
సాజములైన రూపములఁ జక్కఁ వెలుంగుచుఁ బాలవెల్లిలో
నా జను నాల నష్టాసఁగెఁ నర్బుదషట్కము విప్రకోటికిన్. 99

మ. మనసారన్ దొలుతన్ ద్విజేంద్రుల భుజింపం జేసి మృష్టాన్నముల్
వెనుకన్ భూవరుఁ డంబరీషుఁ డధిక ప్రీతాత్ముఁడై వారి చే
త ననుజ్ఞంగొని పారణంబునకు యత్నం బల్లనం జేయు నం
తన దుర్వాసుఁడు వచ్చెఁ దా నతిథిగాఁ దత్త్వప్రబోధోల్లాసుఁడై. 100

శా. దుర్వాసోముని లోకనాథునకుఁ బ్రత్యుత్థానమున్ జేసి యా
యుర్వీశుం డుచితాసనంబునిడి విధ్యుక్తపరికారంబునన్
హర్షొప్పంగ సపర్యఁ జేసి యిట మాయాతిథ్యముం గొమ్ము లె
మ్మర్వీదేవవరా! యటంచు వినయం బొప్పంగ వేడెన్ మునిన్. 101

శా. ఆ మౌనీంద్రవతంసుఁడున్ నరవరేణ్యాభ్యర్థనప్రక్రమం
బామోదించి చనెన్ వెసన్ సలుపఁ గాల్యంబైన కృత్యంబు నో
భూమీనాయక! యాతఁ డంత పరమాత్మున్ భక్తి ధ్యానించుచున్
దా మున్గెన్ యమునానదీజలమునన్ జ్ఞానాభిరక్తాత్ముఁడై. 102

గీ. ధర్మవిదుఁ డంబరీషభూధవుఁడు ద్వాద, శీతిథియు ముహూర్తార్థావశిష్టయగుట
ద్విజవరుండు రాకుంటయుఁ దెలిసి మదిని, ధర్మసంకటమునఁ బడి తా నలంగె. 103

గీ. ద్వాదశీతిథియందు సత్పారణమున, సద్విజాతిక్రమమున దోషంబుగల్గు
నేదిసల్పిన మేలుప్రాపించు నాకు, నెటు లధర్మమ్ము నను స్పృశియింపకుండు. 104

క. కేవలము సలిలపానము, చే వెస వ్రతపారణంబుఁ జేయుదు క్షోణీ
దేవులు జలభక్షణమున్, భావిం తశనంబు ననశనంబు నటంచున్. 105

గీ. ఇట్లు జలభక్షణం బొనరించి మదిని, శ్రీహరిధ్యానపరుఁడు రాజర్షివరుఁడు
బ్రాహ్మణాగమనమునకై భక్తిమీఱ, నెదురుఁజూచుచునుండె మహీతలేశ! 106

మ. అట స్నానాదికకృత్యముల్ నెఱపి పూజ్యుండౌ కళిందాత్మజా
తటభాగంబుననుండివచ్చె ముని యాధాత్రీశుఁడున్మ్రొక్క నం
తటఁ దచ్చేష్ట నెఱింగి క్రోధవిచలద్గాత్రుం డురుభ్రూకుటీ
కుటిలాస్యుండు వచించె నిట్టులు భుభుక్షుండై నృపుం జూచుచున్. 107

దుర్వాసుఁడు:—

శా. శ్రీమత్తుండు నృశంసకుండు నతి దర్పిష్ఠుండునై నట్టి యీ
భూమీనాథుని దుష్టమైన చెయిదంబు ల్గంటిరే మీర లి
ప్డీ మాంధాతృసుఁడు విష్ణుభక్తుఁడె? ధరిత్రీశాభిమానంబుతో
నీ మాడ్కిన్ జరియించెఁ బాపమతియై యాతం డుపేక్షార్హుఁడే? 108

క. ఆతిథ్యమునకు నన్నుం, బ్రీతిఁ బిలిచి నా కొకింతఁ బెట్టక ధృష్టుం
డై తా భుజించె నీతని, నీ తఱిఁ దత్ఫలము నెల్లనేఁ గుడిపింతున్. 109

శ్రీశుకుఁడు:—

క. అని యిట్టులు నుడువుచు రో, షనిబద్ధుండగుచు మౌనిజటను బెఱికి దా
నినిఁ గాలానలసమకృ, త్యను గావించి వడిఁబనిచెనా నృపు పైకిన్. 110

చ. బెడిదపువాలు కేల ఝుళిపించుచు మండుచు నగ్గురాపిడిన్
బుడమి వడంకఁజేయుచును బోరన మీఁదికి నుగ్రరీతిఁగా
నడరుచునున్న కృత్యను మహామహిమాన్వితుఁ డంబరీషుఁ డ
య్యెడఁ బొడఁగాంచి యొక్క యడుగేనిఁ జలింపకయుండె ధీరతన్. 111

ఉ. అంతట భక్తుఁగావఁగ మహాపురుషుండు రమాకళత్రుఁ డ
త్యంతభయావహంబును సుదర్శన నామకమైన చక్రమున్
వింతఁగఁ బంచె నయ్యదియు వేగమ కృత్యను దావవహ్ని దు
ర్దాంతమహోరగంబును విధంబున వెల్మిడిఁ జేసె వెల్మిడిన్. 112

మ. తన యామానము వ్యర్థమౌటయును గృత్యన్ దగ్ధఁ గావించియుం
దనపైఁ జక్రము బాఱుదెంచుటయు నంతన్ భీతచేతస్కుఁడై

కని దుర్వాసుఁడు దిక్కులం బఱచె వేగన్ బ్రాణరక్షార్థియై
యనఘా! భాగవతాపచారులకు శ్రేయం బౌనె యెందేనియున్. 113

మ. విను భూనాయక! విష్ణుచక్రము మునిన్ వెన్నంటి తోడ్తోఁ జనెన్
ఘనదావాగ్ని మహాహినింబలె నుదగ్రప్రక్రియన్ ఘోరమై
తను వెంటాడెడు చక్రము న్గనుచు సంత్రస్తాత్ముఁడై యమ్మహా
మునియుం బాఱె సుమేరుభూధరగుహాభూభాగమున్ జేరఁగన్. 114

శా. ఆకాశంబును మేదినీతలము నాశాంతంబులన్ వార్ధులన్
లోకాధీశ్వరసంయుతంబులగు నాలోకంబులన్ దివ్యమా
నాకంబున్ వివరంబు లి క్లైట నెటన్ బ్రాణేచ్ఛఁ బాఱున్ దురా
లోకంబౌ హరిచక్రముం దపసి యాలోకించె నందందునన్. 115

ఉ. ఎందును దిక్కుఁ గానక మునీంద్రుఁడు భీతమనస్కుఁడై శతా
నందునిఁ బద్మగర్భు శరణంబును బొందఁదలంచి యార్తిచేఁ
గుందుచు సత్యలోకమునకుం జని యో పరమేష్ఠి! దేవ! యో
జం దయఁజూడవే యతివిశంకటచక్రమునుండి కావవే. 116

బ్రహ్మ:—

మ. ద్విపరార్ధాహ్వయకాలమందుఁ దగఁ దత్క్రీడావసానంబునన్
విపులంబైన సమస్తవిశ్వమును మద్వేశ్మంబునున్ శ్రీరమా
ధిపుఁడున్ గాలమయుండునై తనరు నాదేవేశు భ్రూభంగ మా
త్ర పరివ్యాప్తినశించుఁ జూవె యతివర్యా! వెక్కలిం కేటికిన్. 117

ఉ. ధాతను నేను శర్వుఁడును దక్షభృగుప్రభృతుల్ ప్రజాపతుల్
భూతపతుల్ సురేశులును బోలఁగ నెవ్వరమున్ జగత్త్రయీ
ప్రీతివిధాయకంబగు పరేశుని యాజ్ఞను మూర్ధసీమలన్
ఖ్యాతిగఁ దాల్తు మట్టిగుటనా విభుచక్రము మాన్పశక్యమే. 118

క. అని బ్రహ్మ వచింపఁ దపోధనుఁ డుజ్జ్వలచక్రతాపతప్తుండగుచున్
జని కైలాసనివాసినిఁ, బినాకినింగాంచి శరణు వేఁడెఁ గృపణతన్. 119

శంకరుఁడు :—

సీ. ఎం దవశత బ్రిమియింతుమొ మే మట్టి, బ్రహ్మాండసంస్థ లేపరమపురుషు
వలనఁ గాలంబునఁ బ్రభవించు నశియించు, నట్టి శ్రీవిష్ణుచక్రాయుధంబు
నేమును వారింపలే మేను బ్రహ్మయు, నారదుండు సనత్కుమారుఁడు కపి
లుఁడు ధర్ముఁడును దేవలుఁడు ననురేంద్రపుత్రుఁడు మరీచ్యాదులుఁబరాఘిసన్య

గీ. పారదర్శులౌ సిద్ధదేశులారయంగ, మునివర! యమేయమాయావిమోహితులయి
యించుకేనియుఁ దన్మాయ నెఱుఁగలేక, స్రుక్కుచుందురు మింతయు నిక్కువంబు.

క. ఆ విశ్వేశుని చక్రం, బేవారికి మాన్ప రానిదిది ధ్రువము సుమీ
కావున నీ వికఁ జని యా, దేవుని శరణంబు వేడు తృప్తి యొదవెడున్. 121

మ. వసుధాధీశ! నిరాశుఁడై పిదప దుర్వాసుండు శ్రీదేవితో
నసమానోజ్జ్వలవైభవాఢ్యుఁడయి యెందా దేవదేవుండు సొం
పెసలారన్ వసియించుచుండునో యతిప్రీతిన్ వికుంఠాఖ్య నొ
ప్పు సుపూజ్యంబగునట్టి శ్రీహరిపురంబుం జేరె ధన్యాత్ముఁడై. 122

మ. హరిచక్రానలదహ్యమానుఁ డురుకంపాయత్తగాత్రుండునై
వెరవొందెద్దియుఁ గానరామి నల శ్రీవిష్ణుప్రభున్ జేరి త
చ్ఛరణంబు స్మరణంది యిట్లనె నధీశా! యచ్యుతా! శ్రీధవా!
వరదా! నన్నుఁ గృతాపరాధుఁ గృపఁ గాపాడంగదే దీనునిన్. 123

ఉ. నీ మహిమం బెఱుంగుటకు నేరని నేను భవత్ప్రియాళికిన్
బాములఁ గల్గఁజేసితి నపాచితము న్దగ దాని కిమ్మ నీ
నామము సంస్మరించునెడ నారకుఁడైనను ముక్తి నొందెడున్
ప్రేమమయస్వరూప! పరమేశ్వర! దీనజనావనోత్సుకా! 124

శ్రీభగవానుఁడు:—

క. నే నెప్పుడు భక్తపరా, ధీనుఁడనై యుందుఁ గాన ద్విజ! స్వాతంత్ర్యం
బూనను భక్తజనుల్ మ, న్మానసము హరింత్రు తజ్జనహితుఁడ నగుదున్. 125

గీ. నాకునై నేను గోర నెన్నఁడును మదిని, నీవె దిక్కని యితరమున్విడిచి నన్నుఁ
గోరి కొల్చు మద్భక్తులకొఱకె కాని, సకలసౌభాగ్యలక్ష్ములన్ సంయమీంద్ర! 126

క. దారసుతబంధువిత్తా, గారప్రాణముల నిహసుఖము పరసుఖమున్
ధీరతఁ ద్యజించి నన్నున్, జేరెడు భక్తులను విడువ నేర్తునె చెపుమా. 127

గీ. సంయమీ! సమదర్శులౌ సాధుజనులు, మనసు నాయందు నిల్పి నిర్మలినభక్తి
నన్నులోఁగొనుచుంద్రు సుపుణ్యమతులైన, సతులు యోగ్యవర్తనుఁడైన పతినిఁ బోలె.

క. నాదగు సేవన్ సాలో, క్యాదిచతుష్టయము ప్రాప్తమైనఁ గొనరు సే
వాదృఢబుద్ధులు తా మా, మోదింతురె కాలగళితముల నన్యములన్. 129

గీ. సాధువులు నాకు హృదయంబు సాధువులకు, నేను హృదయంబునగుదును మౌనివర్య!
నన్నుఁ దక్కంగ వారలన్యం బెఱుంగ, రేనుఁ గూడ వారలకంటె నితర మెఱుఁగ.

గీ. కాన నెవ్వనివలన నీకుగాసి నీకు, నయ్యె నతనినే శరణంబునందుమయ్య!
సాధుజనులందుఁబఱపు తేజంబుదత్ప్ర, యోక్తకె యమంగళంబుబిట్టొదవఁజేయు.
గీ. తపము విద్యయు విప్రవ్రతంసులకును, రెండుఁగల్గించుచుండు నిశ్శ్రేయసంబు
నవియ యవినీతికరులగుచునా ద్విజులకు, విప్రవర! యశుభంబుఁ గావించుచుండు.
క. మునివర! చను నీకున్ శో, భనమగు నాభాగసుతునిఁబార్థివముఖ్యున్
గని వేడు క్షమాపణమును, ఘనతరతాపోపశాంతిగల్గును దానన్. 133

---

## అ ధ్యా య ము ౫.

### దుర్వాసోగర్వభంగము

శ్రీశుకుఁడు:—

క. భూదయితా! యిట్లు భగవ, దాదిష్టుండై సుదర్శనానల తప్తుం
డా దుర్వాసుఁడు పోయి వి, పాదముతో నంబరీషుచరణముఁ బట్టెన్. 134
క. ఆ దుర్వాసునిఁ గనుఁగొని, పాదస్పర్శమున సిగ్గుపడి నృపుఁ డెద నెం
తే దయగదురఁగ నా దా, మోదరవరచక్రరాజమున్ స్తుతియించెన్. 135

అంబరీషుఁడు:—

సీ. వైశ్వానరుఁడ వీవభాస్కరుండవు నీవ, యుడుపతినైన సోముఁడవు నీవ
సలిలంబ వీవ విశ్వంభరవును నీవ, వ్యోమంబ వీవ వాయువును నీవ
సకల మాత్రేంద్రియసంచయమ్ములు నీవ, సర్వాత్మకుఁడ వీవసాక్షి నీవ
ధర్మంబు నీవ సత్యంబును నీవ పెం, ధృతియును నీవ సత్క్రతువు నీవ
గీ. యజ్ఞభోజివి నీవ యయ్యఖిలలోక, పాలుకును నీవ తేజంబుఁబౌరుషంబు
నీవ మొక్కెద ద్విజుఁబ్రోవుమనిఖిలశత్రు, సంహరా! యచ్యుతప్రియా!చక్రరాజ!
చ. అనఘ విశుద్ధతేజమవునచ్యుతభక్త సమస్త కార్య సా
ధనమవు ధర్మసేతువ వధర్మపరాసుర ధూమకేతునై
దనరెడు నట్టి దానవు సుదర్శనమంబువునై జగత్త్రయా
వనకృతివైన నీకు నిదేవందన మో శుభచక్రరాజమా! 137
చ. తమమును భాస్కరాములయుదంచితమైన ప్రకాశమున్ నిర
స్తమగునుగాదె యారయఁగధర్మమయుంబగు తావకీన తే
జమున సుదర్శనాఖ్య హరిచక్రమ! మెన్నఁగ లేము నీదు ది
వ్యమహిమ బ్రహ్మయున్ సదసదాత్మక విశ్వము నీదు రూపమా. 138

ఉ. ఓ విజయాలవాల! పురుషోత్తముచేత విసర్జితంబవై
నీవల దైత్యయోధుల యనీకములం జొరఁబాఱి ఘోర యు
ద్ధావని వారిబాహులు పదంబులుఁ గుక్షులు గొంతు లూరువుల్
ప్రేవులు ప్రోవులై పడఁగఁ బ్రేల్చుచుఁ బెంపెసలారు దెంతయున్. 139

చ. ఖలులను సంహరింపఁగ జగత్త్రయరక్షణ దక్షు నిన్ను న
ర్మిలిని గదాధరుండు నియమించెగదా యదియట్టులౌట మా
కులము శుభోన్నతి న్గనుటకు న్గరుణించి సుదర్శనంబ! వి
హ్వలుని ద్విజేంద్రుఁ గావు మిపుడయ్యది మాయెడల న్ప్రసాదమా. 140

గీ. నేను దానముఁ జేసితినేని యజ్ఞ, ముల నొనర్చితినేని నియమ్ముల స్వధర్మ
మునఁ జరింతునే న్నాకు విప్రుండు స్వకుల, దైవమగునేని ద్విజుఁడు వీతజ్వరుఁడగు.

గీ. నిఖిలభూతాత్మ భావుఁడై నెగడుచున్కి, నొక్కఁడును సమస్తగుణాశ్రయుండునైన
విష్ణుదేవుఁడు నా సేవఁ బ్రీతుఁడేని, దప్పకీ ద్విజవరుఁడు భద్రంబుఁ గనుత. 142

శ్రీశుకుఁడు:—

చ. అని ఘనుఁ డంబరీషుఁడు నయంబునఁ బ్రస్తుతిఁ జేయఁగా సుద
ర్శనమను పేరనొప్పు హరిచక్రము శాంతివహించి తేని ప్రా
ర్థనమునఁ జేసి తాపసవతంసునకించుక యేనిఁ దాపమున్
దనువునకు న్మనంబునకుఁ దాఁ గలిగింపక యుండె నత్తఱిన్. 143

మ. జవసంయుక్త సుదర్శనాహ్వయ మహాచక్రానల జ్వాలచేఁ
బ్రవిముక్తుండును భద్రయుక్తుఁడయి దుర్వాసుండు సంప్రీతితో
నవనీనాథున కంబరీషున కమోఘాశీః ప్రదానంబు న
ర్హవిధిన్ జేయుచుఁ దద్గుణాళిఁ బొగడెన్ బ్రజ్ఞా విశేషంబునన్. 144

దుర్వాసుఁడు:—

ఉ. ఔర! కృతాపరాధునకునై నను బాయక శోభనంబులం
గూరిమిఁ గూరుపంగఁ దలకొన్న మహాత్ముఁడ వీవు గావునన్
భూరమణాగ్రణీ! పరమపూరుషభక్తుల యత్యుదారగం
భీరమహత్త్వ మిప్పు డిదమిత్థ మటంచు నెఱుంగఁ గల్గితిన్. 145

గీ. దుష్కరం బొక్కఁ డున్నె సాధులకు మఱియు
దుస్త్యజం బున్నె యమ్మహాత్ముల కొకింత
పరమపూరుషుఁ డా భగవంతుఁడు హరి
వారి హృదయంబులందుఁ గైవస మగుటను. 146

ఉ. ఏ నరుఁడేని నొక్కపతికెవ్వని నామము విన్నయంత మా
త్రాన సమస్తపాప సముదాయములు న్నశియింపఁ బావనుం
డౌను బరావరేశుఁడగునా హరి ప్రేమకుఁ బాత్రుఁడున్ శుభా
ఖ్యానుఁడునైన భక్తునకుఁ గల్గునొకో! యవశిష్ట మెద్దియున్. 147

చ. నరవర యంబరీష! వినునా యపరాధము వెన్కఁద్రోచి య
బ్బురముగ నాదుప్రాణములఁ బ్రోచి కృపారససిక్తదృష్టి దు
స్తరతర చక్రవహ్ని పరితాపముఁ బాపియు నెయ్యమొప్ప న
న్నరసి యనుగ్రహించితి జయంబగు నీ కిఁకఁ బోయివచ్చెదన్. 148

శ్రీశుకుఁడు:—

గీ. తిరిగి చనుదెంచు ననెడుబుద్ధిం గుడువక, యున్నయయ్యంబరీష నృపోత్తముండు
పాదములువట్టి మునినిఁ బ్రసాదకలితుఁ, జేసి మృష్టాన్న మెలమి భుజింపఁజేసె.

క. యతితిలకుం డాత్మకు న, మ్మతమగు భోజనముఁ జేసి మదిఁ దృప్తుండై
హితమతియై త్వరఁబెట్టెన్, క్షితిపతిని భుజింపు మిఁక భుజింపు మటంచున్. 150

దుర్వాసుఁడు:—

ఆ. పార్థివేంద్ర! పరమభాగవతుండవౌ, నిన్నుఁ గంటి వింటి నీదు నుతులు
అంటితిని భవచ్ఛుభాంగంబుఁ బ్రీతుండ, నైతి భవదనుగ్రహమ్ముకతన. 151

మ. జననాథాగ్రణి! యంబరీష! యతిపూజ్యుండవైన యేతద్భవ
ద్ఘనకర్మన్ దివియందు దేవవనితల్ గానంబుఁ గావింతురే
దినియందున్ గడుఁ బావనంబగు భవత్కీర్తిన్ ముదాన్వితులై
జనముల్ కీర్తనచేయుచుంద్రు చుమి యాశాంతంబులన్నిత్యమున్. 152

శ్రీశుకుఁడు:—

క. అనికీర్తించి నరేంద్రుని, మునిపతి దుర్వాసుఁ డధికముదితాత్ముండై
చనెఁగడిఁది బ్రహ్మలోక,మ్మున కా విభు వీడుకొని నభోమార్గమునన్. 153

గీ. భూప! యదికి దుర్వాసుఁడు పోయి మగిడి, రాక గడచిన సంవత్సరంబుగడిచె
నంతదనుకం బుభుక్షునై యట్లువేచి, యుండె మునిరాకకై నృపాలోత్తముండు.

శా. దుర్వాసుండు చనంగ నంత నరనాథుం డంబరీషుండు దా
హార్వాప్పంగ ద్విజోపభోగమును నీ తాన్నంబు భక్షించి ని
ర్గర్వుండై ఋషివర్యుక్లేశము స్వవీర్యంబున్ విమర్శించుచున్
సర్వం బెన్న హరిప్రభావ మనుచున్ భావించె స్వాంతంబునన్. 155

చ. అరసి మది న్విరించిపదమాదిగఁగల్గు సమస్తభోగముల్
హరిపద భక్తిఁ దుఃఖనిరయంబునకున్ సరిగాఁగ నెంచి యా
పరముఁడు నాదిపూరుషుఁడు బ్రహ్మమునౌ హరియందు గాఢని
ర్భరతరభక్తి నిల్పి సుకరంబుగఁ జేయుఁ గ్రియాకలాపమున్. 156

చ. అమలినచిత్తు లాత్మసములైన కుమారులయందు రాజ్యభా
రమునిడి ధీరచిత్తుఁడయి రాజఋషీశ్వరుఁ డంబరీషుఁ డో
ర్పుమెయి వనంబుఁజొచ్చి పరిపూర్ణతరుండగు వాసుదేవు నం
దు మనసుఁ బాదుకొల్పెఁ గడుఁ దూలిచనంగ గుణప్రవాహముల్. 157

గీ. పరమపుణ్యంబు భక్తిబంధురమునైన, యంబరీషనృపాలకాఖ్యానము రహి
మించఁ గీర్తించుచున్ స్మరియించుచున్ జనుండు భాగవతుండగుఁ బాండవేయ!

---

## అధ్యాయము 6.

-ఇక్ష్వాకువంశానుక్రమము-మాంధాతృప్రభృతికచరిత్రము-

శ్రీశుకుఁడు:—

సీ. విను మంబరీషభూవిభునకుఁ దగ విరూ, పుండను కేతుమంతుండు శంభుఁ
డనుమువ్వు రుదయించి రాత్మజు లందు వి, రూపనామునకుఁ బుత్రుండగుచును
బృషదశ్వుఁ డొప్పె నాపృథివీశునకు రథీ, తరుఁడనువాఁడు దాఁ దనయుఁ డయ్యె
ననపత్యుఁడైన యాతని కళత్రమునందు, బ్రహ్మవర్చస్కులై పరఁగు సుతుల

గీ. నంగిరుండు పుట్టించె వారాంగిరసులు, నల రథీతరగోత్రులై వెలయు చితరు
లగు రథీతరుల న్మించి నెగడుచుండి, బ్రాహ్మణోత్తములై కురువంశముఖ్య!

గీ. మానవేశ్వర! మనువుతుమ్మంగ నతని, ఘ్రాణముననుండి పొడమె నిక్ష్వాకునాముఁ
డతనికిన్ బుత్రకులు నూర్వురందు జ్యేష్ఠు, లైరల వికుక్షినిమిదండకాఖ్యులధిప!

గీ. ఇర్వదేవు రార్యావర్తపూర్వభాగ, మేలిరందు మఱిర్వదియేవు రేలి
రరయఁ బడమర మువ్వు రేలిరి నడుమును, దక్షిణోత్తరమేలిరితదితరులును.

సీ. అవనీశ! యొక్కనాఁ డష్టక శ్రాద్ధంబు, నందు నిక్ష్వాకుండు నందనుగని
యో వికుక్షి! తడవుండక మేధ్యమాం, సమ్మును వని కేగి తెమ్ము పొమ్ము
నావుడు నాతఁడున్ దా వల్లెయని వన, మ్మున కేగి శ్రాద్ధార్హముల మృగములఁ
జంపి యాఁకట మ్రగ్గి శ్రాంతుఁడై యొక్క శ, శమును భుజించె నష్టస్మృతియయి

గీ. తండ్రికి న్నేష మొసఁగె నాతండు గురుని
బ్రోక్షణకుఁ బ్రోత్సహింప గురుండు దెల్పె
నతని దుష్కర్మ విధిబాహ్యుఁడైన సుతుని
నెట్టివైచె దేశమునుండి నృపవరుండు. 162

గీ. పార్థివేంద్ర! యిక్ష్వాకుభూపాలుఁడు గురు, నరుఁడగు వసిష్ఠుతోడ సంవాదము తగఁ
జేసి యోగియై తనువుఁ ద్యజించి తాన, పరమపదమును జేరె నిర్భరముగాఁగ.

గీ. తండ్రి యీరీతిఁ బరమపదంబుఁ జెంద, మగిడి వచ్చి వికుక్షి భూమండలంబు
నేలుచును యజ్ఞములచే యజించె హరిని, జగతిని బ్రసిద్ధికెక్కె శశాదుఁడనుచు.

గీ. జనవరా! తత్సుతుఁడు పురంజయుఁడనియును
బ్రాభవంబొప్పఁగా నింద్రవాహుఁడనియు
మఱి కకుత్స్థుండని పిలువంబడియె వినుము
కర్మసిద్ధములగు దదాఖ్యలఁ దెలిపెద. 165

చ. అసురులతో సురాళికిఁ గృతాంతమునందుఁ బ్రవృత్తమైన ఘో
ర సమరమందు దానవపరాజితులై ధృతిఁదూలియున్న దే
వ సమితిచే వరింపఁబడె బానటగా జగదేకవీరుఁడై
యొసఁగు శశాదుపట్టి పరమేశ్వరుఁడౌ హరియాజ్ఞచొప్పునన్. 166

మత్తకోకిల. దేవదేవుఁడు విశ్వరూపుఁడు దేవలోకహితుండు దీ
నావనుండును వేదవేద్యుఁడునైన విష్ణుని యానతిన్
భూవరోత్తమ! వాహనత్వముఁ బొందెఁ దాను మహోక్షమై
దేవవల్లభుఁ డింద్రుఁ డర్హమతిన్ శశాదుని పట్టికిన్. 167

మహాస్రగ్ధర. నరనాథా! భూమిభృన్నందనుఁడు ససురసన్నద్ధుఁడై దివ్యమౌ భా
సురచాపంబున్ నిశాతేషువులనుగొని సంస్తూయమానప్రదుండై
హరి తేజస్సంభృతుండై యలరుచు వృషవాహం బధిష్ఠించియున్ మూ
పురమందు న్గూరుచుండెన్ బొలుపుగఁ ద్రిదశవ్యూహముల్ దన్నుఁ గొల్వన్.

గీ. వృషభరూపేంద్రకకుదుపవిష్టుఁడగుచు, దేవతలఁగూడి పడమటిదిక్కునందుఁ
జుట్టి దైత్యులపురములు ముట్టడించె, దైత్యకాంతల యుల్లముల్ దల్లడిల్ల. 169

క. తుములము మహాద్భుతమునయి, యమరారిగణములకా శశాదసుతున క
య్యో మహారణ మటనెదిరిన, వినుతులనా నృపుఁడు యమునివీటికిఁ బుచ్చెన్. 170

చ. ఉరవడిఁ గ్రమ్మ దెంచు విలయోగ్రకృశానునిభంగి మండు ని
ష్ఠురశరపాతవేగమును జూచి కలంగి హతావశిష్టులా

సురరిపువీడు వెల్లఁ దమకుఁ గూరతడించి నిహన్యమానులై
వెరవఱి యోడి సల్గడల విచ్చిరి జొచ్చిరి స్వాలయంబులన్. 171

గీ. ఇట్లు రిపురం బతండు జయించి వజ్రి
కఖిలధనమిచ్చుట పురంజయాఖ్యఁ దనరె
వాహముగ నింద్రుఁ గొన నింద్రవాహుఁ డయ్యెఁ
గురువృష! కకుత్స్థుఁ డౌటఁ గకుత్స్థుఁ డయ్యె. 172

గీ. తత్సుతుండు శ్రవస్తుఁ డాతఁడు నిజాఖ్య, మించి శ్రావస్తిపురము నిర్మించె నధిప!
ఆ శ్రవస్తుపుత్రుఁడు బృహదశ్వుఁ డతని, పుత్రకుం డయ్యెఁ గువలయాశ్వుం డనంగ.

చ. అవనితలేశ! యా కువలయాశ్వుఁ డుదంకుని ప్రీతికై మహా
హవమున నేకవింశతి సహస్రయుతాన్వితుఁడై వధించె ను
క్కువుఁ డగు దుందు దానవుని కీర్తితుఁ డయ్యె జగాన దాన రా
జవరుఁడు దుందుమారుఁ డనుసంజ్ఞను బెంపగు ఖ్యాతిఁ జెందుచున్. 174

గీ. దుందుముఖవహ్నిచేతఁ దత్పుత్రులెల్ల, రొక్కమొగి మ్రగ్గిపోయిరో యుర్వినాథ!
ముగురుమాత్రము వారిలో మిగిలిరిల దృఢాశ్వకపిలాశ్వభద్రాశ్వు లనెడువారు.

వ. అందు దృఢాశ్వునకు హర్యశ్వుండును, వానికి నికుంభుండును, నికుంభునకు బర్హి
ణాశ్వుండును నతనికిఁ గృతాశ్వుండును, గృతాశ్వునకు సేనజిత్తును వానికి యువ
నాశ్వుండును బొడమిరి. 176

మ. యువనాశ్వావనిపాలవర్యుఁ డనపత్యుండౌట నిర్వేద మం
ది వనక్షోణికి నేగెఁ దాను శతపత్నీయుక్తుఁడౌచున్ గృపా
ళువులౌ మౌనివరుల్ సమాహితమతుల్ పొందొప్పఁగా నైంద్రమా
సవనంబున్ యువనాశ్వభూవిభునిచే నల్పించి రత్యున్నతిన్. 177

ఉ. ఆ యువనాశ్వభూరమణుఁ డద్దను రేయి విదాహకృత్పిపా
సాయుతుఁడై కడంగి మఖశాలను జొచ్చి ఋషీంద్రులెల్లరున్
హాయిగ నిద్రవోవఁ గని యల్లన నుజ్జ్వలమంత్రపూతమౌ
తోయముఁ ద్రావెఁ దాను దమితో సమింతోత్సుకతన్ నృపోత్తమా! 178

గీ. అంత మేల్కాంచి నిర్జలమగు కలశముఁ, గాంచి ప్రశ్నించిరా క్షమాకాంతు విప్రు
లెవనిపని యిదియిట్లు పుంసవనజలము, పాన మొనరింపఁబడియె భూపాల! చెపుమ.

గీ. అనియడిగి దైవచోదితుఁడై నృపుండె, త్రావుట యెఱింగి విప్రులాత్మల నల పర
మాత్ముఁ డగు నీశ్వరునకు నమస్కరించి, తలఁచి రపుడు దైవబలమె బలమటంచు.

గీ. అంతకాలంబు పరిపూర్ణమగుడు నా క్షితీశు దక్షిణకుక్షి భేదించి చక్ర
వర్తిగాఁగలపుత్రుండు ప్రభవమందె, ధారుణీధవ! యత్యద్భుతంబుగాఁగ. 181

సీ. స్తన్యమ్మునకును రోదనముఁ గావించు నీ, కొమరుం డిఁకేమి త్రాగునని ద్విజులు
దురపిల్లుచుండ నింద్రుఁడు చనుదెంచి యీ, తండు ద్రావింప మాంధాత యనుచుఁ
బలుకుచు వత్స! యేడ్వకుమని యూరడించుచు నోటఁ దర్జని సారిది నుంచె
విప్రదేవప్రసాదప్రభావమునఁ ద, జ్జనకుండు నయ్యెడఁ జావకుండె
ఆ. పిదప నతఁడు దపము పేర్మిసిద్ధినిఁ బొందె, రావణాది దస్యురాజి కితఁడు
త్రాసమొసఁగుఁ గాన త్రసదస్యుఁడను నామ, మిడియె బాలున కమరేశ్వరుండు.

సీ. అంతట నయ్యువనాశ్వభూవిభు తనూ, జాతుండు మాంధాతచక్రవర్తి
పాలించె నొక్కఁడ సప్తద్వీపపరివృత, క్ష్మాస్థలిన్ విష్ణుతేజంబుతోడ
నాత్మజ్ఞుఁడగుచు సర్వాగమమయుని స, ర్వాత్ము నతీంద్రియు నచ్యుతు హరి
భూరిదక్షిణలతోఁ బొలుపొందునట్టి య, త్యలఘుపావనయజ్ఞముల యజించె
గీ. ద్రవ్య మోషధిచయము మంత్రంబు యజ్ఞ
మరయ యజమానుఁడును ఋత్విగాదిగణము
ధర్మదేశకాలంబు లేతత్సమస్త
ముం బరబ్రహ్మమయమని బుద్ధిఁ గనుచు. 183

గీ. అర్యముం డుదయించి తా నస్తమించు, నంతకున్ సర్వసర్వంసహావలయము
యౌవనాశ్వుఁడౌ మాంధాతృభూవరేణ్యు, క్షేత్రమని పండితులచే వచింపఁబడియె.

గీ. క్షితిప! మాంధాతృభూపతికి శశబిందు, పుత్రియగు నిందుమతియందు మువ్వురైన
కొడుకు లుద్భవించిరి పురుకుత్సుఁ డంబ, రీషుఁడును ముచికుందుఁడు ప్రీతి నిడుచు.

వ. వారిచెల్లెండ్రు మాంధాతృకన్యలేబండ్రు సౌభరిమహర్షిసత్తముఁ బతిగా వరించిరి.
తదుదంతంబు నెఱింగించెద నాకర్ణింపుము. 186

మ. ఘనకాళిందిని మున్గి యుగ్రతపముం గావించు నమ్మౌని సై
ధునధర్మమ్మున నున్న మీనపతి యాత్మసౌఖ్యంబు వీక్షించి యా
త్మను జాతస్పృహుఁడై బిరానఁ జని మాంధాతృక్షితీంద్రుం గనుం
గొని 'రాజా! యొకకన్యనిమ్మ'నుచుఁ దాఁ గోరెన్ నయంబొప్పఁగన్. 187

వ. అని యిట్లు సంసారకాంక్షియైన సౌభరిచే నభ్యర్థితుండై మాంధాతృచక్రవర్తి
యమ్మహర్షిం గాంచి యో బ్రహ్మస్వరూపా! నాకన్యలను స్వయంవరంబున నొకరి
గ్రహింపు మనవుడు నతండు నేను ముసలిని, పలితకేశుండను, వళీకలితుండను,

కంపితశిరస్కుఁడను గావున నేనెట్లు స్త్రీజనంబునకుఁ బ్రియుఁడనగుదునని వితర్కించుకొని, 188

ఉ. కానఁజెలంగి నే నమరకాంతలకేని నభీష్టమైన నె
మ్మేను ధరింతు నిప్పు డుపక్రమింపఁగ నయ్యది మానవేంద్ర క
న్యానివహంబులన్ వలపునందగ ముంపకయున్నె యంచు న
మ్మౌని వినిశ్చితాత్ముఁడయి మంజులదేహముఁ దాల్చె నయ్యెడన్. 189

క. అంత లలితకన్యాళు, ద్ధాంతంబునఁ జేర్చె మునిని దౌవారికుఁ డా
కాంతశరీరుఁ వరించిరి, యెంతయుఁ దమి రాజకన్య లేబం ద్రోకనిన్. 190

ఉ. ఆ వరమౌనిమూలమున నా నృపకన్యక లాత్మలన్ సుహృ
ద్భావము డించి "నా కితఁడు దా ననురూపుఁడు మీకుఁ గాఁ" డటం
చీ విధిఁ గ్రుమ్ముసుద్దులొనరించుచునుండిరి తద్గతాత్మలై
యీ విధ మెల్లఁ గన్గొని మునీందుఁడు దక్షిణతాపటిష్ఠుఁడై. 191

సీ. మంత్రిసామర్థ్య సంపన్నుండు సౌభరి, రాజకన్యా ప్రకరంబుఁగూడి
నిజతపస్సంపద్వినిర్మిత లలిత ప, రిచ్ఛదయుతములౌ గృహములందు
నానావిధోపవనక్షోణులందును, బ్రివిమలాంభస్సరోవరములందు
నత్యర్ఘవస్త్రశయ్యాసనభూషణ, స్నానానులేపన సత్క్రియములఁ

గీ. జక్కఁగై సేసికొని విలాసములుచెలఁగ, గాయదళిపంక్తి వందిమాగధులభంగిఁ
జెలువుమీఱఁగై వారముల్ జేయుచుండ, నిచ్చలు రమించెఁ గోర్కులునిండ మదిని. 192

వ. అంత సప్తద్వీపాధిపతియైన మాంధాతృచక్రవర్తి సార్వభౌమలక్ష్మీసమన్వితుండై యొకనాఁడువచ్చి సౌభరిమునీంద్రుని గృహస్థభావంబును వీక్షించి మహైశ్వర్యసంభృతమానసుండై నిజైశ్వర్యదర్పంబును బరిత్యజించె. 193

క. ఈ విధి గృహాభిరతుఁడయి, భూవర! నానాసుఖానుభూతి విషయముల్
సేవింపుచు మదిఁ దనియఁడు, పావకుఁ డాజ్యప్రసృతులబలె సౌభరియున్. 194

గీ. క్షితివరా! యొక్కనాఁ డుపాసీనుఁడగుచు, మనమునన్ మీనసంగసంజనితమైన
నిజతపోభంగమును గమనించిచూచె, సౌభరిమహర్షి వర్యుఁడుజ్ఞానగరిమ. 195

ఉ. తాపసముఖ్యులన్ సుచరిత వ్రతసంకలితుండనై న నా
యీ పతనంబుఁ గంటిరె? యిసీ! యమునాసలిలంబులోపలన్
బాపురె! మీనసంగమును బట్టి యిటుల్ చిరకాలసంభృతం
బై పెనుపొందు నాతప మిదంత నశించెను జూచుచుండఁగన్. 196

క. దాంపత్యధర్మయుక్తుల, సంపర్కము విడువవలయు ◊ సర్వవిధములన్
దెంపరియగుచు ముముక్షువు, పెంపేదన్ విడువఁజనదు ◊ వెలి కింద్రియముల్. 197

క. ఏకాకియగుచుఁ దాపసి, యేకాంతమునందు సంచరించుచుఁ బుణ్య
శ్లోకు మదినిల్పి విబుధా, నీకముతోఁడం బ్రసక్తి ◊ నెఱపఁగవలయున్. 198

సీ. కటకటా! తపసి నేనేకాకి నే నంతర్జ, లమునందు మీనసంగమునఁ జేసి
బలిమిఁ బంచాశత్సతులయుఁ బంచసహస్ర, సుతులయుఁ దగులంబుసారిడిఁగల్గి
మాయాగుణధ్వస్తమతినయి యైహికా, ముష్మికవిషయ సముదయమందు
నర్థభావంబుంచి ◊ వ్యర్థుండనైతినం, చీ భంగి భావించి ◊ సౌభరిముని

గీ. తద్దయుం బెద్దప్రొద్దు సద్మంబునందుఁ, గడపుట విరక్తిఁ జెంది సంగంబులెల్ల
నవలఁద్రోసి వనంబునకరిగె నతని, నతులు నాతని వెనువెంటఁజనిరి క్షితిప! 199

గీ. ఆత్మవిదుఁడైన యామునియచట దేహ, కర్శనంబగుతపము నుగ్రముగ సల్పె
నాత్మ నగ్నులతోఁ బరమాత్మయందు, యోజనముఁ జేసె నంతనా యోగివరుఁడు.

క. తమపతి యాధ్యాత్మికమగు, నమలగతింగాంచి సతులు ◊ నా ముని ప్రభా
వమున ననుగమించిరి పెం, పమరన్ శాంతమగు నగ్ని ◊ నర్చులువోలెన్. 201

---

## అ ధ్యా య ము 7.

### హరిశ్చంద్రోపాఖ్యానము

శ్రీశుకుఁడు:—

సీ. భూతలనాథ! మాంధాతృసుత జ్యేష్ఠు, డంబరీషాహ్వయు ◊ నతనితాత
సుతునిగాఁ గైకొనె ◊ నతని పుత్రుఁడు యౌవ, నాశ్వుఁడు హారితుం ◊ డతనిసుతుఁడు
అంబరీషుఁడు యౌవనాశ్వహారితులును, దలఁప మాంధాతృ గోత్రప్రవరులు
భ్రాతలౌ నాగులచేత నీయంబడె, నర్మదఁ బురుకుత్సు ◊ నామునకును

గీ. నాగరాజచోదితయయి నర్మద గొని, పోయెఁ బతిని రసాతలమునకు నచట
వధ్యులైన గంధర్వులఁబట్టిచంపె, నతఁడు వైష్ణవశక్తి సమన్వితుఁడయి. 202

గీ. ఈ యుదంతము మది స్మరియించువారి, కుగ్రసర్పభయంబు లేకుండునట్లు
లోజమెఱయంగ నా నాగరాజువలన, వరముగాఁ బొందెఁ బురుకుత్సధరణివిభుఁడు.

వ. ఆ పురుకుత్సపుత్రుండు త్రసదస్యుండు. అతని కనరణ్యుండు సుతుండయ్యె. అన
రణ్యునకు హర్యశ్వుండును, నతనికి నరుణుండును, వానికిఁ ద్రిబంధనుండును,
త్రిబంధనునకు సత్యవ్రతుండును బొడమిరి. ఆ సత్యవ్రతుండు త్రిశంకుండను పేరఁ
బ్రసిద్ధుండయ్యె. 204

మ. గురుశాపాహతిఁ బీడితుండయి త్రిశంకుక్షోణినాథుండు దు
ర్భరచండాలతఁ బొంది యాపిదప విశ్వామిత్రి తేజంబునన్
సురలోకంబును బొందెతోఁ బడసి యచ్చోఁ ద్రోయ జేజే లవా
క్షిరుఁడై గూలుచునుండ గాధిసుతుఁడాఁచెన్ మింట నప్పార్థివున్. 205

వ. ఆ త్రిశంకుండు నేఁడును నంతరిక్షంబునఁ గానంబడుచుండు. 206

మ. చతురాత్ముండు త్రిశంకుపుత్రుఁడు హరిశ్చంద్రాఖ్యుఁ డామేదినీ
పతిమూలంబున నవ్వసిష్ఠుఁడును విశ్వామిత్రుఁడున్ శాపసం
గతులౌచున్ బకగృధ్రరూపముల నుగ్రంబైన ద్వేషంబుతో
క్షితిపాలాగ్రణి! పెక్కువత్సరము లాజిం జేసి రత్యుద్ధతిన్. 207

సీ. అనపత్యతన్ విషణ్ణాత్ముఁడై యా ధరి, త్రీపాలకుఁడు నారదోపదేశ
మునఁ జేసి వరుణదేవుని శరణొంది ప్ర, భూ! నాకుఁ బుత్రునిన్ బొడమఁ జేయు
దేని నాతని చేతనే నిన్ను యజియింతు, ననుచు వల్లె’’ యటంచు నామతించి
నట్టి యా వరుణు దయన్ క్షోణివిభునకు, రోహితుండనెడి పుత్రుండు వొడమె
గీ. నంత వరుణదేవుఁడు పేర్మి నరుగుదెంచి, సుతుఁడు జనియించెఁ గదనీకు నతనితోడ
నన్ను యజియింపుమనఁ బదినాళ్ళుపురుడు, చనినఁ బశువు మేధ్యంబగు ననియె
నృపతి. 208

సీ. పురుడైనపిదప నవ్వరుణదేవుఁడు వచ్చి, యజియింపు మన్న నయ్యవనివిభుఁడు
దంతముల్ వొడమిన తదనంతరంబు మే, ధ్యంబగు పశువని తరలఁ జేసె
దంతముల్ రాఁజూచి తగ వేల్వు మన్న దం,తము లూడినం గాని తగ దనియె
పండ్లూడె వేల్వు నా పశువు నిప్డన్నఁ గ్ర,మ్మఱఁ బండ్లువచ్చిన మంచి దనియె
గీ. మగుడ దంతముల్ మొలచె నో మనుజనాథ!
వేల్వుమన్న నా హరిశ్చంద్ర పృథ్వివిభుఁడు
సమరసన్నాహయుతము రాజన్యపశువు
మిగుల శౌచయుతంబగు మేధ్య మనియె. 209

మ. అని యిబ్భంగి సుతానురాగమున స్నేహాకృష్టచేతస్కుఁడై
జననాథేంద్రుఁడు కీర్తిసాంద్రుఁడు హరిశ్చంద్రావనీంద్రుండు వం
చనతో నెప్పటికప్డు కాలముల నోజ న్నెట్టుచుండంగఁ దాఁ
గనుచుండెన్ వరుణుండు మానసమునన్ క్షాంతిన్ బ్రదర్శించుచున్. 210

క. తనతండ్రి సలుపఁగా నెం,చిన యాకర్మము నెఱింగి శీఘ్రంబునఁ గా
ననమున కేగె బ్రా,వనరతి రోహితుఁడు చాపబాణధరుండై. 211

క. వరుణగ్రస్తుఁడయి మహా, దరరోగ నిపీడితుండగు తండ్రిని విని తాఁ
బురికిం బోవుచునుండఁగ, బురుహూతుం డడ్డగించె మొగి రోహితునిన్. 212

గీ. పావనక్షేత్రతీర్థనిషేవణముల
భూమిపర్యటనం బది పుణ్యమనుచుఁ
దెలిపె రోహితునకు సురాధిపతి యొక్క
యేఁడు వసియించె వనిని క్షితీంద్రసుతుఁడు. 213

సీ. దివిజేంద్రుఁ డిట్లు రెండవయేఁట మూఁడవ, యేఁటను నాల్గవయేఁట మఱియు
నైదవయేఁటఁ దానరుదెంచి వృద్ధవి, ప్రుండయి యా కుమారుని గడంక
యలర నిరోధించె నాఱవయేఁట రో, హితుఁడు పురంబున కేగుదెంచు
చుండ నజీగర్తుఁ డనువాని మధ్యము, సుతుని శునశ్శేపు సొమ్మునిచ్చి
గీ. విలిచి తన జనకునకు సమర్పించితనిపె, నా హరిశ్చంద్రభూపాలుఁ డలఘుయశుఁడు
పురుషమేధంబున యజించె వరుణదేవు, నంత ముక్తోదరుండయ్యె నాతఁ డధిప!

వ. అప్పురుషమేధంబున విశ్వామిత్రుండు హోత యయ్యె. ఆత్మవంతుండగు జమదగ్ని యధ్వర్యుండును, వసిష్ఠుఁడు బ్రహ్మయు, నాయాస్యుం డుద్గాతయు నైరి. ఆ యజ్ఞంబువలన సంతుష్టుండై యింద్రుం డా హరిశ్చంద్రునకు స్వర్ణమయంబైన రథంబొసంగె. రాజేంద్రా! శునశ్శేపుని మాహాత్మ్యంబు మీఁదఁ జెప్పంగలవాఁడ. 215

సీ. పత్నీసమేతుఁడై పరఁగు నా ఱేనిసూ, నృతసారకలితమౌ ధృతినిఁ గాంచి
సంప్రీతుఁడగుచు విశ్వామిత్రముని యవి, నశ్వరమైన జ్ఞానంబు నొసఁగె
అంతట నిస్తంద్రుఁడా హరిశ్చంద్రుండు, మనమును బృథివినిఁ జొనిపి దాని
జలమునం దానిని జ్వలనంబునందు దా,నిని వాయువునను దానిని నభమున
గీ. నా నభంబు నహంకారమునను దాని, ఘనమహత్తత్త్వమునఁ బాదుకొనఁగఁ జేసి
జ్ఞానకలచేతఁ జెఱిచి యజ్ఞానగ్రంథి, ముక్తబంధనుఁడై పొందె మోక్షసుఖము.

---

## అధ్యాయము 8.

### —సగరచక్రవర్తి కథా ప్రారంభము—

శ్రీశుకుఁడు:—

సీ. క్షోణీశ! రోహితసూనుండు హరితుండు, చంపుఁ డాతని పట్టి చంపయనెడు
పురిఁ గట్టె నతనికి సమరుఁడు సుదేవుండు, కొడుకా సుదేవునకు విజయుండు

రురుకుఁ డాతనికుమారుఁడు వృకుండాతని, కొడుకు వానికి బాహుకుండుసుతుఁడు
రిపుజనహృతధరిత్రీమండలుండయి, వని కేగె నతఁడు సభార్యుఁడగుచు
గీ. నందు ముదుసలియై మృతిఁబొందె నంత, నతనితో మరణింప నాయత్తపడిన
తత్సతిం గర్భవతినిగాఁ దానెఱింగి, యౌర్వుఁడను మునివల్లభుండడ్డగించె. 217
గీ. తత్సపత్నీజనంబు మాత్సర్యసంభృ, తాత్మలై గరయుక్తతోయంబు నామె
కొసఁగి రాశిశువును గరయుక్తుఁడగుచుఁ, బ్రభవమందెను సగరాఖ్యఁ బార్థివేంద్ర!

వ. ఆ సగరుండు చక్రవర్తియయ్యె. ఆసగరచక్రవర్తి పుత్రులచే సాగరంబు విరచితంబయ్యె. మఱియు నా సగరసార్వభౌముండు తాళజంఘులగు యవన, శక, హైహయ, బర్బరులను గురువాక్యంబునం జేసి చంపక కొందఱ వికృతవేషులుగను మఱికొందఱ ముండులుగను, కొందఱ శ్మశ్రుధరులుగను, కొందఱ నర్ధముండితులుగను, గొందఱ నంతర్వస్త్రరహితులుగను, గొందఱ బహిర్వస్త్ర రహితులుగను నొనర్చె. 219

సీ. అశ్వమేధంబుల యజియించె సార్వోప, దిష్టమార్గంబున దేవదేవుఁ
బరమాత్ము నీశ్వరు హరిఁ బురుషోత్తము, నధ్వరోత్సృష్టతద్ధయపశువును
హరియించె నల పురందరుఁ డంత నాతని, సతులలో సుమతికి సంభవించి
నట్టి పుత్రకులు పిత్రాదేశకారులై, దృప్తులై యజ్ఞవీతి న్నెమకుచు
ఆ. వసుధఁ ద్రవ్వుచు నటఁ బ్రాగుదీచీదిశఁ, గపిలునంతికమునఁ గాంచిహయము
వాజిహరుఁడు వీఁడె పాటచ్చరుండు ని, మీలితాక్షుఁడగుచు మెదలకుండె. 220

శా. పాపుం డీతనిఁ జంపుఁడంచుఁ బటు కోపవ్యగ్రచేతస్కులై
చాపాద్యాయుధసంచయంబు పెలుచన్ సారించుచున్ బింకముల్
దోపన్ షష్టిసహస్రసంఖ్య నృపపుత్రుల్ జుట్టుముట్టన్ ద దా
టోపంబుల్ చెవి సోకినంతఁ గపిలుండున్ గన్నువిచ్చెన్ వెసన్. 221

మ. అమరాధీశహృతాత్ములై సకలలోకారాధ్యమానివ్రతి
క్రమదోషంబునఁ జేసి యా సగర భూకాంతాత్మజుల్ పెల్చనన్
దమదేహంబులయంద పుట్టిన ప్రచండాగ్నిచ్ఛటాకీలలన్
నిముసంబందున దహ్యమానులగుచున్ నీఱైరి రాజోత్తమా! 222

చ. మనుజవరేణ్యనందనులు మానికులోత్తమకోపదగ్ధులై
రనుట యసాధువాదమగు నంచితసత్త్వమయుండు లోకపా
వన హృదయుండునైన మునివల్లభునందుఁ దమోగుణంబు దో
చునె? పరికించిచూడ భువిఁ జొప్పడు ధూళి దివిన్ జనించునే? 223

మ. గురుసాంఖ్యాత్మకనౌకఁ గూరిచి ముముక్షుశ్రేణి ఘోరంబు దు
స్తరమున్ మృత్యుభయానకంబునగు సంసారార్ణవంబున్ ధృతిన్
దరియింపంగ నొనర్చె నే ఘనుఁడు తత్త్వజ్ఞానసంబాధుఁ డా
పరిపూర్ణుండు పరేశుఁ డెట్టులు పృథగ్భావంబునుం బొందెడున్. 224

క. క్షితిపతికిన్ గేశినియను, సతియం దసమంజసుండు జనియించెన్ ద
త్సుతుఁ డంశుమదాఖ్యుండా, యతపడియెన్ నిజపితామహ హితముఁ గూర్పన్.

సీ. మును దాను యోగి యయ్యును సంగజనితదో, షంబునఁ దద్యోగచాలితుఁడయి
జాతిస్మరుండయి జననంబునంది య, య్యసమంజసుండు తన్నఖిలజనుల
కసమంజసుని గాఁగ నగపఱచుచు జ్ఞాతి, జనుల కప్రియములు సలుపుచుండి
లోకగర్హితుఁడయి లోలతఁ గ్రీడించు, బాలురం గొనిపోయి ప్రసభగతిని

గీ. ప్రజలు బెగ్గిల సరయూస్రవంతియందుఁ, బాఱవైచుచునుండె నీవసువునన్ బ్ర
మత్తురీతి వర్తించెడు తత్తనయుని, దండ్రి విడనాడె నెయ్యంబుఁ దలఁగఁద్రోచి.

గీ. ఆత్మయోగవిభూతి సర్వార్భకులను, వెండియుం జూపి యతఁ డటనుండి చనియె
మగిడివచ్చిన బాలురఁ దగఁ బొడఁ గని, యంతసాకేతవాసులు వింతపడిరి. 227

వ. సగరచక్రవర్తియుఁ దన పుత్రుని నిర్గమనమునకు దురంతచింతాక్రాంతస్వాంతుం
డయ్యె నంత. 228

మ. నుతయజ్ఞాశ్వగవేషణార్థము నయజ్ఞుం డంశుమంతుండు చో
దితుఁడై స్వీయపితృవ్యఖాతమెచటన్ దీపించు నచ్చోటికి
న్నప్రతిమోత్సాహముతోడఁ బోయి యటఁ దద్భస్మాంతికంబందు య
జ్ఞతురంగంబును గాంచె నెట్టెదుట నోజన్ రాజచూడామణీ! 229

గీ. అచట నాసీనుఁడగు కపిలాఖ్యవిష్ణు, వరయతీశ్వరుఁ బొడఁగాంచి ప్రణతుఁడగుచుఁ
జేతులొగ్గి సమాహితచిత్తుఁడునయి, భక్తి నిట్లంశుమంతుండు ప్రస్తుతించె. 230

చ. అజుఁడును గానలేఁడు పరమాత్ముని నిన్ను సమాధియుక్తిచే
నిజముగ నేఁడునుం దెలియనేరఁ డనంగ మహాత్మ! యీ నరో
జజుని మనశ్శరీరభవసర్గవిసృష్టులమై మెలంగుచుం
డు జడులమైన మే మిఁక నెట్టుల్ గననేర్వఁ గలార మో ప్రభూ! 231

మ. అనఘా! యద్భుతతావకీనఘనమాయామోహితస్వాంతులై
యనయంబున్ ద్రిగుణప్రధానులయి బాహ్యజ్ఞానసంయుక్తులై
తనుధారుల్ పొడఁగానలేరు నిను నాత్మస్థున్ గుణవ్రాతమున్
గనుచుండ్రొక్కఁపు డద్దియున్ గనక యేకన్గొంద్రు పెంజీఁకటిన్. 232

ఉ. రాగము ద్వేషమున్ విడిచిరపరిజ్ఞదలిర్ప స్వతోనిరస్త మా
యాగుణభేదమోహములగునట్టి సనందనముఖ్యులౌ మహా
యోగుల నిన్నెదన్ దలఁపనోర్తురు కేవలమున్ జడుండ నే
నే గతిఁబూని నిన్ను గణియింపఁగనేర్తును జ్ఞానభాస్కరున్. 233

వ. మఱియును భవన్మాయావిరచితమగు లోకంబునఁ గామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, విభ్రాంత చేతస్కులై, గృహాదులయందు వాస్తవికబుద్ధిం దవిలి యజ్ఞులు భ్రమించుచుందురు. ఓ పరమయోగిపుంగవా! ఇప్పుడు సర్వభూతాత్ముండవగు నీ శుభదర్శనంబునఁ గామకర్మేంద్రియాశ్రయంబగు మదీయ మోహపాశంబు విచ్ఛిన్నంబయ్యె. 234

శ్రీశుకుఁడు:—

క. అని యీ వచువునఁ దన మహి, మను బొగడిన ధీరు నంశుమంతునిఁ గని య
మ్మునిపతి కపిలాచార్యుం, డనె నాతనిపై ననుగ్రహము పొడ సూపన్. 235

క. నీ తాతయజ్ఞపశు వగు, నీ తురగమును గొనిపొమ్ము ధృతి వత్సా! యీ
నీ తండ్రులకు సుగతి గం, గాతోయంబునన కల్గుఁగా దితరమునన్. 236

శ్రీశుకుఁడు:—

ఆ. అంత నంశుమంతుఁడతనికి శిరమున, మ్రొక్కి హయమును గొనిపోయెఁబురికి
సగరచక్రవర్తిసరగ నా పశువుతో, యజ్ఞశేషమును సమాప్తిచేసె. 237

గీ. అంశుమంతునియందు రాజ్యంబునిల్పి, సగరభూపతి నిస్పృహుండగుచు ముక్త
బంధనుండయి యుత్తమపథముఁ బొందె, ఘనతరౌర్వోపదిష్టమార్గమునఁ జేసి.

---

## అధ్యాయము 9.

గంగావతరణము, ఖట్వాంగాది చరిత్రాభివర్ణనము

శ్రీశుకుఁడు:—

గీ. అంశుమంతుఁడు గంగానయనదృఢేచ్ఛఁ, దద్దయున్ బెద్దకాల ముగ్రతపము
సల్పెఁ గాని యందులకు సశక్తుఁడగుచుఁ, గడకుఁ గాలధర్మంబునుబడసె నధిప!

క. అతనిసుతుండు దిలీపుం, డతని తెఱఁగుననె యశక్తుఁడయి మడిసెన్ ద
త్సుతుఁడు భగీరథుఁడు మహో, గ్రతపంబొనరించె సమధికనియమయుతుఁడై.

శా. గంగాదేవియు నా భగీరథునకున్ గానంగనై భావము
ప్పొంగన్ నీకు వరంబు నిత్తు నన నా భూపాలవర్యుండు స

ర్వాంగాలింగిత భూతలుండగుచుఁ దచ్ఛ్రీపాదాంబుజాతద్వయిన్
భృంగంబట్లు మెలంగుచున్ దెలిపె స్వాభిప్రాయమున్ సర్వమున్. 241

గంగాదేవి:—

చ. నరవర! యిన్మహీతలముకై నంబడు నాదగు వేగధారమున్
దిరముగఁ దాల్పఁగాఁ గలుగుదిట్ట మెవం డటుగాక యున్న నో
ధరణితలంబుఁ జీల్చుకొనిపోయి తత్క్షణమంద యనార్యవేగవి
స్ఫురణ రసాతలంబు వడిఁజొచ్చెద నేఁ బలుమాట లేటికిన్. 242

చ. విను మది గాక నేను భువిపైఁ దలమున్ జొర నిచ్చగింప నె
ల్ల నరులు స్వీయపాతకములన్ దిగవిడువుదురు నా జలంబులన్
మొనకొని యట్టి లా యఘుసముదాయముఁ బాపుకొనంగ నెట్లు నో
జనవరసత్తమా! తగ విచారము సేయుము దీని నెమ్మదిన్. 243

రాజు:—

గీ. సాధువులును సన్న్యాసులుఁ శాంతిపరులు, ధార్మికులు లోకపావనుల్ దగ్గసురితము
నంగసంగంబున హరింతురఘహరహరులు, నఘహరుండు విష్ణుండు వారియందునుండు.

గీ. తంతువులయందుఁ బటము దంపదమున నెవని, యందు విశ్వమో తప్రోతమైన తనర్చు
నఖిలదేహులకాత్మగుచున్నట్టి రుద్ర, దేవుఁడు ధరింపఁగలఁడు నీదు వేగభరము.

మ. అని యిట్లాడిన యా భగీరథుని వాక్యంబోజ నాలించి యి
ట్లనియె న్గంగయు నోనృపాలకవరేణ్యా! నీ విఁకన్ సుప్రస
న్నునిగాఁ జేయుము దేవదేవుని భవున్ దద్దివ్యమస్తకస్థలం
బును దాల్పన్ నృపభక్తితో సతనికిన్ దామానంబుఁ గల్పించు మన్. 246

శా. ఆ గంగావచనంబు భూమిపతి సమ్యక్చాలించి యుత్కృష్ట మహా
భాగుండైన మహేశ్వరుం గొలిచె విభ్రాజత్తపశ్చర్యచేన్
నాగేశాభరణుం డుమారమణుఁ డుంచెన్ దా నల్పకాలంబులో
శ్రీగంగాజలధారణార్థమయి యక్షిన్ సమ్మతించెన్ నృపా! 247

మ. నృపతి ప్రార్థితుఁడై చు నట్లయని గౌరీవల్లభుం డా శివుం
డు పరార్థాభిరతుండు గావునను దోడ్తో విష్ణుపాదాబ్జసం
గపునీతోదకమైన యా విమలగంగన్ రంగదుత్తుంగభం
గవృషోత్సేకను దాల్చెఁ దా నవహితాత్మత్కంఠన్ మహీనాయకా! 248

సీ. వీరరాజర్షి భగీరథుం డఖిలలోకైకపావని యగు నాక ధునిని
స్వపితృదేహములు భస్మావశిష్టంబులై, యెటఁ బడియుండె నచ్చటికి వాయు

రయసమన్వితమహారథ మధిరోహించి, యురవడిఁ గొంపోవుచుండ నదియు
నా నృపశేఖరు ననుగమించుచు దగ్ధతనులగు సగరపుత్రకులఁ దడిపి
గీ. పావనులఁ జేసెఁ దజ్జలస్పర్శఁ జేసి, సగరసుతులును దేహభస్మములతోన
చనిరి బ్రహ్మదండహతులయ్యును దివికిని, పరమపావనగుణసాంద్ర పార్థివేంద్ర!

ఉ. నాకధునీజలంబు జననాయక! వెల్మిడియైన మేనులన్
సోకినమాత్ర నా సగరసూనులు స్వర్భువనంబుఁ జెంది ర
స్తోకధృతవ్రతాఢ్యులయి తోరపుశ్రద్ధ వహించి యే ప్రజా
నీకము గంగనున్ గొలుచు నిచ్చలు వారలఁ జెప్ప నేటికిన్. 250

సీ. అవనీశ! విమలాత్ములైన మునీంద్రు లవితథమాత్రశ్రద్ధ నేవిభునియందు
నెలమిడెందము పాదుకొలిపి దుస్త్యజమైన, దేహబంధనము నొద్దికఁ ద్యజించి
ధైర్యంబుమీఱ సద్యఃకాలమునఁ దా, దాత్మ్యమున్ బొందుదు రట్టివిష్ణు
చరణసంజాతయై సంసారకాంతార, ఘోరతరకుఠారధారయగుచు
గీ. నలరు త్రిభువనపావనయైనయట్టి, యమరధునిదివ్యమహిమలం దలఁతియైన
యీదృశంబగుకార్యమూహించిచూడఁ, గాదుపరమాద్భుతంబు నిక్కంబురాజ!

వ. ఆ భగీరథునకు శ్రుతుండును, నతనికి నాభావరుండును, నతనికి సింధుద్వీపుండును,
నతనికి నయుతాయుతుండును జన్మించిరి. ఆ యయుతాయునకు ఋతుపర్ణుండు
వొడమె. 252

గీ. నలసఖుఁడు ఋతుపర్ణుఁడు నలునివలన, నశ్వవిద్యను గొని యొఁదా నక్షహృదయ
మనెడువిద్యను నిపుణత నతనికొసఁగి, యతనికిన్ సర్వకామాఖ్యసుతుఁడు వొడమె.

వ. ఆ సర్వకామునకు సుదాసుండను పుత్త్రకుండు కలిగె. ఆ సుదాసునకు మిత్రసహాం
డనఁబడు దమయంతీ పతియగు సౌదాసుండు జనించె. అతండు పదంపడి కల్మాష
పాదుఁ డనఁబరఁగె. ఆ సౌదాసుండు వసిష్ఠశాపంబున రాక్షసుండై నిజకర్మంబున
ననపత్యుండయ్యె నని వినిపించిన 254

విష్ణురాతుఁడు:—
క. అనఘాత్ముండగు సౌదా, సునకున్ గురుశాపమేల చొప్పడె దీనిన్
వినుచు రహస్యము కాదే, న్వినఁగోరెద నాత్మయందు విప్రవరేణ్యా! 255

శ్రీశుకుఁడు:—
సీ. వినుము సౌదాసుఁడు వేటగ్రుమ్మరు చటన్, రక్కసు నొక్కనిఁ జక్కడంచెఁ
దానఁ దద్భ్రాత వంతన్ గుందుచున్ బ్రతిక్రియఁ జేయఁ దలఁచి దుష్కృత
మతియయి

సూదరూపముఁ దాల్చి క్షోణీశుగృహమున, నుండి బుభుక్షుఁడై యున్న గురున
కనువొంద నరమాంసమును వండిపెట్ట న,భక్ష్యమా దానినిఁ బరఁగఁ జూచి

గీ. గురుఁడు క్రుద్ధుఁడై శపియించె నరవరేణ్య, రక్కసుఁడవుగ మ్మని యంత రక్కసుండె
యట్లు గావించుట యెఱింగి యతఁడె శాప,ముక్తి ద్వాదశవార్షికంబుగ నొసఁగె.

క. ఆ సౌదాసుఁడు జలమును, దోసిటఁ గొని గురుని శపింపఁ దొడరియు మదయం
తీసతిచే వారితుఁడయి, యా సలిలము విడిచెఁ దా నిజాంఘ్రులయందున్. 257

వ. ఇట్లు భూమ్యాకాశంబులును దిగ్దిగంతంబులును సర్వంబును జీవమయంబుగాఁ గనుచుఁ దనపాదంబులయందఁ దచ్ఛాపజలంబును విసర్జించి, దానఁ గల్మాషపాదుండై గురుశాపంబున రాక్షసభావంబు నొంది చరించుచుండె నంత నొక్కనాఁడు, 258

చ. క్షితివర! యాతఁ డాఁకటను జిక్కి వనౌకసులైన విప్రదం
పతుల వ్యవాయకాలమున సముక్కువఁ గన్గొని యందు విప్రుఁ గ్రూ
రతమెయిఁ బట్ట నా ద్విజపురంధ్రి విషాదపరీతచిత్తయై
యతికృపణత్వ మేర్పడఁగ నాతనితో ననె నిత్తెఱంగునన్. 259

క. రాక్షసుఁడ వీవు కా విఁక, సాక్షాదిక్ష్వాకువృషభ సమహారథుఁడవు ప
ద్మాక్షి మదయంతినాథుఁడ, వీ క్షితినిన్ దగ దధర్మకృత్యములు చేయన్. 260

ఉ. క్ష్మాధవ! యీగతిన్ మిథునకర్మమునం దకృతార్థ విప్రు నా
నాథు నపత్యకాము ననునాకు నొసంగుము వేఁడుచుంటి న
య్యా! ధరణిన్ సమస్తపురుషార్థములన్ సమకూర్చుపట్టి స
త్సాధన మానుగాదె పురుషాళికి దేహము నిశ్చయంబుగన్. 261

సీ. బ్రాహ్మణుఁ డితఁడు విద్వాంసుఁడు వరతప,శ్శీలగుణాఢ్యుఁడు స్థిరహృదయుఁడు
కావున నో రాజ! యీ విప్రవరవధ, యఖిలార్థవధగాఁగ నాత్మఁ దలఁపు
సకలభూతాత్ముఁడై సకలభూతముల గు,ణంబులతోడ సంగతప్రీతుఁడగు
పరపురుషాహ్వయు బ్రహ్మ నారాధింపఁ,దలఁచిన ఘనుఁడు శాంతస్వరూపు

గీ. డట్టి బ్రహ్మర్షివరుఁ డితఁ డకట కటట!, నే సురాజర్షివరుఁడ వౌ నీవలనను
తండ్రివలనఁ బ్రేమాస్పదాత్మజుఁడుఁ బోలె, వధమునకు నర్హుఁడగు నెట్లు జలధిప
చెప్పుమ. 262

గీ. వైదికుం డనఘుండును బ్రహ్మవాది, సాధుశీలుఁడునగు నీ ద్విజన్ముఁ బట్టి
మొదవునుం బోలె నెట్లు చంపుటకు నీవు, సమ్మతింతువు సజ్జనసమ్మతుఁడవు.

ఉ. ఈతని మానకీవు భుజియింపఁ దలంచితివేని ముందుగా
నా తనువున్ భుజింపు జననాయక! యొక్క క్షణంబుగూడ నే

సీతనిఁ బాసి పీనుఁగతి నీ క్షితినిన్ బ్రతుకంగలేను జు
మ్మీ తెఱఁగెల్ల నీదు మది నెంచి యనుగ్రహ ముంపు నాపయిన్. 264

గీ. అనదగతి నిట్లు కరుణోక్తులాడు చామె, పనవుచుండంగ వ్యాఘ్రంబు పశువునట్లు
బలిమి భక్షించె బ్రాహ్మణుఁ బట్టి శాప, మోహితుండయి సౌదాసభూపవరుఁడు.

శా. ఆ నారీమణియైన బ్రాహ్మణియు గర్భాదానసంధాయకుం
డౌ నాథుం బురుషాదుఁ డిట్లు తిన శోకావేశయుక్తాత్మయై
తన్నాథుం బోడఁగాంచి యుగ్రసముదగ్రక్రోధదష్టోష్ఠయై
చానం గూడినఁ జత్తు వీవు ననుచున్ శాపం బొసంగెన్ వెసన్. 266

గీ. ఇట్లు మిత్రసహున్ శపియించి మగని, ననుగమింపఁగ నెంచి తదస్థులను స
మిద్ధవహ్నియందుంచి యాకమెలఁత దాని, యందుఁబడి భర్తృగతిఁ బొందె
ననువుమీఱ. 267

ఉ. ద్వాదశహాయనాంతమునఁ దద్గురు శాపవిముక్తుఁడౌచు నా
త్మదయితుండు పెన్దమిని మైథునకర్మకుఁ దా సముద్యతుం
డై దృఢవాంఛనుండ మదయంతియు నాథునిఁ జూచి కూడఁగా
రాదని మాన్చివైచె నలబ్రాహ్మణిశాపము జ్ఞప్తిఁ జేయుచున్. 268

ఉ. ఆపయి స్త్రీసుఖంబు విడనాడెఁ గడింది స్వకర్మఁ జేసి ధా
త్రీపతి సంతులేమికి మదిన్ గడుఁ గుంది గురున్ వసిష్ఠుఁ దా
నా పనికై యనుజ్ఞ యిడ నంత వసిష్ఠమునీంద్రుఁ డుద్యతుం
డై పరిపాటితోడ మదయంతికిఁ గల్గఁ జేసె గర్భమున్. 269

ఉ. ఆ మదయంతి గర్భమును హాయనసప్తక మోలిఁ దాలిచెన్
భూమిప! యెంతకు న్నిసువు పుట్టకయున్న వసిష్ఠమౌనియున్
గోమలి గర్భ మశ్మమునఁ గ్రొచ్చినఁ దత్క్షణమంద పెంపుతో
నామెకు నుద్భవించెఁ గొడుకశ్మక నామమున బ్రసిద్ధుఁడై. 270

వ. అశ్మకువలన జనించినకుమారుండు నారీజనపరిరక్షితుండగుట నారీకవచుండనియుఁ బరశురామునివలన నిఃక్షత్రింబైన కులంబునకు మూలభూతుండగుట మూలకుండనియుఁ బేర్కొనంబడియె. ఆ నారీకవచునకు విశ్వసహుం డుదయించె. ఆ విశ్వసహునకు ఖట్వాంగచక్రవర్తి యుద్భవించె. 271

మ. అమరాభ్యర్థితుఁడై యజేయుఁడగు ఖట్వాంగావనీజాని యు
ద్ధమునన్ దైత్యుల సంహరించి సురబృందజ్ఞాపితుండై ముహూ

ర్తము స్వీయాయు వటం చెఱింగి దృఢవైరాగ్యంబునం జేసి వై
శమ పీటిన్ దరియంగఁ జేరి నిలిపెన్ లక్ష్మీశుపై డెందమున్. 272

మ. కులదైవద్విజజాతికంటె మఱినాకుం గూర్పఁగాఁ జాల వ
ర్మిలిఁ బ్రాణంబులుఁ గాంతలున్ దనయులున్ శ్రీయున్ మహీరాజ్యమున్
దలఁపన్ బాల్యమునందె నా మనము పొందం బో దధర్మంబుఁ గే
వలుఁడౌ విష్ణువుకంటెఁ గాన నిఁక నే వస్త్వంతరం బెద్దియున్. 273

ఉ. కామవరంబు నాకు నొసఁగన్ భువనత్రయ నాథులైన సు
త్రామముఖాఖిలామర వితానము నాయెడఁ బ్రీతిఁ జూపఁ నేఁ
గామితమున్ వరింపక నికారముఁ జేసితి భూతభావనుం
డౌ మధుసూదనున్ మనమునందు నితాంతము సంస్మరించుచున్. 274

గీ. ఆ వశీకృతేంద్రియబుద్ధులగు సుపర్వు, లైన సహృదయసంస్థితు నాత్మరూపు
శాశ్వతున్ బ్రియుఁ దెలియంగ జాల రన్న, నితరులగు వారలన్ వచియింప నేల.

మ. హరిమాయారచితంబులున్ బ్రబలమోహోపాదకంబుల్ విన
శ్వర గంధర్వపురోపమంబులగు నైశ్వర్యాది నానాగుణో
త్కర సంగంబును దుస్త్యజప్రకృతిసిద్ధంబున్ విసర్జించి యా
హరి సర్వం బని యెంచి తచ్చరణముల్ ధ్యానింతు నశ్రాంతమున్. 276

స్రగ్ధర. శ్రీమన్నారాయణాంఘ్రిశ్రితహితమతి రంజిల్లి ఖట్వాంగభూపుం
డీ మాడ్కిన్ నిశ్చయంబున్ ధృతిని నరిచి తానీ శరీరాత్మ రూప
వ్యామోహంబెల్ల భవ్యోద్యముఁడగుచును బోనాడి చిన్మన్ బరీక్షి
ద్భూమీశా! బ్రహ్మభావంబును విమలగతిన్ బొందె నవ్యాజలీలన్. 277

గీ. పరమభాగవతుల్ భగవంతుఁ డజుఁడు, వాసుదేవుఁ డటంచు నెవ్వని భజింత్రు
సూక్ష్మమును శూన్యకల్ప మశూన్యమునగు, నా పరబ్రహ్మమెన్నంగ నతఁడుమావె.

---

## అధ్యాయము 10.

### శ్రీరామ చరిత్రము

శ్రీశుకుఁడు:—

వ. రాజా! ఆ ఖట్వాంగచక్రవర్తికి దీర్ఘబాహుండును, దీర్ఘబాహునకుఁ బృథుయశస్కుండగు రఘువును, నతనికి నజుండును, నయ్యజునకు దశరథుండును బొడమిరి.

మ. చరితార్థుండయినట్టి యా దశరథక్ష్మాజానికిన్ బ్రోల్లన
చ్చరితుండున్ భగవంతుఁ డాద్యుఁడును సాక్షాద్బ్రహ్మరూపుండునౌ

హరి పుత్రత్వమునందె నిర్జరనికాయాభ్యర్థితుండై సరే
శ్వర! యంశాంశముచేత నిమ్మగఁ జతుర్భాగంబులన్ జెందుచున్. 280

వ. అట్లు శ్రీవిష్ణుదేవుండు జన్మించి శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్న నామధేయంబులఁ బరఁగె. తత్త్వదర్శులగు మునిపుంగవులచే వర్ణింపఁబడిన యా సీతాపతి పవిత్రచరిత్రంబు నీవు మున్నువింటి వైనను గ్రమ్మఱ వినిపింతు వినుము, అని యిట్లనియె. 281

సీ. ధరణీశ! పితృవాక్య పరిపాలనార్థంబు, త్యక్తరాజ్యుండయి యతిమృదులము
లగు పదాంబుజముల నడవులఁ దిరుగుచు, మారుతపుత్రి లక్ష్మణులు భక్తి
మార్గశ్రమంబు డింపంగ శూర్పణఖా వి,రూపతాహేతు సంప్రాపితోరు
కాంతావిరహరోష ఘటితభ్రుకుటిపరి, త్రస్తాంబురాశి యై ప్రాభవమున
తే. నా పయోధివిజ్ఞాపన మవధరించి, సేతువున్ గట్టి రిపుధూమ కేతువగుచు
ఖలజనమహాటవీదవ జ్వాలనుఁడైన, కోసలేంద్రుఁడు మమ్ము సాకుత సతంబు. 282

శా. సారోదారపరాక్రముండగుచు విశ్వామిత్రయాగంబునన్
మారీచాదికయామినీచరుల భీమాటోప మేపారఁగన్
దా రాముండు సుమిత్రపట్టి కనుచుండన్ లిప్తమాత్రంబునన్
బోరన్ బెల్చన బిల్కుమార్చెను సుపర్వుల్ చూచి యగ్గింపఁగన్. 283

చ. నరవర! వీరలోకము గనంగ సుశోభనమైథిలీస్వయం
వరసదనంబునన్ ద్రిశత వర్గసమాహృతభర్గచాపమున్
గరికలభంబు దాఁ జెఱకుఁ గట్టనుబోలెను లీలఁబట్టి చె
చ్చెర నరివోసి పెల్చ విఱిచెన్ బెనుమ్రోత జనింప మధ్యకున్. 284

మ. మునువక్షస్స్థలమందు నెక్కొనియె నేపూఁబోఁడి పెంపొప్ప ని
ష్ఠనురూపాంగవయస్సుశీల గుణాఢ్యయై యన్వొంది సీతాసమా
ఖ్యను జెన్నారెడు నా రమారమణినిన్ గల్యాణమై లోకపా
వననాముండగు రాముఁడొప్పెసఁగె విఖ్యాతాన్వయస్థేముఁడై. 285

చ. ధరణిజఁ బెండ్లియై యిటు ముదంబున నేగుచు మార్గమధ్యమం
దిరువదియొక్కమాఱులు మహీస్థలమెల్ల నరాజకంబుగా
బరువడిఁజేసినట్టి భృగువర్యుని యుద్ధృతదర్పమున్ బోరిం
బోరి నణఁగించె భానుకులముఖ్యుఁడు శ్రీరఘురాముఁ డేఁపునన్. 286

సీ. ప్రకట కేకయసుతావర దానరూప సూ, నృత పాశపరివీతపితృని దేశ
మూదలఁ దాల్చి భార్యాయుక్తుఁడగుచు రా, జ్యశ్రీని మిత్రుల నాప్తజనుల

భవనంబు నసువుల భంగిఁ ద్యజించి యు, జ్ఝితసంగుఁడై వనక్షితికి నేగ
నచటఁ గిల్బిషబుద్ధియగు రావణస్వసన్, వికృతిరూపిణిగఁ గావించి పిదప

గీ. నాపెకున్ ముఖ్యబంధువులైన ఖరుఁడుఁ, ద్రిశిరుఁడును దూషణుండును నాదిగఁగల పదు
నాల్గువేల రక్కసుల గండడచి చాప, హస్తుఁడై గ్రుమ్మఱుచు రాముఁడడవి మెలఁగె.

మ. క్షితిపా! శూర్పణఖానివేదిత లసత్సీతాకథాకర్ణనో
ద్ధితపుష్పాయుధవిభ్రముండగుచుఁ బంక్తిగ్రీవుఁ డంపంగ ద
ర్పితుఁడై హేమకురంగరూపమున మారీచుండు తన్నాశ్రమో
ర్వి తోలంగింప వధించె రాముఁడతనిన్ వేధన్ శివుండుం బలెన్. 288

మ. అసమక్షంబున రాక్షసాధముఁడు లంకాధీశుఁ డక్కానలో
వసుధాపుత్రినిఁ బెన్వృకంబుకరణిన్ బల్మిన్ హరింపంగ స్వీ
య సతిం బాసి యతండు భ్రాతృసహితుండై గ్రుమ్మఱెన్ దీనరీ
తి సతీసంగులపాటు లిట్టి వని వ్యాప్తిం జేయు నట్లయ్యెడన్. 289

మ. తగ నాత్మార్థము చంపఁగాఁబడిన గృధ్రస్వామిఁ ఖండించి యో
జఁ గబంధు న్దునుమాడి వానరులతో సత్సఖ్యమున్ జేసి జా
లిగ సీతాసతి వార్తఁ దెల్ప విని వాలిం గూల్చి బ్రహ్మేశ్వరుల్
వొగడన్ సానుజుఁడై సముద్రతటికిం బోయెన్ ప్లవంగాళితోన్. 290

క. అమరన్ ద్రిరాత్ర ముపవా, సముఁ జేసి ప్రతీక్షఁ జేయ సాగరుఁడు రఘూ
త్తముఁడగు శ్రీరాము నను, క్షమునకు రాకుండె సంతత గౌరవముఖ్యా! 291

ఉ. రాముని క్రోధదృష్టి మకరంబులు నక్రములుం గలంగ ను
ద్దామరవం బడంగఁ దనుదాన సముద్రుఁడు రూపుఁ దాల్చి ను
శ్రీమహితార్ఘ్యపాద్యములు శీర్షమునన్ ధరియించి వచ్చి యా
స్వామిపదాంబుజద్వయిని వ్రాలి నయంబునఁ బల్కె నీగతిన్. 292

చ. సనకముఖేద్యుఁడౌ నెవని సత్త్వమునన్ సురసంఘముల్ రజం
బున నఖిలప్రజాపతులు భూతపతుల్ తమమందు నొందు ర
య్యనఘు నినున్ గుణేశ్వరుని నాద్యు జగత్పతిఁ గాలరూపునిన్
ఘనమహిమున్ జడాత్మలము గన్గొననేరము మేము సుంతయున్. 293

చ. ధృతి నలవోకమై జలనిధిం దరియింపుము విశ్రవఃపుత్రి
షతులితుఁ గ్రూరు రావణునిఁ జంపుము వీరవరా! గ్రహింపు త్వ
త్కృతిని గకుబ్విజేతలగు క్ష్మాపులు చేరి నుతింపఁ బొల్చు న
ప్రతిహతమైన సేతువు నవారణ గట్టు యశోభిలాషివై. 294

వ. అని సముద్రుండు పలుక. 295

మ. బహుళాటోపముతోఁ గపీంద్రులు గిరిఽవ్రాతంబులున్ బెక్కనో
కహముల్ వైవఁ బయోధిసేతు వలవోఽకంగట్టి సుగ్రీవ నీ
ల హనూమత్ప్రముఖప్లవంగతతితోఽలంకాపురంబున్ రఘూ
ద్వహుఁడా రాముఁడు తద్విభీషణమతిన్ఽబాటించి చొచ్చెన్ వెసన్. 296

సీ. కొట్టంబు లరికట్టిఽగుమ్మముల్ పడఁగొట్టి, కొల్వుకూటమ్ములుఽగూలఁద్రోచి
గవనులఁగూర్చి బొఽక్కసములఁ బెకలించి, కోణిగల వలబిటాఽకులఁ దెమల్చి
చదుకంబులను బేర్మిఽసదమదం బొనరించి, యరుగుల మెట్ల నూఽటాడఁజేసి
టెక్కెములనుజించిఽయొక్కుమ్మడి పసిండి, కుండలనెల్లనుఽగూల్చివైచి

గీ. కపికులశ్రేష్ఠులెల్ల నీఽకరణిఁ జెలఁగి, ఘనతరోత్సాహములను లంఽకాపురంబుఁ
జొచ్చి కలగుండువెట్టిరిఽక్షోణినాథ!, మత్తగజయూథ పంక్తులుఽమడుపునట్లు. 297

వ. అంత రాక్షసేశ్వరుండగు రావణుం డది విలోకించి నికుంభ, కుంభ, ధూమ్రాక్ష, దుర్ముఖ, సురాంతక, నరాంతకాదులను, బుత్రుండగు నింద్రజిత్తును, నమాత్యుం డగు ప్రహస్తుని, నతికాయుని, నకంపనాది సర్వానుచరులను, గుంభకర్ణుని యుద్ధంబునకుఁ బనిచె. వారును శూల, చాప, ప్రాస, శక్తి, శర, తోమర, ఖడ్గాద్యాయుధసమేతులై తన్నెదురింప సుగ్రీవుండును, లక్ష్మణుండును, హనుమంతుండును, గంధమాదనుండును, నీలుండును, నంగదుండును, బనసుండును మున్నుగా ననేక వానరయూథపులఁ గూడి రామభద్రుండు రాక్షససైన్యంబును మార్కొనె. అంత శ్రీరామచంద్రుని యయ్యంగదాది చమూపతు లెల్లరు సీతాపహరణదోషంబునఞ్జేసి హతభాగ్యుండగు రావణుండు ప్రభువుగాఁగల చతురంగబలసమేతంబులగు విరోధిసైన్యంబుల నెదుర్కొని గదా శర పరంపరల బిట్టు మర్దింపఁ దొడంగిరి. అంత 298

మ. తనసైన్యంబు వినాశముంగనుట దైఽత్యస్వామి వీక్షించి క్రొ
న్నన రోషాన్వితుఁడౌచుఁ బుష్పకవిమాఽనారూఢుఁడై పుణ్యకీ
ర్తను మాతల్యుపసీతదీప్తికలితేంఽద్రస్యందనాధిష్ఠితున్
ఘనధామున్ రఘురాముఁ గొట్టె నురుపుంఽఖక్రూరబాణంబులన్. 299

శా. రాముం డాతనితోడ నిట్లనియె నోఽరా! రావణా! మూఢ! నా
లేమన్ శ్వాన మటుల్ పరోక్షమున బఽల్మిన్ నాఁడు గొంపోతిసీ!
యీమై రోఁతగుకర్మఁ జేసిన గతఽహ్రీకుండవౌ నీకు సం
గ్రామక్షోణిని దత్ఫలంబుఁ గుడుపంఽగా నా జముండుంబలెన్. 300

శా. శ్రీరామప్రభుఁ డిట్లు రావణు నధిక్షేపించుచున్ గ్రూరసం
నారాచంబు నిగిడ్చె వజ్రముక్రియన్ వక్షంబుమున్ జీల్చె న
ద్దా రక్షఃపతి నెత్తురుం గ్రక్కుచు దశాస్యశ్రేణి యుద్ధోర్వి వి
స్ఫారత్పుష్పకమందునుండి పడియెన్ బ్రక్షీణపుణ్యుండువలెన్. 301

ఉ. ఖేదముతోడ డెందములు గీడ్పడ నత్తఱి లంకనుండి మం
దోదరితో నిశాచర సతుల్ పఱతెంచిరి ముక్తకంఠలై
రోదనమున్ బొనర్చుచు నురోజశిరమ్ములు బాదుకొంచుఁ బ్ర
స్వేదనతోడ బిట్టు పలవించుచుఁ గన్నుల నీరు వెట్టుచున్. 302

గీ. సంగరక్షోణి లక్ష్మణశాతవిశిఖహతులఁ దమతమ బంధుసంతతుల నెల్లఁ
గౌఁగిటం జేర్చి యేడ్వంగఁ గడఁగి రపుడు యాతుధానాంగనల్ కౌరవాధినాథ!

వ. పదంపడి వారెల్లరు రావణు నుద్దేశించి 304

గీ. లోకరావణ రావణ! మాకు నెల్ల, దిక్కునగునీవు నేఁడు గతింప మేము
హతల మైతిమి వైరిజనార్దితయగు, లంక యెవ్వని శరణంబు నింకఁ బొందు. 305

శా. కామావేశవశంగతుండవయి లంకాధీశ! పౌలస్త్య! నీ
తా మాహాత్మ్య మెఱుంగ నైతి వనుమాత్రం బేనియు న్నివహో!
నీ మాహాత్మ్యంబు నిం కేమి యాఱుదుము నిర్ణిద్రశ్రీభావాభ్యమా
భూమీజం గొని తెచ్చి పొందితివి గా కున్మిష్ట నీవృద్ధిగన్. 306

గీ. లంకయును మేముఁగూడఁ గులప్రదీప!, నేఁడు విధవల మైతిమిక నిట్టి యభోగ
మనుభవింపఁగ నయ్యె నీశయ్యాన్ను నీశ, రీర మాహారమయ్యెఁ గాకగృధ్రములకు.

వ. అని పరిపరివిధంబుల నిశాటాంగనలు విలపించిరని చెప్పి వెండియు శుకుం డిట్లనియె.

గీ. కోసలేంద్రునియనుమతింగొని విభీషణుఁడు యథావిధి స్వీయ జనులకు నౌర్ధ్వ
దైహికములగు కర్మజాతంబు లెల్లఁ దా నలిపె పితృమేధవిధానమునను. 309

చ. అసముఁడు రామభూరమణుఁ డంత నశోకవనోనికేతనం
బున ఘనశింశుపాఖ్యతరుమూలసమాశ్రితయై నితాంతమున్
దన యెడబాటునన్ బెనువెతన్ బడి కుందిన యట్టి భూసుతం
దన నతిదీనచిత్తదయితం బొడఁగాంచెఁ గురుక్షితీశ్వరా! 310

శా. ఖ్యాతశ్లాఘ్యచరిత్రి సంకలితశంఖాద్యా స్వీయసందర్శనో
ద్భూతాహ్లాదవికస్వరామలముఖాంభోజాతసంపూత నా
సీతం గాంచి రఘూత్తముండుఁ గరుణింపంగన్ బుష్పకంబందు భూ
జాతన్ జేర్చి యెక్కెఁ బ్రాతృయుతుఁడున్ సామీరియుక్తుండునై. 311

శా. ఆరాముం డపు డవ్విభీషణుని రక్షోధీశుఁగాఁ జేసి పో
ల్పారన్ దద్గుణరక్తి లంకయును గల్పాంతాయువున్ గూర్చి పెన్
భారంబౌ వ్రతదీక్షఁ దీర్చి హనుమద్భ్రాతృర్క్షజోపేతుఁడై
దారిన్ వేల్పులు పుష్పవృష్టిఁ గురియన్ దా వీటి కేఁగె న్వెసన్. 312

మ. స్మయదూరుండు విరించిముఖ్యనుతసచ్చారిత్రకుండున్ శుభో
దయుఁడౌ రాముఁడు వల్కలాంబరధరున్ ధర్మాత్ము గోమూత్రప
క్వ యవాన్నాశినిఁగా జటాధరునిఁగా భవ్యాత్ముఁగా స్థండిలే
శయుఁగా బుద్ధి నెఱింగి తమ్ము భరతున్ సంతప్తుఁ డయ్యె న్మదిన్. 313

సీ. అగ్రజుఁడగు రాము నాగమనమ్మును, విని పౌరసచివాప్తజనపురోహి
తాదిగణోపేతుఁడై మస్తకమునందుఁ, బాదుకలిమ్ముగఁ బాదుకొలిపి
నెఱి భరతుండు నందిగ్రామమందలి, స్వశిబిరముననుండి సాధురీతి
బహువిధశుభగీతవాదిత్రనిక్వాణ,ములు భూనభోంతరంబులఁ జెలంగ
గీ. వినయమును భక్తి యనురక్తి పెనగొనంగ, నన్నయగు రామచంద్రుని కభి
ముఖముగఁ
బరఁగఁ జనుదెంచె నుజ్జ్వలభాగధేయ, పండితజనవిధేయ! యోపాండవేయ!

సీ. సారెకున్ బ్రహ్మఘోషంబునఁ బఠియించు, సద్బ్రహ్మవాదివ్రజంబుతోడ
స్వర్ణపతాకావిభాసురచిత్రవ,ర్ణక కాంచనస్యందనములతోడ
నానావిధోపాయనవ్రాతభారవా,హకభృత్యజనసమూహంబుతోడ
కనకనేపథ్యయుక్తతురంగములతోడఁ, దులలేని వెలవెలందుకలతోడ
గీ. ఛత్రచామరముఖ్యరాజార్హవివిధ,వస్తువులఁ గొని భరతుండు పాదుకలట
నెదుట నిడి సాశ్రునయనుఁడై యెడఁదఁ బ్రేమ,గదురఁ బ్రాంజలియై పడెన్
బదములందు. 315

సీ. భరతు వాత్సల్య సంభరితుఁడై బాష్పపూ,రంబులఁ దడుపుచు రామవిభుఁడు
బాహుల దృఢపరిష్వంగంబుఁ గావించి, జానకీలక్ష్మణసహితుఁడగుచు
నఖిలవిప్రులకుఁ బూజ్యతములౌ పెఱలకు, స్వయముగఁ బ్రణమిల్లి ప్రజలుతనకు
బ్రణతులు గావింపఁగాఁ బ్రసన్నుఁడై,యర్హరీతిని వారి నాదరించె
గీ. నోజ నుత్తరకోసలు లుత్తరీయ,ములను విసరుచుఁ దమ యమాత్యులనుగూడి
యుల్లములు హర్షవారిధి నోలలాడ, నృత్య మొనరించి రప్పు డవనీతలేశ! 316

సీ. భరతుండు పాదుకల్ నట్టె విభీషణా, ర్కతనూభవుల్ చామరములు వీవ
వాతాత్మజుండు శ్వేతాతపత్రముఁ బూన, శ్రీతీర్థకలశంబు సీత దాల్ప

ఖడ్గరాజంబు సంగదుఁడు ధరింపంగ, వందిమాగధులు కైవారములిడ
జాంబవంతుండు ఋక్షాధినాథుండును, భస్మచర్మంబును బ్రాఁకిఁ బూన
గీ. సంగనాపరివేష్టితుఁ డగుచు సకల, జనులు ప్రస్తుతిఁ జేయఁ బుష్పకము నెక్కి
యుప్పరమున గ్రహములతో నుదితుఁడైన, చంద్రుగతి నొప్పె శ్రీరామ
చంద్రుఁ డధిప! 317

గీ. సోదరులు మానసంబులు మోద మంద, ననుపమోత్సవవిలసితం బగు నయోధ్యఁ
దగఁ బ్రవేశించి యా వికర్తనకులుండు, రాజభవనంబుఁ జొచ్చె విభ్రమము మెఱయ
గీ. అందుఁ గేకయనందనయాదిగ గురు,సతులను స్వమాతయైన కౌసల్యను గురు
వులను జెలికాండ్ర ననుచరవ్యూహములను, నాదరించె రాముండు తత్సదాదృతుఁడయి.
వ. సీతాలక్ష్మణులును యథాతథంబుగ నారాము ననువర్తించి రంత 320
క. తనువులు ప్రాణములం బలెఁ, దనయులఁ గ్రమ్మఱఁగఁ బడసి తల్లులు లోఁడి స్వా
రిని జేర్చి బాష్పపూరము, లను దడుపుచు వగచిరి మిగుల నంకములన్. 321
సీ. కులవృద్ధసహితుఁడై గురుఁడు జటాబంధ, మోక్షంబుఁ జేసి స్వయంభువననాథు
గతిఁ జతుస్సాగరాహృతజలాదుల యథా, విధి తేని కభిషేకవిధి నొనర్చె
శ్రీరామవిభుఁ డిట్లు కృతశిరస్స్నానుఁడై, క్రమమొప్పఁ బట్టుపుట్టములు గట్టి
తొడవులఁ దొడిగి పొంకముగ ధృతచేలురు, సుస్వలంకృతులునై సొగసుమిగులు
గీ. భ్రాతలును భార్యయును నిరుపక్కియలను, జెన్ను మిగులంగ నొప్పె రక్షిస్న దేంద్ర!
సకలజనులకు లోచనోత్సవముగాఁగ, దివ్యతేజముతోఁ గనుఁ దేజరిల్లె. 322

చ. భరతుఁడు భక్తి మ్రొక్కి పలుభంగులఁ దన్నుఁ బ్రసన్నుఁ జేయ నా
దరమును బూని యాసనము దా గ్రహియించెను రామభూవరుం
డరయఁ బ్రజల్ స్వధర్మపరులై తమ వర్ణము లాశ్రమంబులున్
సరియయినట్టి ధర్మములు సాగుచునుండ మెలంగి రిమ్ములన్. 323

చ. ప్రజలను దండ్రివోలెఁ బరిపాలనఁ జేసెను రామభద్రుఁ డా
ప్రజలును దండ్రిగాఁగఁ దమభావములన్ దలపోసి రా విభున్
ద్రిజగములు న్నుతింపఁదగు శ్రీరఘురాముని రాజ్యమందుఁ ద్రే
త జరుగుచున్న నయ్యది కృతప్రతిమంబయి యొప్పె భూవరా! 324

సీ. ధర్మజ్ఞుఁ డఖిలభూతసుఖావహుండునై, రామభద్రుం డిట్లు రాజుగాఁగ
వనములు నదులును వర్షంబు లద్రులుఁ, జెలఁగి ద్వీపంబులు సింధువులును
మున్నుగాఁగల సర్వమున్ బ్రజాతతులకు, మక్కువ దీరఁ గామములఁ గురిసె
భరతరాజన్యభ! వ్యాధు లాధులు జరా, క్షుత్తృష్ణలున్ దుఃఖశోకభయము



శ్రీ శ్రీరామమూర్తి

గీ. లించుకేనియు లేకుండ నెంచిచూడ, నెవరు మరణింపఁగోరరో యవనివారిఁ
జెనకఁగాఁబోదు మృత్యువుం జెప్పనేల, నన్యవిషయంబు రామరాజ్యంబునందు.

సీ. రాజర్షిచరితుఁడై రాముండు దా నేక, పత్నీవ్రతంబును బరఁగఁ దాల్చి
యోజ గృహస్థులకుచితధర్మముల శి,క్షించుచు వ్రతములఁ జేసె నెలమి
సౌశీల్యమునఁ బ్రేమ సంగతిన్ వినయవి, నమ్రమై భయమును నయముఁదనర
సాధ్వీశిరోవతంసమనంగ నెగడొంది, యనుకూలవర్తనంబను వుమీఱ
గీ. భర్తృభావంబు నెఱిఁగి సపర్యల మది, నెమఱక సంతతంబు గావించుచుండి
నెమ్మిఁ బుట్టించి నాథుని నెమ్మనంబుఁ, జూరగొనియె సీతాసతి క్షోణినాథ! 326

# అధ్యాయము 11.

## శ్రీరామ కృతాశ్వమేధయాగవర్ణనము

శ్రీశుకుఁడు:—

సీ. వసుమతీనాయక! భగవంతుఁడగు రామ, భద్రుండు నాచార్యవంతుఁడగుచు
నిఖిలదేవాత్మకున్ దేవునిఁ దనుఁదాన, యజియించె సత్కల్పయజ్ఞములను
హోతకుఁ బ్రాగ్దిశ నొసఁగె దక్షిణదిశ, బ్రహ్మకు నొసఁగె నధ్వర్యునకును
పశ్చిమదిశ నిచ్చె వరసామగాతకు, నుత్తరదిశ నప్పుడొసఁగె విభుఁడు
గీ. నాల్గుదిగ్భాగములకు నడుమనున్న, జగతి నంతయు నొసఁగె నాచార్యునకును
బ్రాహ్మణుం డర్హుఁడీ మహీభాగమునకు, ననిమనంబునఁ దలఁచి నెయ్యంబుతోడ.

గీ. కట్టుపుట్టముఁ దక్క సకలమునిట్లు, లొసఁగె రాముండు రాణియై యొప్పుసీత
గరిమ మంగళసూత్ర మొకండు దక్క, నాభరణముల నన్నింటి నర్థి నొసఁగె.

మ. తలఁపన్ బ్రాహ్మణదేవుఁడై పరఁగు తద్వాత్సల్య మీక్షించి వా
రలు నంప్రీతమనస్కులై హితమతిన్ రామావనీజాని క
ర్మిలి నర్పించుచుఁ గ్రమ్మఱన్ సకలధాత్రీభాగముల్ ప్రీతి ని
ట్టులు భాషించిరి రాముమోముపయిఁ జూడ్కుల్ నింపుచున్ మెల్లనన్. 329

తరల. భువననాయక! సర్వదేవ విభూ! ప్రభూతదయుండవై
తవిలి మాకు నొసంగనట్టి పదార్థ మొకండు లేదు సా
ధ్వవనతత్పర! నీవు మా హృదయాంతరంబులఁ జొచ్చి వా
స్తవిక నిర్మల రోచులన్ వెలుగన్ దమంబు హరింతుగా. 330

గీ. పుణ్యోత్తమచరితుండు బ్రహ్మణ్యదేవుఁ, డనుపలబుద్ధియు సర్వలోకాధివిభుఁడు
మహానిజనపాదముల నిజకమానసమున, నిల్పు శ్రీరామభూమిజాని జూచె.

వ. అని విప్రోత్తములు ప్రస్తుతించిరి. అంతఁ గొంత కాలముకడచన నొకనాఁడు. 332

క. లోకోదంతముఁ దెలియన్, గాకుత్స్థుఁడు గూఢవృత్తిఁ గనరాక నిశన్
జోకఁ జరించుచు నొక్కని, వాకును విని భార్యఁ గుఱిచి పలుకుచునుండన్. 333

క. పరగేహాగతన్ గులటను, భరియింపఁగనొల్ల నేను భరియించెను శ్రీ
వరుఁడై రాముఁడు సీతను, దిరుగం బొందంగ సమ్మతింపుచు ననఁగన్. 334

వ. అట్లు విని, 335

గీ. బహుముఖము దురారాధ్యమహాపాపవృఁగ, మునకు భీతుఁడై తనపత్నిఁ ద్యజించుదన్న
వినినభూములవిడువ సాధ్వియగుసీత, చేరె వాల్మీకి మునిశ్రీమదాశ్రమంబు. 336

గీ. ప్రసవకాలము రాఁగ గర్భవతి సీత, కొడుకులం గనె నిద్దఱఁ గుశలవులను
అపుడు వారికి జాతకర్మాదిక క్రియాకలాపము జరిపె వాల్మీకి మౌని. 337

గీ. అంగదుఁడు చంద్రకేతుండనఁగనన నిరువురు
సుతులు లక్ష్మణునకుఁ బుష్కరతులసుతులు
తక్షుఁడున్ బుష్కలుండు నాఁగఁదనయు లిర్వు
రుదయమందిరి భరతరాజోత్తమునకు. 338

గీ. నందనయుగంబు శత్రుఘ్ననకు సుబాహుఁ
డనఁగ శ్రుతసేనుఁ డన నుదయంబునొందె
దిగ్విజయమనుయంబునకృతి భరతుఁడు
కోట్లకొలఁది గంధర్వులఁ గూల్చివైచె. 339

వ. మఱియు వారల సర్వధనంబులన్ గొనితెచ్చి శ్రీరామచంద్రునకు సమర్పణంబుఁ
గావించె. 340

మ. రఘుపుత్రున్ లవణాఖ్య రాక్షసు ననిన్ గూల్చి శత్రుఘ్నుఁడున్
మధునామంబునఁబొల్చు కాననమునన్ బ్రఖ్యాతిశోభాఢ్యమై
మధురాఖ్యన్ వెలుఁగొందు దివ్యపురమున్ బాగొప్ప నిర్మించె న
వ్విధ మత్యంతము విస్మయావహము పృథ్వీనాథ మాన్యాగ్రణీ! 341

చ. తనయుల నిద్దఱన్ మునివరుం డొసఁగి సన్నిధినుంచి లోకపా
వనసతి సీతయున్ బతి విరహాన్వితయౌటకుఁ జింతనొంది నా
థునిచరణాంబుజంబులను దోరపుభక్తిని సంస్మరింపుచున్
జనవరసత్తమా! వెనర పాతలసీమను జొచ్చె వేడ్కఁడిన్. 342

సీ. అంత సీతోదంతమాలించి భగవంతుఁ, డైన రాముండు శోకాతిశయము
ధీపటిమ న్నివర్తించువాఁడౌచు నీ, శ్వరుఁ డయ్యు నరికట్టఁజాలఁ డయ్యె
స్త్రీపుంప్రసంగ మింతియ యెల్లయెడలను, నెంతయు భయ మావహిల్లఁ జేయు
నీశ్వరులగువారి కెయిట్లైన నిఁక గృహ, చిత్తుల నన్యులఁ జెప్ప నేల

గీ. నంతమీఁదట బ్రహ్మచర్యవ్రతంబుఁ, బూని శ్రీరామచంద్రుండు పోలుపుమీఱ
నగ్నిహోత్రంబు వేలిచె ననవరతము, శ్రీకరధ్యాననిష్ఠాగరిష్ఠుఁడగుచు. 343

వ. ఇట్లు పదుమూఁడువేలవత్సరంబు లవిచ్ఛిన్నంబుగ నగ్నిహోత్రంబు వేల్చుచు నిరంతరంబుఁ దన్ను స్మరించువారి హృత్పద్మంబుల స్వపాదపల్లవవిన్యాసంబుఁ గావించి యనంతరం బాత్మగతిం బొందె. 344

మ. అమరప్రార్థనఁ గేళిదేహుఁడయి సామ్యాధిక్యముక్తప్రభా
విమలుండౌ రఘురామమూర్తి కిది భావింపన్ యశంబే? సము
ద్రముబంధించుట యస్త్రసంతతులచే రక్షోవధంబున్ ప్లవం
గమసాహాయ్యము మున్నుగాఁగలుగు నీ కార్యంబు లాటల్ గదే! 345

సీ. ఆశాంతవిశ్రాంతమమలంబునగు నే ర,ఘూద్వహు సద్యశం బొప్పుమీఱ
నృపసభాంతరములనేఁడును ఋషివరుల్, సెలువొప్ప గానంబుఁ జేయుచుంద్రు
త్రిదివపాలకధరిత్రీపాలకకిరీట, ఘటితమణిఘృణిశర్కర్బురమగు
నా విభు శుభచరణారవిందంబును, శరణంబు వేడెద సంతతంబు

ఆ. ఆ కకుత్స్థవంశ్యు నంటుచుఁ గాంచుచుఁ, గూడి తిరుగుచుఁ బలుకుచును నగుచు
నుండి కోసలులు మహోత్తమయోగులు, పొందనట్టిగతిని బొంది రధిప! 346

క. పురుషుఁడు వీనుల రాఘవు, చరితము వినెనేని సదుపశమనిష్ఠాత
త్పరుఁడయి విముక్తుఁ డగు న, బ్బురముగ ఘనకర్మబంధములనుండి నృపా! 347

వ. అనిచెప్పినవిని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. మునీంద్రా! భగవంతుండగు రామచంద్రుండు భ్రాతలయెడ స్వజనులయెడఁ బ్రజలయెడఁ బౌరులయెడ నెట్లెట్లు వర్తిల్లె? వారును నతనియెడ నెట్లు మెలంగి రెఱింగింపు మనవుఁడు 348

శ్రీశుకుఁడు:—

వ. రాజా! త్రిభువనేశ్వరుండగు నా రామభూవరుండు దిగ్విజయార్థంబుఁ దన సోదరుల నియోగించె. స్వకీయులకు దర్శనంబొసంగుచు ననుయాయిబృందసమేతుండై యయోధ్యాపురంబుఁ దాను వీక్షించె. 349

సీ. గంధోదకంబులఁ గరిమదశీకరం,బుల రొంపియగు మార్గములఁ దనరుచు
స్వామిరాకం గాంచి సావశ్యమునఁ బ్ర,కామమత్తసురభిగతిఁ జెలఁగుచుఁ

ప్రాసాదచైత్య సభా గోపురాగ్రదే, వాలయస్థానవిన్యస్తములగు
సౌవర్ణకలశభాస్వరపతాకలచేత, శృంగారముగ నలంకృతయగుచును
గీ. వృంతయుతపూగతరువులు పెంపుగలల, యనంటిచెట్లును పట్టికలలలరుచుండ
దర్పణాంశుకస్రగ్గ్రథితశుభతోర, ణముల భాసిల్లుచు నయోధ్యకొమరునిగిలె.

చ. అట నటఁ బౌరు లెల్లరు సమాగతుఁడౌ రఘురామమూర్తిచెం
గటి కొగి నర్ఘ్యపాద్యములు గైకొని వచ్చి యొసంగి దీనసల్
'ఇటముగ నుద్ధరించితి క్షితిన్ దొలి నీవు వరాహమూర్తివై
యటు లగుటన్ గృపన్ మనుపుమయ్య' యటంచును వేఁడి రున్మదిన్. 351

ఉ. అంతఁ బ్రజాతతుల్ చిరసమాగతుఁడౌటను రామచంద్రునిన్
వింతగఁజూచు వేడ్క మెయివీడి గృహంబులు స్త్రీలుఁ బూరుషుల్
ప్రాంతగతోరుహర్మ్యములపై కెగఁబ్రాకుచుఁ బద్మనేత్రుఁ ద
న్వింతయులేని నేత్రములనింపుగఁజూచిరి పూలుసల్లుచున్. 352

సీ. చిత్రసౌధములు విచిత్రధ్వజములు స, త్యమలమాణిక్యగవాక్షములును
విద్రుమసోపానవిలసితద్వారముల్, గురుతరస్ఫాటికకుడ్యములును
శస్తవైడూర్యమయస్తంభతతులును, మరకతరత్నరమ్యస్థలములు
చిద్విలాసంబులై వెలఁగుచు భోగభా, జనములౌ ముత్యాలజాలరులును
గీ. బరఁగసురచిరధూపదీపములు నెలయ, లాలితస్త్రీపురుషసువిలాసయుతము
పూర్వరాజోపయుక్తమై భూరికోశ, కలితమగు స్వగృహముఁజొచ్చె తాన్నాథవుండు.

ఉ. రాముఁడు కీర్తిధాముఁ డభిరాముఁడు ధీరజనోత్తముండు స
త్ప్రేమసమేతయున్ మిగులఁ బ్రేయసియున్ గమనీయమైన సీ
తామహిళాలలామ సతతం బనుకూలతమై చెలంగ నా
శ్రీమహితోరువేశ్మమునఁ బ్రీతిమెయిన్ విహరించె భూవరా! 354

గీ. ధర్మపీడగాకుండ యథాతథముగ, మొనసి పెక్కేండ్లు కామంబులనుభవించె
నరులు నిత్యము తన చరణారవింద, ములను గొలువంగ నా రామభూవరుండు.

---

## అధ్యాయము 12.

### శ్రీరామపుత్ర కుశాన్వయాభివర్ణనము

శ్రీశుకుఁడు: —

వ. ఆ శ్రీరామునకుఁ గుశుండును, నా కుశునకు నతిథియు, నతనికి నిషధుండును, నిషధునకు నభుండును, నా నభునకుఁ బుండరీకుండును, నతనికి క్షేమధన్వుండును బొడమిరి. క్షేమధన్వునకు దేవానీకుండును, నతనికి నహీనుండును, నహీనునకుఁ బారియాత్రుండును, నతనికి బలుండును, బలునకు జలుండును, నతనికి నర్కాంశజుండగు వజ్రనాభుండును, నతనికి శంఖణుండును, నతనికి విధృతియుఁ గలిగిరి. విధృతికి జైమినిశిష్యుఁడుఁ గౌసల్యుఁడునగు యాజ్ఞవల్క్యుఁ డెవనివలన నధ్యాత్మయోగంబు వడసెనో యట్టి యోగాచార్యుండగు హిరణ్యనాభుండు వొడమె. ఆ హిరణ్యనాభునకు బుష్యుండును, నతనివలన ధ్రువసంధియు, నతనికి సుదర్శనుండును, నతనికి నగ్నివర్ణుండును, వానికి శీఘ్రుండును, వానికి మరువును నుదయించిరి. ఆ మరువు యోగసిద్ధిం బొంది కలాపగ్రామము నాశ్రయించియుండె. కలియుగాంతమున వినష్టంబగు సూర్యవంశం బతండు పునరుద్ధరింపఁగలండు. ఆ మరువునకుఁ బ్రశుశ్రుకుండును, వానికి సంధియు, సంధికి నమర్షణుండును, వానికి మహస్వంతుండును, నతనికి విశ్వసాహ్వుఁడును గలిగిరి. అతనికి భారతరణంబున నీ తండ్రియగు నభిమన్యుచేఁ జంపఁబడిన బృహద్బలుండు వుట్టె. వీరలు గతించిన యిక్ష్వాకుభూపాలురు. ఇంక భావిభూపతుల వక్కాణించెద నాకర్ణింపుము. 356

బృహద్బలునకు బృహద్రణుండు పుత్త్రుండు కాఁగలండు. అతనికి మరుక్షతుండు వొడము. ఆతనికి వత్సప్రీతుండు జనింపఁగలండు. వత్సప్రీతునివలనఁ బ్రతివ్యోముఁడును, నతనివలన దేవసేనాధిపతియగు భానుండును, ఆ భానునకు సహదేవుండును, నతనికి వీరుండగు బృహదశ్వుండును, నతనికి భానుమంతుండును, నతనికిఁ బ్రతీకాశ్వుండును, నతనికి సుప్రతీకుండును, వానికి మేరుదేవుండును, వానికి హుతక్షతుండును, వానికి బుక్షుకుండును బొడముదురు. ఆ బుక్షుకున కంతరిక్షుండును, వానికి సుతపుండును, వానికి నమిత్రజిత్తును, వానికి బృహద్వాజియు, వానికి బర్హియును, వానికి ధనంజయుండును గలుగఁగలరు. ఆ ధనంజయునకు రణంజయుండు, నతనికి సృంజయుండును, వానికి శాక్యుండును, వానికి శుద్ధాదుండును, నాతనికి లాంగలుండును, నా లాంగలునకుఁ బ్రసేనజిత్తును, వానికి క్షుద్రకుండును, వానికి బుణకుండును, వానికి సురథుండును, వానికి సుమిత్రుండు ననంబరఁగు వారు జనియింతురు. వీరు బృహద్బలవంశీయులు. ఇ ట్లిక్ష్వాకువంశంబు సుమి

త్రాంతం బగును. ఆసుమిత్రాఖ్యరాజును బొంది కలియుగంబున సూర్యవంశంబు నిల్చిపోవును. 357

---

## అధ్యాయము 13.

### నిమివంశానుక్రమణిక (జనకచరిత్రము)

శ్రీశుకుఁడు:—

సీ. జననాథ! యిక్ష్వాకుతనయుండు నిమి యొక్క, సత్త్రయాగంబొనర్చ నవినయముగ
ఋషిసంఘంబు వసిష్ఠు ఋత్విజుఁగాఁ గోరె, నాతని కాతఁ డిట్లనియె నన్నుఁ
గోరెఁ దొల్దొల్త శక్రుఁ డది నిర్వర్తించి, చనుదెంతు మగిడి యంతదనుక వేచి
యుండు మనెన్ మిన్నకుండెను నిమి గురుం, డరిగె నింద్రుని జన్నమాచరింప

గీ. నస్థిరము జీవితం బనియనుచు నెఱిఁగి, యాత్మకోవిదుఁడగు నిమి యన్యులైన
ఋత్విజులతోడ మఖము మొదలిడించఁ జేసె, రాజయిట్లు వసిష్ఠుండు రాకమున్న.

గీ. మఖపుముఖము ముగించి క్రమ్మఱంగ వచ్చి, శిష్యుని వ్యతిక్రమంబు వీక్షించి గురుఁడు
నిమినృపాలుని శపియించె నీ తను విడి, పడుముగా వృథ యనుచుఁ గోపంబుఁ బొంది.

గీ. ధర్మవర్తనుఁడౌ గురుకల్పజనకు, నిమియుఁ బ్రతిశాపమొసఁగె లోకశీతలేశ!
'ప్రబలలోభంబు కతన ధర్మంబెఱుఁగక, పడుఁగు నీ దేహమును జనుక నాతో' యనుచు.

వ. ఇట్లు గురుని శపించి యధ్యాత్మకోవిదుండగు నిమి మహీపాలుండు తన శరీరంబు నుజ్జగించె. అంతఁ బ్రపితామహుండగు వసిష్ఠుండును మిత్రావరుణుల కూర్వశి యందు జనించె. 361

మ. నిమి దేహంబును గంధవస్తుతతులన్ నిక్షిప్తముం జేసి స
ర్వముని శ్రేష్ఠులు సత్త్రయాగము సమాప్తంబైన రీతిన్ సమా
ప్తముఁ గావించి సమాగతామరతతిన్ బ్రార్థించిరీ యీతని దే
హము జీవించుత మా మొఱన్ గృపను నంతర్బైన నీ మొఱన్ గల్గినన్. 362

ఆ. అనిన నట్లు కాక యనుచు వేల్పులు నల్క, నాకు దేహబంధనము రవంత
కలుగకుండుఁగాక కలనైన ననుచును, బలికె నప్పుడు నిమినృపాలకుండు. 363

వ. మఱియు నిట్లనియె. 364

చ. మునులు శరీరయోగమును బుద్ధినిఁ గోరరు తత్త్వభావనా
శనభయకాతరాత్ములయి సంతతమున్ స్థిరమైన మానసం
బున హరిపాదపంకరుహమున్ భజియించుచునుండ్రు గాన నే
ననుపమమైన భక్తిని దదాశ్రయలాభము గాంక్షఁ జేయుచున్. 365

గీ. సలిలభాగమునన్ మత్స్యములకుఁ బోలె, నన్నిచోట్ల దానికి మృత్యువావహిల్లు
నట్లగుట దుఃఖమోహభయాశ్రయమగు, మేన నేను బ్రవేశింపఁ బూన నింక.

వ. అని నిమి పలికినంత దేవతలు మునులఁ గాంచి శరీరధారులలోచనంబులం దితండు విదేహుండై యున్మేష, నిమేష లక్షణుండై యధ్యాత్మస్థితుండై నివసించుఁ గాత మని వాక్రుచ్చి రంత. 367

గీ. నరులకు నరాజకభయంబు పరఁగు నని గణించుచు మహర్షివర్యులు నిమినృపాలు
దేహమును బేర్మితోడ మథించి రంత, నుద్భవించెఁ గుమారకుం డొక్కరుండు.

వ. అతండు స్వదేహంబునం జనించుటం జేసి జనకుండనియు విదేహుండగుట వైదేహుండనియు మథనజాతుండగుట మిథిలుండనియుఁ బరఁగె. ఆ మిథిలునిచేతనే "మిథిల"యను పురంబు నిర్మింపఁ బడియె. ఆ జనకునివలన నుదావసుండును, వాని వలన నందివర్ధనుండును, వానివలన సుకేతుండును, నా సుకేతనృపతికి దేవరాతుండును, వానికి బృహద్రథుండును, నతనికి మహావీర్యుండును, వానికి సుధృతియు, సుధృతికి ధృష్టకేతుండును, వానికి హర్యశ్వుఁడును, నతనికి మరుండును, మరునకుఁ బ్రతీంధకుండును, వానికిఁ గృతిరథుండును, వానికి దేవమీఢుండును, వానికి విధృతుండును, విధృతునకు మహాధృతియు, నతనికిఁ గీర్తిరాతుండును, వానికి మహారోముండును, వానికి స్వర్ణరోముండును, నతనికి హ్రస్వరోముండును, నా హ్రస్వరోమునకు సీరధ్వజుండును జన్మించిరి. 369

గీ. జన్నమునకై యతఁడు భూమి దున్నెడునెడఁ, బ్రభవమందెను సీత సీరాగ్రమందు
దాన సీరధ్వజుండని ధారుణీంద్ర!, యతఁడు ప్రఖ్యాతుఁడయ్యె క్షోణితలమందు.

వ. ఆ సీరధ్వజునకుఁ గుశధ్వజుండు, నతనికి ధర్మధ్వజుండు, వానికిఁ గృతధ్వజ మితధ్వజులను నిర్వురుపుత్రులుం గలిగిరి. అందుఁ గృతధ్వజునివలనఁ గేశధ్వజుండును, మితధ్వజునివలన ఖాండిక్యుఁడును జన్మించిరి. కర్మతంత్రజ్ఞుండగు ఖాండిక్యుండు విద్యావిశారదుండగు కేశధ్వజునివలన భీతుండై యెటకేనిఁ జనియె. కేశధ్వజునకు భానుమంతుండును, నతనికి శతద్యుమ్నుండును, వానికి శుచియును, వానికి సనద్వాజుండును, వానికి నూర్ధ్వకేతుండును, వానికి నజుండును, నజునకు గురుజిత్తును, వాని కరిష్టనేమియు, వానికి శ్రుతాయువును, వానికిఁ బార్శ్వకుఁడును, బార్శ్వకునకుఁ జిత్రరథుండును, జిత్రరథునకు మిథిలాధిపతియగు క్షేమాపియు, వానికి హేమరథుండును, వానికి సత్యరథుండును, నతనికి నుపగురుండును, వానికి నగ్నిసంభవుండైన యుపగుర్వుండును, వానికి సావనుండును, సావనునకు సువర్చుండును, సువర్చునకు సుభూషణుండును, వానికి శ్రుతుండును, వానికి జయుండును,

వానికి విజయుండును, వతనికి హృతుండును, వానికి సనఘుండును, వానికి వీతిహవ్యుండును, వీతిహవ్యునకు ధృతియు, ధృతికి బహులాశ్వుండును, బహులాశ్వునకుఁ గృతియుఁ, గృతికి మహావశియును జనించిరి. 371

గీ. ధారుణీశ్వర! మైథిలుల్ ధవీర లధిగ, తాత్మవిద్యావిశారదు లైనవారు
విమలయోగేశ్వరప్రసాదమున గృహము, లందునుండియు నిర్ద్వంద్వు లై నెగడిరి.

---

## అధ్యాయము 14.

చంద్రవంశేతిహాసము – పురూరవ శ్చరిత్రము

శ్రీశుకుఁడు:—

మ. అవనీనాయక! యింకఁ బావనతరం బా చంద్రవంశంబు నీ
వివరింతున్ వినుమయ్య! పుణ్యయశులై పెంపొందు నైలాది భూ
పవరేణ్యుల్ నుతియింపఁగాఁబడుదు రవ్వంశంబునం దా చరి
త్ర వినంగా హృదయంబునందు నధికోత్సాహంబు చొప్పిల్లెడిన్. 373

చ. మునుపు సహస్రశీర్షుఁడగు పూరుషు నాభిసరస్సరోరుహం
బున జగముల్ సృజించుటకుఁ బుట్టినబ్రహ్మకు సద్గుణాదులన్
జనకసమానుఁ డై ఘనుఁ డయ్యశంబునుబొందిన యత్రిపుత్త్రు నా
తని నయనంబునం దమృతధాముఁడు సోముఁడు పుట్టెఁ బుట్టెను. 374

శా. ఆ సోమున్ సరసీరుహాసనుఁడు విప్రౌషధ్యుడుశ్రేణికిన్
జేసెన్ నాథునిగాఁ ద్రిలోకముల నాకన్ గల్పి యత్యున్నతిన్
దా సల్పెన్ ఘనరాజసూయమఖముం దారావిభుం డాపయిన్
ద్రాసం బించుకలేక దేవగురుదారన్ దారఁ బల్మిన్ గొనెన్. 375

ఉ. దేవగురుండు దీనతను దేఁపకుఁ దేఁపకుఁ దన్ను వేడినన్
గావర మొప్ప నాతని నిరాకారముఁ జేసి యొసంగఁ డయ్యెఁ దా
రావనితాలలామను దురంబు భరంబుగ నయ్యె నప్పు డా
దైవతకోటికిన్ సమదదానవకోటికిఁ దన్నిమిత్తమై. 376

చ. సురగురునందుఁ గోపమున శుక్రుఁడు దానవయుక్తుఁ డై నిశా
కరునకు నాఁతఁ డై నిలిచె కాన్మరమణా! యిదివింటి స్నేహభా
స్వరుఁడయి సర్వభూతగణసంయుతుఁడై చు హరుండు ధీరతన్
గురుసుతుఁడై బృహస్పతిని గూడె రణంబున కాయితంబుగన్. 377

గీ. సర్వసురగణోపేతుఁడై శర్వుఁ డెలమి, గురున ననుసరించె నిటు సురాసురవినాశ
కారణంబగు భీమసంగ్రామ మయ్యెఁ, దారకొఱకునై యత్తఱిఁ గౌరవేంద్ర!

ఉ. పిమ్మట నంగిరోముని నివేదితుఁడై కమలాసనుండు న్యా
యమ్మిది కాదు నీ కనుచు నా యమృతాశను మూఁదలించి శీ
ఘ్రమ్ముగ దారనున్ బతికిఁ గ్రమ్మఱ నీయఁగఁ జేసె నంత గ
ర్భమ్మును బూనియున్న దని భర్త గ్రహించెను నెమ్మనమ్మునన్. 379

సీ. నాక్షేత్రమునఁ బరనిక్షిప్తమైన యీ, కడుపును వేవేగ విడువు విడువు
పొలఁతి! యపత్యకాముఁడ నౌట నేను నిన్, భస్మమ్ముఁ జేయఁ బూనను నిజమ్ము
అని బృహస్పతి పలుకనంతలో సిగ్గిలి, తార స్వర్ణాభుఁ గుమారుఁ గనియె
నకుమారునిఁ గాంచి యలబృహస్పతియును, జంద్రుండుఁ బుత్రవాత్సల్యమొదవ

గీ. నాకొమరుఁ డీతఁ డరయంగ నీకొమరుఁడు, కాఁడటంచును వాదంబులాడుచుండఁ
దాపసులు దేవతలుఁ గూడి తార నడుగఁ, జెప్ప దయ్యె నింతేని యుసిగ్గుకతన.

మ. కొమరుం డప్పుడు తల్లిఁ జూచి పలికెన్ గ్రుద్ధాత్ముఁడై యిట్లు లో
యము! యీ టక్కరిలజ్జ యేటికి? యసద్వ్యాపార వైతీవు నీ
చమతిన్ దాపఁగ నేమిలాభ మిఁక దుశ్శంకల్ విసర్జించి వే
గమ యెవ్వానికి నన్నుఁ గంటివో యెఱుంగన్ దెల్పుమా యేర్పడన్. 381

గీ. తార నేకాంతమునకు విధాత పిలిచి
యనునయించుచుఁ బదుదంతమడిగె నేర్మి
సోమునకుఁ బుట్టె ననుచు నాసుదతి పలికె
నల్లనఁ దనూజు గ్రహియించె నమృతకరుఁడు. 382

గీ. ఆ సుతునకు నజుఁడు బుధుఁడనెడినామ, కరణముం జేసె బుద్ధివికాసయుక్తుఁ
డై చెలంగునటంచు నయ్యమృతరశ్మి, తనయునిం గాంచి యమితమోదంబునొందె.

సీ. బుధునకు నిలయందుఁ బొడమెఁ బురూరవుం, డతఁడిప్పుట్టువు మున్నె యధిప! వింటి
వింద్రసభన్ విబుధస్త్రీగీతములైన, తద్రూపగుణగణౌదార్యశీల
విక్రమాదుల నర్థిఁ విని మెచ్చి యూర్వశి, పూవిలుకాని తూపులఁ గలంగి
అతసియంతికమునకరుదెంచి మిత్రావ,రుణశాపవశతఁ దాఁగొన్న మనుజ

గీ. భావమును బొందినట్టిది కావున సుమ,బాణసదృశరూపంబునఁ బరఁగునట్టి
యా పురూరవుఁ గాంచి ధైర్యంబు విడిచి, యతని పజ్జను నిలిచె ధరాధినాథ! 384

ఉ. పొచ్చెము లేక వచ్చి తనపొంతను మచ్చిక నిల్చియున్న య
య్యచ్చరలేమనుం గని ప్రహర్షవికస్వరలోచనాబ్జుఁడై

మెచ్చి పురూరవుండు తమిక్రమించిన డెందముతోడ నిట్లు వా
క్రుచ్చె లతాంగితో సుమధురోక్తుల నెమ్మిఁ బ్రహృష్టరోముఁడై. 385

పురూరవుఁడు:—

గీ. స్వాగతము నీకు నో యెలనాఁగ! యిందు, నిల్వుమా యేమి సేయుదు? నీకు నేను
మెలఁత! నాతోడఁ గూడి రమింపు మనకు, శాశ్వతసమంబు లురురతిసౌఖ్యమగుత.

ఊర్వశి:—

శా. భూపా! సుందరరూప! యెవ్వరి మనంబున్ దృష్టియున్ మక్కువన్
నీపై లగ్నముగాక యుండుఁ జెప్పుమా నిక్కంబుగాఁగన్ మన
స్తాపంబున్ హరియించు తావక తనూసంగం బహుయత్నంబుగాఁ
బ్రాపింపన్ వలదంచు నెట్టుకొనిపోవనన్ శక్యమే యేరికిన్. 387

క. ధీరత నీన్యాసములగు, నీ రెండు పొట్టేళ్ళఁ గావుమిదె నీ తోడన్
నే రమియించెద శ్లాఘ్యుఁడె, నా రమణులకున్ వరుండవౌదువు ముఖ్యా! 388

గీ. ఘృతము నాకు భక్ష్యమ్ముగ క్షితివరేణ్య! కడఁక మైథునేతరకాలమందు
విగతవస్త్రుఁడవై కానుపింపరాదు, నా కనఁగ నీయకొనసట్లు కాదని పతి. 389

సీ. నరలోకసమ్మోహనములగు త్వద్రూప, భావంబు లత్యద్భుతానహములు
మనుజుఁ డెవ్వఁడు స్వయంసంప్రాప్తవగు దేవి, నిన్నున్ గొల్వఁ దృణీకరించు
నని యొగ్గడించు చయ్యతివతోఁ గూడి యా, భూపై రీతిన్ బ్రమోదంబుతోడఁ
గమనీయ బృందారకవిహారభూములౌ, చైత్రరథాదులన్ సంతతంబు

గీ. సజ్జకింజల్కగంధ సమంచితశుభ, తరముఖామోదముషితచేతస్కుఁ డగుచుఁ
బెక్కువత్సరగణములు ప్రీతి మెలఁగు, చోలినై హర్షవారిధి నోలలాడె. 390

వ. అంత 391

గీ. శక్రుఁ డూర్వశిలేని యాస్థానభూమి, యింపు జనియింపకుండ నాశించు కేనిఁ
గాన మీరలు గొని తెండు కడఁకఁ బోయి, యనుచు గంధర్వులం బంపె జనవరేణ్య!

ఆ. వారు రేయి యంధకారమ్ము గ్రమ్మంగ, నరవరోత్తముసకు న్యాసములగు
యూర్వశికిని గూర్చు నురణకంబులఁ బట్టి, బోయి యపహరించి రలఘుమాయ. 393

గీ. ఉరవడిం గొనిపోఁబడుచున్న తనదు, సుతుల మొఱవిని యూర్వశి మతిఁ గలంగి
కుపతి, వీరమాని, నపుంసకుండునైన, యితనిచే హతనైతి నింకేమి కలదు? 394

చ. చెడితిని వీని నచ్చి కనుఁజెచ్చెర ముచ్చులు మాయఁ జేసి నా
కొడుకుల ముచ్చిలించి రధికుండని యెంచితి వీని నాత్మ నీ

తఁడు పురుషుండెయయ్యు నెడఁ బదన్ బెనుభీతి కలంచి వైవఁగాఁ
ఒడఁతియుఁబోలె నీపగిదిఁ బాన్పును వీడకయుండె భీరుఁడై. 395

వ. అని పురూరవు నుద్దేశించి 396

చ. విడువిడు నాదుమేనఁ బెనవేసిన బాహువులన్ గునాథ! నా
కడను వసింప కీవు తొలఁగన్ జను మెయ్యెడ కేనిఁ జూడ న
ల్పుఁడ వతికాతరుండ వతిలోలమనస్కుఁడ వైన నీ వి టా
గడమున నన్మొఱంగితివిగా యిది యెల్లను దెల్ల మియ్యెడన్. 397

శ్రీశుకుఁడు:—

మ. బరికోలన్ గరిరాజువోలెఁ గటువాగ్బాణావళీవిద్ధుఁడై
ధరణీశోత్తముఁ డా పురూరవుఁడు శాతంబౌ కృపాణంబు ను
ద్ధురలీలన్ వలకేలఁ దాలిచి వివస్త్రుండై నిశీథంబునన్
గురురాజోత్తమ! ప్రౌఢిమీఱఁ బఱచెన్ బొట్టేళ్ల రక్షింపఁగన్. 398

గీ. అంత నా మేషముల డించి యచటవారుఁ, దేజరిల్లిరి యుజ్జ్వలదీప్తులెసఁగఁ
దగరులన్ గొని చనుదెంచు మగని నగ్న, వేషుఁ గని బాసఁదప్పటన్ వెడలె సుదతి.

శా. ఐలుండైన పురూరవుండు నట శయ్యన్ జాయనుంగాన కు
ద్వేలోద్విగ్నమనస్కుఁడై సతతమున్ బెన్వంతలన్ గుందుచున్
వ్యాలోలత్వమునన్ సమస్తధరణీభాగంబు నున్మత్తుఁడుం
బోలెన్ దద్గతచిత్తుఁడై తిరిగె నో భూపాలకగ్రామణీ! 400

మ. చెలువారంగఁ బురూరవుండును గురుక్షేత్రంబునందున్ రహ
స్స్థలి నయ్యూర్వశి నేవురన్ జెలుల నోజన్ గాంచి యత్యంత హ
ర్షలసద్వక్త్రసరోరుహుండగుచు నుత్సాహంబు దీపింపఁగన్
బలికెన్ శోభనమైనయట్టి పలుకున్ బార్వ్యవంశోత్తమా!. 401

గీ. ఓహూం! నా జీవితేశ్వరి! యుండుముండు, కఠినహృదయా! ననువీడఁ గాఁ జనదిట
మంతనంబును బాటించి యింతదనుక, నన్నుఁ దనుపక యేగుట చన్నె? నీకు. 402

ఉ. నీవు త్యజింతువేని వినునిక్కము మేదినిమీఁదఁ గూలెదున్
దేవిరో! నామనోజ్ఞమగు దేహము గృధ్రములు న్వృకమ్ములున్
దావకసుప్రసాదరహితమ్మగు నాతనువున్ భుజించెడున్
గావున నంతకన్న మును గావుము నన్నుఁ గృపార్ద్రబుద్ధివై. 403

ఊర్వశి:—

చ. పురుషుఁడ వీవు గాన నృపపుంగవ! చావఁ దలంపఁ బోకు వి
స్ఫురిత భవచ్ఛరీరమును బుట్టి వృకమ్ములు మెక్కకుండుతన్
గరము భయంకరమ్మగు వృకమ్ముల డెందముఁబోలెఁ గ్రూరపూ
తరుణులతోడి పొత్తెప్పుడుఁ దద్యాజ్యము పూజ్యము కాదు భూవరా! 404

క. క్రూరలు నదయలు దురహం, కారలుఁ బృథుసాహస ప్రకారలు నగుస్త్రీ
లూరక యల్పార్థమునకె, దోరింతురు మగని నేనిఁ దోఁబుట్టువు నేన్. 405

ఆ. కల్లనచ్చికలను గల్పించి మైత్రిపోఁ, దివిచి క్రొత్తక్రొత్తచవులు మరిగి
స్వైరవృత్తులగుచు జారిణులగుచును, మెలఁగుచుందు రెప్పుడు మెలఁత లెందు. 406

క. వినుమో వల్లభ! యొకరే, ననుఁగూడి వసింతు హాయనాంతంబున సం
దను లన్యు లింక నీకున్, జనియింతురు సుమ్ము ప్రకటసౌజన్యనిధీ! 407

క. అంతఁ బురూరవుఁ డూర్వశి, సంతర్వత్నిగ నెఱింగి యరిగెఁ బురికి స
ద్భ్రాంతమున మగిడివచ్చి యు, వాంతమునన్ వీరమాత యయ్యతివఁ గనెన్. 408

క. రేయిఁ గడపెఁ బ్రిమదంబున, నా యూర్వశిఁ గూడి యథిపుఁ డడఁగి పిమ్మట నా
తోయలి విరహాతురుఁడగు, నా యొడయని దీనుఁ గాంచి యనె నీరీతిన్. 409

క. పార్థివ! యీ గంధర్వుల, నర్థింపు మిడుదురు నన్ను నన సర్విభుచే
దుర్ధర్షులు గంధర్వులు, ప్రార్థితులై యొసఁగి రతనికగ్నిస్థాలిన్. 410

గీ. దాని నూర్వశిఁగా మదిఁ దలఁచి వనినిఁ, గ్రుమ్మరుచు నిజమెఱిఁగెఁ బురూరవుండు
నడవినా స్థాలినునిచి యాతఁడు గృహమున, కేఁగి యూర్వశి నిశలధ్యానించుచుండె.

వ. అంతఁ ద్రేతాయుగంబు సమావృత్తంబగుడు నా పురూరవుని మనంబున వేదత్ర
యంబు ప్రాదుర్భవించె. అప్పు డాతఁడు స్థాలి నునిచిన చక్కటికిం జని తత్సమీ
పంబున శమీగర్భసంజాతంబగు నశ్వత్థంబు నుపలక్షించి యయ్యశ్వత్థంబున నర
ణిద్వయంబుఁ గల్పించి యూర్వశీలోకంబుఁ బొందంగోరి క్రింది యరణి యూర్వశి
గా మీదియరణి తానుగా నుభయమధ్యకాష్ఠంబు పుత్రుఁగ మంత్రంబుల
ధ్యానించుచు మథించె. తన్నిర్మథనంబున విభావసుండు జన్మించి జాతవేదుండ
నంబరఁగి రాజగు పురూరవునివలనఁ ద్రయీవిద్యచేఁ ద్రేతాగ్ని రూపపుత్రత్వం
బునఁ గల్పితుఁడయ్యె. ఇట్లు. 412

గీ. ఊర్వశీలోకమును గోరి యుర్వినాథుఁ, డగ్నుల దేవస్వరూపు యజ్ఞేశు హరి
నభవు భగవంతు నాద్యుని యజ్ఞవిభునిఁ, బేర్మి యజియించె నా జాతవేదుకతన. 413

గీ. ప్రథమమున సర్వవాఙ్మయప్రణవరూప, వేద మొక్కఁడ యొకఁడ భావింప దేవుఁ
డాదినారాయణుండు లేఁడన్యుఁడెవఁడు, నొక్కఁడేయగ్ని వర్ణంబు నొక్కఁడెయగు.

వ. త్రేతాముఖంబున నియ్యది త్రైవిధ్యంబుఁ జెందె. అనంతరం బా రాజేంద్రుం డపత్యంబగు నగ్నికతన గంధర్వలోకంబుం బొందె. 415

---

## అధ్యాయము 15.

### పరశురామచరిత్ర

శ్రీశుకుఁడు:—

వ. ఇలాపుత్త్రుండగు పురూరవున కూర్వశివలన నాయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుఁడు, విజయుఁడు, జయుఁడు నను నార్వురు కొమరు లుద్భవించిరి. శ్రుతాయువునకు వసుమంతుండును, సత్యాయువునకు శ్రుతంజయుండును, రయునకు నేకుండును, జయునకు నమితుండును, విజయునకు భీముండును బొడమిరి. ఆ భీమునకుఁ గాంచనుండును, నతనికి హోత్రకుండును, వానికి గంగను బుక్కిటం బట్టిన జహ్నుండును, నా జహ్నునకుఁ బూరుండును, నతనికి బాలకుండును, నతనికి నజకుండును, నతనికిఁ గుశుండును, గుశునకుఁ గుశాంబుండు, ధూర్తయుండు, వసువు, కుశనాభుండు నను నలువురు కొడుకులును గలిగిరి. కుశాంబునకు గాధి జనించె. సత్యవతియను నా గాధికన్యను ఋచీకుండను బ్రాహ్మణుండు యాచించె. అననురూపుండగు నా వరుంగాంచి గాధిరా జిట్లనియె. 416

సీ. ఒకచెవి నల్లనై యొడలెల్ల జాబిల్లి, యోజను దెల్లనై తేజరిల్లు
గుఱ్ఱముల్ వేయి యుంకువగాఁగఁ గన్యకై, కొనితెచ్చి యొసఁగుము కుశికవంశ
జాతుల మే మని యా తెఱంగునఁ బల్కఁ, బృథ్వీశు నభిమతంబెఱిఁగి తోన
వరుణదేవునికడ కరిగి యా హయముల, వెసఁ దెచ్చియిచ్చి యబ్బిసరుహాక్షిఁ

గీ. బెండ్లియాడె ఋచీకుఁడు పిదప సతియు, నత్తయు నపత్యకాంక్ష నెయ్యంబుతోడఁ
దన్ను సంప్రార్థనముఁ జేయఁ దత్ప్రియంబు, సల్పఁగా నెంచి యా ఋషిసత్తముండు.

గీ. బ్రహ్మమంత్రంబులన్ దనపత్నికి మఱి, క్షాత్రమంత్రింబులన్ దగ శ్వశ్రువునకు
చరువుఁ గల్పించి యమ్ముని సరభసమున, స్నానమొనరించుటకు నయి చనియె నదికి.

వ. అంత. 419

చ. చరువు మదీయ మి మ్మనుచు సత్యవతిన్ జనయిత్రి వేడఁగా
మురిపెమునన్ స్వకీయచరువున్ దన తల్లికి నిచ్చి తల్లిదా

చరువును దా భుజించె సతి సంయమివర్యుఁ డెఱింగి భార్యతోఁ
బరువడి నిట్లు వల్కె మగువా! యొనరించితి కష్టకార్యమున్. 420

గీ. ఘోరుఁడున్ దండధరుఁడు నౌ కొడుకు నీకుఁ, గలుగు నీభ్రాత బ్రహ్మవిద్వరిష్ఠుఁ డగు ననఁగ
నట్లు కాఁజనదనుచు సత్యవతి తనదు, వల్లభుని వేఁడె వినయసంభ్రమ మెసంగ.

గీ. భార్య యెడలఁ బ్రసన్నుఁడై భార్గవుండు, పల్కె నీరీతి నట్లైన నీ పౌత్రుఁ డట్టి
వాఁడగు నటంచు నంతఁ దత్పత్ని కుదయ, మించె జమదగ్ని పౌరవోర్వీతలేశ!

వ. ఆ సత్యవతి మహాపుణ్యయు, లోకపావనియు నగు కౌశికి యను స్రవంతి యయ్యె.

ఆ. రేణుసుహితయైన రేణుకాదేవిని, విజ్ఞుఁడు జమదగ్ని పెండ్లియయ్యె
వరుస నామెయందు భార్గవఋషికిని, వసుమదాదిసుతులు ప్రభవమైరి. 424

ఉ. వీరలలోన రాముఁ డనువిశ్రుతుఁ డయ్యెఁ గనిష్ఠపుత్రుఁ డిం
పారెడు వైష్ణవాంశమున నభ్యుదయంబును గాంచి మించి హే
లారతి సర్వహైహయకులంబును బీజమణంచి ధీరుఁడై
ధారుణిఁ జేసె క్షత్రరహితంబుగ నిర్వదియొక్క మాఱ్లుగన్. 425

ఉ. రాజకులావతంస! యపరాధము స్వల్పమెయయ్యు నమ్మహా
తేజుఁడు జామదగ్న్యుఁ డతిదృప్తుల భూభరహేతుభూతులన్
రాజుల బ్రాహ్మణాహితులఁ బ్రాకటకీర్తిని బిల్కుమార్చెఁ దా
రాజసతామసాత్ముఁడు నిరంకుశవృత్తియునై పొరింబొరిన్. 426

పరీక్షిత్తు:—

ఉ. మాటికి మాటికిం జలముమానక క్షత్రియకోటి నిట్లు బా
హాటముగా వధించుటకు నా భగవంతున కేమి దొగ్గు మో
మోటములేక చేసి రల భూభుజు లెల్లరు నయ్యంహమున్
సూటిగఁ దెల్పఁగాఁ గదవె సూరిజనోత్తమ! యోగివిత్తమా! 427

శ్రీశుకుఁడు:—

సీ. అర్జునాభిఖ్య నొప్పారెడు ఘనుఁడు క్షత్రియపుంగవుండు హైహయనృపాలుఁ
డచ్యుతాంశాంశు దత్తాత్రేయు వివిధార్చనంబుల నారాధనంబుఁ జేసి
బాహాసహస్రంబుఁ బ్రత్యర్థిజయము న, వ్యాహతేంద్రియముఖ్యయశము బలము
నోజంబు శ్రీయును దేజంబు యోగేశ్వ, రత్వంబు నణిమాదిరాజితగుణ

గీ. భరితమైన యైశ్వర్యముం బడసి యెలమి, నఖిలలోకంబులందుఁ దా నప్రతిహత
గతిని విచ్చలవిడి సదాగతియుఁబోలె, సంచరించుచునుండె రాజన్యవర్య! 428

మ. మదవిస్ఫూర్జితుఁ డర్జునుండు నిజభార్యామారత్నసంయుక్తుఁడై
హృది రంజిల్లఁగ నర్మదాజలములన్ క్రీడించుచున్ విస్మయ
ప్రదబాహాబలసంపదన్ వెస నదిన్ బంధింప నయ్యేటి నీ
రెదురై పాఱుచు ముంచివైచెఁ గురురాజేంద్రా! తటీభాగముల్. 429

ఉ. క్ష్మావర! యత్తటిన్ విడిసి శర్వు జపించెడు వీరమానియై
రావణుఁ డత్తటిన్ స్వశిబిరంబు ప్రతీపజలప్రవాహ వి
ప్లావితమౌటఁ గన్గొని కలంతను బొందుచుఁ గార్తవీర్యధా
త్రీవరవిక్రమంబు సయిరింపక ప్రౌఢి నెదిర్చె నాతనిన్. 430

గీ. అంతటఁ గృతాపరాధు దశాస్యుఁ బట్టి, యతివలసమక్షమునఁ గట్టి యర్జునుండు
తనదు మాహిష్మతీపురంబునను బెట్టి, వానరమునట్లు నెట్టె నవజ్ఞఁ దుదిని. 431

క. అతఁ డొక్కనాఁడు మృగయా, రతుఁడగుచు వివిక్తమగు నరణ్యంబున న
ద్ధతిఁ గ్రుమ్మఱుచున్ జేరెన్, యతితిలకుఁడగు జమదగ్ని యాశ్రమపదమున్. 432

గీ. తాపసోత్తముఁడగు జమదగ్ని యంత, సైనికామాత్యవాహనసహితుఁడైన
యా మహీపాలవర్యున కర్హణంబుఁ, గామధేనువు కతన నగ్గలికఁ జేసె. 433

మ. తనయైశ్వర్యముకన్న మిన్నయగు నుద్యత్సంపదన్ బేర్చు న
మ్మునిచంద్రున్ జమదగ్ని నచ్చటఁ దపోభూమిన్ బొడంగాంచి యా
తని యాతిథ్యము నాదరింపక తమిన్ దా నా హవిర్ధానిపై
మనమున్నిల్పెను హైహయాధిపతి నిర్మర్యాదుఁడై పార్థివా! 434

మ. అవలేపంబునఁ జేసి హైహయవిభుం డమ్మౌనిరాడ్హోమధే
నువు బల్మిన్ హరియింప స్వీయభటసందోహంబుఁ బ్రేరేఁప వా
రు వడిన్ లేఁగనుఁ గూర్చి యమ్మొదవు నాక్రోశింపుచుండంగ మ
క్కువ మాహిష్మతి పట్టణంబునకునుం గొంపోయి రువ్వెత్తుగన్. 435

గీ. రాజు వెడలినపదపడి రాముఁ డాశ్ర, మావనికి నేగుదెంచి యయ్యవనినాథు
దౌష్ట్యమును విని పృథుదండతాడితమగు, కృష్ణసర్పంబుకరణిఁ బెన్నిక్కనుకఁ జెందె.

గీ. ఘోరపరశువు సశరతూణీరయుగముఁ, గవచమును గార్ముకంబును గడఁకఁ దాల్చి
యూథపతిపైకి దుముకు మృగాధినాథు, పగిది రాముండు హైహయపతినిఁ గవిసె.

మ. పురినిన్ జొచ్చుచు నర్జునుండు కనియెన్ భూరిప్రతాపానల
స్ఫురణున్ శత్రుచమూమదాపహరణున్ సూర్యాంశుదీవ్యజ్జటా
భరణున్ బాణధనుఃపరశ్వధధరున్ బ్రస్ఫీతకృష్ణాజినాం
బరు సంత్రాసకరున్ భృగుప్రవరు సంహారక్రియాతత్పరున్. 438

మ. కని యా హైహయచక్రవర్తి చటులోగ్రక్రోధనిస్ఫూర్తి సైన్యం
దనహస్త్యశ్వపదాతియుక్తములు నానాశస్త్రజాలోగ్రముల్
హననోద్యోగచణంబులైన పదునేడక్షౌహిణుల్ పంచెఁ నోఁ
మునిమెన్ దా నొక్కరుండ పేర్చి భగవంతుండైన రాముం డటన్. 439

చ. పవనమనోజవుండు రిపువర్గనిషూదనుఁడైనయట్టి భా
ర్గవుఁడు కడంకతో నిజపరశ్వధమున్ నిగిడించె నంత బా
హువులును గుత్తుకల్ పదములూరువులున్ దెగ యుద్ధభూమి వా
రువములు సారథుల్ మడియ రోజుచుఁ గూలిరి విద్విషద్భటుల్. 440

వ. ఇట్లు శోణితకర్దమంబగు సంగరాంగణంబున భార్గవరాముకుఠారసాయకంబులఁ గవచంబులును, ధ్వజంబులును, గార్ముకంబులును, కళేబరంబులును నికృత్తంబులై నేలంగూలంబడిన నిజసైన్యంబును బొడఁగాంచి రోషకుటిలభ్రుకుటియుగళుండై

ఉ. అంచితవిక్రమాఢ్యుఁడగు నర్జునుఁ డాత్మసహస్రబాహులన్
బంచశతాంబకంబులను బంచశతోగ్రధనుస్సులందు సం
ధించెను రాముపైఁ బటుధీరుఁడు రాముఁడు నేకధన్వుఁడై
సించెను వాని నన్నిటిని జేవ దలిర్పఁగ నన్నికోలలన్. 442

చ. ద్రుమములఁ బర్వతంబులను దోర్బల మొప్పఁగఁ బెల్లగించి వే
గమ పఱతెంచు నర్జునునిఁ గాంచి తదీయ మహాభుజాసహ
స్రము నుఱుమాడి సైచె నహిరాజఫణంబులఁ బోలె యుద్ధరం
గమున భృగుప్రకాండుఁ డతి కర్కశనేమి కుఠారధారలన్. 443

క. పిమ్మట ఖండితభుజుఁడగు, నమ్మనుజేంద్రుని శిరంబు నలఁతిన్ గిరిశృం
గమ్మువలెన్ గూల్చె నదె, క్రమ్మగుపరశువునఁ బరశురాముఁడు క్షితిపా! 444

క. తమతండ్రి హతుండైనన్, సమరక్షితి నిలువ కయుతసంఖ్యాకులు భూ
రమణుని కొమరులు కడు వే, గమునన్ బాఱిరి భయప్రకంపితమతులై. 445

చ. పదపడి వైరిఘస్మరుఁడు భార్గవరాముఁడు లేఁగతోడ న
మ్మొదవును వే మరల్చుకొని పోయి నిజాశ్రమభూమి యల్లనన్
గదిసియుఁ దండ్రి కర్పణముఁ గా నిడి యాత్మకృతంబు సర్వమున్
వదలక తెల్పెఁ దండ్రికిని భ్రాతలకున్ గరువంబుఁ దోఁపఁగన్. 446

వ. అది విని జమదగ్ని పుత్రున కిట్లనియె. 447

క. వినుసర్వదేవమయుఁడగు, జననాయకుఁ బట్టి యుఱక చంపుటకతనన్
ఘనభుజ రామా! పాపం, బొనరించినవాఁడవైతి వౌరా! యిదితగునే? 448

గీ. మనము బ్రాహ్మణులముగదా! తనయ! సర్వ, పూజ్యతం బొందితిమి తొల్లి మూలమునన
లోకగురుఁడగు దేవుండు గ్రక్కొనెఁజుమి, తాల్మి నాపార మేష్ఠ్యపదంబు నిజము.

క. విప్రులసిరి భాసిలు సా, ర ప్రభయుంబలె నిరంతరము క్షమకతనన్
క్షిప్రగతి హృష్టుఁడౌ లో, కప్రభుఁ డా హరి క్షమావికాసయుతులకున్. 450

గీ. అన్న! విను బ్రహ్మవధమునకన్న మిక్కు, టమ్ము మూర్ధాభిషిక్తవధమ్ము కానఁ
జిత్తమా యచ్యుతునియందుఁ జేర్చి తీర్థ, సేవచేఁ బాతకమ్ముఁ ద్యజింపు మయ్య.

---

## అధ్యాయము 16.

### విశ్వామిత్ర చరిత్ర

శ్రీశుకుఁడు:—

గీ. ఓ క్షితీశ్వర! జనకోపశిక్షితుఁడయి, వల్లెయని రాముఁడొక్క సంవత్సరంబు
తీర్థయాత్రలఁ గావించి తిరిగి తనదు, పుణ్యతరమగు నాశ్రమభూమిఁ జేరె. 452

క. ఒకనాఁడు గంగకున్ రే, ణుకచని యట నప్సరోగణోపేతుండై
వికచాబ్జమాలియై మ, చ్చిక గంధర్వపతి క్రీడ సేయుటఁ గాంచెన్. 453

గీ. నదికి జలమునకై చన్న ముదిత యట్లు, క్రీడఁగావించు నతని వీక్షించుచుండె
నెలమి నాచిత్రరథునిపై నించుకంత, స్పృహ మదిజనింపఁగా హోమవేళ మఱచి.

క. కాలాతిపాతమగుటన్, లోలో మునిశాపశంకలోఁగుచు నాలో
నా లేమ వచ్చి కలశము, మ్రోలన్ బెట్టియును గేలు మొగిడిచి నిలిచెన్. 455

గీ. దారవ్యభిచారమున్ జమదగ్ని యెఱిఁగి, కోపఘూర్ణితనయనుఁడై కొడుకులఁగని
దీనిఁ బాపాత్మురాలి వధింపుఁడనిన, నాక్రియన్ జేయరైరి వారవనినాథ! 456

గీ. పిదప రాముండు దాఁ బితృప్రేరితుఁడయి, తల్లితోఁగూడఁ దనదు భ్రాతల వధించె
మునివరుండగు జమదగ్ని ఘనతపస్స, మాధిదివ్యప్రభావ మర్మజ్ఞుఁ డగుట. 457

గీ. అంత జమదగ్ని సంప్రీతుఁడగుచు నిజత, నూజు వరమును వేడ ననుగ్రహించె
హతులజీవితమును దద్వధాస్మృతియును, రాముఁడర్థించె వరముగా రాజతిలక!

గీ. కుశలులై నిద్రనుండి మేల్కొన్న యట్లు, తత్క్షణము వారు లేచిరి ధరణినాథ!
పితృతపోవీర్యవైభవాభిజ్ఞుఁ డగుట, నిట్లు రాముండు సేసె సుహృద్వధంబు. 459

గీ. ధారుణీశ్వర! యర్జునాత్మజులు మదిని, సంస్మరింపుచుఁ దమలోన స్వపితృవధము
రామవీర్యాతిరేకతిరస్కృతులయి, యెందు సౌఖ్యంబు లేశంబుఁ బొందరైరి. 460

శా. ఆ రాముం డొకనాఁడు భ్రాతృసహితుం డై ప్రీతిమీఱంగఁ గాం
తారక్ష్మోణికిఁ బోవ నర్జునసుతుల్ తచ్ఛిద్రమున్ బట్టి ప్రా
గ్ద్వారంబున్ దగఁ దీర్పఁగాఁ దలఁచి దు ష్ప్రారంభులై పావకా
గారాసీను ముకుందభక్తుని మునిన్ ఖండించి రుర్వీశ్వరా! 461

చ. కృపణత రామమాతయగు రేణుక యెంతగఁ గోరి వేఁడినన్
గృప యొకయింత లేక చలి యింపక యాగతి దుష్ప్రవర్తనుల్
నృపసుతు లెల్లరున్ వరము నీంద్రుశిరంబును బల్మిఁ గోసి ని
ష్కృపులయి యేగి రాశ్రమప దంబును వీడి కురుక్షితీశ్వరా! 462

చ. ఉరము శిరమ్ము మోదికొను చుమ్మలికమ్మున "రామ! రామ! స
త్వరమున నేగు దెమ్మిటు సు తా" యనుచున్ విలపించె నుచ్చకై
స్స్వరమున రేణుకాతరుణి వారును దవ్వులనుండియే తదా
ర్తరవము నాలకించి వెసఁ దా రరుదెంచిరి స్వాశ్రమోర్వికిన్. 463

మ. హతుఁడౌ తండ్రినిఁ గాంచి దుఃఖపృథురో షామర్షశోకార్తులా
హితులై "యక్కట! తండ్రి! ధర్మరత! యో గీంద్రా! మమున్ వీడి యే
గితె స్వర్లోకముఁ జేర నీ"వను చతి క్లేశంబునన్ దూలి పె
క్కు తెఱంగుల్ విలపించి రప్డు తనయుల్ క్షోణీతలేశాగ్రణీ! 464

వ. అప్పుడు. 465

మ. పితృదేహంబిడి భ్రాతృసన్నిధిని న వ్వీరుండు రాముం డుద
గ్రతమై ఘోరపరశ్వథంబుఁ గొని క్ష త్రాంతంబుఁ గావింపఁగా
మతి నూహించి ద్విజఘ్ననాశిత రమన్ మాహిష్మతిం జేరి యు
ద్ధతిఁ గావించె మహాగిరిన్ నగరమ ధ్యన్ దచ్ఛిరఃపంక్తులన్. 466

గీ. వారి రక్తంబుచేత నవ్వారిగాఁగ, బ్రాహ్మణాహితులకు నతిభయదమైన
"ఘోర" యనియెడి పేరిటి గొప్పనదిని, వాసిగా నందుఁ బ్రవహింపఁ జేసెనధిప!

చ. జనకవధంబు హేతువుగ క్షత్రియజాతిని నుట్టువెట్టఁగా
మనమున నెంచి యిర్వదొక మాఱు వసుంధర క్షత్రశూన్యమై
యొనరఁగఁ జేసి రాముఁడు మ హోజ్జ్వలుఁడౌచు శమంతపంచకం
బున నొనరించెఁ జెన్మి హ్రద ముల్ దగఁ దొమ్మిది రక్తయుక్తముల్. 468

గీ. రాముఁ డంతటఁ దండ్రిశిరంబుఁ దెచ్చి, తత్తనువుతోడ సంధించి దర్భలనిడి
యఖిలదేవమయుండు సర్వాత్మఁడైన, దేవు యజియించె మఖముల భూవరేణ్య.

గీ. ప్రాగ్దిశన్ హోతకు నొసంగెఁ బ్రహ్మకొసఁగె, దక్షిణాశఁ బ్రతీచి నధ్వర్యునకిడెఁ
బ్రీతి నుత్తరదిక్కు నుద్గాత కొసఁగె, నిచ్చె నంతరదిశలఁ దదితరులకును. 470

గీ. కశ్యపునకిచ్చె మధ్యభాగంబు మఱియు
బొలుపుమీఱ నార్యావర్తమును భృగూద్వ
హుం డొసంగె నుపద్రష్టకుర్వినాథ
తదితరం బెల్ల నొసఁగె సదస్యులకును. 471

గీ. పిదప సంతృప్తహృదయుఁడై భృగువరుండు
బ్రహ్మనదియౌ సరస్వతిన్ బ్రాకటముగ
నవభృథస్నాననిర్మూలితాఘుఁడగుచు
జలదనిర్ముక్తభానుండువలె వెలింగె. 472

గీ. అంత జమదగ్ని స్మృతియుక్తమైనతనువుఁ
బడసి రామార్చితుండై యపారమహిమ
సరగ ఋషిమండలంబున సప్తముఁడయి
తేజరిల్లెను వింటె యో రాజముఖ్య! 473

గీ. పద్మదళలోచనుఁడు భగవంతుఁడజుఁడు, జామదగ్న్యుఁ డపారమహామహిముఁడు
రాముఁ డాగామిమన్వంతరంబునందుఁ, బొసఁగ సప్తర్షిమండలంబున వెలుంగు.

గీ. న్యస్తదండుండు శాంతమనస్కుఁడునయి
నేఁడును మహేంద్రశిఖరి నున్నాఁడతండు
భూరమణ! సిద్ధగంధర్వచారణులు త
దీయ చరితంబు సతముఁ గీర్తించుచుందురు. 475

చ. జగదధినాయకుండు హరిసర్వమయుండు జనార్దనుండు దా
భృగువులలోన నిట్లవతరించి నృపాలురనెల్లఁ జేవ యొ
ప్పఁగ నుఱుమాడియాడి మహిభారము సర్వము డించివైచె నా
భృగుకులవర్యు నద్భుతచరిత్రము పాత్రముగా? పొగడ్తకున్. 476

గీ. గాధికి సమిద్ధపావకుకరణిఁ బొడమె
నవనినాథ! విశ్వామిత్రుఁడమితతేజుఁ
డతఁడు తపమున క్షత్రకాయంబుఁ దొఱఁగి
ప్రకటమగు బ్రహ్మతేజంబుఁబడసెఁ జూవె. 477

వ. రాజా! ఆ విశ్వామిత్రునకు నేకశతపుత్రు లుద్భవించిరి. అందు మధుచ్ఛందుం
డనువాఁడు మధ్యముఁడు. ఆ గాధేయుండు దేవరాతుండును, భృగుకులజాతుం

డును, నజీగర్తనామాంతరుండు నగు శునశ్శేఫుఁ బుత్రుఁగా నియ్యకొని తన కొడుకులంగని యాతని మీకు జ్యేష్ఠునిఁగా నొనరించుకొండని యాదేశించె. ఆ యజీగర్తుఁడు హరిశ్చంద్రుయాగంబునకై విక్రయింపఁబడిన పురుషపశువు. ఆతండు ప్రజాపతి మున్నుఁగాఁగల దేవతలఁ బ్రస్తుతించి పాశబంధంబునుండి విముక్తుం డయ్యె. భార్గవుండైన శునశ్శేఫుండు దేవయజనంబునన్ దేవతలచే రక్షింపఁబడుటంజేసి దేవరాతుండనంబరంగె. మధుచ్ఛందునకు జ్యేష్ఠులైన యేఁబండ్రును దమతండ్రి యాదేశంబు కుశలంబుకాదని యియ్యకొనరైరి. దానంజేసి క్రుద్ధుండై కౌశికుండు దుర్మతులారా! మీరు మ్లేచ్ఛులు కండని వారల శపించె. అంత శాపభీతుండై మధుచ్ఛందుండు తనకుఁ గనిష్ఠులైన యేఁబండ్రం గూడి తండ్రిం జూచి నీయానతిచొప్పున మే ముండంగలవార మని శునశ్శేఫు జ్యేష్ఠునిఁగా నంగీకరించి తా మాతని ననుసరించిరి. 478

విశ్వామిత్రుండును నిజాజ్ఞానువర్తులైన కొడుకులంగని మీరు నా మానంబుఁ గాపాడి నన్ను వీరవంతునిగా నొనర్చితిరి. కావున మీరును వీరవంతులుకండని యనుగ్రహించి "యో కుశికవంశజాతులారా! యీ దేవరాతుండు మీ కగ్రజుండు. ఈతని ననుసరించి మెలంగుఁడు" అని యాదేశించె. 479

అష్టక హారీత జయంత సుమదాదు లజీగర్త వంశజాతులు. ఇట్లు కౌశిక గోత్రంబు విశ్వామిత్రి పుత్రులచే భిన్నభిన్నంబై ప్రవరాంతరంబునుం బొందె. ఇది దేవరాత జ్యేష్ఠత్వంబునఁ బ్రకల్పితంబయ్యె. 480

---

## అధ్యాయము 17.

### రజిచరిత్ర

శ్రీశుకుఁడు:—

వ. రాజేంద్రా! పురూరవుని పుత్రుండైన యాయువునకు నహుషుండును, క్షత్రవృద్ధుండును, రజియు, రంభుండును, వీర్యవంతుండును, ననేనసుండు నను సుతు లుదయించిరి. అందు క్షత్రవృద్ధవంశంబు నెఱింగించెద నాలింపుము. క్షత్రవృద్ధ సుతుం డగు సుహోత్రునకుఁ గాశ్యుండు, కుశుండు, గృత్సమదుండు నను మువ్వురు కొడుకులు గలిగిరి. అందుఁ గృత్సమదునివలన శునకుండు సంభవించె. ఆ శునకునకు బహుమంత్రపవిత్రమైన శౌనకుం డుత్పన్నుండయ్యె. కాశ్యునకుఁ గాశియు, నతనికి రాష్ట్రుండును, రాష్ట్రునకు దీర్ఘతపుండును, దీర్ఘతపున కాయుర్వేద ప్రవర్తకుండగు ధన్వంతరియుఁ బొడమిరి. ఆ ధన్వంతరి యజ్ఞభాజియు,

నారాయణాంశుండునై స్మరించినంతమాత్రంబున నార్తుల యార్తులం బోఁగొట్టు చుండు. ఆ ధన్వంతరికిఁ గేతుమంతుండును, గేతుమంతునకు భీమరథుండును, నతనికి దివోదాసుండును, నతనికి ద్యుమంతుండును, నతనికిఁ బ్రతర్దనుండును గలిగిరి. ఆ ప్రతర్దనుండే శత్రుజిత్తగు ఋతధ్వజుఁడనియుఁ జెప్పంబడె. అతనికిఁ గువలయాశ్వుండును, నతనివలన నలర్కుండును గలిగిరి. 481

అరువదియాఱువేల సంవత్సరంబు లలర్కుండు భూమి ననుభవించె. అలర్కునకంటె నన్యుండగు రాజెవ్వండును భూమి నంతకాలం బనుభవించినవాఁడులేఁడు. అలర్కునివలన సన్నతియు, నతనివలన సునీతుండును, నతనివలన సుకేతుండును, నతనివలన ధర్మకేతుండును, వానివలన సత్యకేతుండునుబుట్టిరి. సత్యకేతునివలన ధృష్టకేతుండును, నతనివలన వీతిహోత్రుండును, నతనివలన భర్గుండును, నతనివలన భార్గభూమియు జనియించిరి. వీరు క్షత్రవృద్ధవంశంబు ననుసరించిన కాశసంబంధికులైన భూపాలకులు. రంభుండనువానికి రభసుఁడను కొడుకు కలిగె. అతనికి గంభీరుండును, నతనికిఁ గృతుండును గలిగిరి. అతనిక్షేత్రంబున బ్రహ్మకులం బుదయించె. ఇఁక ననేనసుని వంశంబుఁ జెప్పెద వినుము. అనేనసునకు శుద్ధుండును, నతనికి శుచియు, నతనికి బ్రహ్మసారథియైన త్రికకృతుండును, నతనికి శాంతిరజుండును బొడమిరి. అతండు చరితార్థుఁడు నాత్మజ్ఞానియు నయ్యె. రజి యనువాని కేనూఱుగురు కొడుకు లుదయించిరి. ఆ రజి దేవతలచే సంప్రార్థితుండై దైత్యులను వధించి యింద్రునకు స్వర్లోకంబొసంగె. ఇంద్రుండు మగుడ దివం బతని కొసంగి యతని చరణంబులు ముట్టి ప్రహ్లాదునివలన శంకితుండై తన్ను సమర్పించుకొనియె. అంత రజి పొడసినపిమ్మట నతని కొడుకులు యాచించుచున్నను నిందునకు స్వర్గంబొసంగరైరి. యజ్ఞంబులయందలి భాగంబులను నపహరింపఁదొడంగిరి. అంత మహేంద్రుండు గురునిచే వేల్పంబడు హోమాగ్నియందు మార్గచ్యుతులగు నా రజిపుత్రకుల నందఱ దహించె. అందొక్కఁడును శేషింపఁడయ్యె. 482

క్షత్రవృద్ధజాతుండగు కుశునివలనఁ బ్రీతియు, నతనివలన సంజయుండును, నతనివలన జయుండును గలిగిరి. ఆ జయునకుఁ గృతుండును, గృతునకు హర్యధ్వనుండను నృపుండును గలిగిరి. అతనివలన సహదేవుండును, వానికి భీముండును, వానికి జయత్సేనుండును, వానికి సంకృతియు, వానికి జయుండును, వానికి మహారథుండైన క్షత్రధర్ముండును బొడమిరి. వీరలు క్షత్రవృద్ధ సంజాతులైన భూపాలురు. ఇఁక నహుషవంశజాతులైన భూపతులను జెప్పెద వినుము. 483

సీ. ఎవ్వారు తపముచే నీ సమస్తజగత్త్రయంబును సృష్టించి రలఘుశక్తి
నెవ్వార లలపరమేశునకును ముఖంబగుచు నగ్రస్థానమందియుండి
రెవ్వారు తగ ధరియింతురు కల్యాణ, దాయకమైన యామ్నాయచయము
నెవ్వారలకు మ్రొక్కు చెపుడు స్తుతింతురు, జేజేలు దిక్పతుల్ శ్రీపతియును
గీ. నట్టి ద్విజులలో భృగువుల మరయ మేము, దీనితండ్రి శిష్యుఁడు మాకుఁ దెంపుతోడ
దాను దాలిచె నా తాల్పఁ దగినవలువ, దుష్టయగుచు వేదంబు శూద్రుండువోలె.
క. అని యాడెడు గురుపుత్రిన్, గని కినుకన్ రోజుచు ఫణికన్యయుఁబోలెన్
గసనాచు నొడుగఱచుచు, నసె నీగతి రోషభీషణాలాపములన్. 492

చ. ఎఱుఁగక యాత్మవృత్తము నిసీ! యిటులేటికి దుర్వికత్థనం
బుఱక యొసప్పుకోఁగడగి తోసి యభాగిని! యోసిభిక్షుకీ!
మఱచితె? వాయసంబువలె మా గృహసీమలఁ గాచిపెట్టుకోం
చఱినుఱిఁ బొట్టవోసికొనుటన్నది యంతన నింతమైతివే. 493
శ్రీశుకుఁడు:—
క. ఏవంవిధపరుషోక్తుల, నా వృషపర్వసుత తెగడి యాచార్యసుతన్
బావిన్ బడద్రోయించియు, వావిరిఁజనె సఖులఁగూడి వస్త్రముఁగొనుచున్ 494
గీ. ఆమె స్వగృహంబుఁ జేర యయాతినృపతి, యాపురోద్యానమున మృగయాభిరతిని
స్వేచ్ఛఁ గ్రుమ్మరుచుండి యదృచ్ఛఁ జేసి, నూతికడ కేగి కావ్యతనూజఁ గాంచె.
ఆ. విగతవస్త్రయైన యెలఁదికి రాజన్య, రేణ్యుఁ డపుడు స్వోత్తరీయ మొసఁగి
తన కరంబుచేత దక్కరంబును బట్టి, యెత్తి లాగెఁ గరుణ యుత్తమిల్ల. 496

సీ. ఆ వీరవర్యు యయాతిభూపతిఁ గాంచి, కావ్యపుత్రిక ప్రేమకలితసుమధు
రోక్తులఁ బల్కె నిట్లో రాజసత్తము!, వైరిఘస్మర! నాదు పాణి నీవు
పట్టితి కాన నీ పట్టిన నాచేయి, యొరుఁ డెవ్వఁడును బట్టకుండుఁగాక
పార్థివ! యిదియు దైవకృత సంబంధంబు, పూరుషకృతము కాదు సుమ్ము
గీ. కూపమునఁ జిక్కియున్న నాకు భవదీయ, దర్శనప్రాప్తి యిందు నిదర్శనంబు
సర్వవిది దీనిఁ ద్రోసిపుచ్చంగ నెవరి, తరము కానేరదో వసుధాకళత్ర! 497

మ. తొలి నాచే శపియింపఁబడ్డ గురుపుత్రుండా కచుం డప్డు పే
రలుకన్ నన్ను శపించె క్రోధితమనా! యా శాపమూలంబునన్
బలుమాటల్ పలుకంగనేల నిఁక నా పాణిన్ గ్రహింపంగఁ బోఁ
డిలలో బ్రాహ్మణుఁ డెవ్వఁడేనియు నిజం బీవాక్యము న్నమ్ముమీ. 498

వ. అని పలికిన దేవయాని వాక్యంబులు విని. 499

గీ. తన కనభిమతమయ్యు నదైవవిహిత, మగుటయున్ దగ్గతంబయి స్వాశ్రయంబు
నుంటయు నెఱింగి యద్దానవాధిపుండు దేవ, యానివచనంబుఁ బ్రీతి నియ్యకొనె నధిప!

గీ. జనపతి యయాతి యటనుండి చన్న పిదప, నెమ్మి మన బట్టణంబున కేఁగి యుండుఁ
జెప్పె శర్మిష్ఠను సఖులుం జెలియదములును, దండ్రి యగు శుక్రుఁ డసుర తాపసవర.

చ. అడలుచు నుక్కుచున్న తనయం గని యా భగవంతుఁడైన శు
క్రుఁడు విమనస్కుఁడై నిజపురోహితవర్గము సీసడించుచున్
గడుకొని యుంఛవృత్తియె సుఖప్రదమంచని యుగ్గడించుచున్
వెడలె పురంబునుండి పృథ్వీధవ! పుత్రికతోడఁ దాపసుం. 502

గీ. అంత వృషపర్వుఁ డెఱిఁగి యయ్యమరవిజయి
కావ్యుతోడ్పాటు తనకు ముఖ్యంబటంచుఁ
దలఁచి తెరువున నడ్డగా నతని పదముల
సాగిలంబడి గురునిఁ బ్రసన్నుఁ జేసె. 503

ఆ. సులభకోపుఁడైన నమునీంద్రుఁ గలఁగఁ దే, రి నిజశిష్యుఁ గాంచి యనియె నిట్లు
క్షితిప! నీమొఱాలకించ జెల్లింపఁగాఁ దగు, నిను విడిచియుండ నిచ్చగింప. 504

ఆ. అనిన వల్లెయనుచు నతఁడిది యెఱిఁగించె, దెల్పె హృద్గతంబు దేవయాని
జనకదత్త యగుచు శర్మిష్ఠ నానుగ, యగుచు ననుసరింపఁ దగుచు నన్ను. 505

మ. అని కావ్యాత్మజ పల్కినట్టి వచనంబున్ బాలించి శర్మిష్ఠ యా
య్యన నాత్మీయుల సంకటంబును దలంచి ధ్యాత్రీ మహాగౌరవం
బును లోలోఁ దలపోసి చేడియలతో బ్రాపింపఁగా దేవయా
నిని దా దాసిక్రియన్ గడంగి కొలిచెన్ నెమ్మిఁ దర్పించుచున్. 506

గీ. అధిప! నహుషాత్మజుఁడగు యయాతినృపతి, కొనఁగ శర్మిష్ఠతోఁ గూడి యున్న సుతను
బ్రీతి నిట్లనిపలికె శర్మిష్ఠ నెపుడు, తల్పమునఁ జేర్పఁబోకు మానవేశనాథ! 507

వ. ఇట్లు యయాతినరపాలకుండు రాజ్ఞియగు దేవయానింగూడి చరింపుచుండ సఖీజన
పరివృతయై యున్న శర్మిష్ఠయు రహస్యస్థలంబున నతని నే వరించె. అపత్యార్థంబున
రాజదుహితృప్రార్థితుండై ధర్మవిదుండగు యయాతి ధర్మంబుఁ బరికించి శుక్రవచ
నంబు స్మరించియు నది దైవనిర్దేశంబుగా భావించి శర్మిష్ఠం గ్రహించె. 508

క. జనవర! యదుతుర్వసులను, తనయులఁగనె దేవయాని దనుజాధిపనం
దన శర్మిష్ఠయు ద్రుహ్యుని, ననువుఁ బూరు నను మువ్వురాత్మజులఁ గనెన్.

క. పతివలనన్ శర్మిష్ఠయు, సుతులఁగనుట యెఱిఁగి క్రోధశోకవివశయై
పితృగేహమునకు మానిని, యతిరయమునఁ జనియె దేవయాని కడంకన్. 510

గీ. కాముకుండు యయాతి యాకాంత వెంటc
బడి కలcకc దేర్చు నుములc దక్తత్పాదయుగము
నంటి చాలcగ వేడియునా సతిం బ్ర
సాదకలితcగాc జేయ నశక్తుcడయ్యె. 511

గీ. కుపితుcడై తెనిcజూచి శుక్రుండువల్కె, నంగనాకాముకుండవై యయాజ్ఞ మీాటి
వ గ్రిలితిగాన వికృతరూపమును గూర్చు, ముదిమి నిన్నా వరించు తమాఘహృదయ!

చ. అనిన యయాతిభూమిపతి యార్య! భవత్సుతయందుc గోర్కులన్
దనివినిజెంద కుండితి నన వినిభార్గవుc డెవ్వcడేని యా
వనము నొసంగి నీముదిమిcబాల్పడి తాలుచు నేని నవ్వయో
వినిమయవృత్తిచేతc బృథివీశ! యథేచ్ఛ సుఖంబునొందుమా. 513

చ. అని స్వజరావ్యవస్థc దెలియం బలుకన్విని యప్పు డయ్యయా
తినృపతి జ్యేష్ఠపుత్రకుని ధీయుతునిన్ బొడcగాంచి యో యదూ!
తనయ! ధరింపు నా ముదిమిcదావక యావన మిమ్ము కోర్కులన్
దనియని నేనుc దాన మమతన్ రమియించెదc గొన్నియేం డ్లిలన్. 514

యదువు:—

గీ. నడుమదారకొను ముదిమిచేనినుమలువడ, నిచ్ఛగింపను నేను క్షోణీశతిలక!
గ్రామ్యమైన సుఖంబెఱుంగక పురుషుcడు, శాంతిcబొందంగలేcడు నిజమ్ము సుమ్ము.

వ. అని యదువు పితృని దేశంబు నిరాకరించిన. 516

గీ. స్వపితృయాచితులగుచుcదుర్వసుcడుద్రుహ్యుc, డనువు ధర్మానభిజ్ఞులై యస్థిరముల
స్థిరములనియెడు బుద్ధిcజింతించు చతని, వాంఛితముc దీర్పనొల్లనివారలైరి. 517

వ. అంత. 518

ఉ. ప్రాయమునందుc బిన్న గుణవర్గమునందున మిన్నయైన మే
ధాయుతుc బూరువున్బిలిచి తండ్రి యయాతి వచించె నిట్లు వ
త్సా! యిదె నాదుమాటవినుమగ్రజులట్లు నిరాకరింపcగా
నీ యెదలోc దలంపకుము నీ వెహితుండవు నాకు నన్నిటన్. 519

పూరుcడు:—

క. తన దేహము సృజియించిన, జనకునకున్ బ్రత్యుపకృతి నలుపcగ లోకం
బున నెవcడు సమర్థుండగు?, జనకుని కృపcగాదె? సుతుcడు సౌఖ్యము వడయున్.

గీ. నుతువకయచేయుసుతుcడు త్తముcడునుడివిన, యవలcజేసెడివాcడు మధ్యముcడు శ్రద్ధ
యుడిగియొనరించువాcడధముcడు నిరాక, రించువాcడెన్న జనకపురీషసముcడు.

మ. అని ప్రత్యుత్తరమిచ్చి పూరుఁడు తదీయయౌవనం బాత్మజరం దాల్చి జ
వ్వనమిచ్చెన్ దగ నయ్యయాతినృపుఁడున్ భావంబు పొంగార నా
తని లేఁబ్రాయముఁ దాల్చి స్వైరగతి నుత్సాహప్రవృత్తాను ర
క్తిని నానావిధకామభోగములఁ బొందెన్ బార్థివోత్తంసనూ! 522

గీ. ఏడుదీవులలో వసియించు ప్రజల, కెన్న మైఁ దండ్రి వోలెఁ బాలించుచుండి
యింద్రియవశంవదుండై నరేంద్రుఁ డంత, ననుభవించె యథాప్రీతి విషయసుఖము.

గీ. దేవయానియుఁ దాఁ బ్రతిదినముఁ గూడి, వాఙ్మనఃకాయవృత్తుల వల్లభునకు
నుడుగ కేకాంతమున సకలోపచారములను జేయుచు సంప్రీతిఁ గలుగఁ జేసె. 524

ఆ. సర్వదేవమయుని సర్వయజ్ఞాత్ముని, దేవదేవు హరిని భావమలర
భూరిదక్షిణలఁ బ్రభూతంబులగు యజ్ఞములఁ యయాతిభూధవుఁడు యజించె.

సీ. అంబుదమాల యభ్రంబునవలె నిజ్జగం బెల్ల నానావిధంబుగాఁగఁ
దోఁచు నెవ్వనియందుఁ దోఁపదు స్వప్నమాయామనోరథముల్ బుద్ధ్యర్థమయి
యా వాసుదేవు గుహావాసు సూక్ష్ముని, నారాయణునిఁ బరమాత్ము భావమునఁ దలఁచి
నిష్పృహుండయి ధరణీవల్లభుండు య,యాతి యజించె నతయంబుగ దుర

గీ. నిట్లు వేయేండ్లు కామభోగేచ్ఛఁ దవిలి, యమితసుఖములనొందియున్న యయ్యయాతి
యించుకంతయు మదిఁ గుతృప్తి తేంద్రియములఁ, దృప్తినొందకయుండె ధాత్రీవరేణ్య!

---

## అధ్యాయము 19.

### —బస్తోపాఖ్యానము.—

శ్రీశుకుఁడు:—

శా. స్త్రీలోలుండయి యా యయాతినృపతి శ్రేష్ఠుండు కామంబు లీ
లీలన్ బెక్కులుపొందుచున్ మదిఁ గడున్ గ్లేశంబు సంధిల్లఁగా
లోలో నాత్మవిమోహముం దెలిసి యాలో దేవయానీముఖం
బాలోకించి వచించె గాథ యొకటి యత్యంత నిర్విణ్ణతన్. 527

యయాతి:—

క. విను భార్గవి! మనకథఁ బోలినదగు నొకగాథ నేఁ దెల్పెదన్ భాసురము
వనవాసులల్లఁ గ్రామస్థుని కథవిని మనములందు శోకింతురు గడున్. 528

గీ. ఛాగ మొక్కటి ప్రియుగవేషమణపరతను, గాన నైకతమునఁ దిరుగాడుచుండి
కనుఁగొనియె నొక్కచో నిజకర్మవశతఁ, గూపపతితను ఛాగినిఁ గూర్మిమీఱ. 529

గీ. కామియగు ఛాగమయ్యెడఁ గడఁక గడలు, కొనఁ దదుద్ధరణోపాయమును వెదకుచుఁ
దత్తటము గొనకొమ్మలఁ ద్రవ్వి త్రవ్వి, రేవుగా నొనరించె నేరిమి సెలంగ. 530

గీ. పిదప నా ఛాగి కూపంబు వెడలివచ్చి, కోరె నా ఛాగవిభు దానిఁ గూడి తిరుగు
పుష్టకాయుని శ్మశ్రులముఖునిఁ బ్రౌఢుఁ, గాంతుఁగాఁ గోరి బహ్వాజాగణము పొందె.

గీ. అయ్యజర్షభుఁ డొకఁడ య్యజాంగనలను, గూడి యశ్రాంతమును రతిఁ గోవిదుఁడయి
రాణమీఱఁ గామగ్రహగ్రస్తుఁడగుచుఁ, దృప్తిఁ జెందక తనుదాను దెలియకుండె.

క. లోఁగక ప్రియయగు నన్యచ్ఛాగిని గూడి రమియించు ఛాగర్షభు న
య్యాగడము సైఁపనేరక, తాఁ గూపప్రాప్త మిగులఁ దాపముఁ జెందెన్. 533

గీ. దుర్హృదున్ గాముకున్ సుహృద్రూపు క్షణిక, సౌఖ్యు నింద్రియపరుఁ గాంచి చాల వగపుఁ
బూని యా కూపసంప్రాప్తయైన ఛాగి, యుజ్జగించి నిజస్వామి యొద్ద కరిగె. 534

గీ. దీనతన్ ఛాగవర్యుఁడు స్త్రీపరుఁడయి, సారె కిలిబిలి శబ్దంబు సలుపుకొనుచు
చనియె వెన్నంటి దానిఁ బ్రసన్న పఱుపఁ, గాని సంధింప శక్తుండు గాకపోయె.

గీ. అ య్యజస్వామియైన బ్రాహ్మణుఁడు కినిసి, లంబమానమౌ తద్వృషణంబుఁ గోసెఁ
బిమ్మటఁ బ్రయోజనార్థియై వెరవెఱింగి, యతికె వృషణంబు నెప్పటియట్లు మగుడ.

గీ. లబ్ధవృషణుఁడై యా కూపలబ్ధయైన, ఛాగితోఁ గూడి నిత్యంబు ఛాగవిభుఁడు
పెక్కుతెఱఁగుల కోర్కెలఁ బెద్దతడవుఁ, గ్రీడ సేయుచు నేటికిన్ దృప్తిఁగనఁడు.

గీ. ఉవిద! నే నట్లు కూపలబ్ధవగు నీదు, బంధురప్రేమచేత నిబద్ధుఁడనయి
మొనకొను త్వదీయమాయచే మోహమంది, యించుకేనియు నన్ను నే నెఱుఁగ
కుంటి. 538

గీ. పుడమిఁ గామోపహతుఁడైన పూరుషునకు, స్త్రీ పశు హిరణ్య గేహముల్ వ్రీహి యవలు
నాదిగాఁ గల్గు సర్వపదార్థములు నొకింతయేని మనఃప్రీతి నిడఁగలేవు. 539

గీ. బహుళ కామోపభోగమ్ము వలన నెపుడు, కామ మడుగంటఁబోదు నిక్కముల తాంగి!
పెక్కులేల! యాజ్యాదిహవిస్సుచేత, హుతవహుండును బోలెఁ బెంపొందు మఱియు.

గీ. సర్వభూతములం దపరిశస్తమైన, భావమును బూనకుండుఁ గృపార్ద్రబుద్ధి
బొసఁగ సమదృష్టియైన యా పూరుషునకు, నఖిలదిశలప్రాడేయగు సుఖమయములు.

గీ. దుర్మతులకు నజస్రము దుస్త్యజమయి, జీర్ణమగు శరీరంబునఁ జివుకకుండు
నట్టి దుఃఖైకకారణమైన యాశ, నుజ్జగించును సుఖకాముఁ డొక్క మొఁగిని. 542

శ్రీశుకుఁడు:—

గీ. పరమపూరుషుఁడున్ భగవత్స్వరూపుఁ,డాద్యుఁడవ్యయుఁడవికారుఁడమరుఁడజుఁడు
సర్వభూతనివాసుండు శాంతమూర్తి,యైన వాసుదేవునకు జోహార్లొనర్తు. 555

---

# అధ్యాయము 20.

## భరతచరిత్ర

శ్రీశుకుఁడు:—

గీ. ఎందునీవుజనించితివెచట రాజ, వంశ్యులును బ్రహ్మవంశ్యులున్ ప్రభవమైరి
భారతోత్తంసమా! యట్టిపూరువంశ, మేను సాంతంబుగావచియింతు వినుము.

వ. పూరునకు జనమేజయుండను కొడుకుగలిగె. అతనికిఁ బ్రాచిన్వంతుఁడును, వానికిఁ బ్రవిరోధనమన్యువును, వానికిఁ జారువును జన్మించిరి. ఆ చారువునకు సుద్యువును, నతనికి బహుగతుండును, నతనికి శర్యాతియు, వానికి సంయాతియు, నా సంయాతికి రౌద్రాశ్వుండును బ్రభవించిరి. ఆ రౌద్రాశ్వునకు ఋతేపుండును, కక్షేపుండును, సలేపుండును, కృతేపుండును, జలేపుండును, సన్నతేపుండును, ధర్మేపుఁడు, సత్యేపుఁడు, వ్రతేపుఁడు, వనేపుఁడు నను పదుండ్రుకొడుకులు జగదాత్మభూతుండగు జగత్ప్రాణునకు నిందిృయంబులుంబోలె ఘృతాచియను నప్సరసయందుఁబొడమిరి. అందు ఋతేపునకు నంతిసారుం డుద్భవించె. అతనికి సుమతియు, ధ్రువుండును, నప్రతిరథుండు నను ముగ్గురుపుత్రు లుదయించిరి. ఆ యప్రతిరథునకుఁ గణ్వుండు వొడమె. ఆ కణ్వునకు మేధాతిథియు, నా మేధాతిథివలనఁ బ్రస్కందప్రభృతులగు ద్విజాతులును సంభవించిరి. సుమతికి రాభ్యుఁడుగలిగె. రాభ్యునకు దుష్యంతుండు జనియించె. 557

మ. అతిలోకప్రతిభాసమన్వితుఁడు దుష్యంతావనీజాని భూ
రితరాటోపముతోడఁగూడి మృగయాక్రీడావినోదార్థియై
కుతుకంబొప్పఁగఁ గానలం దిరుగుచున్ క్షోణీశ! కణ్వాశ్రమ
క్షితికింబోయెఁ దదాశ్రమస్థలిని వీక్షింపంగ నుత్కంఠతోన్. 558

సీ. ఆ కణ్వమౌని పుణ్యాశ్రమసీమ సు,ఖాసీనయై యిందిరానతిగతి
స్వప్రభాపటలిచేనాప్రదేశంబెల్లఁ, జెలువొప్పఁగాఁ గయిసేయుచున్న
కాంతాలలామ నొక్కర్తుఁ బొడఁగాంచి, కంతునిబారి కగ్గమయియతఁడు
కతిపయభటపరివృతుఁడౌచు దేవతా, మాయనుబోలినదగువఁ జేరి

గీ. అందుఁ దద్దర్శనప్రహృష్టాంతరంగుఁ, డగుచు పూర్ణశశిముం బెల్లసంతరించ
మృదుమధురమైనవాక్కులఁ బ్రీతిపుట్ట, నా సరోజాననం గాంచి యనియె నిట్లు. 559

దుష్యంతుఁడు:—

క. ఎవ్వతెవు నీవు సుందరి?, యెవ్వరిదానవు? సరోరుహేక్షణ! చెప్పుమా
యి విజనవిపినమున నో, జవ్వని! యేకార్యమీవు సల్పఁ గడఁగితో! 560

క. తనుమధ్యా! నిను నే నా,మనమున నెఱిఁగితిని రాకుమారినిఁగా మా
నిని! యిది ధ్రువం బధర్మం,బున మెలఁగదుగాదె? పౌరవుల మన మెప్పుడున్.

శకుంతల:—

క. రాజా! విశ్వామిత్రుత, నూజను మేనక వనిన్ సనమున్ విడిచె మహా
తేజుఁడు కణ్వుఁడు పెంచెన్, నేఁ జేయందగినదేమి? నీ కిట నధిపా! 562

క. నిలువు మిట రాజవర! మా, సలిపెడు పూజలఁ గ్రహింపు సమ్మతిఁ గొనుమా
పొలుపగు నెవ్వరియన్నము, నెలమిన్ వసియింపు మిందు నేఁ డిష్టంబేనిన్. 563

దుష్యంతుఁడు:—

గీ. కుశికకులజాతవైన నీకు నుగ్రు శాంగి!, వాక్యమిదియెంత యేని సుసంపన్నముగద
తరుణిరో! రాజకన్యలు తమకుఁ దాము, కోరుకొందురు తమ కనుకూలవరుని. 564

గీ. అనిపలికి నల్లెయని యామె కొన శకుంత, లాలతాంగిని దేశకాలజ్ఞుఁడగుచుఁ
బ్రీతి గాంధర్వవిధిచేతఁ బెండ్లియాడె, ధర్మసరణిని దుష్యంతధరణివిభుఁడు. 565

ఉ. అంత నమోఘవీర్యుఁడు మహామహిమాఢ్యుఁడు రాజయోగి దు
ష్యంతనృపాలుఁ డమ్మహిషి యందు స్వవీర్యమునుంచి మేదినీ
కాంత! స్వపట్టణంబునకుఁ గ్రమ్మఱి యా మఱునాఁడు వోయె నా
కాంత శకుంతలాఖ్య తగుకాలమునన్ గనెఁ బుత్రు నొక్కనిన్. 566

ఉ. మానివరుండు కణ్వుఁడు కుమారునకున్ వనసీమయందు వి
జ్ఞానముతో శిఖోపనయనాదికకర్మము లాచరించెఁ దే
జోనిధి యక్కుమారుఁడు మహాశూరతఁ దోఁపఁగ విక్రమించి య
క్కానన మృగేంద్రడింభములఁ గట్టి రహిన్ విహరించె భూవరా! 567

చ. అతులపరాక్రముండగు నిజాత్మజునిం గొని యేగుదెంచె న
య్యతివ లమిన్న నాథుకడ కయ్యవనీంద్రుఁ డనింద్యులన్ సతీ
సుతులఁ బరిగ్రహింప మనసుం గొనఁ డప్డు శరీరవాణి య
ద్భుతముగ నిట్లనెన్ సకలభూతములున్ వినుచుండ రేనికిన్. 568

చ. జనకునిచేతఁ బుత్రకుఁడు జన్మము నొందుటఁజేసి తండ్రియే
తనయుఁడుగాఁగఁ జెప్పఁబడు తల్లియొ భస్త్రిక కేవలమ్ముగా
వునఁ దనయున్ భరింపు మిఁక భూరమణాగ్రణి! యన్య మేమియున్
మనమున నుంచఁబోకు మవమానము సేయకు మీ శకుంతలన్. 569

శా. వైముఖ్యంబు సహింపఁబోకు తరియింపన్ జేయుఁ బుత్రుండె పు
న్నామంబౌ నరకంబునుండి జనకున్ రాజర్షివర్యా! యశో
ధామా! జన్మవిధాతవై తితనికిన్ దథ్యంబుగా నీవ చూ
రామారత్నము తా శకుంతల యథార్థంబాడె లో నమ్ముమీ. 570

గీ. వాసుదేవాంశసంభవు బ్రాహ్మణహితు, సత్యసంధు గుణాఢ్యు లసద్యశోభి
వృద్ధికరుఁబుత్రు భరతు భరింపుమయ్య, సరసగుణధామ! దుష్యంతసార్వభౌమ!

ఉ. పౌరవముఖ్యుఁడట్లు వినవచ్చిన యా యశరీరవాక్య మిం
పారఁగ నాలకించి వినయాఢ్యుఁ గృతజ్ఞుని వృద్ధసేవకున్
ధీరుఁగుమారుసన్ వరసతిన్ సుగుణోజ్జ్వల నా శకుంతలన్
జేరఁగఁదీసి మక్కువను స్వీకరణం బొనరించె నర్తిలిన్. 572

గీ. జనకుఁడు గతింపఁ బృథులయశస్కుఁడైన, భరతుఁడు ధరిత్రికిన్ జక్రవర్తియయ్యె
జగతి శ్రీవాసుదేవాంశజనితుఁడైన, యతనిమహిమ గానంబు సేయంగఁబడియె.

క. వలకేలన్ జక్రం బం, ఘ్రులయందును లలితపద్మకోశంబులు భా
సిలు విభుఁ డభిషిక్తుండై, వెలసెన్ భరతుండు భూరివిభవం బెసఁగన్. 574

వ. ఆ భరతచక్రవర్తి దీర్ఘతపునిం బురోహితునిఁగాఁ గైకొని గంగాకూలంబున నేఁబదియైదశ్వమేధ యజ్ఞంబులును, యమునాతీరంబున డెబ్బదియెనిమిది యశ్వమేధంబులను గావించి పరిష్కృష్టధనంబు నొసంగె. మఱియు దుష్యంతపుత్రుండైన భరతుండు వేయిద్వంద్వంబుల గోవులను వేవురు బ్రాహ్మణుల కొసంగె. ద్వంద్వంబనఁ బదుమూఁడు వేలయెనుబదినాలుగు. ముప్పదిమూఁడువందల నశ్వంబుల బంధించి నృపాలకులను విస్మితులఁ గాపించుచు దేవమాయ నతిక్రమించి తదంశసంభవుండగుటఁజేసి పూజ్యుండగు హరిని బొందె. శుక్లదంతంబులు కృష్ణంబులు మృగజాతీయంబులు, హిరణ్యసమావృతంబులునగు పదునాల్గర్బుదంబులు గజంబులను మష్కారకర్మంబున దానంబొసంగె. భరతుని మహనీయంబగు కర్మంబు పూర్వాపరనృపాలు రెవ్వరును జేయరు. మఱియు భరతుని కైవడి బాహువులఁ ద్రిదివంబును బొందినవారుఁ బొందఁగలవారును లేరు. కిరాత, హూణ, యవన, ఆంధ్ర, వంగ, శక, ఖస, మ్లేచ్ఛాదిరాజుల నబ్రహ్మణ్యుల దిగ్విజయంబున బలిమి

నోడించె. తొల్లి రాక్షసులు దేవతల జయించి దేవకాంతల రసాతలంబునఁ గారా
గారంబుల బంధించిరి. అట్టివారి విముక్తలఁగావించి వారివారి పతులం జేర్చె.

చ. భరతనృపాలు రాజ్యపరిపాలన మం దఖిలప్రజాళికిన్
ధరణియు వ్యోమమున్ బితికెఁ దత్తదభీష్టములైన కోర్కుల
ట్లిరువదియేడు వేలయిన యేండ్లు దిశావలయంబునందు సు
స్థిరమగు రాజ్యచక్రము నుదిప్పుచునేలె నతండు ధీరతన్. 576

గీ. లోకపాల భాగ్యాతిగ శ్రీకుఁడైన, యా భరతచక్రవర్తి స్వకైన భవంబు
దారపుత్రులు ప్రాణముల్ తదితరములు, కల్లలని యెంచి వైరాగ్య కలితుఁడయ్యె.

గీ. అతనికి విదర్భరాజేంద్ర సుతలు మువురు, సాధుసమ్మతశీలలు జాయలైరి
పితృసమానులు కారని సుతులఁబట్టి, యా సతులు సంహరించిరి త్యాగభీతి. 578

గీ. తనదు వంశ మీ రీతి వ్యర్థంబుగాఁగ, నాతఁడు సుతార్థమై మరుద్యాగ మర్థిఁ
జేసెను మరుత్తులున్ ప్రీతిఁ జెంది యతని,కోజనొనఁగిరి సుతు భరద్వాజనాము.

వ. ఆ భరద్వాజుం డెవ్వం డన 580

గీ. భ్రాతృజాయయుఁ బూర్ణ గర్భవతియు నగు,మమతఁ గాంచి బృహస్పతి మ్రుచ్చుఘనంబుఁ
జేయ దొరకొని గర్భస్థశిశువు మాన్ప,నలుకమై శపియించి వీర్యమును విడిచె.

సీ. తద్వీర్యజనితుఁడౌ తనయుని మమత ప,తిత్యాగశంకఁ బరిత్యజింపఁ
దలఁప భరింపుమీ ద్వాజు నీవని బృహస్పతిపల్క మమత యద్వాజు నీవ
భరియింపుమనె యిట్లు పలికి యా తలిదండ్రు,లరుగుటచేత నాయర్భకుండు
తనరె భరద్వాజుఁడను పేరఖ్యాతుఁడై,యమరులు ప్రీ గేప మమతయున్ను

గీ. విడిచె వ్యర్థునిగాఁగ భావించి సుతుని,బదపడి మరుత్తులెల్ల నా బాలకుని భ
రించి కొనిపోయి యొసఁగిరి ప్రియ మెసఁగ,నధిప!విచ్ఛిన్న భరతాన్వయంబునకును.

వ. నాటంగోలె నతఁడు వితథనంజ్ఞం బ్రబీతుండయ్యె. 583

---

## అ ధ్యా య ము 21.

### రంతిదేవ చరిత్ర

శ్రీశుకుఁడు:—

వ. అ వితథునకు మన్యువు, మన్యువునకు బృహత్క్షత్రుండు, జయుండు, మహావీర్యుండు,
నరుండు, గర్గుండు నను పుత్రులుదయించిరి. అందు నరునకు సంకృతియు,
సంకృతికి గురుండు, రంతిదేవుండునుం బొడమిరి. 584

సీ. జనవర! రంతిదేవునికీర్తి కీర్తింపఁ, బడియెడి నిందు దక్షభంగురమయి
యా శ్రీఁడు తన ధనం బర్థిజనాళికి, లేదనకొసఁగి తాఁ బేదవడియె
తనకు లబ్ధంబగు దాని బుభుక్షితుఁ, డయ్యు యాచింపఁ గాదనక యిచ్చు
సకుటుంబుఁడై యకించనుఁడయ్యు ధీరత, నలుబదియెనిమిది నాళ్ళు క్రమత
గీ. సలిలపానమ్ము లేమి కాఁకలియుదప్పి, గ్రుంగఁజేయఁగ వణఁకు మేనంగదిరిన
యా నృపతికి ఘృతంబు పాయసము జావ, యంబువులును బ్రాతస్సమయమున దొరకె.

సీ. భూరమణుం డదియారగింపఁదలంప, నతిథి బ్రాహ్మణుఁ డొక్కఁ డరుగుదెంచె
శ్రద్ధాసమన్వితస్వాంతుఁడై యెల్లెడ, హరిని దర్శించుచు నాదరమున
విభజించి యొసఁగె నవ్విప్రున కన్నంబు, నయ్యది భుజియించి యాతఁ డరిగెఁ
గ్రమ్మఱ భుజియింపఁ గడఁగిన నన్నృపుఁడొ, క్కఁడు వచ్చె నాతని కడకు వృషలుఁ
గీ. డాత్మహరిని స్మరించుచు నవనివిభుఁడు, పంచియిచ్చెఁ బ్రీతుండయి వాఁడరిగిన
కుక్కగమితోడ వచ్చె వేఱొక్కఁ డధిప!, యన్నమిడుమా కుక్షుధితుల కనుచు వేడె.

క. ఆ నృపుఁ డాతనికి సబహు, మానముగా గడఁగి హరిసమర్పణ మనుచున్
తా నవశిష్టాన్నంబిడి, శ్వానములకు శ్వవిభునకును బ్రణతుండొనర్చెన్. 587

గీ. తనకు నింక తోయంబు మాత్రంబు మిగుల, దానిఁ గ్రోలంగ డంగిన తేని కడకు
పుల్కసుఁడు వచ్చి పల్కెఁ బాపుండనయిన, నాకు సలిలంబు నొసఁగు భూనాథ యనుచు
గీ. జాలిఁ గూర్చు తద్వచనంబు నాలకించి, కరుణ దళ్కొత్త నమ్మహీకాంతుఁ డంత
నెంతయేని సంతాపంబు హృదిఁ గలంప, నమృతవాక్కులఁ బల్కె నిట్లని నరేంద్ర!

గీ. అపునరావృత్తియు నణిమాద్యష్టసిద్ధి
యుతము నైన యోగేశ్వరగతిని గోర
నఖిలదేహులలో నుండి యటఁ దదార్తిఁ
బొందెదన్ దాన సుఖములు వొడముచుండు. 590

మ. మనఁ గోరెడు దీనమానవునకున్ బ్రాణంబులన్నిల్వ జా
లిన యీ తోయ సమర్పణంబుననె యోలిన్ క్షుత్పిపాసల్ భ్రమం
బును దైన్యంబును శోకమోహములు నిర్మూలంబులై వానియం
తన నాకన్ని తొలంగుఁగాన దగ మానం గ్రోలుమా నీరమున్. 591

చ. అని కరుణాస్వభావుఁడు ప్రశమంచితభావుఁడు రంతిదేవుఁ డీ
యనువునఁ బల్కి దుర్విషహమైన పిపాసను గ్రుగ్గుచుండియున్
మనుజవరేణ్య! తెంపుమెయి మాలనికిన్ గలశంబులోని తి
య్యని సలిలంబుఁ బోసె వెస స్వార్థపరత్వము నుజ్జగించుచున్. 592

గీ. అంతఁ ద్రిభువనాధీశ్వరు లటకువచ్చి, ధీరవరుఁ డైన యా రంతిదేవునకును
విష్ణుకల్పితమాయల విశదపఱచి, తమ్ముఁ జూపి రక్షిష్టవరము లొసఁగ. 593

శా. ఆ రాజేంద్రుఁడు రంతిదేవుఁడు త్రిలోకాధీశు లైనట్టి యా
నీరేజాతభవాది దేవతలకున్ నిశ్శీర్షంబుతోడన్ నమ
స్కారంబున్ బొనరించి నిస్పృహుఁడు నిస్సంగుండు నై భక్తి న
వ్వారాధ్యుండగు విష్ణు నాత్మనిడి కోరం డయ్యె నేం దెప్పయున్. 594

గీ. డెందమును వాసుదేవునియందుఁ బాదు, కొలిపి తదితరమ్ముఁ గోరకుండు
నా నృపాలునకున్ ద్రిగుణాత్మకంబు, లైన మాయలు స్వప్నంబులట్లడంగె. 595

గీ. జనవరా! యా నరేంద్రప్రసంగమహిమ
నతని యనుయాయులందఱు నశ్రమమున
నాదినారాయణపరాయణాత్ములగుచుఁ
బరమయోగీంద్రు లైరి భూపాలవర్య! 596

వ. గర్గునివలన శిని యుద్భవించె. శినివలన గార్గ్యుం డుద్భవించి క్షత్రియత్వంబునుండి బ్రహ్మత్వంబు వడసె. మహావీర్యున కురుక్షయుండు వొడమెను. ఆ యురుక్షయునకుఁ ద్రయ్యారుణి, కవి, పుష్కరారుణి యను మువ్వురుకొడుకులు జనియించిరి. వారు క్షత్రవంశంబున బ్రాహ్మణత్వముఁ బడసిరి. సుహోత్రపుత్రులలో జ్యేష్ఠుండగు బృహత్క్షత్రునకు సుహోత్రుండు కలిగె. ఆ సుహోత్రునకు హస్తి యుదయించె. ఆ హస్తి హస్తినాపురంబు నిర్మించె. హస్తికి నజమీఢుండు ద్విమీఢుండు పురుమీఢుండను మువ్వురుకొడుకులు గలిగిరి. అజమీఢుని వంశజులు ప్రియమేధాదులు బ్రాహ్మణులైరి. అజమీఢునకు బృహదిషువు కలిగె. అతనికి బృహద్ధనువుండు, వానికి బృహత్కాయుండు, వానికి జయద్రథుండును జనియించె. ఆ జయద్రథునకు విశ్వజిత్తును, వానికి సేనజిత్తును, వానికి రుచిరాశ్వుండును, దృఢహనుండు, కాశ్యుండు, వత్సుండు ననువారలు కొడుకు లైరి. అందు రుచిరాశ్వునకుఁ బ్రాజ్ఞుండు వొడమెను. ప్రాజ్ఞునకుఁ బృథుసేనుండు జన్మించె. అతనికిఁ బారుండు కలిగె, పారునకు నీపుం డను పుత్రుం డుదయించె. ఆ నీపునకుఁ బుత్రశతంబు కలిగె. 597

క. ఆ యవనీశుఁడు నీపుఁడు, తోయజదళనేత్రి శుకునితనూజయు సుగుణ
ధ్యేయయగు కృత్వియందుఁ బ్రభ, ధాయుతు యోగీశు బ్రహ్మదత్తుఁ గనియెన్.

గీ. 'వాణి'యనుభార్యయందు నా బ్రహ్మదత్తుఁ, డురుతరజ్ఞానకలితుండు యోగివిభుఁడు
నతవిధేయు విష్వక్సేననామధేయుఁ, బుత్రు నొక్కని గనియె లోకభూపవర్య! 599

వ. మఱియు నా బ్రహ్మదత్తుండు జైగిషవ్యోపదేశంబున యోగతంత్రంబుఁగావించె. ఆ విష్వక్సేనునకు నుదక్సేనుండును, వానికి భలాదుండును గలిగిరి. వీరెల్లరును బృహదిషువంశసంజాతులనం బరఁగుదురు. ద్విమీఢునకు యమీనరుండును, నతనికిఁ గృతిమంతుండును, వానికి సత్యధృతియు, వానికి ధృఢనేమియు, దృఢనేమికి సుపార్శ్వుండును, సుపార్శ్వునకు సుమతియు, నతనికి సన్నతిమంతుండును, నతనికిఁ గృతియును జన్మించిరి. ఆ కృతి హిరణ్యనాభునివలన యోగంబునుంబొంది షట్సంహితల విభజించి సామసంహితాధ్యయనంబుఁ జేయించె. ఆ కృతికి నుగ్రాయుధుండు, నతనికి క్షేమ్యుండు, వానికి సువీరుండు, సువీరునకుఁ బురంజయుండును, నతనికి బహురథుండును గలిగిరి. పురుమీఢుఁ డనపత్యుండయ్యె. అజమీఢునకు నలినియందు నీలుండు శాంతియు నను తనయులు వొడమిరి. శాంతికి సుశాంతియు, నతనికిఁ బురుజుండును, వానికినర్కుండును గలిగిరి. అర్కునకు భర్మ్యాశ్వుఁ డుదయించె. వానికి ముద్గలుండు, యవీనరుఁడు, బృహదిషువు, కాంపిల్యుండు, సృంజయుండు నను నేవురు కొడుకు లుదయించిరి. భర్మ్యాశ్వుండె యా పుత్రులు పంచ దేశంబులఁ గాపాడ వలంతులగుదురని నుడువుటంజేసి వారు పాంచాలసంజ్ఞకులైరి. ముద్గలునివలన మౌద్గల్యసంజ్ఞితంబైన బ్రహ్మగోత్రంబు నిర్వృత్తంబయ్యె. భార్మ్యుండగు ముద్గలునివలన మిథునం బుద్భూతంబయ్యె. అందు దివోదాసుండు పురుషుం డయ్యె. అహల్య కన్యయయ్యె. ఆ యహల్యయందు గౌతముని వలన శతానందుండు వొడమె. ఆ శతానందునకు ధనుర్విద్యావిశారదుండైన సత్యధృతియను పుత్రుం డుదితుండయ్యె, అతని సుతుండు శరద్వంతుండు. ఆ శరద్వంతువీర్యం బూర్వశీదర్శనంబువలన శర స్తంబంబునంబడియె. అది శుభంబగు మిథునంబయ్యె. మృగయావిహారంబుఁగావించు శంతనుం డా మిథునంబును గాంచి కృపచేఁ బరిగ్రహించుటంజేసి కృపుఁడు కృపియునని యమ్మిథునంబు ప్రసిద్ధం బయ్యె. కృపి ద్రోణపత్నియై పరఁగె. 600

---

## అ ధ్యా య ము 22.

### కురువంశ కథనము

శ్రీశుకుఁడు:—

వ. ఆ దివోదాసునకు మిత్రాయువు పుట్టె. మిత్రాయునకుఁ జ్యవనుండుకలిగె. అతనికి సుదాసుండును, వానికి సహదేవుండును గలిగిరి. ఆ సహదేవునకు జంతుజన్మకరుం డగు సోమకుండు జన్మించె. ఆ సోమకునకు నూర్వురుకొడుకులు వొడమిరి. అందు

జంతు వనువాఁడు జ్యేష్ఠుండు, పృషతుండు కనిష్ఠుండు. అతనికి ద్రుపదుండు జన్మించె. ఆ ద్రుపదునకు ద్రౌపది యను కన్యయు, ధృష్టద్యుమ్నాది కుమారులుం బొడమిరి. ధృష్టద్యుమ్నునకు ధృష్టకేతువు గలిగె. వీరు పాంచాలకు లనం బరఁగిరి. మఱియు నజమీఢునకు ఋక్షుఁడు, వానివలన సంవరణుండు, నతనికిఁ గురువుఁ, గురువునకుఁ బరీక్షిత్తు, సుధనువు, జహ్నువు, నిషధుఁడును జన్మించిరి. సుధనువునకు సుహోత్రుండు కలిగె. అతనికిఁ జ్యవనుండును, వానికిఁ గృతియును, వానికి నుపరిచరవసువును గలిగిరి. ఆ వసువునకుఁ గుసుంభ, మత్స్య, ప్రత్యగ్ర, చేదిపాది చేదిపతులును బృహద్రథముఖ్యులు జన్మించిరి. ఆ బృహద్రథునకుఁ గుశాగ్రుండును, వానికి ఋషభుండును, వానికి సత్యయుతుండును, వానికిఁ బుష్పవంతుండును, వానికి జహ్ను వనువాఁడును గలిగిరి. 601

సీ. రాజేంద్ర! యా బృహద్రథభూధవున కన్య, జాయయందు జనించె శకలయుగము
తల్లి వానిని వెలిన్ ద్యజియింపఁగా నంతఁ, గ్రీడించు జర వానిఁ గేలఁ బట్టి
బ్రతుకుము బ్రతుకుమం చతికింపఁగా జరా, సంధనామకుఁడై యెసంగ నాతఁ
డతనికి సహదేవుఁ డాత్మజుఁ డయ్యె సో, మాపి యాతనికిఁ గుమారకుండు
గీ. పొసఁగ సోమాపికి శ్రుతశ్రవుండు పొడమె, వసుమతిం బరీక్షిత్తు సుతుఁ డయ్యె
జహ్నువునకును సురథుండు జననమయ్యె, వానికి విదూరథుం డను వాఁడు కలిగె.

వ. ఆ విదూరథునకు సార్వభౌముండు పొడమె. అతనికి జయత్సేనుండును, వానికి రథికుండును, నతనికి నయుతాయువును, వానికిఁ గ్రోధనుండును, వానికి దేవాతిథియును, నతనికి ఋక్షుండును, ఋక్షునకు భీమసేనుండును, నతనికిఁ బ్రతీపుండును జనియించిరి. ఆ ప్రతీపునకు దేవాపి, శంతనుఁడు, బాహ్లికుండను మువ్వురు కొడుకులు పుట్టిరి. 603

సీ. అధిప! దేవాపి పిత్ర్యంబగు రాజ్యంబు, విడిచి కానలకును వెడలిపోయె
రాజయ్యె నంతట ప్రాగ్జన్మను మహాభి, షాఖ్యఁ జెన్నొందిన శంతనుండు
తన కరమ్ముల ముదిసిన జనుం దాకి యౌ, వనవంతుఁ జేసి శాంతిని వహించు
దాన శంతనుఁ డనఁగా నొప్పె నతని రా, ష్ట్రమున ద్వాదశవత్సరములుఁ గ్రమత
గీ. క్షోణిమీఁదఁ బర్జన్యుండు కురియకున్న, ననిరి శంతనుతో విప్రు లగ్రభోక్త
వగుటఁ బరివేత్తవైతి వీ వగ్రజునకు, రాజ్యమిమ్ము పురమ్ము రాష్ట్రమ్ముఁ జనర.
సీ. బ్రాహ్మణు లీ క్రియఁ బలికిన నాలించి, శంతనుండు నిజాగ్రజన్ము వేఁడ
రాజ్యంబుఁ గొనుమని రాజ! యంతకుమున్న, మంత్రిచోదితులు బ్రాహ్మణులు గొంద
ఱరిగి యా దేవాపి నాగమభ్రష్టుఁ జేయఁగ వేదనిందల నతఁడు సలిపె
దాన దేవాపి రాజ్యానర్హుఁడై నంతఁ, దోన శంతనుఁడు నిర్దోషుఁ డగుట

గీ. కువలయంబున వర్షంబు గురిసె సకల, రాష్ట్రము సుభిక్షమై యొప్పెఁ బ్రకటకీర్తి
యోగమును బూని దేవాపియును గలాప, గ్రామమున నుండెఁ బౌరవరాజతిలక!

వ. ఆ దేవాపి కలియుగంబున సోమవంశంబు నష్టింజెంద మగుడఁ గృతయుగాదిని
స్థాపింపఁగలండు. బాహ్లీకునివలన సోమదత్తుండును, సోమదత్తునివలన భూరియు,
భూరిశ్రవుండును, శలుండు నను మువ్వురుకొడుకు లుదయించిరి. 606

ఉ. శంతనురాజవర్యునకు జాహ్నవియందు నయాన్వితుండు ధీ
మంతుఁడునైన భీష్ముఁడు కుమారుఁడుగా నుదయించె నాతఁ డ
త్యంతము వీరయోధమణి ధర్మవిదగ్రణి భక్తవర్యుఁడున్
శాంతుఁడునై సెలంగెఁ గదనంబునఁ దృప్తునిఁ జేసె భార్గవున్. 607

సీ. శంతను మేదినీశ్వరునకుఁ దాశక, న్యకయై చెలంగు సత్యవతియందు
చిత్రాంగదుండు విచిత్రవీర్యుండునా, పుత్రులు వొడమి రిర్వురు నరేంద్ర!
ఘోర స్వతుల్యనాముఁడగు గంధర్వుచేఁ, బ్రతిహతుఁడయ్యెఁ జిత్రాంగదుండు
ఆ సత్యవతియందె యవతరించెఁ బరాశ, రుండను మౌని వర్యునకు మున్న
గీ. వేదగోప్తయు సాక్షాత్తు విష్ణుకళయుఁ, దండ్రి నాకు శ్రీభాగవతప్రవక్త
బాదరాయణుఁడున్ భగవంతుఁడునగు, మునివరేణ్యుండు వ్యాసుండు మనుజనాథ!

గీ. అతఁడు శాంతుఁడఁ బుత్రుఁడనైన నాకు, పైలముఖ్య స్వశిష్యగణాల విడిచి
పరమగుహ్యము మిగులఁ బావనమునైన, భాగవత పురాణమ్ము నువ్యక్తపఱచె.

సీ. పెనుస్వయంవరరంగమున బలాదానీత, లైన కాశీవిభునాత్మజలను
నంబి కాంబాలికాఖ్యాకలఁ బెండ్లియా, డె విచిత్రవీర్యుండు తేవమెఱయ
సంతతంబును దదాసక్తచేతస్కుఁడై, రాజయక్ష్మవ్యాధిగ్రస్తుఁడగుచు
ననపత్యుఁడై గతించిన భ్రాతృక్షేత్రంబు, నంతు నా బాదరాయణమహర్షి
గీ. జననియానతిఁ జేసి యోజ ధృతరాష్ట్రుఁ, బాండు విదురుని నుద్భవింపఁ జేసె
దలఁప ధృతరాష్ట్రునకును గాంధారియందుఁ, బుత్రశతకంబు జనియించె
భూవరేణ్య! 610

వ. అందు దుర్యోధనుండు జ్యేష్ఠుండు. మఱియు నా నూర్వురయనంతరంబు దుస్సల
యను కన్యకయుఁ గల్గె. శాపభయంబునఁ బాండుభూవిభుండు తన భార్యలం
గవయ వెఱచియుండె నంత. 611

క. కుంతియందు నా పాండుభూకాంతునకును
యమసమీరణేంద్రుల ప్రసాదమునఁ బొడమి

రోలిని యుధిష్ఠిరుండు వృకోదరుండు
నర్జునుండు ననంగ మహారథికులు. 612

గీ. మఱి నకులసహదేవులు మాద్రియందు, నవ్భవించి రయ్యాశ్వినేయుల వరమున
నెలమి ద్రోవదియందు నయ్యేవురకు జ, నించి రేవురు తనయులు నీ జనకులు.

వ. యుధిష్ఠిరునకు ద్రోవదియందుఁ బ్రతివింధ్యుండును, భీమునకు శ్రుతసేనుండును,
నర్జునునకు శ్రుతకీర్తియు, నకులునకు శతానీకుండును, సహదేవునకు శ్రుతకర్మం
డును జనించిరి. మఱియు యుధిష్ఠిరునకుఁ బౌరవతియందు దేవకుండును, భీమ
సేనునకు హిడింబయందు ఘటోత్కచుండును, గాళియందు సర్వగతుండును గలిగిరి.
అర్జునున కులూపియందు నిలావంతుండును, మణిపూరపతిదుహితయందు బభ్రు
వాహుండును గలిగిరి. ఆ బభ్రువాహనుండు మాతామహునకుం బుత్త్రుం డయ్యె. నకులు
నకుఁ గరేణుమతియందు నిరమిత్రుండును, సహదేవునకు విజయయందు సుహో
త్రుండును బొడమిరి. 614

క. సర్వాతిరథమహారథ, గర్వాపహరణ ప్రచండకరుండు దక్షిణమ్యం
డుర్వీధవ! నీ జనకుఁడు, ముర్వాప్పు సుభద్రయందుఁ బొడమె నరునకున్. 615

వ. ఆ యభిమన్యునకు నుత్తరయం దీవు జన్మించితివి. 616

గీ. ద్రోణిబ్రహ్మాస్త్రతేజంబుచేతఁ జిక్కి, కౌరవులు పరిక్షీణులు గాఁగ నంత
నీవు శ్రీకృష్ణదేవు ప్రభావమునను, బ్రదుకఁ గంటి మృత్యువునుండి విముక్తుఁడవగుచు.

వ. జనమేజయపూర్వులైన శ్రుతసేన, భీమసేన, ఉగ్రసేన, నీర్యవంతులను వారు నీ
కుమారులై పరఁగిరి. 618

గీ. తక్షకునిచేత నీవు నిధనముఁ గనుట, దెలిసి జనమేజయుండు క్రోధతప్తుఁడయి
సర్పయాగ సమిద్ధాగ్నిజ్వాలలందు, నేన ముయిచ్ సర్పముల నెల్లఁ వేల్వఁ గలఁడు.

గీ. కావషేయుఁ బురోహితుఁగా నొనర్చి, యశ్వమేధ యాగంబుచేసి నఖిలమైన
మేదినిం గెల్చి యా జనమేజయుండు, పెక్కులగు యజ్ఞములఁ జేసి వెలయఁగలఁడు.

గీ. అతనిసుతుఁడు శతానీకుఁ డతులుఁడు శుకుఁడు, యాజ్ఞవల్క్యునివలన వేదాధ్యయనము
కృపునివలన నస్త్రజ్ఞాననిపుణతయును, శౌనకునివలన నాత్మవిజ్ఞానముఁ గొను.

వ. ఆ శతానీకునకు సహస్రానీకుండును, నా సహస్రానీకున కశ్వమేధజుండును, వానికి
నాసీమకృష్ణుండును, వానికి నిచక్షుండును బొడముదురు. ఆ నిచక్షుండు నదిచే గజా
హ్వయపురంబు హరింపంబడఁ గౌశాంబియందు వసింపంగలండు. ఆ నిచక్షున
కుష్ణుండును, వానికిఁ జిత్రరథుండును, వానికి శుచిరథుండును, వానికి వృష్టిమంతుం
డును, వానికి సుషేణుండును, వానికి సునీథుండును, వానికి నృచక్షుండును, వానికి

సుఖానిలుండును బొడమఁగలరు. ఆ సుఖానిలునకుఁ బరిప్లవుండు, నతనికి మేధావియు, వానికి సునయుండును, వానికి నృపంజయుండును, నతనికి దూర్వుండును నతనికి నిమియును జనియింపఁగలరు. నిమికి బృహద్రథుండును, బృహద్రథునకు సుదాసుండును, వానికి శతానీకుండును, వానికి దుర్దమనుండును, వానికి విహీనరుండును, వానికిదండపాణియు, వానికి మితుండును, వానికి క్షేమకుండును, వానికి బ్రహ్మక్షత్రుండును గలుగుదురు. ఆ బ్రహ్మక్షత్రుండు నిర్వంశుండై దేవర్షి సత్కృతుండై క్షేమకునిఁబొంది కలియుగంబున నుండంగలవాఁడు. ఇంక భావి మాగధరాజుల వివరించెద వినుము. 622

జరాసంధపుత్రుఁడగు సహదేవునకు మార్జాలి, వానికి శ్రుతశ్రీవుండు, వానికయుతాయువు, వానికి నిరమిత్రుండు, వానికి సునక్షత్రుండును, వానికి బృహత్క్షత్రుండును, వానికిఁ గర్మజిత్తును, వానికి శ్రుతంజయుండును, వానికి విప్రుండు, వానికి శుచి, వానికి క్షేముఁడు, వానికి సువ్రతుఁడు, వానికి ధర్మనేతృఁడు, వానికి శ్రుతుండు, వానికి దృఢసేనుఁడు, వానికి సుమతి, వానికి సుబలుఁడు, వానికి సునీతుఁడు, వానికి సత్యజిత్తు, వానికి విశ్వజిత్తు, వానికిఁ బురంజయుండును జనియింపఁగలరు. వీరు సాహస్రవత్సరులగు బార్హద్రథులైన భావిభూపాలురు.

---

## అధ్యాయము 23.

### యదువంశ చరిత్రము

శ్రీశుకుఁడు:—

వ. యయాతికొడుకగు ననువునకు సభానరుండు, చక్షువు, పరోక్షుండు నను మువ్వురు కొడుకులు వొడమిరి. సభానరునకుఁ గాలనాథుఁడు, నతనికిస్సృంజయుండు, వానికిఁ బురంజయుండు, వానికి జనమేజయుండు, వానికి మహాశాలుండు, వానికి మహామనసుండు, వాని కుశీనరుండు, తితిక్షువు నను నిర్వురుకొమరులుఁ గలిగిరి. ఆ యుశీనరునకు శిబియు, వనుఁడు, క్రిమి, దర్పుఁడు నను నలువురు తనయు లుద్భవిల్లిరి. అందు శిబికి వృషదర్భుఁడు, సువీరుఁడు, మద్రుఁడు, కేకయుఁడు నను నలువురు పుత్రులు పుట్టిరి. తితిక్షునకు రుశద్రథుండు, వానికి హేముండు, వానికి సుతపుండు, వానికి బలియు జనించిరి. ఆ బలికి, అంగ, వంగ, కళింగ, సింహ, పుండ్ర, ఆంధ్రులను పేర్లంబరగు నార్వురుసుతులు జనించి తమ తమ పేర్ల నాద్దేశంబులకడి పాలించిరి. సువీరునకు హవిరథుండును బొడమె. 624

గీ. అతనికిని ధర్మరథుఁడను సుతుఁడు పొడమె, వానికి జనించె ననపత్యుఁ డైన చిత్ర
రథుఁ డతఁడె రోమపాదాఖ్యఁ బ్రథితుఁ డయ్యె, దత్సఖుండై ప్రవర్తిల్లె దశరథుండు.

గీ. దశరథుఁడు శాంతయను నిజతనయ కన్య, దుహితగా నిచ్చె రోమపాదునకుఁ బ్రీతి
ఋష్యశృంగుఁ డా శాంతను బ్రేమ మీఱఁ, బెండ్లియయ్యెను కౌరవోర్వీశలేశ! 626

మ. మనుజాధీశ్వర! పౌరవోత్తమ! యొకింబర్జన్యదేవుండు మే
దిని వర్షింపక యుండినన్ వివిధవాదిత్రంబులున్ గీత న
ర్తనముల్ లీలలఁ గాఁగిళుల్ సెలఁగఁ, గాంతారత్నముల్ మౌనినా
థుని సద్బోధుని ఋష్యశృంగుఁ బురికిన్ దోడ్తెచ్చి రింపొప్పఁగన్. 627

వ. అంత ఋష్యశృంగుం డనపత్యుం డైన దశరథునిచేఁ బుత్రకామేష్టిఁ జేయించి సంతానవంతుఁ గావించె. ఆ రోమపాదునకుఁ జతురంగుండును, నతనికిఁ బృథులాక్షుండును గలిగిరి. వానికి బృహద్రథ, బృహత్కర్మ, బృహద్భానులను మువ్వురు కొడుకులు పుట్టిరి. బృహద్రథునకు బృహన్మనసుఁడు, వానికి జయద్రథుఁడు, వానికి విజయుఁడు, వానికి సంభూతి యను భార్యయందు ధృతియు, నా ధృతికి ధృతవ్రతుండు, వానికి సత్కర్ముండు, నతనికి నతిరథుండును నుద్భవించిరి. 628

గీ. అతిరథుండు గంగాతటమునందుఁ గ్రీడ, జేయుచున్ గుంతిచేఁ ద్యజింపఁగఁబడి
పెట్టెలోనున్న కానీనుఁ బట్టిగాఁ గ్ర, హించె ననపత్యుఁ డౌటఁ బృథ్వీశవర్య! 629

వ. కానీనుండగు నా కర్ణునకు వృషసేనుండు పుట్టె. యయాతి కొడుకైన ద్రుహ్యునకు బభ్రుండును, వానికి సేతువును, వానికి నారబ్ధుండును, నతనికి గాంధారుండును, నతనికి ధర్ముండును, వానికి ధృతుండు, ధృతునకు దుర్మదుండును, వానికిఁ బ్రచేతసుఁడును బొడమిరి. ప్రచేతసునకు నూర్వురు కొడుకులు పుట్టి మ్లేచ్ఛాధిపతులై యుత్తరదిశ నాశ్రయించిరి. తుర్వసునకు వహ్నియు, వానికి భర్గుండును, వానికి భానుమంతుండును, నతనికిఁ ద్రిసానుండును, వానికిఁ గరంధముఁడును, వానికి మరుత్తుండును జనించిరి. మరుత్తుం డపుత్రకుండై పౌరవుండగు దుష్యంతుని పుత్రునిగా గ్రహించెఁ గాని యా దుష్యంతుఁడు రాజ్యకాముండై తిరిగి స్వవంశంబును జేరె.

సీ. క్షితిప! యయాతికి జ్యేష్ఠపుత్రుండగు, యదువు వంశంబు నరావళులకు
నతిపుణ్యమును గిల్బిషాపహారంబునై, నెగడొందుచుండు దానిం దెలియఁ
బరమాత్ముఁ డగు భగవంతుఁడు మానవా, కారుఁడై యెట నవతార మొందె
నెయ్యది విని నరుం డొయ్యన సకలపాప, ములనుండి సద్యోవిముక్తుఁ డగును
గీ. నట్టి యదువంశచరితంబు హర్షదాయ, కంబుగా దొరా! సర్వలోకంబులకును
నింపు మీఱంగ దాని నాలింపుమయ్య! కీర్తిగుణసాంద్ర! యో పరీక్షిన్నరేంద్ర!

వ. యదువునకు సహస్రజిత్తు, క్రోష్టువు, నలుండు, రిపువు నన బ్రసిద్ధులైన నలువురు కొడుకులుగలిగిరి. అందు సహస్రజిత్తునకు శతజిత్తును, వానికి మహాహయ, వేణుహయ, హేహయులను మువ్వురు కొడుకులుఁగలిగిరి. హేహయునకు ధర్ముండును, ధర్మునకు నేత్రుండును, వానికిఁ గుంతియు, వానికి సోభంజియు, వానికి మహిష్మంతుండును, వానికి భద్రసేనుండును, వానికిఁ దుర్మదుఁడును, వానికి ధనికుండును, వానికిఁ గృతవీర్య కృతాగ్ని కృతవర్మ కృతౌజులను నలువురు కొడుకులును గలిగిరి. కృతవీర్యునకు నర్జునుండు జనించె. ఆ యర్జునుండు— 632

సీ. హర్యంశసంభూతుఁడైన దత్తాత్రేయు, గురుకృప ఘనయోగగుణముఁబొంది
యేడుదీవులకుఁ దానేలిక యగుచుఁ జె, న్నారె నా కార్తవీర్యార్జునుండు
కార్తవీర్యుని మేలుగతినిబొందఁగలేరు, పార్థివులెవరు ధ్రువమ్ము సుమ్ము
హరిని బ్రత్యహము సంస్మరియించు చెనుబది, యైదువేలేండ్లు నవ్యాహతగతి
గీ. రాజ్యమొనరించె నాతఁడు ప్రాజ్యవిత్త, లబ్ధిఁదలఁగని సౌఖ్యముల్ వడసె నతని
సుతసహస్రంబులో రణక్షోణిఁబడక, మిగిలిరేవురు మాత్రమ మేదినీశ! 633

వ. ఆ యేవురు జయధ్వజుఁడు శూరసేనుఁడు వృషణుఁడు మధువు నూర్జితుండు నను వారలుగఁ బ్రఖ్యాతిఁ జెందిరి. అందు జయధ్వజునకుఁ దాళజంఘుండుఁ గలిగె. వానికిఁ బుత్రశతంబు ప్రభవించె. తాళజంఘాఖ్యమైన క్షత్రియజాతి యౌర్వతేజంబున నుపసంహరింపఁబడియె. ఆ పుత్రశతంబున జ్యేష్ఠుండు వీతిహోత్రుండు, మధువునకు వృష్ణుండను పుత్రుండును, వానికిఁ గులవిస్తారకంబును వృష్ణిజ్యేష్ఠంబును నైన పుత్రశతంబునుదయించె. తద్వంశ్యులకు మాధవులు, వృష్ణులు, యాదవులు, నను సంజ్ఞలుకలిగె. యదువురెండవపుత్రుండైన క్రోష్టువునకు వృజినవంతుండును, వానికి శ్వాహితుఁడును, వానికి భేరుశేకుండును, వానికిఁ జిత్రరథుండును, వానికి శశిబిందుండును బుట్టిరి. 634

మత్తకోకిల:- రాజయోగి మహాచతుర్దశరత్నుఁడౌ శశిబిందుఁ డ
వ్యాజవిక్రముఁ డింపుగన్ వరవర్ణినుల్ పదివేవు రం
దోజమై పదివేలలక్షలయుజ్జ్వలాత్ములఁ బుత్రులన్
దా జనింపఁగఁ జేసెఁ గీర్తినిధాన! పుణ్యచరిత్రుఁడై. 635

వ. ఆ శశిబిందుని పుత్రులమొత్తంబునఁ బ్రధానులైన యార్వురయందుఁ బృథుశ్రవుండు ముఖ్యుండు. ఆ పృథుశ్రవునకు ధర్ముండును, వానికి నుశనుండును బుట్టెను. ఆ యుశనుండు నూఱశ్వమేధంబులఁగావించె. వానికి రుచికుండును, నా రుచికునకుఁ బురుజిత్తు, రుక్ముఁడు, రుక్మేషువు, పృథువు, జ్యామఘుండు నను వారేవురుఁబుట్టిరి.

సీ. శైబ్యాధవుండగు జ్యామఘుం డనపత్యుఁ, డయ్యును బత్నీభయమునఁ జేసి
యన్యయోషాసతి నొల్లఁడయ్యె నయ్యును శత్రు, మందిరభ్రష్టను మనుగువ నొకతెఁ
గొని తేర స్యందనంబుననున్న నా సతిఁ, గాంచి శైబ్య యమర్షకలితయగుచు
వంచకా! యీమె యెవ్వరిత? నాచోట ని, ట్లుంచితి వని యదలించి యడుగ
గీ. నతఁడు నీ కోడ లనవుడు నల్ల నగుచు, నేను వంధ్యను నా సపత్నియుగుఁ గాని
కోడలెట్లగునన్న నీకున్ జనించుఁ, గొడుకు ధ్రువమని యతఁడు వాక్రుచ్చె సతికి.

వ. ఇట్లు జ్యామఘుండు పుత్రుం డుద్భవించునని భార్యతోఁ బ్రసంగించుటం జేసి విశ్వేదేవతలు, పితృదేవతలు తమకు గతులు గలుగునని ప్రమోదభరితులైరి. అంత.

గీ. గర్భమును దాల్చెఁ దాఁ గొంతకాలమునకు
శైబ్య పదపడి కొమరుండు జననమయ్యె
నా కొమారుండును విదర్భుఁ డనఁగఁబడియె
జ్యామఘుఁ డొనంగ నతని కాసతిని క్షితిప! 639

---

## అధ్యాయము 24.

### వసుదేవవంశానుక్రమణిక

శ్రీశుకుఁడు:—

వ. ఆ కన్యకయందు విదర్భునకుఁ గుశక్రథులును, వైదర్భకులదీపకుండగు రోమపాదుండును జనియించిరి. రోమపాదునకు బభ్రువును, వానికిఁ గృతియు, వానికి నుశికుండును, నతనికిఁ జేదియును, జేదికి దమఘోషాదులును జనించిరి. క్రథునకుఁ గుంతియు, వానికి ధృష్టియు, వానికి నిర్వృతియు, వానికి దశార్హుండును, వానికి వ్యోముండును, వానికి జీమూతుండును, వానికి వికృతియు, వానికి భీమరథుండును, వానికి నవరథుండును, వానికి దశరథుండును, వానికి శకునియు, వానికిఁ గుంతియుఁ, గుంతికి దేవరాతుండును, వానికి దేవక్షత్రుండును, వానికి మధువును, వానికిఁ గురువశుండును, వానికి ననువును, వానికిఁ బురుహోత్రుండును, వానికి నంశువును, వానికి సాత్వతుండును గలిగిరి. ఆ సాత్వతునకు భజమానుఁడు, భజి, దివ్యుఁడు, వృష్ణి, దేవావృధుఁడు, నంధకుఁడు, మహాభోజుఁడు, నను నేడ్వురు జనియించిరి. అందు భజమానునకుఁ బ్రథమభార్యయందు నిమ్రోచి, కంకణ, వృష్ణులను మువ్వురును; రెండవకళత్రమునందు శతజిత్తు, సహస్రజిత్తు, అయుతజిత్తు నను మువ్వురును బుట్టిరి. అందు దేవావృధునకు బభ్రువు కలిగె. వీరిరువురవిషయమై పెద్దలిట్లు పద్యరూపంబునఁ జఠింతురు.

గీ. దూరమునసుండి దేనివింతదు మొదరియఁగఁ, గందు మద్దానిమనయంతికంబునందు
మానవులలోన నుత్తముండగును బభ్రు, వమరసముఁడు దేవావృధుఁడరసిచూడ.

వ. బభ్రు దేవావృధుల యుపదేశ ప్రభావంబువలనఁ బదునాలుగువేల యరువది యేవురు నరు లమరత్వముఁ జెందిరి. మహాభోజుఁ డతిధర్మాత్ముఁడు, తదన్వయ జాతులు భోజులనం బరఁగిరి. వృష్ణికి సుమిత్రుండును, యుధాజిత్తును గలిగిరి. అందు యుధాజిత్తునకు శినియును, శినికి ననమిత్రుఁడును, వానికి నిమ్నుండును, నతనికి సత్రాజిత్ప్రసేనులును జనించిరి. అనమిత్రునకు శినియను వేఱొక కొమరుండు కలఁడు. ఆ శినికి సత్యకుఁడు, వానికి సాత్యకియనం బరఁగు యుయుధానుఁడు, వానికి జయుఁడు, వానికి గుణియు, వానికి యుగంధరుఁడును గలిగిరి. మఱియు ననమిత్రునకుఁ బృశ్నియను వేఱొకపుత్రుండు గలండు. ఆ పృశ్నికి శ్వఫల్క చిత్రకులు పొడమిరి. అందు శ్వఫల్కునకు గాదిని యనుదానియందు నక్రూరుఁడు, నసంగుఁడు, సారమేయుఁడు, మృదుకుండు, మృదుపచ్ఛివుండును, వర్మదృక్కును, ధృష్టవర్మయు, క్షత్రోపేక్షుండును, నరిమర్దనుండును, శత్రుఘ్నుండును, గంధమాదనుండును, బ్రతిబాహువు నను పన్నిద్దఱు కొడుకులు, సుచారువను కూఁతురును జనించిరి. అందక్రూరునకు దేవలానుపదేవులను నిర్వురు పుట్టిరి. చిత్రకునకు బృథుండును, విదూరథాదులగు పెక్కురును జనించిరి. వృష్ణికి భజమాన, కుకుర, శుచి, కంబళ, బర్హిషులను నలువురు కలిగిరి. అందు కుకురునకు వృష్ణియు, వానికి విలోమతనయుండును, వానికిఁ గపోతరోముండును, నతనికిఁ దుంబురసఖుండగు యనువును, వానికి దుందుభియు, వానికి దవిద్యోతుండును, వానికిఁ బునర్వసువును, వానికి నాహుకుఁడను కుమారుఁడు నాహుకియను కుమార్తెయుఁ గలిగిరి. 642

ఆహుకునకు దేవక, ఉగ్రసేనులను నిర్వురు జనించిరి. దేవకునకు దేవలానుపదేవ సుదేవ దేవవర్ధనులను నలువురు కొడుకులును; ధృతదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకియును నేడ్వురు కూఁతులును బొడమిరి. ఆ యేడ్వురును వసుదేవుని భార్యలైరి. ఉగ్రసేనునకుఁ గంస, సునామ, న్యగ్రోధ, కహ్వ, శంకు, సుభూ, రాష్ట్రపాల, విసృష్ట, తుష్టిమంతులను దొమ్మండ్రు కొడుకులును; గంస, కంసవతి, కంక, సురాభూ, రాష్ట్రపాలిక యను కూఁతులును గలిగిరి. వారు వసుదేవునితమ్ముని భార్యలైరి. భజమానసుతుండగు విడూరథునకు శూరుండును, వానికి శినియు, వానికి భోజుఁడును, నతనికి హృదికుండును గలిగిరి. అందు హృదికునకు దేవమీఢుఁడు, శతధన్వుండు, కృతవర్మ యను వారలు పుట్టిరి. శూరుండనఁబడు దేవమీఢునకు మారిషయను భార్యయందు

నకల్మషులగు వసుదేవుఁడు, దేవభాగుఁడు, దేవశ్రవుఁడు, ఆనకుఁడు, సృంజయుఁడు, శ్యామకుఁడు, కంకుఁడు, అనీకుఁడు, వత్సకుఁడు, వృకుఁడు నను పదుగురు కొడుకులును; బృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవస, రాజాధిదేవి నను నేవురు కూఁతులును గలిగిరి. 643

ఆ. ఆనకాహ్వయంబులగు దేవదుందుభుల్, మొఱసెను వసుదేవు పుట్టువునను
దానఁ బలుకుచుందు రానకదుందుభి, యంచు హరికి స్థానకర్తమున యుతని. 644

సీ. తనసఖుండగు కుంతిభోజున కపుత్రుఁ, నకును బృథయను తనయ నకన్యకనొసంగె
శూరుఁ డామె దుర్వాసు శుశ్రూషఁ జేసి, దేవహూతియా విద్యఁబొందె నన్నరేంద్ర!

మ. పృథయున్ శౌచపరీతయై యపుడు తద్విద్యాపరీక్షార్థమై
విధియుక్తంబగు పద్ధతిన్ దినమణిన్ వేల్వంగ నద్దేవుఁడున్
బృథు వేగంబున నేగుదెంచె నతనిన్ వీక్షించి యాశ్చర్య సం
గ్రథితస్వాంతసమేతయై చనఁ బలికెన్ రాజోత్తమా! యీగతిన్. 646

క. దేవా క్షమియింపుము నన్నీ విద్యామహిమఁ దెలియనిబాల నలిపితిన్
నీ వింక మగిడి యేగుము, దేవేడెద దోయిలొగ్గి యెనసిన భక్తిన్. 647

వ. అనిన నాదిత్యుండు పృథ కిట్లనియె. 648

గీ. తరుణిరో! విను దేవసందర్శనంబు, మోఘమనుచు నెఱుంగుము సుపుత్రు నీకు
గలుగఁ జేసెద దాన నీ కన్నెతనము, చెడక యుండ ననుగ్రహింతు వదను జుమ్ము!

మ. అని వాక్రుచ్చి దినేశుఁ డా పృథకు గర్భాధానముం జేసి చ
య్యన నాకంబున కేగె నా సతికి సద్యఃకాలమందే విక
ర్తనతుల్యుండగు నాత్మజుండు వొడమెన్ రాజేంద్ర! లోకాపవా
దనభీతిన్ ద్యజియించె నందనుని నాతస్వాంగి కష్టంబునన్. 650

వ. ఆ పృథాదేవిని భవత్ప్రపితామహుండును, సత్యవిక్రముండు నగు పాండుభూపాలుండు పెండ్లియాడె. ఆ పృథ చెలియలగు శ్రుతదేవను, గారూషకుఁడగు వృద్ధశర్మ పరిణయంబయ్యె. వారిరువురకు మునిశాపంబున దానవుఁడు దంతవక్త్రుఁడై జనించె. దాని చెలియలగు శ్రుతకీర్తిని కేకయుండగు ధృష్టకేతుండు పెండ్లాడె. వారిరువురకుఁ బ్రతర్దన ప్రముఖు లేవురు జనించిరి. దాని చెలియలగు రాజాధిదేవిని జయత్సేనుఁడు వివాహంబయ్యె. వారికి విందానువిందులు జనించిరి. దాని చెలియలగు శ్రుతశ్రవసను చేదిరాజగు దమఘోషుఁడు గ్రహించె. ఆ జంటకు

శిశుపాలుఁడు కలిగె. వసుదేవసోదరుఁడగు దేవభాగునికిఁ గంసయందుఁ జిత్రకేతు బృహద్బలులను నిరువురు గొడుకులు జన్మించిరి. వాని తమ్ముఁడగు దేవశ్రవునకుఁ గంసవతియందు సువీర, ఇషుమంతులు జనించిరి. వాని సహజన్ముఁడగు కంకునికి గంకయందు బక, సత్యజిత్, పురుజిత్తులను మువ్వురుదయించిరి. వాని యనుజాతుఁడగు సృంజయునికి రాష్ట్రపాలియందు వృషదుర్మర్షణాదులు కలిగిరి. వాని యనుజన్ముఁడగు శ్యామకునకు సురభూమియందు హరికేశ, హిరణ్యాక్షులు కలిగిరి. వాని యపరజుఁడైన వత్సునకు మిశ్రకేశియను నప్సరసయందు వృకాదిసుతులు కలిగిరి. వాని జఘన్యజుఁడైన వృకునకు దుర్వాక్షియందుఁ దక్ష, పుష్కర, సాళ్వాదులుఁ గలిగిరి. వాని యవీయుఁడగు సమీకునకు సుదామినియందు సుమిత్ర, అనీక, బాణాదులు పుట్టిరి. వాని తోఁబుట్టువగు నానకునకుఁ గర్ణికయందు, ఋతధామజయులు కలిగిరి. వసుదేవునకు రోహిణియందు బలుఁడు, గదుఁడు, సారణుఁడు, విపులుఁడు, ధ్రువుఁడు, కృతుఁడు మొదలగువారలును, పౌరవియందు సుభద్రుఁడు, భద్రబాహుఁడు, దుర్మదుఁడు, భద్రుఁడు, భూతుఁడు మున్నగువారలును, మదిరయందు నందోపనంద కృతకశూరాదులును, కౌసల్యయందుఁ గులవర్ధనుఁడగు కేశియను నొకకొడుకును, రోచనయందు హస్తహేమాంగాదులును, ఇళయందు యదుముఖ్యులైన యురువల్కాదులును, ధృతదేవయందుఁ ద్రిపృష్ఠుండును, శాంతిదేవయందుఁ బ్రశమ ప్రశ్రితాదులును, ఉపదేవయందుఁ గల్పవృష్ట్యాదులు పదుండ్రును, శ్రీదేవయందు వసుహంస సుధన్వాదులగు నార్వురును; దేవరక్షితయందు గదాదులు తొమ్మండ్రును; సహదేవయందు ధర్మంబునకు వసువులువలె పురూథ శ్రుతముఖ్యాదు లెనమండ్రును; దేవకియందుఁ గీర్తిమంత, సుషేణ, భద్రసేన, ఋజు, సమదన, భద్ర, సంకర్షణులను నేడ్వురును గలిగిరి. మఱియు నా దేవకీవసుదేవులకు శ్రీమన్నారాయణుండు స్వయముగ నష్టమసుతుండై జనించె. రాజోత్తమా! త్వత్పితామహియగు సుభద్రయు వారికిఁ గడగొట్టు కూఁతురయ్యె.

గీ. ఎప్పుడెప్పుడు ధర్మంబుకు ముప్పుఁ జెందుఁ
బాపమునకును వృద్ధియుఁ బరిఢవిల్లు
నప్పుడు భగవంతుఁ డీశ్వరుఁ డాద్యుఁడు హరి
ధరణి సృజియించుకొనుచుండుఁ దన్నుఁ దాన. 652

గీ. అఖిలసాక్షియు నీశుండునైన హరికిఁ, దనదు మాయావిలాసంబె తప్పవిడిచి
మహిని జన్మంబునకును గర్మంబునకును, గారణం బన్యమొద్దియుఁ గానరాదు. 653

గీ. నృపతిలాంఛనులక్షౌహిణీశులునగు, నసురనాథులచేతఁ బెల్లాక్రమింపఁ
బడిన విశ్వంభరాదేవిభారమెల్లఁ, బాపఁగఁ గృతోద్యముండయ్యె భవ్యుఁడు హరి.

గీ. అతని మాయావిచేష్టితమఖిలభువన, సృష్టిసంస్థితిలయములు చేయుపొంటఁ
గాని యాత్మలాభమునకుఁ గాదొకింత, యేనిఁ జూడఁ బరీక్షిన్మహీకళత్ర! 655

గీ. పరమపూరుషుఁడున్ భగవంతుఁడునగు, శార్ఙ్గపాణి సంకర్షణసహితుఁడగుచు
నమరవల్లభులకు మానసమున నేని, నెన్నఁగారాని కర్మంబులెన్నొ చేసె. 656

గీ. కలియుగంబున జన్మింపఁగలస్వకీయ, భక్తజనుల ననుగ్రహింపంగ శౌరి
పుణ్యమును దుఃఖశోకతమోపహంబు, నైన స్వీయయశంబును వ్యాప్తిఁ జేసె.

గీ. నరవరోత్తమ! సుజనకర్ణామృతమగు, తద్యశస్తీర్థమందు శ్రోత్రాంజలిపుటి
నాచమించి జనుండు తానాక్షణంబ, కర్మవాసనలన్ దొలఁగంగఁ జిమ్ము. 658

వ. మఱియు సమ్మహామహులు భోజ వృష్ణ్యంధక మధు శూరసేన దశార్హ రాజన్యులచేతను, కురు సృంజయ పాండుభూపాలురచేతను [illegible]సునీయ మహిముఁడయ్యె. 659

ఉ. భూరమణాగ్రగణ్య! యదుముఖ్యుఁడు నందకపాణి నిర్వృతి
ద్వారములైన వాగమృతధారలతో సకలాంగసుందరా
కారముతో విలోచన సుఖప్రద విభ్రమలీలతో శుచి
స్మేర ముఖాబ్జుఁడై తమి రమింపఁగఁ జేసెఁ జుమీ నృలోకమున్. 660

చ. కురువర! ప్రోల్లసన్మకరకుండలమండితకర్ణయుగ్మవి
స్ఫురితకపోలరమ్యము శుభోదయమున్ సవిలాసహాసభా
సురమగు కృష్ణు మోముఁ దమిఁ జూడ్కులఁ గ్రోలుచు సంగతృప్తిఁ జెం
దరు పురుషుల్ నెలంతలు నెపదన్ నిమిషైవ హియింత్రు కోపమున్. 661

సీ. నిజరూపమునను జన్మించియు మనుజరూ, పముతోఁడ విదప ప్రేమపత్నులరిగి
వారి యభీష్టంబుఁ దీర్చి ఖలహృద, యుల నరాతుల నెల్లఁ గనుక్కడంచి
పెక్కండ్రు కాంతలఁ బెండ్లాడి పలువుర, నందనులను వారియందుఁ గాంచి
యాత్మవిద్యారహస్యంబును సువ్యక్త, ముగ భక్తజనులకు బోధపఱచి
గీ. తన్నుఁ దా ననేకములగు జన్మములను, దెలఁగి యజియించుకొనియెనా శ్రీవసుంధ
లోకసంగ్రహమున కతిశలోకమహిముఁడయ్యు నీరీతి వర్తించె[illegible]నాధ! 662

మ. అవనీభారముఁదీర్ప నెంచుచును బద్మాక్షుండు శ్రీకృష్ణుండు కౌ
రవభూపాలురలోన శేగిన కలిన్ రాజా! యనిన్ జూడ్కిఁ బా
ర్థివులన్ గూలిచి క్రీడియందు విజయశ్రీఁగూర్చి తత్త్వజ్ఞు న
ద్ధవుఁగావించి స్వధామమున్ బరమమున్ దాఁబొందె సమ్యగ్గతిన్. 663

## గద్యము.

శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, 'శ్రీరామనృసింహామూర్తి కవులు'
అను గంధం శ్రీరామమూర్తి, ఇట్టింకి నరసింహామూర్తులచే
రచింపఁబడిన శ్రీమదాంధ్రి భాగవతమున
నవమ స్కంధము సంపూర్ణము.

---